# ఖండకావ్యములు



"బ్రహ్మర్షి" డా॥ ఉమర్ ఆలీషాకవి కృతసంహిత



శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము

పిఠాపురం- 533 450

తూర్పు గోదావరి జిల్లా

# ఖండకావ్యములు





బ్రహ్మర్షి డా॥ ఉమర్ ఆలీషా కవి కృతసంహిత



శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము
పిఠాపురం - 533 450.
తూ॥ గో॥ జిల్లా



[మూల్యము : రు. 125-00

# పీఠిక



"శ్రీ ఉమర్ అలీషాకవిగారు రకరకాల కవిత్వముఁ జెప్పిరి" అని "భారతి" పత్రిక ఈ ఖండకావ్యముల సముచ్చయమందా రకరకాల కవిత్వము కాననగును. శ్రీ ఉమర్ ఆలీషాకవిగారు 1908 వ సం॥ నుండి 1944 వ సం॥ల మధ్య అప్పుడప్పుడు వ్రాసిన "లఘుకావ్యము" లను చేర్చి "ఖండకావ్యము" లను పేర ప్రకటించినాము. ఇందనేక ములు పత్రికలయందు ప్రకటింపబడినవి. 'కథకుడు' 'నిశాసందేశము' జ్ఞానసభలనివేదికలుగా 1943, 44 సంవత్సరములలో ప్రకటింపబడినవి 'హాలి' చిన్నపొత్తముగా కాకినాడ ముస్లిం సంఘమువారు 1909 లో ప్రకటించిరి. శ్రీ కవిగారు పత్రికా సంపాదకుల కోరికపై లఘుకావ్య ములు వ్రాసి పంపుచుండిరి. మఱియు వారు తమ మిత్రులవద్దకు వెళ్ళినప్పుడు మిత్రుల కోరికపై పద్యములు వ్రాసి యిచ్చుచుండిరి. ఇట్టివి ఢిల్లీనుండి బళ్ళారివరకు గలవు. వీటినన్నిటిని సంపాదించుట మిక్కిలి దుస్తరమైనది.

రెండవ భాగమునందు పద్యములు కొన్ని ప్రత్యేకముగా ప్రక టించినాము. శ్రీ కవిగారు 1934 సం॥ నుండి వారి జీవితాంతము వరకు అనగా 1945 సం॥ వరకు అఖిలభారతశాసన సభాసభ్యులుగా నుండిరి. ఆ సందర్భమున సిమ్లా, ఢిల్లీ వెళ్ళుచుండిరి. ఈ రెండవభాగమునందు ప్రకటించిన పద్యములు చాలవరకు ఢిల్లీ, సిమ్లాలలో వ్రాసినవి. వీటిని ప్రత్యేకముగా ముద్రింపఁదలచినాము. కాని అవకాశము లేక ఈ పుస్తక ముతోనే జతపర్చినాము. శ్రీ కవిగారికి భావము స్ఫురించినప్పుడెల్ల చిత్తు కాగితములపై పద్యములను వ్రాసి పడవేయుచుండిరి, వీటిలో కొన్ని పద్యములు అసంపూర్తిగా కూడ నుండిపోయినవి. అట్టివానిలో భావము పూర్తియైన వాటిని ప్రకటించినాము. ఉదా :

"కలధన మర్ధవాహినులుగా రచియించి నిజానురాగమం
గలవెల నాంధ్రవాటికలు గాదుల నిండితి ..........."

ఈ చిత్తు కాగితములపై వ్రాయఁబడిన పద్యములకు తిరిగి శుద్ధ ప్రతికూడ వ్రాయబడలేదు. శ్రీ కవిగారి జీవితకాలమున వారు వ్రాసిన కొన్ని గ్రంథములు అచ్చుపడక పోవుట మిక్కిలి శోచనీయము. శ్రీ కవిగారు తమగ్రంథములు అచ్చగునప్పుడు వాటిని సవరించుచుండిరి. మఱియు అసంపూర్తియైన పద్యములను కూడ పూరించెడివారు.

ఋషిసత్త్వములైన శ్రీ ఉమర్ ఆలీషాకవిగారి కావ్యములు వాఙ్మయమునకు నూతనవికాసము కలిగించుచున్నవి. పంచభూతములు సృజియింపబడినట్లే ఈశ్వరాజ్ఞచే కవితావృష్టియు కురియుచుండును. దీనిని జాతి మత భేదములు లేక గ్రహించుటయే సమంజసము. శరచ్చంద్రునిఁ జూచి కన్నులు మూసుకొనుటలో ప్రయోజనములేదు. శ్రీ ఆలీషాకవిగారి కవిత్వ తత్త్వసుధాసముద్రము అపారమైనది. వీరొక పద్యమునందు.

శా. నేనే కోకిలమైన మావిచివురుల్ నిండారభక్షించి మీ
జ్ఞానంబంతయు పంచమస్వరము శృంగారంబులోఁ బెట్టి నే
గానంబున్ వొనరించి యీ వనము లోకంబంచుఁ జూపించి మి
మ్మానందాబ్ధినిఁ దేల్చియుందును కదా యానాటి కానాటికిన్.

నిజముగా శ్రీ కవిగారు తమ కవితా తత్త్వమును పంచమస్వరమున బెట్టి చదువరుల నానందాబ్ధినిఁ దేల్చిరి.

—ఏ. ఎస్. శాస్త్రి



# శ్రీ ఉమర్ ఆలీషాకవి ఖండకావ్యములు

విషయసూచిక



* బ్రాకెట్టులలో పేర్కొనిన సంవత్సరములలో వ్రాయబడినవి.

విషయము — పుట

విషయము | పుట

రెండవ భాగము





# పీఠాధిపతుల చరిత్ర

శ్రీ విశ్వవిజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠమునకు పీఠాధిపతులలో ఆది పీఠాధిపతి 1472 సం॥లో భారతదేశమునకు వచ్చియున్నారు.

ఆదిలో ఈ పీఠము అరబ్బుదేశమున అందలి బాగ్దాదునుండి పారశీకదేశము. అక్కడనుండి భారతదేశమునకు వచ్చి ఢిల్లీనగరమున నివసించి అక్కడ సర్మద్‌హుస్సేనీ (సర్మద్ షహీద్) పేరుగల తత్త్వవేత్తను ఔరంగజేబు చంపించినప్పుడు వారి సమకాలికుడైన యీ పీఠాధిపతి తానేషా కాలమున హైదరాబాదు వచ్చి హైదరాబాదు నుండి యీ పీఠమునకు జాగీరొసంగిన కారణమున ఆంధ్రదేశము ప్రవేశించి పిఠికాపురమున నివాసముగా స్థిరపరచుకొన్న మొదటి పీఠాధిపతి మదీన్ కబీర్షా.

ఆ కాలమువారిచే యీ పీఠాధిపతి మదీనా నుండి వచ్చిన తత్త్వవేత్తయని పిలువబడినారు. ఈ పీఠాధిపతులు ఏ దేశములోనున్నప్పుడు ఆ దేశ భాషలలో, ఉత్కృష్టమైనదిన్ని, గణనీయమైనదిన్ని అయిన కవిత్వం చెప్పియున్నారు.

వీరు అరబ్బి, పార్సీక భాషలలో తత్వము గూర్చి గ్రంధము వ్రాసినట్లు తెలియబడుచున్నది.

ఈ మదీన్ కబీర్షాగారిని తత్వరూపులుగ గ్రహించుటకు అనాటి ప్రజలు వీరి మహత్మ్యము చూడగోరి బండ్లకొలది యిన్ధనంబులు కాల్చి అగ్నిగుండము యేర్పరచి వారిని అందు కూర్చుండమని కోరగా అప్పుడు ఆ అగ్నిగుండమున పూలపాన్పున గూర్చున్నట్లు గూర్చుండి తన మానసిక మహత్మ్యము ప్రజలకు జూపిరని వారి చరిత్ర.

వారి తరువాత వారి అగ్రనందనుడు ద్వితీయ పీఠాధిపతి మధార్షా. ఆ తరువాత వారి సుతులు తృతీయ పీఠాధిపతి "హసన్మియాషా వారి కుమారులు చతుర్థ పీఠాధిపతి కహెనేషావలి." వీరి పిన్నినాటి కాలమున బాల్యమందే వీరి తండ్రి హసన్మియాషా దివంగతులైన కారణ

మున వారికి తిరుగ అఖైలలీషా గురువర్యులచేత యీ పీఠతత్వ స్వరూపమైన మహామంత్రము ప్రబోధింపబడి తిరుగ యీ పీఠము పునః స్థాపితమైనది.

శ్రీకహెనేషావలీగారి చిన్ననాడు ఒకనాడు వారి దృశ్యములో నొక మహాపురుషుడు కనబడి దర్శనమిచ్చి మీ వంశమందు అధ్యాత్మికరూపమైన తత్వస్వరూపము పీఠాధిపత్య రూపంలో వెలార్చబడుచున్న విధానము మీకు ముందు మీ తండ్రిగారు పీఠాధిపతిగ నిర్వహించు కాలమున మీ బాల్యమునందే వారు నిర్యాణము పొందియుండుటచే, అది మృగ్యమౌ సమయము కలుగనున్నది, ఆ పీఠమునకు మీరు పీఠాధిపత్యాధికారము స్వీకరించవలసియున్నది. ఇప్పుడు నాచే మీకు యీ మహామంత్రము ప్రబోధింపబడి పునరుద్ధరణ కావలసియున్నది. కాబట్టి ఈ రహస్యము నాచేత తెలుసుకోవలసినదిగా చెప్పినట్లు పైవిషయములు దృశ్యములో చెప్పిన విధానమున శ్రీ కహెనేషావలీగారు బడికిపోవు సమయాన యే మహాపురుషుడు దృశ్యములో తనతో ప్రసంగించెనో ఆ మహావ్యక్తి జాగ్రదావస్థలో యెదుటపడి యే వాక్కులైతే దృశ్యములో ఆయన నోట ధ్వనింపబడినవో, ననేతీరున ఆయనచే ఈ పీఠాధిపతులచే ప్రబోధింపబడు మహామంత్రము ఆనాడు కహెనేషావలీగారికి ప్రబోధింపబడినది. ఆయనే శ్రీ అఖైలలీషా గురువులు. వీరు అకల్పాంతము దాక యీ పీఠాధిపతులకు గురువుగ సంస్మరణీయులు.

అనాటి నుండి యీనాటివరకు యీ పీఠాధిపత్యము అవిచ్ఛిన్నముగ సాగుచున్నది.

వారిపీఠాధిపత్య కాలములో ''కలికి భాగవతము'' అనే గ్రంథము ఈశ్వర పరిణామము తెలుపు మహత్మ్యములతో నిండిన తత్వము చెప్పబడినది.

అ తరువాత వారి అగ్రసందనులైన పంచమ పీఠాధిపతి మహర్షి శ్రీ మొహియద్దీన్ బాద్షా గురువర్యులు. తన స్వానుభవైక వేద్యమైన కీర్తనలు, పదములు ''పరతత్వ కీర్తనలు'' అను గ్రంథముగ రచింపబడినది.

—✶—



"బ్రహ్మర్షి" శ్రీ మొహియద్దీన్ బాద్షా

పంచమ పీఠాధిపతి

## మారుతిరాగము - ఆటతాళము

విను మహాశ్చర్య మిదియు వినిపింతు నకటా
తనువులో బ్రహ్మమట తా గాంచు టహాహా ॥విను॥ 1

జన్మ మెత్తితి గాని జీవునకు సుఖ మెఱుఁగ
సన్మాన మెవ్వరికి సేయ లే నైతిన్
తన్మయంబేదో యా తత్వ మేదొ తెలియ
దు న్మనియోగ మేలాగు సాధింతున్ ॥విను॥ 2

ధనధాన్యములు గూర్చి ధరగానకను తిరిగి
వినయ మేమియు లేక విఱ్ఱ వీగుచున్
మనమునను తను గర్వమును నొంది మండిపడి
తనకన్న ఘనులెవ్వ రనుచు నే చచ్చున్ ॥విను॥ 3

అయ్యయో యీకాయ మంధకారము నొదిగి
శయ్య సుమములపండి సౌఖ్య మొందుచును
వెయ్యి మాయలు బన్ని కయ్యంబు లనుబెంచి
వ్రయ్యలై తుదియముని ద్వారంబు జేరున్ ॥విను॥ 4

భాగ్యవంతుల మంచు భగవద్గృహంబుల
యోగ్యమని గట్టింతు రదియేమె వారు
భాగ్యహీనుల బుధుల పట్టైతన్నంబిడ ర
యోగ్యులా పాషాణముల కిడెదరేమో ॥విను॥ 5

సోమమంతఃకరణ మందున్న దేయాత్మ
దేహియం మను శృతుల శ్రుతపర్చికొనుము
మోహరహితపదాన మొహియదీన్ భాష్య సం
దేహములు ఆఖైలలీ గురుడు మాన్పె ॥విను॥ 6

## పిల్వారాగము - అటతాళము

ఓంకారమే జీవమనుచు నమ్మి
నాకారముననుు వీక్షించు
ఏకమౌను నీలో ఆకారమును బొంది
ఆకంటి నడుమ నీ
వఖిలామై నిలిచెదవు ॥ఓం॥ 1

ఓంకారమునకు నాదామునకు భేద
మున్నా దేమిటొ తెలియ వలయు
ఓంకార మిహమగును నాదాము నీవగును
శంకలెంచక తనుతాసాధించిజూచితె ॥ఓం॥ 2

తొలిజన్మ పదము లన్నిటిని తలంచి
తలంచి నే జాలి నొందితిని
ఇలకొన్ని జన్మములు ఈ జన్మమున జరిపి
తెలివిలోపల తెలివైతే జాము కనుగొంటి ॥ఓం॥ 3

ఆది యానాది మర్మంబు తెలివి
సాధించి గనుట ధర్మంబు
బిందు బీజము నందు నీవై నిలిచి నాద
మందు లగ్నంబై యా నందాము నొందెదవు ॥ఓం॥ 4

నేనైనను జూచు చుంటిని ఆజ్ఞై
లలి గురు నచట గంటిని
జ్ఞానసమాధి మొహియుదీన్ భాష్యా సం
ధాన ధ్యాన మిదియె తర్కించి చూచితే ॥ఓం॥ 5

బ్రహ్మర్షి శ్రీ మొహియద్దీన్ బాద్షా
పంచమ పీఠాధిపతి.

—★—



# బ్రహ్మర్షి శ్రీ డా॥ ఉమర్ ఆలీషా

షష్ఠమ పీఠాధిపతి

# శ్రీ ఉమర్ ఆలీషా మహాకవి
# జీవిత సంగ్రహము

శ్రీ ఉమర్ ఆలీషా మహాకవిగారు పీఠికాపురమున క్రీ. శ. 1885 వ సం॥లో జన్మించిరి. వీరి తండ్రిగారు మహర్షి మొహియద్దీన్ భాషా గురువర్యులు. వీరి జనని చాన్బియాంబ.

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు. అధ్యాత్మిక విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాపారంగతులు. వీరి కుటుంబము పూర్వము నుండియు భాషాపాండిత్యమునకు, అధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతి గాంచినది. శ్రీ కవిగారు చిన్ననాడే సంస్కృతాంధ్రములు విశేషముగా నభ్యసించిరి తదుపరి అరబ్బీ పారశీ కాంగ్ల భాషలు నేర్చిరి. వీరు ఆంగ్లమున వ్రాయుట, మాట్లాడుట యెఱుంగుదురు; కాని ఆంగ్ల పద్యకావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవేశము లేదు. వీరు సహజ కవులు వీరి 14 వ వర్షమున తెనుగున ధారాళముగా కవిత్వముఁ జెప్పిరి. వీరి 18 వ మేట ''మణిమాల'' యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలె నున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి. వీరి కనేకచోట్ల ఉద్యోగము లిచ్చెదమని ఆహ్వానించినను వాటి కంగీకరింపక భాషాసేవ, దేశసేవఁ జేయుచు తమ జీవితమును గడిపిరి. వీరు 1934 వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి. ఆ పదవి వీరు అవతారము చాలించు వరకు నుండెను.

వీరికి International Academy of America వారు 1936 సంవత్సరమున Doctor of Literature బిరుద మొసగిరి. శ్రీ కవిగారు వంశపారంపర్యముగా వచ్చుచున్న అధ్యాత్మిక విద్యాపీఠమునకు అచార్యులై పదహారు వేల జనమును శిష్యులుగా నొనర్చిరి.

వీరి యౌగిక జ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభాసభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుద మొసంగిరి. వీరి సతీమణి అగ్బరు బీబీగారు. వీరితో ఢిల్లీ నగరము వెళ్ళి ది. 5-4-35 తేదీని దివి నలంకరించిరి. ఆ దినమున ఢిల్లీ శాసన సభ మూయబడెను. వీరు గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమారులు, యిరువురు కుమార్తెలు, పెక్కురు పాత్రి పౌత్రిక లుండిరి.

శ్రీ కవిగారి జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయబడుచున్నది. వీరు రచించిన సూఫీ వేదాంత గ్రంథమందు వీరి జీవితము సంగ్రహముగా నిట్లు వ్రాసిరి.

—♦ స్వీయము ♦—

క. ఆ మొహియద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హిత వి
ద్యామతి "ఉమ్రాలిషా" మహాకవి నేనున్

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్య ప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసినాఁడను కల్పనాస్తక మతి పది
నాటకంబులను కర్ణాటఫక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలు పది నవ నవల లనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

తే. రసము పెంపార నవధానక్రమములందు
ఆశువులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమలెక్క
యవని "ఉమ్రాలిషాకవి" యనఁగ నేను.

ఉ. రాజులఁ జూచితిన్ సుకవిరాజుల నోర్చితి బేరు మ్రోయరా
రాజులఁ నోలగంబుల విరాజితపండిత సత్కవీంద్ర వి
భ్రాజిత మౌలవీబిరుద పట్టములందితి యూనివర్సిటిన్
దేజముమీఱ సభ్యుడయితిన్ మతబోధకుఁడైతి గ్రమ్మఱన్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వరసైక చారు వి
న్యాసములున్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను "ఉమ్రలిషా" కవీంద్రుఁడన్.

ఉ. వేలురచించి విద్యలనుబెట్టి గడించితి పారితోషికా
ద్యాళిని వేయినూట పదియార్లను సింహతలాటముల్ మహా
భీలకసత్కళాకనక విశ్రుతముల్ జయభేరి మ్రోయ హిం
తాల వనీనటత్కు కవి తండము లేమిటి లెక్కమాకడన్.

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గమ మెక్కి మతిని చక్కాడియాడి ;
బోధించితిని జ్ఞానసాధన క్రమములు
చెవినిల్లుగాఁ జేసి చెప్పిచెప్పి ;
సవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి;
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగర మోపిమోపి

తే. ఇప్పుడప్పుడె నలుబదియేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాఁటికైన
శాంతి గలుగదు నీ కళాధ్వాంతమందు
జీవితము తెన్ను సుడిబోవు నావబోలు.

మ. నను నీజ్ఞానమహాసభాసదులు నానందన నర్థించి "ఆ
దిని మీపూర్వ పితామహుల్ గురువులై దివ్యత్వ మేపారఁగా
ఘనవిజ్ఞానకళాప్రవృష్టి ప్రజహృత్క్రాంతారముల్ నింపి రా
మని మీ రాకృతి బోధసేయఁదగు "ఉమ్రాలీష" భాషాగతిన్.

మ. అని నెయ్యంబునఁ గోరగావిని మహాహర్షంబు సంధిల్ల నౌ
నని యా జ్ఞానమహాసభాకథన మత్యంతంబు కష్టంబు మే
దిని నంసారనిమగ్న మానసులు నర్థింపంగ సాధ్యంబు గా
దని యున్నంత నెఱుంగసేతునని నే నారంభమున్ జేసితిన్.

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వపదంబుఁ జేర నేఁ
గోరఁగ జ్ఞాన సభ్యులు నకుంఠితదీక్ష జగంబు మెచ్చఁగా
భూరితపస్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబుఁ దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండు జూచితే.

చ. కవిత నెఱుంగనట్టి పృథుకాలము వ్రాసితి పుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటమురాదు నుపన్యసించు నా
దినముల విద్యతోఁ గలసి తృప్తి ఘటించెడు వాని నిప్పుడో
లవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమిచెప్పుదున్.

శా. ఢిల్లీ భారతశాసనైకసభ రూఢిన్ ప్రాతినిధ్యంబు సం
ధిల్లన్‌జేరి మహత్త్వరోజ్జ్వలకళాధిక్యంబు రాజిల్ల వి
ద్వల్లోకంబున రాజకీయకలనావ్యాపార పారంగతం
బెల్లన్ వేట్కను నిర్వహించుచును నే నీ గ్రంథమున్ ★ వ్రాసితిన్

ఉ. ఏను హిమాలయంబుపయి కెక్కి తపస్వులఁ జూచి వారి వి
న్నాణములన్ గ్రహించి విజనంబగుచోఁ జ రచించినాఁడ నా
నా నవ కావ్యమార్గము లనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగఁ గన్పడునట్లు దృశ్యంబు మార్చుచున్.

---

★ సూఫీ వేదాంతదర్శము.

శా. నాలోనున్నవి నేనుజూచినవి విన్నాణంబులై లోకమం
దాలోకింపఁగ రాని యీ యమరవిద్యాతత్త్వమర్మంబు లం
దేలోటున్ జనియింప దీశ్వర రహస్యైకైక మీమార్గ మే
మేలా దాచెదమంచుఁ జెప్పితిమి మీరిద్ధాత్ములై తేరఁగన్.

కం. మా తాతయు మా తండ్రియు
ఖ్యాతిని అఖిలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
దీరితుల వివరింతు యోగరీతులు తెలియున్.

ఉ. ఎల్లరు జెప్పుచుండిరల యీశ్వరుడీవని మీరుగూడ నా
కల్లలు బొల్లులల్లి కథగా నిటుకల్పనఁజేసి చెప్పగా
నొల్లునెయంచు మీరలన నోపుదురేమొ తదీయవాస్తవం
బల్ల రహస్యమున్ దెలిసి యద్భుతమార్గము విప్పి పెట్టితిన్.

మ. కనదుత్ పాదరసంబు తాత్త్వికుడు బంగారంబుగావించున
ట్లనుమానాస్పదమై వినాశకరమై యల్లాడు జీవుండు బ్ర
హ్మనుగామార్చెడు త్రోవజూపితి నిధి ధ్యాసంబు సంధించి మీ
కనులన్ విప్పెడు శూన్యమందు హరిసంకాశంబు సింధిల్లెడున్.

ఉ. మేమురచించు గీతములు మృత్యువాయువు పదంబులందులో
నేమియు నర్థహానికెడమియ్యక ఉన్నది యున్నట్లుగా
నేమహనీయుడున్ నడచి యీశ్వరరూపమెఱుంగ నేర్చునో
ఆ మహితాత్ముడొక్కడె యథార్థ మెఱింగి మృతిన్ జయించెడున్

శా. నాతోనున్న మహాకవీశ్వరుల నానాకావ్యముల్ వ్రాసినెం
తౌతత్త్వాత్మక దృక్ప్రపంచకము నుద్యోగించి చిత్రించుచున్
చైతన్యంబు గలుగంగజేసితి మహాసత్యస్వరూపంబుతో
జేతోవీథిని నీశ్వరుంగనెడు వైచిత్ర్యంబు జూపించితిన్.

ఉ. ఎవ్వరి నొవ్వనాడమిటు లెవ్వరినోరును కట్టివేయమే
మెవ్వరిదారి దూరిమరలింపము మాకడవచ్చు వారితో
నివ్వటిలంగ నీ తెఱవునేర్పి తరించుమటంచు చెప్పి మా
దివ్వె వెలుంగ జేసెదము దివ్యులుగన్పడ బుద్ధిమాన్పడన్.

♦ అగ్ర రాం బ ♦

శా. ఆ ఢిల్లీనగరాంగ్ల శాసన సభాభ్యర్థిత్వ మర్థింపఁ డం
చాడన్ నేను కృతార్థుఁడై జనిన నాకై వచ్చి ప్రాణంబులున్
వీడెన్ నాసతి అగ్రరాంబిక చలత్ విద్యుల్లతన్ బోలె; యీ
నాఁడే నశ్రులు 'గోరి' పై విడుచుచు న్వర్తింతు నిర్జీవినై.

ఉ. ఏను రచించినట్టి కృతు లెన్నిఁటినో వినె తల్లి; తండ్రి నా
నా నవనాటక ప్రకరణంబులు నాఁడగ జూచినారు; ఢి
ల్లీ నగరాంగ్ల భారతమహీదవ శాసనసభ్య సత్పదం
బానఁగ గాంచి "అగ్ర" రమరాలయ మేగే వెలుంగుచుక్కయై.

శా. ఎన్నొబాధలు బొందుచుండు మని న న్నీభూమివర్జించి యా
పున్నె పుంగని అగ్రరేఁగె దివికిన్ బూర్ణేందు బింబంబు వా
ర్ధీ న్నిద్రిపంగ బోయినట్లిఁక మహాంధీభూత మాలిన్యం సం
ఛన్నామస్మన్నివిషిద్ధజీవిత మభావం బెన్నినాళ్ళుండినన్.

సీ. ఏమాట చెప్పిన నెదురాఁడగా లేదు
పరమ సాధ్వీత్వంబు వరలుకతన
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాఁగ గణియించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ
ఏవురు కొడుకుల నిద్దరు కూఁతుల
ననిశంబు దీవించు నాత్మశాంతి.

తే. ప్రతిదినంబు చదువు ఖురాన్న మాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్బ
రాంబ దివిజులు నిరాజనంబులిడఁగ.

చ. పరమపవిత్ర యీ వెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డీకి బారెడు ప్రేమమూర్తి సుం
దరకసముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరునెద నగ్బరాంబ కడు ప్రార్థన సేయుచు నెల్లవేళలన్

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లీలో బ్రిటిషుసామ్రాజ్యంబు పాలించు వా
రేల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
పుల్లాబ్జానన 'అగ్బరాంబిక' భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లన్ విచ్చిన కుందఁబోలె వెస నే జీరాడుచున్నా నిటన్

చ. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచుఁ గన్నులనీరు కాల్వలై
చెదరఁగ నిమ్న లోకములఁ జేరుటకంటె సమాధితోంటి నీ
సదనము జేరుమార్గము విచారణజేయుట లెస్స యైహి కా
స్పద విభవానుషంగభవబంధమువాసిన నిన్ను చూడఁగన్.

శ్రీ కవిగారు యిస్లాం మతస్థులు. వీరి మాతృభాష ఉర్దూ. అంధ్ర భాష మాతృభాషగా కానివారు తెనుఁగున సరస కవిత్వముఁ జెప్పినవారు ఈ కవిగారొక్కరే. వీరు రచించిన మహాభారత కౌరవరంగ మను నాటకమున—

" నాటకముల్ ప్రబంధము లనంతముగా రచించిన వాణి కా
వ్యాటవి భావవీధుల విహార మొనర్చ జయధ్వజంబు వా
గ్వాటిని నిల్పినట్టి జనవిశ్రుతు ఉం రలీషా కవీంద్రుడన్"
అని వ్రాసిరి.

శ్రీ ఉమర్ అలీషా మహాకవి ఈ తత్వ కీర్తనలందు కూడ అనేక గంభీర భావముల నొసంగిరి.

"చంద్రుడెవరు చుక్కలెవరు
ఇంద్రుడెవరు ఈశుఁడెవరు
ఇంద్రియంబులు కిట్టిచూచితె
యిన్నితానై యుండలేద"

.... .... ....

"రాయినైతే రప్పనైతే
కాయనైతే కసరునైతే
ఏ యుపాయముచేతనో నే
నా యనంతుని బట్టియుందు"

మున్నగు పెక్కు ఋషివాక్యము లీ కీర్తనలందు చెప్పిరి. వీరు రచియించిన "సూఫీవేదాంత" గ్రంథములో

మ. "కనదుత్ పాదరసంబు తాత్త్వికుడు బంగారంబు గావించు న
ట్లనుమానాస్పదమై వినాశకరమై యల్లాడు జీవుండు బ్ర
హ్మనుగామార్చెడు త్రోవఁజూపితి నిధిధ్యాసంబు సంధించి మీ
కనులన్ విప్పుడు శూన్యమందు హరిసంకాశంబు సంధిల్లెడున్.

అని చెప్పిరి.

బ్రహ్మఋషిసత్తములైన శ్రీ ఉమర్ అలీషామహాకవిజీవితమును చరిచి అనేక తత్వగ్రంథములను వ్రాసి అజ్ఞానాంధకారమున నల్లాడు జీవుని బ్రహ్మనుగా మార్చెడు త్రోవజూపిరి.

వీరు రచించిన గ్రంథము లేబదివరకున్నవి. శ్రీ కవిగారు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమ గోదావరి జిల్లా) వెళ్ళి అచ్చట ది. 23 జనవరి 1945 నాటి సాయంత్రము 5 గంటలకు దివి నలంకరించిరి. వీరి భౌతిక దేహమును పిఠాపురముఁ దెచ్చి 24 వ తేదీ సాయంత్రము రైలుస్టేషను వద్దనున్న వారి యారామములో సమాధి చేసిరి.

—★—



# బ్రహ్మర్షి శ్రీ హంసేన్ షా
సప్తమ పీఠాధిపతి
శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము

# పరంజ్యోతి

పడినకష్టాల పాటవంబలతిగాక
సడలిపోయిన సౌఖ్యాలు స్మరణరాగ
మాసిపోయిన మాటలు మరపురాక
పాటపాడిన పదములు పలుకలేక
వెడలిపోయిన కాలంబు వెదకుచుంటి
వెతుకుచుంటి నామరుగునే వెతకుచుంటి
తెలుసుకొంటి నామరుగునే తెలుసుకొంటి
తిరిగి కాలంబురాదని తెలుసుకొంటి (జన్మ)
లేదు పరతంత్రమికనాకు లేనేలేదు
లేదు నాయన్న మౌఢ్యంబు లేనేలేదు
స్వార్ధమున నీ ప్రకృతి నాకు స్వస్తి జెప్ప
భ్రాంతిలోగన్న విషయ విభ్రాంతిగాగ
పోవుచుంటి నాదారినే పోవుచుంటి
కాననంబులో పురములో కానరాని
ఆ అయోమయ మధ్వాన్నమైన దారి
ఆ ప్రళయకాల దంధహ్యామైన యట్టి
చిమ్మచీకట్ల చెంగట చేరిచేరి
జరిగిపోయె సహస్స్రలు జగములోన
దాటిపోయెను మిన్నులా దారిలోన
స్వర్గ నరకాల వీధులాశ్చర్యముగను
దారులివ్వగ వాటిని దాటి నిలిచి
చూచినా నది నిజముగ శూన్యజగము
కలతబడి మనో దు:ఖాన గలయజూడ
అంతదూరాన నేదియో నవతరించె
అందులో రూపమేదొ నాకానుచుండె
అందు బ్రహ్మాండములను రూపొందుచుండె
ఎవరిదారూపు నాకపుడెరుక బడియె
అదియె నా గురుని స్వరూపమవధిగాను
అతడె అఖై లలీషుడది నిజంబు
అదియె ప్రేమైక రసరూపమవ్యయంబు

XIV

వెలువడెను గాదెనందుండి వెలుగనేదొ
నిండెనా వెల్గు జగముల నిండె నిజము
నిండె నావెల్గు నాలోన నిండె నిజము
నిండి నాలోన జతనాన నుండిపోవ
నిలిచె సంతృప్తి నాలోన నిలిచిపోవ
ఇమిడె ప్రమదంబు నాలోన నిమిడిపోవ
తెలిసె జగములు ''నేన'' ని తెలిసిపోయె
నేనె ''విశ్వంబు'' విశ్వంబు 'నేనె' నిజము
నిజము యీ దృశ్యమంతయు ''నేనె'' నిజము
గగనములలోన నారూపె గానుపించె
భాస్కరునియందు నారూపె బరగుచుండె
సలిలమందున నారూపె సాగుచుండె
ఈ వసుంధర నారూపె యసగుచుండె
అరయ వాయువులో నిండెనదిగొ దోచె
అదిగొ వైశ్వానరుని నిండెనదిగొ చూడు
ఎన్ని చెప్పుదు సర్వంబు 'నేను' గాను
సృష్టినంతయు నాలోనె చూచినాడ
ఇదే పరంజ్యోతియన నొప్పు నీ వెలుంగు
ఇదియె యోగులుగన్నట్టి జ్యోతిసుమ్ము
నిలిచిపోదు నీ జ్యోతి నేనెప్పటికిని
నిలిచిపోయి నీ జ్యోతి నేనెప్పటికిని
రాను మిముజూడ వాంఛనే రాను రాను
తిరిగి వచ్చెడి నాశలు తీరిపోయె
వెడలి వచ్చిన మాటలు వేరు లేవు
లీనమగుదు నీ జ్యోతిని నేనుగానె
మరచిపొండింక నారాక మఱచిపొండు
వదలివేయుడు దర్భలు వదలునట్లు
విడచివేయుడు ధారను విడచునట్లు
ఇట్లు ''హుస్సేన్''షా కవి ఎరుక జెప్పె !

బ్రహ్మర్షి శ్రీ హుస్సేన్‌షా
సప్తమ పీఠాధిపతి.



"బ్రహ్మర్షి" శ్రీ మొహియద్దీన్ బాద్షా

అష్టమ పీఠాధిపతి

# శ్రీ విశ్వ విజ్ఞానవిద్యాధ్యాత్మిక పీఠాశయము

శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాపీఠమహర్షి జ్ఞానవేదమూర్తులు శ్రీశ్రీ హుస్సేన్ షాకవి కృతం షాతత్వ సంహితము ఈశ్వరవాణిగా పలికి ఈశ్వర వాణిగా విశ్వమానవకోటికి శ్రీ విశ్వవిజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠ మహా సభాసభ్యులకు అమితానందముగ చేయుచు భౌతికవిధానమందు అనేక జీవిత విశేషములకు లోనై విరక్తి భావము శారీరకముగా కలుగుటవలన మానసిక విశేషమును పురస్కరించుకొని ధర్మ ప్రబోధమునుగావించి మానవుని మానవుడుగా మార్చుటయే ఈ ధర్మముయొక్క లక్ష్యము. అనగా శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము యొక్క విశేషము. ఇది సృష్టి వుద్భవించి, యుగయుగాలుగా, తరతరాలు సృష్టిలో శాఖోప శాఖలుగా ఏకేశ్వరోపాసన చేయుచు; కృతి, శృతిలో స్మృతిగా పాడుచు జాతిమత విచక్షణా లేక యధార్థమైన రసస్వరూపము శ్రీ పీఠాచార్యుని మంత్ర ప్రభావము చేత జీవి ఆత్మపరిణామము అభౌతికమైనటువంటి దృశ్యరూపములో చిత్రించుటయే శ్రీవిశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము యొక్క లక్షణము దాని యధార్థ ధర్మ విషయము. ఇది ఆచరించి అనుసరించినవారికి అనుక్షణము లోకవిషయ వాంఛలను దూరముచేసి సంకల్ప సిద్ధిం జేయును.

## పంచరత్నములు

1) సీ. తరతరంబులనుండి తాతతండ్రులుమున్ను
విజ్ఞాన విషయంబువివిధ విధము
మణులు మాణిక్యముల్ మదిని బడయునట్లు
సర్గపదార్థ ద్వయము సంగ్రహించి
వివిధ దేశంబులు వెదల సభ్యకులము
వినుతిగావించి రా విశ్వ మూర్తి
ఆధ్యాత్మ విద్యల కాకరంబగు మహా
జ్ఞానశక్తిని తపశ్శక్తి బడసి

తే. గీ. ధర్మమననేమి యో దెల్పి ధరణికెగసి
అమృతకరులై బోధకాఖ్యాపకులుగ
నుండి పీఠికాపురమందు నోలగముల
ప్రభువులై యుండి రా 'షా' వంశభవులు.

2. ఉ. అన్నిటికన్న గొప్ప మహిమాస్పదమైన మహాత్మ్యముండు, నిం
దున్నది ఆ 'షాతత్వ' మనే నుత్తమగ్రంథము దైవదత్తమై
సన్నుతమై పవిత్రమయి శాసనమై సచరాచరంబులో
నున్న రహస్యముల్ దెలుపుచున్నది యీశ్వరవాణిసృష్టికిన్.

3. తే. ఇట్టివిజ్ఞానమతము నర్థించి ప్రేమ
పాఠములునేర్పి విజ్ఞానభక్తి గూర్చి
మానవోద్ధార కుండన మహిని వెలసి
మలినములుమాపె 'హుస్సేన్‌షా' మౌనివరుడు.

4. తే. ఏదొ వేవేలు షాతత్వ నేగుదెంచి
అందులోన హుస్సేనుషా కృతవతరించి
వచ్చినిలిచె తేజంబుగ వసుధయందు
దెచ్చితిని నీకిదేయని తేటపరచె

5. తే. వేలు లక్షలు శిష్యులు పాలుగూడి
ప్రజ లజ్ఞానతిమిరంబు బారద్రోలి
భద్రమార్గమే కేశ్వరోపాసనంబు
వనుచు చాటిరి హృదయభక్త్యనుభూతి.

పంచరత్నములు సమాప్తము.

బ్రహ్మర్షి శ్రీ మొహియద్దీన్ బాద్షా
అష్టమ పీఠాధిపతి.

—★—



**శ్రీ డా॥ ఉమర్ ఆలీషా**

ప్రస్తుత నవమ పీఠాధిపతి

# దశరత్నములు

సీ. సుందరంబుగనుండు సుడులతో గోదారి
చిరుగాలి కెరటాల పరుగులిడుచు
ఆణిముత్యములట్టు లమరెడి బిందువుల్
మువ్వలరవళితో ముదముగొలుప
సప్తస్వరాలతో సంచరించెడి గాలి
కలహంసముని వీణ గతులబోలి
ఉరకలనురుగుతో ఉవ్వెత్తుగను పొంగి
పారలు గంగానదీ పొల్కుదనరి

తే. గీ. కవి మనోహర హృదయంబు కావ్యలలన
నవరసమ్ములతోగూడి నాట్యమాడి
కవితసాహిత్య వీధుల గదలిపోవ
గాన మొనరించి విహరించు గగనవీధి

సీ. నలుపుకాకుల గుంపు మలినంబు మాయింప
కాసారమున వడల్ గడుగురీతి
ఆశాహివలయాల ఆకర్షణము నుండి
విషయవాసనలను విడువలేక
షడ్ వర్గములనుండి సంచరించుచునుండి
ముక్తి మార్గముగాచ ముదముతోడ
కాషాయ వస్త్రముల్ ఘనముగా ధరియించి
కొంగజపముచేసి కొలనుమున్గు

తే. గీ కాని తనలోని కామంబు కడుగలేక
బాల్యయౌవ్వన కౌమార బలము తగ్గి
వార్థికమువచ్చి వడవడ వడకిచచ్చు
వెఱ్ఱి జనులనుచూచినే వెఱగుపడుదు.

సీ. అలలచే సెలయేఱు గలగల ప్రవహించి
సురులకు సంగీత శోభగూర్చు
రక్కసులేవేళ రణభీతిఁ గొలుపుచు
కర్కశధ్వనులతో గానుపించ
మృగజాతులకుఁ నెంతొ మోదంబు జేకూర్చి
మర్మరధ్వనులతో మమత గొలుప
మనుజునితమి దీర్చి మాధుర్యముగ నుండి
కవితా స్రవంతుల గానుపించి

తే. గీ. భావముల బట్టి జీవుల భ్రాంతి గొలిపి
ఎండమావుల జలమట్లు ఎఱుకఖడక
రాగమనురాగ భయక్రోధ త్యాగములతొ
పరుగు పెట్టించు గురువు సద్ భక్తినేర్ప

సీ. నక్షత్రముల పూలు నభమున పూయంగ
చంద్రుండు ఉదయించె చెలులతోడ
సుస్వాగతము పల్కి చుక్కల చెలులెల్ల
చిరునవ్వుతో చంద్రు చెంతచేర
మేఘమాలల దాగి మెఱయుచు చంద్రుండు
తారల కవ్వించి తరలు చుండ
అందాల మేఘంబు ఆ చందురుని దాచి
ఆటలాడుచునుండె నద్భుతముగ

తే. గీ. రేయి గడచెను రేరాజు చేయి విడచి
సూర్యబింబంబు పుడమిని చూడగోరి
కడలిలో నుండి జనుదెంచె ఘనముగాను
చంద్రికంటెను తనగొప్ప చెప్పరీతి

సీ. శశిరంబు ఏతెంచ చెలువంబు విడనాడి
మొక్కలాకులు రాల మోడుబారి
శ్రావణ మేఘాల సలిలధార దడసి
చిగురుటాకుల తోడ చెలగుచుండి
రోజాల పూపొదల్ రాజితంబుగ పూచి
పరిమళంబుల తోడ పరిఢవిల్లు
చందాన జీవుండు జడజన్మలో మ్రగ్గి
చచ్చి పుట్టుచునుండ అవనియందు

తే. గీ అవతరించుచున్నాడు సద్గురుండు
ధర్మ సంస్థాపనార్ధంబు ధరణిలోన
మహిని మానవధర్మముల్ మలచి చెప్పి
జన్మ తరియింప సన్మంత్ర జపము నేర్పు

సీ. గగన మండలములో ఘనముగా విహరించి
మెఱపు శబ్దముతోడ మేళవించి
గల గల యను పాఱు గంగా జలమురీతి
ఘలు ఘల్లు గజ్జల గతినిబోలి
శ్రోతల శ్రవణాలు శోభగా శ్రవణించ
సంగీత సాహిత్య సరళిదోప
ఆకాశవీధిలో అందముగ జనించి
సహజ సౌందర్యంబు చాటిచెప్పు

తే. గీ కరణి తపయోగ యోగంబు దనరజేసి
కంటి కన్నీరు ఆనంద కడలి గాగ
కనక కమల కలిమికల కళ ఫలింప
కామ మోహంబు సడలించి కాచుగురుడు

సీ. మేఘాల గర్జనో మేఱువు గర్జనో
పరిమళంబుల తోడ బయలువెడలె
విశ్వ రహస్యంబు విజ్ఞాన మార్గంబు
వీరవర్యుల కెల్ల విశదపరచి
కాంచనమకుటంబు కాంతుల బోలుచు
అజ్ఞాన జనులెల్ల విజ్ఞతగన
ప్రాభవంబును జూపి భయము కల్గించుచు
శాంతంబు చూపెడు సహజ సరళి

తే. గీ. మాయ భయపడి నీగొప్ప మహిమజూచి
సహజకాంతిని ప్రసరింప జాలలేక
నారికేళ ఫలంబుల్ నీరు బోలి
దుఃఖమును దాచి శాంతుడై తొలగుచుండె

కం. సిరి సంపద గల్గినచో
శిరమున మొలువగను కొమ్ము శ్రీపతి ననుచున్
శిరమున జేరును కనులును
సిరినీయుము దానమెపుడు చిరయశకీర్తిన్

కం॰ రవి అరుణ కాంతి మొదలై
రవి క్రుంగిన వేళ, అగు రణముల రీతిన్
రవి బోలు వీరవర్యులు
రవి తీరున ప్రబలుచుందురు రణ విఖ్యాతిన్

తే. గీ. హస్తములు చాచి కంఠ స్వరాళిజీల్చి
కటిక చీకటి దాటించి కాంతి జూపి
కంటి కన్నీరు కారంగ కానబడక
కామమోహంబు సడలించి కాచుగురుడు

డా॥ ఉమర్ ఆలీషా,
B. H. M. S., M. D. [A. M.]
నవమ పీఠాధిపతి.





తూర్పు గోదావరి జిల్లా పిఠాపురం తాలూకా యిసుకపల్లి గ్రామములో శ్రీ నడింపల్లి అచ్యుతరామరాజుగారు ది 20-12-1924 న శ్రీ నడింపల్లి తిరుపతిరాజుగారు, వరహాలమ్మగార్లకు చతుర్థపుత్రునిగా జన్మించారు. అచ్యుతరామరాజుగారు, వీరి తల్లిదండ్రులు కూడా షష్ఠమ పీఠాధిపతి బ్రహ్మర్షి ఉమర్ అలీషాగారివద్ద మంత్రోపదేశం పొందారు. ఈయన సహధర్మచారిణి ప్రభావతిగారు 1962లో సప్తమ పీఠాధిపతి బ్రహ్మర్షి శ్రీ హుస్సేన్‌షా గురువర్యుల వద్ద మంత్రోపదేశం తీసుకున్నారు. శ్రీ అచ్యుత రామరాజు గారు [చిట్టిబాబుగారు] బ్యాంకు మేనేజరుగ మరియు ఉద్యోగ విరమణ అనంతరము కూడ స్వామియొక్క ధ్యాన నిష్ఠలోనే ఉంటూ నలుగురు పీఠాధిపతుల ఆశీస్సులు పొందిన ధన్యజీవి వీరు ది 3-4-1988లో 64వ ఏట పరమపదించిరి. వీరి కుమారులు, కుమార్తెలు, మనుమలు, మనుమరాండ్రు కూడ పీఠాధిపతుల వద్ద మంత్రోపదేశము పొందియున్నారు. కీ॥ శే॥ నడింపల్లి అచ్యుతరామరాజు గారి ప్రథమ కుమార్తె శ్రీమతి పాకలపాటి సత్యవతిగారు, వీరి భర్త శ్రీ సన్యాసిరాజుగారు ఈ పవిత్రగ్రంథము ముద్రించుటకు తోడ్పడి ధన్యులైనారు.



# BRAHMARSHI

# Dr. UMAR ALISHAH

## TELUGU POET

'A really great man has ideas always greater than himself', This is more true of Dr. Umar Alisha, the immortal poet of the Telugu language, than anyone else. He was born on March 1885 in Pithapuram, a town in the Andhra State of India.

Though he had no proper education he developed a great taste for Telugu which was not his mother tongue and began writing verse when he was a teenager. The genius of the boy was at once recognised by Telugu scholars and his fame grew as a poet by the time he was 18.

He wrote plays in Telugu which can only find a parallel in Shakespeare's. Many Hindu poets and scholars began to pay tribute to this Muslim poet of the Telugu language and regarded him as a itern-poet in the Carlylian sense of the word.

His writings took a new shape in all branches of literature. Besides poetry he wrote novels, playlet and essays which excelled the wr tings of the ronowned Telugu scholars of the twentieth century and so on his works found a permanent place in the annals of Telugu literature.

Today he stands alone like a pole star guiding those Who are interested in Telugu literature, and he is acknowledged as their great master who brought a change over literary forms in Telugu.

He also made fresh departures in almost every form of literature. His poetry has no parallel in Telugu despite the great writers whose works no doubt come nearer to his standard and yet lack that charm and candence, lucidity and masterly style both in narration and criticism.

His vast knowledge of Sanskrit which language also he was a scholar, contributed effectively towards his prodigious efforts in Telugu with his contribution. Telugu literature would be nowhere as rich as it is today.

What Shakespeare is to the English, what Dante is to the Italians, what Dr. Iqbal is to Urdu speaking Muslims, Dr. Umer Alisha is to the Hindus of Andhra.

His writings have no other parallel, as I stated before, in any other literature of the world because they are the creation of the one man. He had to his credit such a vast bulk of written work in all literary forms that no one author in English or any other language could have produced.

But Alas ! It is confined to Andhra, and Andhra only, and its great merit lies hidden outside fhe state even in India not to speak of foreign contries.

Yet his repuation, by a curious twist of fate, soared aloft.

In 1936 the International Academy of America confirmed upon him the degree to doctor of l terature for his thesis in Telugu. For a man with no university education to obtain such a high degree from the new world is certainly a matter of pride to the individual as well as to the province in which he was born

He was no ordinary intellant, thought he knew little English whencompared to his ability in Telugu and Sanskrit.

His works in Telugu are clear evidence of what he struggled for lived for and clide for. He was out and out a nationalist purposed to perform the people around him culturally, Socially, economically and politically, and accordingly he rendered youngman service to humanity at large during that little span of his meteoric rice.

He did everything in his capacity. His School of thought pervaded all his works and helped remove the dogmatic ideas and beliefs of the ignorant and the illiterate and led them to the supreme path of glory and virtue.

This won for him a saintly honour and he came to be regarded by all Hindus as a saint. His writings spelled the qualities of a great seer.

Though he was a muslim the magnanimity of the Hindus could not deprive him of what he was in truth, nor did they (the Hindus) leave him in the lunch, but nursed his genius tenderly till it gave them the best of the life they needed. And he did not disappoint them.

Dr. Umar Ali Sha was also a social reformar in his own environs. He had reformed the Hindus, customs and manners by dint of his profound knowledge Sanskrit and the Hindu philosophy which he had mastered.

He know more them any Hindu scholar of his day. He could recite slokas so fluently and so correctly inteprat them in Telugu that the pandits were stunned at his mastry.

All Hindus of Andhra admit that he had surpassed all in every branch of Telugu literature and he came to be regarded as the only eminent poet in modern times in that language.

His writings created a sensation throught Telugu speaking areas both within and outside Andhra State. Indian universities adopted his works in their curricular for degree classes and no library is without his books.

His political career overlapped his literary one and he was so engrossed in both that it is very difficult to think of the one without the other.

During the last decade of his life his literary fame was at its highest, While his political activities continued till his death.

He had to make many trips every year from south to north to be presence in the Legislative Assembly at Delhi from the time when he was elected independently in 1935. From them on he used to repair to the hill-tops of Simla to invoke the muse and produce his master-pieces in Telugu literature, even in his political travells.

Apart from his literary acties, his political career was also remarkable. He was known as a good politician. Mahatma Gandhi accepted him as a man with sound political ideas when he was in Congress upto 1935.

He worked for the nation unhesitatingly during the Khilafat movement and was held in high esteem by all the national leaders of those times. His assemble speeches contained sound principals of integrity and magnanimity and therefore saw the press of his day.

Besides, he worked for the good of the country delivering ectures everywhere irrespective of religion cast or creed with a

view to promoting goodwill amongest the people for which he was adored by Muslims and Hindus alike.

When he was preoccupied with political affairs and when his literary fame was at its zenith, he was suddenly shaken by a tragic event His beloved wife Akbarbebi died Delhi in April 1935 when he was attending the sessions.

This shock are into his vitals and he breathed his last in January 1945 after a cerebral hemorrhage in a village of Narsapur.

His body was brought for burial to Pithapuram where every year congregational meetings are held for one week by his 20,000 disciples including eminent poets and scholars of Andhra state in honour of their great hero-poet and he lies forever enshrined in their hearts.

—M. N. HUDA





ఎవరు తల్లి

## ఉమర్ ఆలీషాకవి

# ఖండకావ్యములు

---

## ఎవరు తల్లి!

నుదిటిపైఁ జుక్క, రత్నాలు । పొదిగినట్టి
కమ్మ, తలకట్టు, వర, కలం । కారిచీర
సౌరు సొంపార బారుమై । జారు జార
చేరెఁడేసి కన్నులు కురుల్ । బారెఁడేసి
లత్తుకరసంబు పదముల, మెత్తి, నెత్తి
గంప నెత్తుకపోయెడు । గరిత యెవరొ ?
ఎఱుకఁ జెప్పక పోయెద । వెవరు తల్లి ?

గగనముననుండి, హిమవ న్న । గమ్మునుండి
జాహ్నవినిఁ గూడి శర్వాణి । చాటు మఱఁగి
ఆర్యభూమిని విడిచి విం । ధ్యాటవులకు
వలస దిగి వచ్చి 'ఉదయార్క' । పట్నవీధి
విడిచి నడిదారిలోఁ జాల । విసిగి విసిగి
కాకతీయుల ఘోర సం । గ్రామరంగ
మందుఁ గాలూది రక్తసి । క్తాన్న మార
గించి, రణదుందుభిని, గీర్తి । గీతములను
బాడుచు, దిశాంతముల జయ । ధ్వజము లెత్తి,
భూతి రేకెత్తఁ గొన్నాళ్ళు । ప్రొద్దు పుచ్చి,

లంగరెత్తిననాఁడు క ♦ లంగు మదిని
నిన్నుఁ జూచిన జ్ఞాపక ♦ మున్న దబల ! ॥నుదిటి॥

శాతవాహనశకనాథ ♦ సార్వభౌము
లాలయు నాస్థానసీమల ♦ నోలగముల
ప్రథిత పట్నాటివీర మా ♦ ర్తాండకోటి
నిండుకొలువున గజరాజు ♦ లుండుకోట
మేటి చాళుక్యగణ పాక ♦ నాటిప్రభుల
యల నిజామాదినృపుల సా ♦ ధాలమోల
మహితమాణిక్యదీపముల్ ♦ మండుచోట
పరనృపాలకిరీటముల్ ♦ వంగుచోట
విమలసురభిళానిలములు ♦ వీచుచోట
సిరి సరస్వతి యొకచోటఁ ♦ జెలఁగుచోట
గజ్జె, లందెలు మ్రోయఁగాఁ ♦ గనకవృష్టి
గురియ; దివిజాంగనల మనో ♦ హరవిలాస
భాసమాన కళా సము ♦ ల్లాసలీల
నవ్వు వెన్నెల లలముఁగ ♦ నాట్యమాడి
నట్టి శ్రీ రాజ్యలక్ష్మి వే ♦ యను చొకింత
జ్ఞాపకం బున్నదమ్మ ! ని ♦ జంబు చెప్పు ॥నుదిటి॥

ఆంధ్రభాండారములను ము ♦ త్యాలమణులు
మలచి కట్టినసౌధాల ♦ మంటపాల
వేలు వీరుల తెలుఁగు చి ♦ త్రాలు విశ్వ
రూపభారతి తెచ్చి యా ♦ రోపితాభి
నయములై నట్టి నాణెముల్ ♦ నగల సొగసు
పగమువారిన గేదంగి ♦ నొగలతెన్ను

వెన్నెలను, నెలవంకల ♦ నిలిచి దిద్ది
సుద్దు లొలయు రాగాల వి ♦ శుద్ధగీత
గానరసవాహినులను, ము ♦ క్కాకఁ దీరి
నాట్య నిగమపాటవము క ♦ ర్ణాటఫక్కి
దిక్కుల వెలార్చి, ప్రేమ పెం ♦ పెక్క సుధల
మార్చి మల్లెల మలపి వే ♦ మారు నదిగొ
గంపలోఁ బోసి పట్టక ♦ వంపునపుడు
నిన్నుఁ గాదన్న జ్ఞాపక ♦ మున్న దోసె !
నిన్ను వలదన్న జ్ఞాపక ♦ మున్న దోతె ! ॥నుదిటి॥

తెలుఁగుకత్తులనెత్తురుల్ ♦ కడిగివేసి
ఘంటములఁ బోసి, భారత ♦ ఘట్టములకు
వీరరుచి పెట్టి తల ♦ ప్రాలువేయుచున్న
నన్న, తిక్కన్న ముకుళిత ♦ హస్తములను
పలుకుపలుకునఁ దేనెలు ♦ చిలుకునట్టి
జిలుఁగుబెట్టినపోతన్న ♦ తెలుఁగువాణి
కంచుఢక్కను బ్రద్దలు ♦ గాగఁ గొట్టి
వెలయు శ్రీనాథభట్టు క ♦ విత్వధాటి
తత సుధామధురోక్తుల ♦ దండలల్లి
వాణిని నలంకరించిన ♦ భట్టునోటఁ
గాంచనోదయ సౌరభ ♦ కలనమట్లు
కవితఁ గూర్చిన సోముని ♦ కలమునందు
నీదు సొగసును, నీ ఠీవి ♦ నీ విలాస
భాసమాన సముల్లాస ♦ బంధుర ప్ర
భా వికాసము, నీ మహా ♦ ప్రజ్ఞ చూచి

యున్న జ్ఞాపక మొక్కింత ♦ యున్నదమ్మ !
నిలిచి నా సంశయముదీర్చి ♦ వెడలిపొమ్ము! ॥నుదిటి॥

మగధ సింహాసనమున సా ♦ మ్రాజ్యలసిత
పాటలీపుత్ర వీధుల ♦ వనమునందు
వారువము లెక్కి యేనుఁగం ♦ బారు లెక్కి
ఒలయ చౌడోలు కట్టిన ♦ యొంటె లెక్కి
నవల లాడుచు నీరాజ ♦ నంబు లిడఁగ,
లాజ లొకమూలఁ జల్ల, వి ♦ రాజమాన
తేజమున స్ఫురదరుణ ప్ర ♦ దీప్తకాంతి
వందిమాగధు లలరి కై ♦ వారములను
జేయుచు, నిశాంతకలశ సం ♦ స్థిత వినూత్న
భావగంభీర భయద రూ ♦ పములఁ బోలు
పేరుపేరుల బిరుదముల్ ♦ పెట్టి వీర
కోటి మేటి సాహసములఁ జాటి కోట
లెక్కి జయభేరి మ్రేయ నూ ♦ రేఁగునాఁడు
పగలు కర్పూరదీపముల్ ♦ పట్టునాఁడు
నీవు మావెంటనుండిన ♦ యెఱుక గలదు
ఆ రహస్యమ్ము చెప్పి నీ ♦ వరుగ వమ్మ ! ॥నుదిటి॥

కృష్ణ, గోదావరీ, పినా ♦ కినులు, తుంగ
భద్ర లిసుకవెట్టిన తేట ♦ బయళులందు
పిల్లగాలికి వాహ్యాళి ♦ వెడలివచ్చు
పుర పురంధ్రుల జత గూడి ♦ పూలమాల
లెగురవేయుచుఁ బకపక ♦ నగుచు పాట
పాడుకొనుచు నెత్తమ్ముల ♦ నాడుకొనుచు
సందడి మహోన్నతంబు ని ♦ స్సంశయంబు

# క ల ము

కలమ ! నీరూపవైఖరీ ♦ కలనఁ గాంచ
ఎంతొ వింతగఁ దోఁచు రా ♦ ధ్వాంతమునకు
నెమలిపురినుండి యేకరూ ♦ పమున వచ్చి
విశ్వమేలుచు నున్నావ ♦ నశ్వరముగ
జన్మచే స్వల్పవస్తువు ♦ సార్వభౌమ
పదము గనుటన్నఁ బుణ్య సం ♦ పదయె గాదె ॥కలమ॥

రెండునాల్కలు నీ కున్న ♦ నొండె చేసి
పాపపుణ్య సుఖాసుఖ ♦ రూపము లగు
ద్వంద్వములయందు నీవు న♦ ద్వంద్వ వగుచు
బ్రహ్మవ్రాఁతలనే దిద్ది ♦ ప్రకృతినెల్లఁ
గదపుచున్నావు విజయ ♦ ఖడ్గంబురీతి
సుకవికరమున నైంద్రజా ♦ లకుని చేతి
కుంచెవలెఁ జిత్రకారుని ♦ కుంచెవలెను
చిత్రచిత్రాలు విశ్వరూ ♦ పత్రయంబు
చూపుచున్నావు రసములు ♦ సోడుముట్ట
మధురమధ్వాసంబులో ♦ మలసినట్లు
ప్రాఁత క్రొత్తల సభ్యత ♦ వచ్చినపుడు
విరిగి పడిన జాతీయ జీ ♦ విత పునాది
యొఱకమునఁ బడి చెడిన య ♦ భ్యున్నతిని ని
షిద్ధ పాషండ ఖిన్న వి ♦ శీర్ణ మలిన
విలయనదులందు నడుపు నా ♦ వలకు నీవు
కాంచన వికారమైన చు♦ క్కాని వగుచు
కాచితివి పెక్కు సుడుల రా ♦ కాసిగముల
రణ శతఘ్నులు, శస్త్ర, ♦ పరంపరలును
తీర్చి జయభేరి వాయించి ♦ తెచ్చినట్టి
రాజ్యములకెల్ల మొదటి వా ♦ రసుఁడ వీవె ;
యీవు కులహీనుల కరాల ♦ నిఱికెదేని
నింక గౌరవములకుఁ జో ♦ టేది చెప్పుమ ?

# గ్రంథాలయములు

చ. జననియు జన్మభూమియును ♦ స్వర్గముకన్న గరీయమైన వం
చనియెడు వాణి వీనులకు ♦ హాయిగ సోఁకినరీతి, శారికా
స్వనములు, చంద్రికాధవళ ♦ శారదరాత్రులు సొంపు నింపలే;
వనఘ ! మనోహరంబు సము ♦ పార్జిత కాంతియుతంబు గావునన్.

ఉ. భారతమాత ! నిన్నుఁ బరి ♦ పాలనఁ జేసినవారు కీర్తిఁ గ
న్నారు; విలాస మేర్పడ న ♦ నంతశుభంబుల నొంది స్వర్ణ దీ
నారములన్ గడించి చని ♦ నారు; వసుంధరలందు మేటి వ
న్నారుగదమ్మ నీ ధరణి ♦ నాథులు యోధులు చిత్రమేర్పడన్.

తే. మున్ను నీగర్భవనమున ♦ బుట్టినట్టి
ప్రతిసుమంబు సుగంధాప్తిఁ ♦ బరిఢవిల్ల
వైదుషీభృంగరుతి వినఁ ♦ బడుచునుండె
నిప్పు డవి లేవు వన మేదొ ♦ చెప్పలేము.

తే. నీవు స్వర్గంబవో కాక ♦ నిఖిల విభవ
ములకు నెలవైన తేజః ప్ర ♦ పూర్ణవొక్క
గంపెడు నిసుంగులను గాంచి ♦ కాంచనములు
నింపుచుఁ గళావిలాసముల్ ♦ నెఱపినావు

సీ. విన సొంపునింపెడు ♦ విమలగాంధర్వంబు
నలరించు మేటిగా ♦ యకులు లేరు
రమణీయ జాతి గీ ♦ తములను రచియించి
పాడింపఁగల కవీ ♦ శ్వరులు లేరు

లలిత నూతన కళా ♦ కలితరీతిని యంత్ర
    ములు సేయగల కార్మి ♦ కులును లేరు
ప్రకృతిపదార్థ జీ ♦ వజ్యోతి శోధిం
    ప్రభాతృభూమిఁ దరించు ♦ వారు లేరు

గీ. దేశమును సంఘమును సము ♦ దీర్ణవృత్తి
నరసి యుద్ధరింపఁగల నా ♦ యకులు లేరు
అట్టి మనపూర్వికుల కథ ♦ లరలయందు
పుస్తకాకృతి నీక్షింపఁ ♦ బోలు నింక

సీ. మనసంఘ జలధికి ♦ వెనుకపాటే కాని
    పోటుతగిలి ముందు ♦ బోవలేదు
మనజాతి చంద్రున ♦ కనయక్షయమె కాని
    శుక్లపక్షపు శోభ ♦ జూడ లేదు
మనదేశ భవనంబు ♦ మహిని గూలుటె కాని
    యే శిల్పియును లేప ♦ నెత్తలేదు
మనభూమిభూజ మిం ♦ కను బుల్లవిరుగుచు
    న్నది గాని పూయు ట ♦ న్నదియె లేదు

గీ. మన మహాజనమేఘంబు ♦ దినదినంబు
ఱాళ్ళు గురియును గాని నీ ♦ రములు లేవు
అట్టి మనపూర్వికుల కథ ♦ లరలయందు
పుస్తకాకృతి వీక్షింపఁ ♦ బోలు నింక

శా. ఏ దేశోదయ దివ్యదీపికలచే ♦ నీరేడులోకంబులన్
ప్రాదుర్భావ కళాప్రదీపకళికా ♦ వ్రాతంబు వెల్గొందెనో
ఆ దేశం బిపు డంధకారమయమై ♦ యల్లాడుచున్ రోజు లెం
తో దైన్యంబునఁ బుచ్చుచున్న దకటా ♦ యూహింప నింకేటికిన్.

సీ. మధుమాసముల మేయు ♦ మావిచిగుళ్ళకై
పంచమస్వర మభ్య ♦ సించెఁ బికము
కుసుమాసవము ప్రేమ ♦ మెసవి వినోదింప
వనచరత్వము నేర్చి ♦ కొనియె భృంగి
మేఘమాలికతోడ ♦ మిత్రానురాగంబు
ప్రకటింపఁ గఱచె న ♦ ర్తనము నెమిలి
పూదీవ తీవకుఁ ♦ బోయి తేనె గడించు
పాండితి నలవాటు ♦ పడియె నీఁగ

తే. సహజపాండిత్య మిటు గాంచి ♦ విహగ క్రిములె
ప్రకృతిని నలంకరించుచుఁ ♦ బఱగుచుండ
మనము మనుజాశయంబు నా ♦ ర్జనవిధంబు
వదలినాము సౌభాగ్యంబు ♦ వదలినాము

సీ. దేశాభిమానంబు ♦ దీపింప నూరూర
గ్రంథాలయము లుంచి ♦ క్రాలవలయు
సంఘసంస్కారంబు ♦ సవరింప నూరూర
గ్రంథాన్వయము జెప్పఁ ♦ గడఁగవలయు
జాత్యభివృద్ధి వి ♦ చారింప నూరూర
గ్రంథార్థపఠనంబు ♦ గఱపవలయు
జన్మభూమికి మేలు ♦ సలుపుట కూరూర
గ్రంథదర్శనవృత్తి ♦ గడఁగవలయు

తే. అట్లుగాకున్న శుష్కవా ♦ క్యములవలన
ఫలము చేకూర దాంధ్రుల ♦ భావిజీవి
తము మహానర్థములఁగూలి ♦ తల్లడిల్లుఁ
గాన భారతి కొకయిల్లు ♦ గట్టుఁడయ్య

# క్షామదేవత

ఉ. అకటికూటికిన్ గఱిటెఁ ♦ డైనను గంజి లభింపలేదు ; రెం
డాకులో నీళ్లో త్రావి మరి ♦ యాదకు నిల్చెదమన్న గుడ్డ లే ;
దాకరి కేకవస్త్రము గృ ♦ హంబున గోచికి మించి యింక వే
ఆకర మేమి లేదు బ్రతు ♦ కాశ యెటో కదె క్షామదేవతా !

ఉ. కూటికి మోము వాచి పసి ♦ కూన లలో యని యేడ్చునిండ్లు నా
నాఁటికి హెచ్చుచున్నవి; ది ♦ నంబు యుగంబునుబోలెఁ దోఁచునే
చోటికిఁ బోయినన్ కడుపు ♦ చుమ్మలుచుట్టుకపోవుచుండె నీ
కాటక మందుఁ జెందు కత ♦ గండ్లిఁకఁ దప్పవె క్షామదేవతా !

ఉ. కందులకాటకం బని జ ♦ గజ్జను లాడుదు రప్పు కూడ నీ
చందము మూఁడుసేరుల నొ ♦ సంగరు రూకకు ; నిట్టివిడ్డురం
బెందు ఘటిల్లలేదు ; దుర ♦ దృష్టమె కాని, ధరిత్రి పండలే
దందువ ? కాదు! నీదు మహి ♦ మాతిశయం బిది క్షామదేవతా !

ఉ. 'అంగడిలోన నన్ని గల ♦ వల్లునినోట శనున్న' దన్న యా
భంగి సమస్తసస్యములు ♦ భారతమాత యొసంగుచున్న మా
కుం గలకష్టనిష్ఠుర మ ♦ కుంఠితదైన్యదవానలంబు బా
యంగల మార్గమేర్పడ ద ♦ హంకృతపూరితక్షామదేవతా !

చ. తిని తినువారికక్కుఱితి ♦ తీరగఁ జేరఁగఁ గోరినంత యి
చ్చినభరతాన్వయం బిపుడు ♦ చేరెఁడు ప్రాలకుఁ జేయి చాచి హా
యని బ్రతిమాలినన్ దొరక ♦ వయ్యెను ; చేటు ఘటిల్లె; నింక మా
దినములు చెడ్డ వయ్యె భవ ♦ దీయవిలాసము క్షామదేవతా !

సీ. ఆరంభ మయ్యె మా ♦ కార్బ్రతునాటి ది
వాలాకె నిఱుపేద ♦ వాలకంబు
మరుసటియేఁడె భీ ♦ మాకంపెనీలు మా
యిల్లు వాకిలిని న ♦ ట్టేటఁ గలిపె
యుద్ధంబుపేర్చెప్పి ♦ యున్నమట్టున కుత్త
మర్ణులూడ్చిరి మచ్చు ♦ మాపినట్లు
వర్షాలు లేక మా ♦ వరిచేలు పండక
సిస్తులకై యున్న ♦ యాస్తి పోయె

తే. ఇట్లు కొనయూపిరికి వచ్చు ♦ నట్లు చేసి
గాలివానకుఁ బడుచెట్లు ♦ వోలె మమ్ముఁ
జేసినావు దరిద్రాగ్నిఁ ♦ ద్రోసినావు
గ్రామదేవత ! కదలు దే ♦ శంబువదలి.

ఉ. వందలు వేలు దెచ్చుకొను ♦ వారలుసైతము పుట్టెఁడాకటన్
గ్రమ్మందుచు నుంత కూలి కొక ♦ పూఁత గడించుదరిద్రు లంద ఱే
చందము పొట్ట పోసికొనఁ ♦ జాలుదు ? రాలును బిడ్డ లేవ్వ నా
మందిర మెట్టులుండు ? నొక ♦ మారుఁ దలంపవు గ్రామదేవతా !

ఉ. అన్నము రామచంద్ర యని ♦ యార్చుచు వీధులవెంట నెందఱో
ఖిన్నులు కంఠమెత్తి తమ ♦ ఖేదము పాడుచు మొత్తుకొంచు నే
మన్నను గాని యొక్కకడి ♦ యన్నము బెట్టెడుఱేఁడులేఁడు సం
పన్నతఁగన్న దేశము శ ♦ వంబటు లున్నది గ్రామదేవతా !

ఉ. కుంచము బోర్లవేసి తల ♦ గుడ్డను పృష్ఠముక్రిందఁ జేర్చి యా
పంచులకట్టు నెత్తికిఁ బ ♦ సందుగఁ జేరిచి యింక వర్తకం
బంచు వచింప రాదని భ ♦ యంపడి పెట్టెకుఁ గాళ్ళు చాచి చిం
తించుచు నుండ్రి కోమటులు ♦ దిక్కఱి దీనత గ్రామదేవతా !

ఉ. ఱొమ్మనకున్ బవల్ నిశలు ♦ ఱోకలి కట్టుక దంపు దంచి జీ
వమ్ములు నిల్పువార లొక ♦ వంకను ధాన్యము లేక బాష్ప వ
ర్షమ్ములు నింప; ధాన్యపు మ ♦ రల్ పనిలేకయె బూజుపట్టి మే
ఘమ్ములఁ జూచుచున్న విఁకఁ ♦ గార్యము లేదని క్షామదేవతా !

ఉ. పూసలు, పుస్తె లమ్మినను ♦ బూటకు బత్తెము చాలదయ్యె ; నా
యాసము నోర్చి కూలి నొక ♦ యర్థ గడించిన సేరునూక లి
చ్చేసరి కెంతొ కష్టము. 'రి ♦ లీపు సొసైటులు' వారి బాధలున్
బాసిన నెట్టులో బ్రతుక ♦ వచ్చును దీనత క్షామదేవతా!

ఉ. కూలియు నాలి మాని కను ♦ గొంచు బజారున బియ్యమమ్మ కం
ట్రోలున కేగి దేహి యని ♦ రూక యొసంగిన బేడకంటె రాఁ
జాలవు బియ్యమంచు నొక ♦ జామొ దినార్థమొ యున్నవానికిన్
సోలెఁడు గింజలే యొసఁగు ♦ చున్నవి దీనత క్షామదేవతా !

ఉ. చెమ్మట యూడ్చియున్ దినము ♦ చేసినకూలిని బెట్టి కొన్న బి
య్యమ్మున సెట్టి తవ్వ కొల ♦ యందున లాభము దీసి నోటు మా
ర్క్కమ్మునఁ గాని దీసి జవ ♦ రాలి కమర్చును నానుపేట ; అ
కొమ్మ మరొక్కరెమ్మ కిడి ♦ కోల్పడుచున్నది క్షామదేవతా !

ఉ. రోగముచేతఁ బండుకొని ♦ రోయుచునుండిన వాని మేనియం
దీఁగలు, పేలు, దోమలును ♦ నెంతయు నల్లులు పీల్చ రక్త; మా
లాగునఁ బేదవాండ్రని త ♦ లంపక వారల కాసువీసమున్
లాగిరి కంటురోలునకు ♦ లాభము సేయఁగ క్షామదేవతా !

మ. పరదేశంబుల వస్తువుల్ ప్రియము కా ♦ వచ్చున్; మహాయుద్ధముల్
పరవాసంబులఁ గాల్పవచ్చు; నవి మా ♦ పైఁ గట్టి మాధాన్యముల్
పరరాజ్యంబుల కంపి మా వస్తువులున్ ♦ బంగారముల్ పోవ దు
ష్కర దుర్భిక్షదవాగ్ని ముంపఁదగునే ♦ క్షామంగనా! నిర్దయన్.

ఉ. గారెలు వంతవే యనుచుఁ ♦ గాంతుఁడు కాంతకుఁ జెప్ప నామె నో
రూరఁగ వ్రేలుఁజూపి యిది♦యొక్కటె యున్నది రంధ్రముంపసం
బారము వేఱె లేదనిన ♦ భంగి గృహస్థుల యిండ్లఁ బైకి బం
డారమె గాని లోపల లొ ♦ టారము చూడుము గ్రామదేవతా !

సీ. మధురాన్నములు మాని ♦ మహనీయు లందఱు
దోసె లుప్మాలకు ♦ దాసులైరి
శతవర్ష జీవులు ♦ శల్యగతప్రాణు
లకట కాఫీగత ♦ ప్రాణులైరి
ఎళనీరు ద్రావి హా ♦ యిగ సుఖించెడు వార
లైను సోడాలకు ♦ నర్థులైరి
కర్పూర తాంబూల ♦ ఖాదను లగువారు
ఖారఖిల్లీల స ♦ ర్దారు లైరి

గీ. మంచి పెసరట్టు, సిగరెట్టు ♦ మనకు రెండె
పంపె స్వర్గంబునుండి యీ ♦ శ్వరుఁ డఁటంచుఁ
బలికి కొఱమాలి నినుఁ గోరి ♦ పిలిచినాము
గాని, లేకున్న నీవు రాఁ ♦ గలవె కఱవ ?
గ్రామదేవత ! లేక రా ♦ గలవె నీవు.

శా. ఏమైనన్ విను మొక్కమాట యిదె; నేఁ ♦ డే గాదు వెయ్యేఁడు లీ
గ్రామంబుల్ పది తోకచుక్కలును, రా ♦ కాసుల్, నభోవీధులున్
భూముల్ బ్రద్దలుగొట్టినన్ భయము రా ♦ బోదేమియున్మాకు; మా
క్షేమం బీశ్వరు శక్తిపైఁ గలదు ని ♦ క్షేపంబు గ్రామాంగనా !

# మోక్షగీతి

విమలమై స్వచ్ఛమై కళా ♦ విహితమైన
యజ్ఞవేదిక రాజిల్లు ♦ నదిగో ! నీవు
మానసికమైన యోగ స ♦ మాధియందు
నిలిచియ సుహవిస్సుల వ్రేల్చ ♦ వలయు నేఁడు
నిలిచి ప్రాణానిలము లియ్య ♦ వలయు నేఁడు.
ఆ మహాధ్వర సముపాస ! నా మహత్వ
మమల మజ్ఞాన తిమిరంబు ♦ నాహరించు
శాంతియుత తేజ మెల్లెడ ♦ సంతరించు
దివ్యశక్తి మనోవీథి ♦ తేజరిల్లు
అఖిల పాతక కాలుష్య ♦ మణఁచివైచు
సకల తాపోపశాంతిని ♦ సంఘటించు ॥విమల॥

ఇదియె జన్మకు తెలివు, మా ♦ కిదియె సుగతి,
ఇదియె నిర్వాణ; మిదియె మా ♦ కిద్ధపథము;
ఆత్మస్వాతంత్ర్యమునకు దే ♦ హాభిమాన
ముడిగి కర్మవాంఛల నెల్ల ♦ నుడుగవలయు
వలయు నెత్తురునైన నీ♦ వలయుఁ దుదకు
నిదియె యోగంబు ముక్తికి ♦ నిదె పునాది
యిదియె సంగపరిత్యాగ ♦ మిదియె శాంతి;
రాగముల రోసి యెల్ల స్వా ♦ ర్థములఁ బాసి
శ్రాద్ధకర్మమె యవధిగాఁ ♦ జలుపవలయు
నిరుపమాన మహాశాంతి ♦ నిలుపవలయు
రక్తసిక్తమై బలి పీఠ ♦ రాజ మదిగొ
త్యాగభోగంబు లనెడు హ ♦ స్తములతోడఁ

బిలుచుచున్నది కర్మవీ ♦ రులను జూచి
పలుకుచున్నది కార్యశూ ♦ రులను జూచి
అక్షయంబుగ నగ్ని ప ♦ రీక్షఁ జేయ
దీక్షఁబట్టెను జగము సు ♦ భిక్ష మెసఁగ
తెలివిలో త్యాగ మిప్పుడే ♦ తెలియవలయు
తెలివిలో కాంతి యిప్పుడే ♦ తెలియవలయు
జనని యాదేశ మిది యార్ష ♦ జన్మభూమి
వధ శిలారూపమును దాల్చి ♦ పలుకుఁ గంటె
మాతృసేవ నొనర్చెడు ♦ మానఘనుఁడు
పూజ్యుఁ డన్నఁట ; వాని స ♦ ద్బోధనంబె
మోక్షసిద్ధికి మరి బంధ ♦ మోక్షములకు
కారణం బది స్వారాజ్య ♦ కారణంబు
ఈవు నీ నిశ్చయము దాటి ♦ యేగ వలవ
దీవు నీ ప్రతిజ్ఞను దాటి ♦ పోవఁ జనదు
సాధ్వి భర్తమాటను దాటి ♦ సాగఁబోదు
కలము కవికన్న నధికంబు ♦ పలుకఁబోదు
మురళి వాయించువానిని ♦ మఱచిపోదు
చారు విజ్ఞాని గురునాజ్ఞ ♦ మీరఁబోఁడు
నీవు నీ నిశ్చయము దాటి ♦ పోవఁ దగదు
నీవు నీ ప్రతిజ్ఞను దాటి ♦ పోవఁ దగదు
గ్రహతతులు మాఱు ; లోక చ ♦ క్రములు మాఱు
పగలు, రేలును, ఋతువు ల ♦ బ్దములు మాఱు
ధరణి మాఱును యుగయుగాం ♦ తములు మాఱు
మాఱినను లెక్క కిసుమంత ♦ మీఱిపోవు
నీవు నీ నిశ్చయము దాటి ♦ పోవఁ దగదు

నీవు నీ ప్రతిజ్ఞను దాటి ♦ పోవ జనదు
దాస్యశృంఖల లను జీవి ♦ తంబు గడిపి
ధనమదాంధుల కొలువు బం ♦ ధనములందుఁ
జిక్కి యాత్మీయవ్యక్తిని ♦ దక్కి స్రుక్కి
నీ మనోభావములఁ జంపి ♦ కామ మోహి
వగుచు నజ్ఞాన ఘోర గా ♦ ఢాంధకార
మందుఁ జిక్కి యనే తల ♦ క్రిందు లైతి
వింకఁ బైకి వచ్చెడు దారి ♦ యేది నీకు ?
ఇంక నీవు నీవగు త్రోవ ♦ యేది నీకు
ఉన్న నీ బ్రతు కథ్వాన్న ♦ మన్నమాట
ఉన్న నీవ్యక్తి భూభార ♦ మన్నమాట
మాతృసేవ నొనర్పని ♦ మానవుండు
దేశసేవ నొనర్పని ♦ త్రిమ్మరీఁడు
నీకళేబర మెన్నాళ్ళు ♦ తీడ్వఁగలఁడు
ఉర్వి నెన్నాళ్ళు చావక ♦ యుండఁగలఁడు
చచ్చి పుట్టెద వనుమాట ♦ సర్వమిథ్య
చచ్చి లేచెద వనుమాట ♦ సర్వమిథ్య
ఈ సహోదరకోటి ని ♦ క్షించు నీకు
ఈ మహాఘోరకాల మీ ♦ క్షించు నీకు
ఈ మహామారిభూత మీ ♦ క్షించు నీకు
ప్రాణ మన్నఁ దృణప్రాయ ♦ మట్లు నీకు
గానవచ్చును; వధలన్నఁ ♦ గానరావు
కంఠ మురివెట్టి లాగినఁ ♦ గానరాదు
అవి సమాధికన్నను నెక్కు ♦ డగునె సఖుఁడ ?
అవి మనోయజ్ఞమునకు నీ ♦ డగునె సఖుఁడ ?

నీవు చార్వాకుఁడై నేఁడు ♦ నిలువవలయు
నీవు స్వార్థవాదివిగాఁగ ♦ నిలువవలయు
కంఠ లొలిచిన నుషస్సను ♦ చుండరాదు
తలను ఖండించినను ప్రేమ ♦ దలఁపరాదు.
రక్తనాళము లుప్పొంగ ♦ రాగయుక్త
మైన పల్లవి స్వాతంత్ర్య ♦ మను స్వరంబు
లమ్మ నేర్పిన చరణ భా ♦ గమ్ము లందు
గూర్చి పాడుము బహు శత ♦ ఘ్నులను ప్రేల్చి
నట్టి, మేఘము లుఱిమిన ♦ యట్లు లగును
అదె స్వరాజ్యభేరిగ లోక ♦ మావరించు
అదియె రోదసీకుహరంబు ♦ కదపివైచు
మనుజహృదయంబు గరచుటో ♦ మాటగాదు
మనుజభావంబు మార్చుటో ♦ మాటగాదు
భూమి నాటిన బీజంబు ♦ మొక్కయగును
మనసు నాటిన మాట కా ♦ ర్యము ఘటించు
కలుషకర్మ మనంత మ ♦ గాధజలము
నీవు సాగరమున నున్న ♦ నావ యిప్పు
డాయమును గూర్పు లంగరు ♦ వేయవలయు
హితము నార్జింప తిష్ఠ సా ♦ ధింపవలయు
అరులఁ దెగటార్చి స్వాతంత్ర్య ♦ మందవలయు
ఇదియె నిష్కామకర్మ నీ ♦ వెఱిఁగియున్న
ఎల్లరకు దీని యర్థమే ♦ యొఱుకపడదు
పక్షు లన్నిటికి రసాల ♦ పల్లవములు
తినుట కాహార మగు నని ♦ తలఁపఁ దగదు
కోకిలము రీతి కో యని ♦ కూసినపుడె

నీకు సాయుజ్యపదవి రా ♦ నేర్చు నిజము
ఇదియె మోక్షంబు జన్మకు ♦ నిదియె యవధి
ఇదియె యిహపరసాధక ♦ మిదియె జ్ఞాన
మిదియె యోగంబు వేదాంత ♦ మిదియె తెలివు
గాన నీ యజ్ఞమును జేయఁ ♦ గడఁగు మింక
హోత్రివై నివృత్తి క్రియా ♦ పాత్రమైన
సర్వతంత్ర స్వతంత్రత ♦ సంఘటించు
ఋత్విజునితోడ నీ మనో ♦ వృత్తి నిలిపి
మఖము సాగింపు సర్వతో ♦ ముఖములైన
నైహికాముష్మికంబుల ♦ కదియె పథము.

# నిమ్నజాత్యుద్ధరణము

అఖిలవిశ్వకుటుంబి, మా ♦ యాస్వరూపి
నిగమములతోఁడు, శశికంటె ♦ సొగసుకాఁడు
తోఁచి తోఁపక యొకట దో ♦ బూచులాడు
నతని కేమైనఁ గలవె నీ ♦ చాధికతలు ?
నతనికేమైన గలదె నిం ♦ ద్యాధికములు
కుసుమ సౌగంధ్యములఁ జల్లు ♦ కొనుచుఁ గుసుమ
కోమలులచెంత, ఘోరకా ♦ కోదరముల
పొంత మసలుచుఁ జల్లని ♦ ప్రొద్దునందు
ధూళిధూసరకలితయై ♦ దోఁగునట్టి
గంధవహున కేమైనను ♦ గలదె మైల ?
ధవళ కిరణాళిచే విశ్వ ♦ ధాత్రిఁ దనిపి
తమముఁ బరిమార్చి, జీవసం ♦ తతికిఁ గూర్చి
లోకబాంధవ పదవిని ♦ స్వీకరించు
కర్మసాక్షికి నేమైనఁ ♦ గలదె తమము ?
కనదనూనపవిత్రగం ♦ గాలహరికి
దీపితాఖండ చంద్ర చం ♦ ద్రికలవెలిఁగి
కువలయామోద మొనరించు ♦ కుంభవృష్టి
కరయ శ్వపచాదిభేదముల్ ♦ పఱఁగునొక్కొ
భేద మన నీర్ష్యచేఁ గల్గుఁ ♦ గాదె సఖుఁడ !
సృష్టి యొకనిమిత్తమె చేసె ♦ నీశ్వరుండు
చేతివ్రేళ్ళున్నయట్టు లీ ♦ స్త్రీలు పురుషు
లుండవలెఁ గాని, కలహంబు ♦ లుండఁదగునె ?
ఆర్యు లాదిని దస్యులై ♦ యుడవులందుఁ

దిరుగు ప్రజతోడఁ జేసె చు ♦ ట్టరిక మరసి
యవన విభులకు బిడ్డల ♦ నరణ మిచ్చి
యపుడు రసపుత్రకులు వియ్య ♦ మందినారు ;
తురకపిల్లను వెంకటే ♦ శ్వరుఁడు పెండ్లి
యాడె ; నాళ్వారు లను మాల ♦ వాఁడు గలఁడు
కంసరాక్షస బంధువ ♦ తంసుఁడైన
కృష్ణుఁ డెవరొ విమర్శించి ♦ రేని నతఁడు
అది బారతవాసియం ♦ చరయఁ గలరు
పాండవులు గూడ భారత ♦ వర్షమునను
పూర్వ వాసులనుండియే ♦ పుట్టినారు
ఆర్యదస్యులభేదంబు ♦ లంతరించి
యొక్క త్రోవను, నొకకోవ ♦ నొక్క రత్న
హారమందలి పూసల ♦ యట్టు లింత
వఱకు భాగ్యాళిలోఁ దూఁగి ♦ వచ్చినారు
దిశల జయభేరి వాయించి ♦ దిగ్గజముల
కుంభయుగములపైఁ గీర్తి ♦ కోమలాంగి
గజ్జె లందెలు మ్రోయఁగాఁ ♦ గనక వృష్టి
గురియ నాట్యంబు సలిపెను ♦ గొన్ని నాళ్ళు
ఆ దినంబులు కల లయ్యె ♦ నల్ప మతుల
కలములకు వెలవచ్చెఁ, గే ♦ వలము స్వార్థ
పరులు సౌజన్యమును మాని ♦ పరమనీచ
శ్వపచబ్రాహ్మణ భేదముల్ ♦ సలిపి మనుజ
కోటియను మేటిసౌధంబు ♦ గూలునట్టు
నిప్పు పెట్టిరి; దానిచే ♦ నేఁటిదాఁక
మండుచున్నది గాని యే ♦ పండితుండు
నడుము కట్టి యా చిచ్చార్పఁ ♦ గడఁగలేదు.
సంఘ సంస్కారమంట, య ♦ సంఖ్యమైన
బ్రాహ్మణేతర సభ లంట ! ♦ బ్రహ్మవిదులు

బ్రాహ్మమతమఁట ! బోధనా ♦ భ్యాసమందు
సర్వ మానవసమతను ♦ జాటునంట
ఆంధ్రు లుద్యమ మఁట స్వరా ♦ జ్యంబు దెచ్చి
దేశ ముద్ధరింతు రఁట ! యే ♦ తీరొ ? యిన్ని
యున్న వాక్శూరతయె గాని ♦ యొక్కటైన
ఆచరించిరె మీరు మా ♦ యన్నలార ?
ఆచరింతురె మీరు మా ♦ యన్నలార ?
దేశవాసుఁడు, మీయిష్ట ♦ దేవుఁ గొలుచు
మీకు సోదరప్రాయుండు ♦ మీ సఖుండు
మాలవాఁ డని వర్జించి ♦ త్రోలఁదగునె
మైల వచ్చునె ముట్టిన ? ♦ మాటలందు
నేర్ప వచ్చును శ్రీరంగ ♦ నీతు లెన్నొ
చేయనివి చెప్పుటకుఁ గాదె ♦ చిన్నతనము
అగ్నిలో బొగ్గులను ఖని ♦ జాధికముల
వేసినపు డన్ని యగ్నినా ♦ వెలసి వెనుక
వేఁడి తగ్గిన నిది బొగ్గు. ♦ వెండి యిది యఁ
టంచు వేర్వేఱుకళలఁ గా ♦ న్పించునట్లు
మనకు ప్రేమాగ్ని ♦ తగ్గిన ♦ వెనుక జాతి
భేదములు వచ్చి సర్వంబు ♦ భిన్న మయ్యె
కూటికిని గుడ్డకును బాసి ♦ కూలవలసె
క్షామములు నీతిబాధలు ♦ క్షణము క్షణము
వేలకొలఁదిని దమపొట్టఁ ♦ బెట్టుకొనుటఁ
జూడలేకుంటె ; క్రీస్తులు ♦ గూడి యున్న
వారిఁ దమజాతిలో లాగి ♦ వైచుచున్న
వార ; లిఁక సంఘ మేరీతి ♦ బ్రతుకఁగలదు
ఈశ్వరా ! పూర్వ మిట నొక ♦ హిందుజాతి
కల దనుచు వచ్చువారలు ♦ దలపఁనట్లు
నిలుపుమీ ! దీనిభారంబు ♦ నీదె గాన.

# శ్రీ మహమ్మద్ ప్రవక్త

౧

చిమ్మచీఁకటిలో నెల • చెలఁగినట్లు
కొండకనుమలఁ గోయిల • కూసినట్లు
ముండ్ల వికసించిన గులాబి • పువ్వు పగిది
అరబులలోనఁ బొడమి సొం • పారినావు
క్రూరదనుజులలోఁ • ప్రేమ • కూర్చినావు
పరమమంత్రార్థ గీతముల్ • పాడినావు
జీవలోకము మోహింపఁ • జేసినావు
హృదయ సీమల నాట్యమా • డించినావు
చేతనాచేతనము లొక్కరీతిఁ • జేసి
తిరిగి యధ్యాత్మవిద్యను • గఱపినావు
ఓమహమ్మదు ! మము బ్రోవు • మో ప్రవక్త.

౨

ఆలవసంతాగమమునఁ గొ • రాకు లూడ్చి
చిగురు లెత్తెడు క్రొమ్మావి • చెట్లపగది
నీదు 'కలమా' ను బాడి య • సాధులైన
సాధులైరి ; క్రూరులు సదా • చారులైరి
భీరులు మహాహవప్రచండ • వీరులైరి
కండకావరమున నోరు • గానకుండ
పురుషులము మేము, పరులంత • పురుగులనుచు
నెంచునరబుల నొంచి దీ • పించినావు
ఓ మహమ్మద్రసూల్ ప్రోవు • మో ప్రవక్త.

౩

వేలుపొక్కఁడు గాని, వే ♦ వేలు గారు
దైవమొక్కఁడె గాని, భే ♦ దములులేవు
విగ్రహార్చన విజ్ఞాన ♦ విధము గాదు
ప్రతిమలను బూజ సేయుట ♦ పాడిగాదు
శిలల, దారుల, దైవాలఁ ♦ జేయరాదు
ఆత్మతేజంబు గుడులఁ జ ♦ ల్లార్పవలదు
ఆదిమధ్యాంతరహితుఁడై ♦ యలరు నతఁడు
నామరూపక్రియాశూన్య ♦ ధాముఁ డతఁడు
అతఁడె యతనికి సాటి ; కా ♦ రితరు లెవరు
ఇదియె పరమార్థ మని నిశ్చ ♦ యించి, పాడి
ఇదియె మోక్షమార్గం బని ♦ యెఱుక చేసె
నెవఁడు నీశక్తి వర్ణింప ♦ నెవరి తరము
ఇట్టి నీభక్తి వచియింప ♦ నెవరి తరము
ఓమహమ్మద్రసూల్ ప్రోవు ♦ మో ప్రవక్త.

౪

కఱకు ఱాబయిళ్లను వేడి ♦ గాలిఁ బైరు
పంటలును పాడిపశువుల ♦ మాట లేదు.
పొందు లేదు రేయుఁ బగలు ♦ పోరు పోదు
అట్టిదుర్భరదుస్సహ ♦ మైన పాడు
కోనలోన నరబ్బుల ♦ కోనలోనఁ
బుట్టినావు; జగంబులు ♦ మెట్టినావు
ఎల్లవారిచేఁ గీర్తి పా ♦ డించినావు
ఓమహమ్మదు ! మము బ్రోవు ♦ మో ప్రవక్త.

౯

ధూళిధూసర పరివృతా ♦ ఖీల నిఖిల
దోషదూషిత వసుధ వి ♦ ద్వేషభూమి
కామమోహితు లరబుల ♦ కాణయాచిఁ
బుట్టినావు విద్యాభిక్ష ♦ పెట్టినావు
భరతవర్షంబువలెఁ బుణ్య ♦ ధరణిగాదు
క్రూరులరబులమునికి వీ ♦ రులకు నునికి
అట్టిచోట బుట్టి సాం ♦ పారినావు
మంచి కులమున నీవు జ ♦ న్మించినావు
ఎంచి సంస్కారములను గా ♦ వించినావు
ఖలుల నెల్లను బరిమార్పఁ ♦ గలిగినావు
దేశదాస్యంబు విడిపించి ♦ తీరినావు
దీనుల ననాథలను జేరఁ ♦ దీసినావు
ఓ మహమ్మదు ; మముఁ బ్రోవు ♦ మో ప్రవక్త.

౧౦

ఆఁడుబిడ్డలు పుట్టుట ♦ యలఁతి యనుచు
ప్రాణములతోడ భూమిలో ♦ బ్రాతువారు
ఆసవము త్రాగి పినతల్లి ♦ నైన జెఱచు
ఖలదురాచారచరితంబు ♦ గలుగువారు
గ్రామదేవతలకు బలి ♦ గా నొసంగి
చెప్పరానన్ని హింనలఁ ♦ జేయువారు
కులము, దేశంబు శాంతిని ♦ గోరువారు
దేశనాశనహేతువుల్ ♦ తెచ్చువారు
కఠినదీర్ఘకోపంబును ♦ గలుగువారు

అరబు లనువారు పరికింప ♦ నలతివారె
వారలను వంచి నీచేతఁ ♦ బట్టినావు
వారిని బవిత్రులను జేసి ♦ వరలినావు
ఓ మహమ్మదు ! మము బ్రోవు ♦ మో ప్రవక్త.

౭

చదువు నేపాఠశాలను ♦ జదువకున్న
జదువుకొనువారికంటె ని ♦ శ్చయముమీఱ
పండితుండవు, కవివి, య ♦ ఖండదివ్య
విభవ విజ్ఞానమూర్తివి ♦ వేయుగాదు
వసుధను 'ఖురాను' శ్రుతులను ♦ బాడిపాడి
కఠినపాషాణముల నెల్లఁ ♦ గరచినావు
కన్నకూతురు గర్భిణి ♦ గా నెఱింగి
చంపినను వానిఁ గాఁచిన ♦ శాంతుఁడీవు
నిన్నుఁ జంపఁగ వచ్చిన ♦ నిందుయఁ జూచి
కరుణనేర్పిన ప్రేమ సా ♦ గరుఁడ వీవు
శాంతగుణధామ ; యోరసూల్ ♦ సార్వభౌమ
ఓమహమ్మదు మము బ్రోవు ♦ మో ప్రవక్త.

—★—

# ఆకాంక్ష

1. వెడలి పోయెద నీ విశ్వ ♦ వీధి విడిచి
కడచి పోయెద నక్షత్ర ♦ గతులు మీరి
పాఱి పోయెదఁ బైలోక ♦ పథములకును
నడచి పోయెద నల గగ ♦ నాలు దాటి
అధికులో యధములో యెవ ♦ రైనఁగాని
భ్రాంతులై నాదువెంట రా ♦ వలదు మీరు
భక్తిమై నాదువెంట రా ♦ వలదు మీరు ॥వె॥

2. వదలివేయుఁడు తృణములు ♦ వదలునట్లు
విడిచివేయుఁడు సమిధలు ♦ విడుచునట్లు
స్వర్గనరకాలయాసలు ♦ వదలివేసి
పాపపుణ్యాలకబురులు ♦ రూపుమాపి
మోక్షబంధాలతలుపులు ♦ మూసివేసి
అక్షరాద్వైతబ్రహ్మ ♦ పదార్థతత్త్వ
భావజిజ్ఞాసలను దన్ని ♦ వైచి దేవ
పూజల నమస్కృతుల నిప్పు ♦ పుల్లగీసి
దోసి లొగ్గి వేడెడుభక్తిఁ ♦ బాసి, శాశ్వ
త ప్రభాభాసమాన నూ ♦ త్న ప్రదీప్త
జ్ఞానతేజంబులో లీన ♦ మైన వెలుఁగు
వెలుఁగులోపల నానంద ♦ విభవ మొంది
సాంద్రవిభ్రమనీలాభ్ర ♦ షండకల్ప
మండితాఖండశిఖిని ను ♦ ద్దండలీల
మాడి బూడిదయై యొక్క ♦ మట్టికణము
నైనఁ గాకుండఁ బోయెదఁ ♦ గాన మీరు – భ్రాంతు

3. నన్నుఁ గని యేడ్చువార లెం ♦ దున్నవారు
నన్నుఁ దలపోయువార లెం ♦ దున్నవారు
నా మరణ మహాజ్వాలలో ♦ నా మహాప్ర
భా ప్రళయకాల దందహ్య ♦ మానమాని
తాగ్ని నెవ్వారు కాలి వె ♦ న్నాడఁ గలరు ?
బాష్పకణములు నాచితి ♦ పైని రాల్చి
అరుపఁగ వచ్చువార లు ♦ న్నారె జగతి ॥అ. వె॥

4. నా మరణవేదికను నేను ♦ నా కరాల
వైచుకొని నేనె శయనించి ♦ వగచి వగచి
కరఁగి కన్నీళ్ళు కడువడిఁ ♦ గార్చి కార్చి
వేఁడినిట్టూర్పులనుఁ బుచ్చి ♦ వేగి వేగి
ఆ వ్యసన దూయమానదుః ♦ ఖానలాన
మిడుతవలె రాలి ప్రాణాలు ♦ విడుతు; మేను
మట్టిఁ గలియఁగ నా మైత్రి ♦ పట్టలేక
పూలు గురియును ఆ మహా ♦ పుణ్య సీమ
వాసనలు వీచు బ్రహ్మజి ♦ జ్ఞాసలందు
మందులై పారువారి కా ♦ నందజనక
మగుచు మూర్ఛలఁ దేల్చు బా ♦ హ్యప్రపంచ
గరిమ ప్రేమానురాగంబు ♦ ఫరిఢవిల్ల ॥అ. వె॥

5. అదియె నిత్యంబు; నక్షర ♦ మదియె నిజము
అదియె అవ్యయ మదె పర ♦ మాత్మతత్త్వ
మదియె అనురాగములకాణ ♦ యాచి ప్రకృతి
విశ్వముల కెల్ల నెలవైన ♦ వీరభూమి
అదియె కవిలోకముల కెల్ల ♦ నాటపట్టు

ప్రేయసీ సమాగమ మహా ♦ విభవవీథి
గాన సౌందర్యముల కిర ♦ వైనచోటు
తపములకు నెల్ల ఫలమొసంగు ♦ దసరుచోటు
నగవులకుఁ దావలంబయి ♦ నెగడుచోటు
ఊహ చొరరానిచోటు సం ♦ దేహములకు
లొంగనటువంటి చోటు ; యే ♦ లోటులేని
చోటు శాంతికి స్థానమై ♦ సొక్కు చోటు
అదియె నా జన్మభూమి నా ♦ కదియె నెలవు
అదియె నా వాస మదియె నా ♦ సదన మరయ ॥ఆ. వె॥

6. ఇదె సమాధి యిదె యోగ ♦ మిదియె శాంతి
శాంతి పాఠకుఁడా ! నీదు ♦ స్వాంతశరధి
పొంగి పొరలు తరంగాల ♦ మునిఁగి తేలి
వ్రాసితిని గీతి నీ రీతిఁ ♦ బాడిపాడి
ఇట్టు లుంరాలిషా కవి ♦ యెఱుక చెప్పె.

—★—

# మెఱుగుడు పురుగు

1. పంటకాలువ గట్టు బోయి
యొంటిగంట రాత్రివేళ
నొంటిగా నిలుచుంటిని ము
క్కంటినీ గనుగొంటినీ

2. కాపు లందరు పార లెత్తి
ఆపుచుండిరి యేటినీరు
ఆ ప్రవాహములోపల నా
చూపు నిలిచిన చావలా ॥నా॥

3. మెఱపుకంటె తేటు గలది
కరకు వజ్రము మీరియున్నది
మెఱుఁగుడుఁ బుర్వందులో పడి
యరుగుచుండెను నీటిలో

4. దానిరూపు నాదుచూపు
దానినడక నాదురాక
ఆ నిముషమునందున నా
మేను పులకరించెను

5. నేను దానితో మాటలాడి
నాను నా కతి జాలివచ్చెను
దానివైఖరి చెప్పగా వి
న్నాను అశ్రులు రాల్పఁగా ॥వి॥

6. దానితేటు నదీజలంబున
దానికాంతి నదీతటంబున

అనుమానై యున్నది నా
యాననము కెదురైనది ॥నా॥

7. జంటబాసి వచ్చునపుడు
తుంటవిల్తునిబారి దగిలి
మంటబడుటకు మారుగా సుడి
గుంట బడితివొ నేరుగా ॥సుడి॥

8. నీ విలాపము నెవరు విందురు
నీ విలాసము నెవరు గందురు
నీవు యేలాగైనను నీ
భావిదశ చెడిపోయెను ॥నీ॥

9. కావరమున పోవలేదని
కానికార్యము సేయలేదని
దేవులాడుచు నుంటివి నా
దేవుతో డనుచుంటివి ॥నా॥

10. నీ వియోగము సైపలేక
నీ విభుం డట నున్నవాఁడు
నీవు వానిని గలియఁగా బో
లేవు నీ గతి చూడగా ॥బో॥

11. ఏటి కడ్డము వైచిరి నీ
చోటి కిప్పుడు పోవలే వా
బాట పూడి పోయెను ము
న్నొటికాపుర మాయెను ॥ము॥

12. రేలు నీవు నడవివీధుల
గ్రాలు యామినిబెట్టుకొను దీ

పాలపోలిక దనరుచు నీ
లీలచెడితివి వనరుచు ॥నీ॥

13. పైడిపిచ్చుక నిన్ను విడచెను
గూడు గుంటలు లాగివైచిరి
తోడునీడ పోయెను నిన్
గూడువా రెవ రింకను ॥నిన్॥

14. ఎంతసేవు వంతబడెదవు
కొంతసేవులో తెల్లవారును
వింతయగు నీ తేజము ఆ
సాంతముగ నగపర్చుము ॥అ॥

15. అనిన నాఖద్యోతి మెఱసెను
అప్పుపై తేజంబు నిలిచెను
అనుకొంటి నదె యీశ్వరునిగా
మనసునకు వినిపింపగా ॥నా॥

16. చుక్కలైనను చూచివచ్చు
రెక్కలున్నవి గాని నీటవి
ముక్కలైనవి యెగురలేవు ; ఇం
కెక్కడ నీఖేచరత్వము.

17. ఒక్కమారే మారిపోయెను
ఒక్కమారే తిరిగిపోయెను
ఎక్కడిది నీపూర్వసదనము ఇం
కెక్కడిది నీఖేచరత్వము.

18. లీల ఉం రాలీష కవి కా
ఖైలలీగురు డెరుక చెప్పిన
నీల తోయద జ్యోతిని యీ
వేళ నే గనుగొంటినీ.

—✶—

# కావ్యకాంత

ఏదీ కాలత్రయాబాధ్య ♦ మేది ఖిలము
గాక పరిపూర్ణతత్త్వసం ♦ కాశ మగుచు
వెలయునో, యేది యిహపర ♦ ములకు సాధ
కంబొ, దానిని గాంచి లో ♦ కమును గాంచి
పలుకు కవికి సదా వాని ♦ కలమునకును
కావ్యకాంతకు నా నమ ♦ స్కారశతము.

మేఘమాలికలోఁ దోఁచు ♦ మెఱపు చూచి
చుక్కకను విచ్చి చూచెడు ♦ సొబఁగు చూచి
ప్రసవసౌరభములు జల్లు ♦ వనముఁ జూచి
దరులఁ బ్రవహించు నేటిసం ♦ దడిని జూచి
పూలపైని సీతాకోక ♦ పురుగుఁ జూచి
కులుకు బంగారుపిచ్చుక ♦ గూడుఁ జూచి
నెమిలి పురి విప్పి యాడెడు ♦ కొమరు చూచి
రాత్రి గాచెడు వెన్నెల ♦ రాయుఁ గాంచి
రాలఁ దృణములఁ గల హిమ ♦ రాజిఁ గాంచి
భవ్యశారద రాత్రిపై ♦ భవముఁ గాంచి
భీతహరిణాక్షికన్నుల ♦ బెళుకుఁ గాంచి
పాడెడువసంతకోకిల ♦ స్వరము గాంచి
వెలఁది నిజనాథుపై నుంచు ♦ ప్రేమఁ జూచి
పలుకు కవికి సదా వాని ♦ కలమునకును
కావ్యకాంతకు నా నమ ♦ స్కారశతము.

వనమహాలక్ష్మి తామర ♦ పళ్ళెరమున
గొజ్జఁగులఁ బెట్టి హారతి ♦ గొలుపుచుండ
తేరిపారఁగ తుమ్మెద ♦ ద్రిమ్మరీఁడు
చూచి విటనారికచముల ♦ సొబఁగుమీరు
మల్లికలఁ జేరి మధుపాన ♦ మత్తచిత్తుఁ
డగుచు నవరసభరితమై ♦ యలరునట్టి
పాటలను బాడి వలపింప ♦ వచ్చుచుండ
మదనుకొలువున జీతంబు ♦ కుదిరి శుకము
వనశకుంతకుహూకల ♦ స్వనము లట్టె
చేయకుండ బరాబరుల్ ♦ చేయుచుండ
చిమ్మచీకటి దెసలను ♦ గ్రమ్మ పువ్వు
పొదల ఖత్యోతములు రాత్రి ♦ పొలఁతికురుల
మెఱయుమొల్లలవలెఁ గాంతిఁ ♦ బరపుచుండ
కేచురాయను తిత్తూదు ♦ బాచకాఁడు
బండిపులుఁగను రండోలు ♦ వాద్యగాఁడు
తీతువను బాకనూదు దూ ♦ దేకువాఁడు
గుడ్లగూబను శుభపాఠ ♦ కుఁడు గడంగి
నడుమ గోలాహలంబులు ♦ సభము ముట్ట
మదనుఁ డత్యంతవైభవ ♦ సదనుఁ డగుచు
చెఱకు విల్ వంచి కాముకుల్ ♦ చెదరి పరువ
కుసుమమార్గణములు వేసి ♦ కొనుచు నూత్న
యౌవనుల మనోవీథుల ♦ కరిగి వారి

సీమలను జేరి రాజ్యంబు ♦ సేయుచుండఁ
గాంచి పలుకు కవికి వాని ♦ కలమునకును
కావ్యకాంతకు నా నమ ♦ స్కారశతము

ధనమదాంధులకనుల కం ♦ జనము లుంచి
భూధవుల వంటినుండెడు ♦ పులును విఱిచి
పండితులకుండుశృంగముల్ ♦ భంగపఱిచి
ఆగపడినకావ్యకాంతల ♦ సొగసు దిద్ది
పారు సెలయేటిజలముల ♦ పాటపాడి
హరిణశాబకములతోడ ♦ నాటలాడి
శాద్వలంబుల సైకత ♦ స్థలములందు
సాంధ్యరాగంబు లీనెడు ♦ సమయములను
చాతకము మింటి వానకై ♦ చంచుపుటము
విప్పి యెలుఁగెత్తి యేమేమొ ♦ ముప్పు గడచు
మాటలాడెడు ద్యోధునీ ♦ మార్గమందు
జూపు మలపుచు జగమెల్లఁ ♦ జూచి చూచి
ప్రకృతి యొకనల్లపూసగాఁ ♦ బరిగణించి
పరగ బ్రహ్మాండభాండంబు ♦ పట్టరాని
భావములతోడ హావభా ♦ వములతోడ
కవితలను పువ్వుదండలు ♦ గా రచించి
తన స్వజాతివధూవరు ♦ లను నలంక
రింపఁజేయుచు జగముఁ ద ♦ రింపఁజేయు
కవికి, రత్నాలఁ దూఁగు నా ♦ కలమునకును
కావ్యకాంతకు నా నమ ♦ స్కారశతము.
ప్రాఁత శృంగారపాఠముల్ ♦ పలికి పలికి
పంచబాణుని యమబాధ ♦ వ్రాసి వ్రాసి

వెన్నెలను మందునగ్నిగా ♦ బిలిచి పిలిచి
తెమ్మెరను వేడిగాడ్పని ♦ తిట్టితిట్టి
మోముపద్మంబు, కన్నులం ♦ భోజదళము
కరము తామరతూడు, వ ♦ క్షస్థలంబ
పర్వతయుగంబు,-నడుము న ♦ భంబు, భంబు
గోరటంచును జెప్పిన ♦ గోడె తిరిగి
చెప్పి తలనొప్పి యెత్తించు ♦ చెనటిత్రోవ
మాని మహనీయమైన వి ♦ జ్ఞానగరిమ
లోకసామ్రాజ్యపట్టాభి ♦ షేకమునకు
మార్గదర్శకులై పుణ్య ♦ మహితమైన
జాతిగీతంబులను వ్రాసి, ♦ చచ్చియున్న
సంఘమును లేవనెత్తెడు స ♦ త్కవీంద్రుఁ
డందఱికిఁ బూజ్యుఁ డతనివా ♦ క్యామృతంబు
ప్రాణ మందఱి కతనికా ♦ వ్య స్వరూప
మందఱికి భుక్తిముక్తి శు ♦ భావహంబు
కాన నట్టికవిత్వమా ♦ ర్గమును దెలిసి
పలుకుకవికి సదావాని ♦ కలమునకును
కావ్యకాంతకు నా నమ ♦ స్కారశతము.

—★—

# జల్యానువాలాబాగు

ఉ. పౌరుల శస్త్రశాస్త్రముల ♦ పద్ధతినేరనివారి సాధుసం
సారులఁ బట్టి డయ్యరు పి ♦ శాచము జల్యనువాలబాగులో
దూరి వధించెఁ దద్రుధిర ♦ దుఃఖసముద్రము భారతీయు హృ
ద్ద్వారముసొచ్చి యగ్నివలె ♦ జ్వాలలు వీచుచునున్న దెంతయున్.

ఉ. యూరపుదేశ మెక్కడల ♦ హూణకిరాటపుళిందు లేద? యా
ఘోరరణంబునం దరులఁ ♦ గూల్చి జయధ్వజ మెత్తినట్టి మా
భారతవీరయోధు లొక ♦ పాలె? నిరంకుశశాసనాగ్ని సం
స్కారముచేసినారు; సిత ♦ జాతికి నీతియటంచు నున్నదే.

ఉ. రౌలటుశాసనంబు సమ ♦ రంబునగెల్చినదాని కంకుగా
గాలము మీనజాలమున ♦ గై యొనరించినరీతి హూణభూ
పాలు రొసంగినారు పరి ♦ పంథినృపాలురు నవ్వునట్లు పాం
చాలకిశోర కాననము ♦ చండహుతాశను కీలకప్పగన్.

ఉ. యూరపుదేశ మట్టిటుల ♦ నూగగ శౌర్యపరాక్రమంబులన్
భారతవీరకోటి రణ ♦ పాండితి వైరులఁ జీల్చి రక్తసి
క్తారుణమూర్తులై నిజజ ♦ యధ్వజముల్ నెలకొల్పినప్డు దీ
దారుణ మెచ్చెఁ దద్రుధిర ♦ ధారలు ఘోరునఁ బొర్లిపారఁగన్.

చ. ప్రళయపయోదముల్ గురియు ♦ భంగి ఫరంగి పిరంగిగుండ్ల గుం
డెలదర దేహపంజరము ♦ డిల్లఁగ జల్లెడరీతి మార్చినన్
సొలసియు నిస్సురుస్సురని ♦ స్రుక్కఁడు చిక్కఁడు వైరిచేతికిన్
బలవదరిప్రభంజనుఁడు ♦ భారతవీరుఁడు మాటలేటికిన్.

శా. ఆహారంబున కంగలార్పఁడు, రణవ్యాపారపారాయణుం
డై హర్యక్షమురీతి వైరిగజకుం ♦ భానీకముల్ చీల్చి సం
దేహం బందక యాత్మరక్త మొలింకి ♦ చెన్భారతీసైనికుం
డాహా! ఆంగ్లకిరీటరక్షణసము ♦ ద్యద్భక్తిసంయుక్తుఁడై.

సీ. ఒకచోట నీహార ♦ నికరంపురాలపైఁ
బవళించు రణము ♦ రే బవలు సలిపి
ఉన్నచోఁ దిని యున్న ♦ యుదకముల్ ద్రావి జీ
వించుఁ బోరును విని ♦ ర్జించుచుండు
ఆసవపాన దు ♦ ర్వ్యసనసంసక్తుఁడై
గతి మాలి వైరివం ♦ కలకుఁ జనఁడు
అగ్నిగోళములకు ♦ నాహూతియగుఁ గాని,
వెన్నిచ్చి పాఱఁ డే ♦ వేళఁ గాని

అట్టిశౌర్యంబు వెచ్చించి ♦ అవహమున
విజయ మార్జించి వచ్చిన ♦ వీరవరులు
భారతీయులు వట్టిసే ♦ వకు లటంచుఁ
జెప్ప నోరాడెనే వినే ♦ శీయులారా?

ఉ. ఈ యఘ మూరకే విడువ ♦ దీ విపరీతము దారుణ్యంబు; యే
దో యొకనాఁడు చండి యిలు ♦ దూరి మహా ప్రళయంబులీల రా
జేయును భారతీయునెడ ♦ జేసిన పాపఫలంబుమీకు; కా
జేయుధనంబు వడ్డిగ్రసి ♦ యించినరీతి; గ్రహింపుడెంతయున్.

సీ. సేవకవృత్తియే ♦ జీవికాదర్శంబు
దొరబాబులని వెంటఁ ♦ దిరుగువారు
మీదాస్యమే మాకు ♦ లేదు పొమ్మనుచున్న
మోక్షమార్గం బని ♦ మ్రొక్కువారు

పిల్లికి భిక్షంబు ♦ పెట్టనివారైన
యుద్ధబుణా లిచ్చి ♦ యులుకువారు
భ్రాతృనినైనఁ గా ♦ పాడనివారైన
యూరపులో బావఁ ♦ గోరువారు

తే. దైవమును మాని దయ్యాలఁ ♦ దలఁచువారు
పుణ్యమును వీడి పాపానఁ ♦ బోవువారు
ఎవరు పోయినఁ దనబాగు ♦ నెంచువారు
నగుచుఁ బ్రజ లుండ దొరల నో ♦ నాడనేల ?

సీ. బానిసత్వము నుగ్గు ♦ పాలఁ బోసిన దోషి
అన్నవస్త్రము లాచి ♦ కొన్న ఖలుఁడు
కాటకం బనెడు ర ♦ క్కసిని దెచ్చినషంధ
కక్షలఁ బెంచిన ♦ రాక్షసుండు
నిర్బంధశాసన ♦ నిచయమార్చినజాణ
పన్ను వేసిన మహా ♦ పాతకుండు
మత్తువస్తువు లమ్మి ♦ విత్తముఁ గొనుద్రోహి
కయ్యాలఁ బెంచిన ♦ కఠినతముఁడు.

తే. కలికిఁజెలికాఁడు యమునకు ♦ వలపుకాఁడు
మోసములకు తావు, విరోధ ♦ ములకు ప్రోవు
దుర్గుణంబులకాణాచి ♦ తులువ, బూచి
ఈ చికాకుల నించె మా ♦ యించెజోఁడు.

సీ. కపటాకులను బోలఁ ♦ గల పసిబాలుర
నెండలో నడిపి హిం ♦ సించినారు
నడచిపోయెడు వారిఁ ♦ బడఁద్రోసి, ప్రజలను
బొట్టపైఁ బ్రాఁకించి ♦ పొడిచినారు

నిరపరాధుల నెల్ల ♦ నిలcబెట్టి పిట్టలు
చితుకునట్టులc గొట్టి ♦ చెనకినారు
శుద్ధాంతకాంతలc ♦ జొచ్చి, కొప్పులc బట్టి
మానభంగము జేసి ♦ మరలినారు

వేల ప్రజల తుపాకుల ♦ పాలు జేసి
కోసి ప్రాణార్థములు లాగి ♦ వేసినారు
తెలిసి పంజాబు పరువును ♦ దీసినారు
కలుషమని జంకcబోక రా ♦ కాసిమూక.

చ. జలియనుబాగులో జనులc ♦ జంపిన రక్తము వర్షపాతముం
బలెc బ్రవహించె; మొండెములc ♦ బ్రాణములుండినవారి యార్తిసం
కలితరవంబు గర్జనము ♦ కైవడి మ్రోసె దిగంతభూములc;
ప్రళయము వచ్చెనో యనుచు ♦ పౌరులు పారిరి ప్రాణభీతులై.

## ఐకమత్యము

ఆ. చంద్ర చంద్రికవలె నాంధ్ర ♦ జగతి నిండి
యంతటను సాంద్రతమతేజ ♦ మావరింప
విద్యయు వివేకమును గూర్చి ♦ వెలయు మీదు
ఆంధ్రచంద్రిక ధరణి చం ♦ ద్రార్క మగుచు.

తే. తెలుఁగు వా రొక్కరు, మహమ్మ ♦ దీయు లొకరుఁ
గలసి యన్యోన్య మైత్రిచేఁ ♦ దెలుగుబాస
నాంధ్రచంద్రిక యనుపేర ♦ నలరు పత్రి
కా ప్రకటనంబు సేఁత భా ♦ గ్యంబు గాదె !.

సీ. తిలల చందమున గో ♦ వులచేత నలరారు
తెలుఁగుదేశము వీరి ♦ నెలవుగాదొ.
ఆంధ్ర మహావిష్ణుఁ ♦ డాదరించిన మహా
మహిత భూస్థలి వీరి ♦ మాతగాదొ
శైలాకృతుఁ డనంత ♦ సార్వభౌముఁడు నేలు
నాంధ్రంబు వీరి కా ♦ణాచిగాదొ
త్రైలింగదేశ మ ♦ ధ్యంబునఁ బొడమిన
తెలుఁగుబాషయె వీరి ♦ దిక్కుగాదొ

గీ. ఆర్యరక్తంబె వీరి దే ♦ హములయందు
స్వచ్ఛమై నేటిదాఁక యే ♦ పారుచుండె
మతము వేఱైన జాతి స ♦ మ్మతము గాదె
భాతృవరులార ! సుగుణ సం ♦ పన్నులార !

సీ. అన్యోన్యమైత్రిచే ♦ నలరారలేదె యా
ర్యుల వేదమతము పెం ♦ పలరునపుడు
సంఘీభవించి వా ♦ సము సేయలేదె బౌ
ద్ధులు. నాస్తికులు వచ్చి ♦ నిలిచినపుడు
కలసికట్టు తనాన ♦ మెలఁగలేదె మహమ్మ
దీయు లిస్లామును ♦ దింపినపుడు
ఐకమత్యముతోడ ♦ నాలింపలేదె క్రై
స్తవసోదరులు బోధ ♦ సలుపునపుడు

ఆ. ముక్తికొఱకు మతము ; ♦ భుక్తికిఁ గాదు; దే
శంబుకొఱకుఁ గా ద ♦ సంశయంబు
బాన యొకటి, దేశ ♦ వాసంబు నొక్కటి
మనకుఁ గల్గు మైత్రి ♦ మానఁదగునె.

సీ. జాతు లన్నియు నేనె ♦ రీతు లన్నియు నేనె
యనలేదె శ్రీకృష్ణుఁ ♦ డనఘమూర్తి
మతము లన్నియు నావె ♦ మతవేదములు నావె
యనలేదె యల మహ ♦ మ్మదు రసూలు
జగ మంతయును వాఁడె ♦ నిగమంబులును వాఁడె
యనలేదె శంకర ♦ మునివరుండు
దృశ్యమంతయు నశ్య ♦ మిది యనశ్యంబని
యనలేదె చైతన్యుఁ ♦ డాది మునులు

తే. ఇట్లు మతమతాంతరులైన ♦ యెల్ల విబుధు
లాడుచుండఁగ భేద మే ♦ నాఁడు గలదు ?
బానకును, దేశమునకుఁ దో ♦ త్పడఁగ వలయు
భేదభావంబు వీడి వి ♦ వేకులార.

ఆ. ఆంధ్రదేశ మనెడు ♦ నట్టి యీయోడపై
భిన్నమతము వార ♦ లున్నవారు ;
ఒకరి కెగ్గు గదుర నొకరు ♦ రంధ్రము సేయ
సమముగానె హాని ♦ సంభవించు.

సీ. వికచారవింద సం ♦ ధ్యకముల నలరారు
నళికులంబులయందుఁ ♦ గలుగు మైత్రి
కేకి కేకారవ ♦ కోకిలాలాపంబు
లొలయు గీతికలందు ♦ గలుగు మైత్రి
నెలరాల రాలు పు ♦ వ్వుల సుధల్ చిలికెడు
కలికి పల్కులయందుఁ ♦ గలుగు మైత్రి
గైరికధాతు రా ♦ గంబుల సాంధ్యరా
గముల యైక్యమునందుఁ ♦ గలుగు మైత్రి

తే. భారతీయులయందల ♦ రారుఁగాత
జాతికిని, నీతికి నిధాన ♦ మై తనర్చు
దేశభాషలు సతము వ ♦ ర్ధిల్లుఁగాత!
గ్రామ్యము లడంగ గ్రంథముల్ ♦ గ్రాలుఁగాత.

తే. ఇట్టి లభ్యుదయము వెల ♦ యించుకొఱకు
నాంధ్రచంద్రిక చిరకాల ♦ మవనియందుఁ
దనర నీ పద్య సప్తక ♦ మును రచించెఁ
దవిలి వుంరాలిషా యను ♦ కవి యొకండు.

సీ. ఆంధ్రమండలిఁ బుట్టి ♦ యాంధ్రులై వర్తించి
యాంధ్రవిద్యను విడ ♦ నాడఁ దగునె
ద్రవిణంబు లైనను ♦ ద్రవ్యంబు లైనను
భాషతోఁ దల్లితోఁ ♦ బాటి యగునె

చంద్రచంద్రికలట్లు ♦ సమగ్రైక్యంబందు
జాతియు నీతియు ♦ జార్పడగునె
డిండు నాఁడగు నాంధ్ర ♦ దేశాన మన దత్త
మండలంబుల కీర్తి ♦ మాపఁదగునె
కనకవర్షము గురి ♦ సిన రాజ్య మిది దంత
కారణ్య మిపుడు పే ♦ యంగ నగునె

తే. ప్రోది తెగఁ ద్రెంచి సంస్కార ♦ ఘులను డించి
దురభిమానంబుఁ గొలిచి యీ ♦ శ్వరుని మఱచి
టూకి యగు తెల్విఁగూడి. తా ♦ టోటు లాడి
రూఢి చెదరాదు జనులార ♦ మూఢమతిని.



# నెలవంక

తే. దర్పకుఁడు వచ్చి వంచిన ♦ ధనువువలెను
పాలకడలిలోపలి వెండి ♦ పడవవలెను
ప్రకృతి కన్య త్రావెడు పాన ♦ పాత్రవలెను
నభముపైఁ దోఁచె రెంతవ ♦ నాఁటివిధుఁడు.

తే. ఎతెవయో దీపమునుఁ బెట్టి ! యేగె నింట;
దాని గని పతంగంబు సం ♦ తసముతోడ
వలచి ప్రాణంబు లర్పించి ♦ వైచె; నేను
నామనోహరి కేల యీ ♦ నోమనైతి ?

తే. మిడుతపై దీపమున కెట్టి ♦ విడువరాని
ప్రేమయో గాని యొక్క రా ♦ త్రియును గూడ
బ్రతుకనియ్యదు ; మిడుత దా ♦ వలచి పడిన
దాను బడి యారిపోవు సం ♦ తసముతోడ.



# శ్రీ రాముఁడు

రామచంద్రుండు దశరథ ♦ రాజ తనయుఁ
డై యయోధ్యాపురంబున ♦ నవతరించెఁ ;
గడపె హితులతోఁ దన బాల్య ♦ కాల మెల్ల
కాల మంతయు గడియలై ♦ గడచిపోయె
కాని, కాలంబు రాముని ♦ గాని, వాని
సుగుణచారిత్రములఁ గాని ♦ సుంతయేని
మఱవలేదు ; మఱెన్నఁడు ♦ మఱవ బోదు.
ఇదియె పరమార్థ మందఱి ♦ కిహమునందు
దేవుఁడే దేహధారియై ♦ దివిని విడిచి
భువికి దిగి రా నవసరంబు ♦ పుట్ట దెపుడు
ఎవరు బాల్యంబునుండి జి ♦ తేంద్రియు లయి
దేశసేవ యొనర్తురో ♦ దేవుఁ డట్టి
వారి హృద్వీథిలో నుండి ♦ వఱలుచుండు
మాట లేల తక్కిన వన్ని ♦ బూటకములు.
రాముఁ డాదర్శమూర్తి బా ♦ ల్యంబునుండి
తప్పు నాతఁ డెవ్వరి బెట్టి ♦ దములు వలుకఁ
డాడి తప్పఁడు కలనైన ♦ ననృత మన్న
మాట యెఱుఁగఁడు కాంతల ♦ మాట లెపుడు
ఉబుసునకునైన నెత్తఁ డే ♦ మున్నఁగాని
మిగుల మొగమాటి, లజ్జావి ♦ మిశ్రితుండు
సఖులు సోదరు లని లేక ♦ సంచరించు
సమల ప్రేమాబ్ధి పొంగి పొ ♦ ర్లాడుచుండ
నిండు సంతోషమునఁ దూఁగు ♦ చుండు నెపుడు

నియమముల మీరి చెడుగు రా ♦ నీయఁడెదను
మదము, మాత్సర్య మనునవి ♦ మొదలె లేవు
సదయహృదయుండు బహు సాధు ♦ సజ్జనుండు
అతని సారూప్య మందఱి ♦ కబ్బవలయు
అతని విజ్ఞాన మందరి ♦ కందవలయు
నతని నర్థించి యట్టి యో ♦ గ్యత గడించి
మాతృదేశంబు పూజించి ♦ మనుట లెస్స
ఒక్కనాఁడు ప్రాతఃకాల ♦ ముదయశైల
శిఖర మరుణాకృతిని దాల్చ ♦ చెన్నుమీఱ
పక్షు లుదయగీతంబులు ♦ పాడుచుండ
కుసుమ పరిమళములు మోచి ♦ కొనుచు మంద
మందగతిఁ బిల్లవాయువు ♦ మాటిమాటి
కొడలు పులకితముగఁ జేసి ♦ వెడలుచుండ
అట్టి బ్రహ్మముహూర్తాన ♦ ఆ ప్రశాంత
సమయమందు విశ్వామిత్ర ♦ సంయమీంద్రుఁ
డరుగుదెంచె ; కషాయ చే ♦ లాంచలములు
నలుదెసల ధగద్ధగితమై ♦ యులరుచుండ
కక్షపాలయు దండంబు ♦ నక్షమాల
కాంతు లీనఁగఁ దన తపో ♦ గర్వనిరతి
తెలిపె బ్రహ్మచర్యమునందు ♦ తేజమపుడు

.... ....

అతని కెదురుగ దశరథుఁ ♦ డరుగుదెంచి
ఔదలను మ్రొక్కి పూజించి ♦ యతనిరాక
కేమి కారణ మన మౌని ♦ యిట్టు లనియె
రామభద్రుని నా యజ్ఞ ♦ రక్షణార్థ

మడుగుచున్న నొసంగు మ ♦ భ్యంతరంబు
లాడ కని యర్థియై వచ్చి ♦ యడిగి వాని
వెంటఁ గొనిపోయె దండక ♦ విపినమునకు
రామునకుఁ బదాఱేఁడుల ♦ ప్రాయమైనఁ
గౌశికునివంటి మౌనిశే ♦ ఖరుఁడుఁ గూడ
శిరము వంచి నమస్కృతి ♦ చేసినాఁడు
చేతులారంగ నతని బూ ♦ జించినాఁడు
తల్లిదండ్రుల మాటలు ♦ దప్పకుండ
సత్యము వచించువారిని ♦ సద్గుణాఢ్యు
లైన వారిని బ్రహ్మదు ♦ లైనఁ గాని
గౌరవింపక పోవ రే ♦ కాలమైన
మొగలిరేకులు కురుచగా ♦ ముళ్ళనున్న
సౌరభం బెల్లవారును ♦ సన్నుతింతు
రటులె జ్ఞానముచే వృద్ధు ♦ లైన వారి
నెల్లవారును బూజింతు ♦ రిందు నందు

.... .... .... ....

కౌశికుండును, రాముండుఁ ♦ గానకేగు
దారిలో నడ్డుదూరి దు ♦ ర్వార ఘోర
రాక్షసాలయ సంచార ♦ దక్ష ఘోటి
తాటకాసుర తీండ్రించి ♦ మాట లాడ
నొక్క వ్రేటునఁ దల రెండు ♦ ముక్కలగుచు
వ్రయ్య నేసెను ; గుణమును ♦ బట్టి రాముఁ
డరికులభయంకరుండు వీ ♦ రాధివీరుఁ ;
డంతఁ గౌశికుఁ డెంతయో ♦ సంతసమునఁ
దోగి రాముని గీర్తించి ♦ కౌఁగిలించి

క్రమ్మఱ ముని వసిష్ఠాశ్ర ♦ మమ్మునకును
నడచె నటఁ బర్వదిన మొండు ♦ గడపుటకును
నాఁడు తత్ప్రాంత తపసి జ ♦ నంబుగూడ
జూడవచ్చిరి ; ఆ వసి ♦ ష్ఠుని కుటీర
మా దినము నిత్యకళ్యాణ ♦ మై దనర్చె ;
అందులో బ్రహ్మఋషులు మ ♦ హాత్ములైన
దేవఋషులు రాజఋషు లు ♦ దీర్ణతేజు
లగుచుఁ గోలాహలంబున ♦ నలరుచుండి
రంతట వసిష్ఠ తాపసి ♦ యట్టై లేచి
వార లొసఁగెడు ఫలపుష్ప ♦ పత్రములను
రోసి శూన్యహస్తుఁ డయి జి ♦ జ్ఞాస నొక్క
మూల నిలుచున్న శ్రీరామ ♦ మూర్తిఁ జేరి
అర్థిఁ బూజించి తెచ్చి య ♦ ర్ఘ్యాసనంబు
నొసఁగ నెల్ల రాశ్చర్యంబు ♦ నొంది దాని
హేతు వేమని యడిగి రా ♦ ఋషిని ఋషులు
శిష్టగుణగరిష్ఠుండు వ ♦ సిష్ఠుఁ డిట్లు
లనియె వినయము రేకెత్తు ♦ నట్లు లపుడు ;
‘ఓ మహామునులార ! యీ ♦ రామచంద్రుఁ
డతి సుగుణసాంద్రుఁ డితఁడు బా ♦ ల్యంబునుండి
దుర్గుణంబుల నెదనుండి ♦ త్రోలినాఁడు
సొంతసొమ్మునె తృణముగాఁ ♦ జూచినాఁడు
ఒరుల కాత్మార్థములు ధార ♦ వోసినాఁడు
లోకకంటకయును, దైత్య ♦ లోకమునకుఁ
బంటయును నగు తాటకఁ ♦ బట్టి దాని
జీల్చి చెండాడి జగతికి ♦ క్షేమ మొసఁగి

శాశ్వతఫలంబు మనకును ♦ సకలజనుల
కొక్కసారి ప్రసాదించి ♦ యున్న యితని
దర్శనఫలంబుకన్న వ్య ♦ థాఫలంబు
లెన్ని మీరిచ్చినను వేత్క ♦ లెసఁగబోవు
ఇట్టి ఫలములె మన మపే ♦ క్షింపవలయుఁ
బెద్దఫలములు మనము వ ♦ ర్జింపవలయు.

ఇతనికన్న మహాత్ముఁ డీ ♦ యిల నెవండు ?
ఎన్ని తపములఁ జేసిన ♦ నెన్ని జన్మ
ముల నొనర్చినఁ దన స్వార్థ ♦ మునకె గాని
అధిక మేమున్న దిఁక నీ మ ♦ హాయశుండు
స్వార్థము పరిత్యజించి లో ♦ కార్థ మాత్మ
దేహము సమర్పణముఁజేసి ♦ దేశసేవ
సంఘసేవయు నీరీతి ♦ సలిపినాఁడు.

ఇతఁడు పూజ్యుండు గాక మ ♦ ఱేమి యగును!
ఎవ్వరు జితేంద్రియులు నయి ♦ యీశ్వరార్ప
ణంబు గాఁగఁ బరోపకా ♦ రం బొనర్తు
రట్టివారు బ్రాహ్మణులైన ♦ నెట్టి యన్య
జాతివారైనఁ గాని య ♦ శంబుఁ గాంచి
వసుధఁ బూజింపఁబడు టిది ♦ వాస్తవంబు. ''

— ★ —

# పల్లెటూరి కాపు

౧

ఎవ్వరో యీ దారి
ఈ కొండ ఈ లోయ
ఈ మారు మూలల్లో
ఈ పూరి కొంపల్లో
ఏగుచున్నారు. మ
మ్మడుగుచున్నారు.

౨

మా వూరు మా పేరు
మా దారి మా కోన
మా రైతు పల్లెల్లో
మా పేద పాపుల్లో
మార్పు లున్నాయ ?
నిట్టూర్పు లుడిగాయ ?

౩

మా చేలు మా గొడ్లు
మా చెర్వు కన్నాలు
మా చోట్లు మా పాట్లు
మా చిత్ర చిత్రాలు
చూచిపోతారా ? మ
మ్మాచి కొంటారా ?

౪

ఈ కొర్వి కుంచెల్లు
ఈ మెఱుఁగు బుర్వుల్లు

తొలి కారు మెరుపుల్లు
తాటాకు మంటల్లు
మాకు దీపాలు. మా
నెలవంక రూపాలు.

౪౮

ఈ కొండ దేవతలు
ఈ కోయ కొంపలు
ఈ కటిక చీకట్లు
ఈ కఱ్ఱ మంచాలు
మాకు వ్రాసెనో ? ఇవి
మాకు నచ్చెనో ?

౬

వానల్ల తడిసేటి
కానల్లో మెలిగేటి
మా నల్ల రూపుల్లో
మా తెల్ల చూపుల్లో
మీకు చోటుందా ?
చీకాకు పోయిందా ?

౭

చేలంట తిరిగేటి
ఆలంట మసిలేటి
పాలికాపుల్లోను
కాలాన్ని మార్చేటి
కాలు చూచారా ?
మా కోల గన్నారా ?

౮

వెదురూసలను పంచి
పొదరిండ్లలో పొంచి
కదలేసి రాకాసి
కదుముల్లో కడతేర్చి
నది మరచినారా ?
మీ రది గడచినారా ?

౯

ఆ గాలి అటు వీచి
ఈ గాలి యిటు వీచి
మా గొంగళుల మూత
లేగొట్టితే, మేము
సాగి పోలేమా ? మే
మూగి పోతామా ?

౧౦

ఆ పిడుగు లటురాలి
మా పిడుగు లటు దూలి
ఆ పాప కూపాలు
మా పట్టుపగ్గాలు
ఆపలే వంటరా ? మే
మాపలే మంటరా ?

౧౧

మా బోగి మూకలే
మాజాతి కారులే

ఆ జారు కేజర్ల
లో జొచ్చి జయభేరి
రో జవంటార ?
ఆ రోజు గంటార ?

౧౨

కాలంబు మారితే
మూలంబు తెలిసితే
కోల కాలాహియౌ
నేల పాతాళమౌ
చాల నన్నవారె
పాలు కొంటారు. యీ

౧౩

చేలల్లో భాగాలు
పాలల్లో రాగాలు
నేలల్లో సాధాలు
ఈలాగు మారితే ?
ఏ లేదంటారా ? మాతో
ఆల మంటరా ?

౧౪

పువ్వుల్లో ముళ్ళుంటె
నవ్వుల్లో విషముంటె.
తివ్వల్లో తేళ్ళుంటె.

ఎవ్వళ్లో తెలిసితే,
నెవ్వరంటారు ? ఇది
అట నెవ్వరుంటారు ?

౧౪

సాగినన్నాళ్ళు మీ
వేగు సాగిందన్న
సాగునా కలికాల
మీగిపోకుండ మా
బాగు రాదంటారా !
అలాగు కాదంటారా ?

౧౫

ఏలాగు చెప్పితే
అలాగు నడిచితే
ఆలీషా తలచితే
ఆ లేఖినే విష
జ్వాల చల్లార్చదా ?
కాలంబు మార్చదా ?

—★—

# కాఫీ

తే. ఆకటికి శంకరుఁడు నంగ ♦ లార్చి విషము
ద్రావెనే గాని కాఫీని ♦ ద్రావలేదు
నిండు దాహార్తిమై యగ ♦ స్త్యుండు జలధి
ద్రావెనే గాని కాఫీని ♦ ద్రావలేదు.

తే. అమరు లమృతంబు ద్రావినా ♦ రపుడు ; ఇపుడు
ద్రావుచున్నాము కాఫీని ♦ తరుచు మనము
అది జరామరణంబుల ♦ నాపుచుండు
నిది జరామరణంబుల ♦ నిచ్చుచుండు.

తే. సురల కమృతంబుఁ బోసి యా ♦ సురల కెల్ల
కాఫీ పోసెను మోహినీ ♦ కాంత యపుడు
అవని ఆ కాఫియే యిప్పు ♦ డవతరించి
మనలఁ బీడించుచున్నది ♦ దినదినంబు.

తే. మధువుకన్నను దియ్యనై ♦ మతిని దనుపు
సుధను మీరినదై చాల ♦ సొగసు గూర్చు
చక్కెరకు మించి యమృతంబు ♦ ధిక్కరించు
కాఫి కన్నను వేఱె భ ♦ క్ష్యంబు గలదె.

సీ. గురువు చెప్పినఁ గాని ♦ గుడికిఁ బోవనివాఁడు
కాఫీ దుకాణంబు ♦ కడకుఁ బోవు
పరదేశ విద్యని ♦ బడికిఁ బోవనివాఁడు
పెసరట్లకై పోయి ♦ పీకులాడు

కోటి పోయినఁ గాని ♦ కోర్టు కెక్కనివాఁడు
పాటీకి టీ త్రాగఁ ♦ బోవుచుండు
మతమ్ముతాచారముల్ ♦ మఱచి పోయినవాఁడు
మధురమౌ కోకోను ♦ మఱచిపోఁడు

తే. అఖిల సంగపరిత్యాగి ♦ యైన కాఫీ
మాట చెప్పినఁ ద్రాగక ♦ మానలేఁడు.
సూర్యు నెఱుఁగనివారలఁ ♦ జూడవచ్చు.
కాఫి యెరుఁగని వారలఁ ♦ గాంచలేము.

సీ. శివుని లెక్కింపని ♦ సిద్ధాంతి సీజరు
సిగరెట్టుకై మ్రొక్కి ♦ సేవ సేయు
దివిజుల నోడించు ♦ కవి దిగ్గజముఁ గూడ
కాఫి యన్నను నమ ♦ స్కార మిడును
కుండలీంద్రుని గెల్చు ♦ దండి పండితుఁడైన
అయిను, సోడాకు జో ♦ హారు సేయు
ఆలుబిడ్డలు తన ♦ కేల యంచను యోగి
ఉప్మా యటన్నఁ గే ♦ లొగ్గి వేడు

తే. హిడ్డె నన్న విద్యార్థి నే ♦ హీ యటంచు
వదలటన్నను గురువు వ ♦ హ్వా యటంచు
తిరుగుచుంద్రు త్రికాలముల్ ♦ మఱవ కింక
కాఫి హోటలన్న నిజము స్వ ♦ ర్గంబు గాదె.

తే. వేడి వేడి కాఫిని నిచ్చు ♦ వేళ దాని
జూచినంతనె ప్రాణాలు ♦ లేచివచ్చు
కాంత లేకున్న మానె నే ♦ కాలమందు
కాఫి యుండినఁ జాలు దుః ♦ ఖంబు లేదు.

ఉ. కాంతయుఁ గాఫియొక్కటన • గాఁదగునా యని మిత్రుఁ డొందుః
ద్ధాంతము సేయఁజొచ్చె నది • తథ్యము కాదు నిజంబు కాఫియు!
గాంతయుఁ జిత్తరంజన మొ • నర్చుదు రందును కాఫి గర్భమః
దెంతయుఁబోయిహాయియిడి•యీాప్సితముల్ ఘటియించు; పైపయి!
గాంత సుఖంబు గూర్చు నది • గావునఁ గాఫికిఁ జాల వేవియున్.

తే. కాఫి యన్న సురాగంబు • గాదు మాకు
కాఫి యన్నను రాగంబు • గలదు మాకు
కాఫి రాగంబు కంటెను • కాఫి యందె
మనసు లగ్నంబు జెందు నే • మనినఁ గాని

తే. కాఫితో సంధ్యవార్చెడు • ఘనులు గలరు
కాఫి కాదంబరీదేవి • గాదె జగతి

.... .... ..
.... .... ....

ఆ. కల్లుపయిని నురుగు • కాఫిలో వేడిని
నూదుకొనుచుఁ ద్రాగు • చుండవలయు
కాని. కాఫి కున్న • గౌరవ మల కల్లు
కాచ నందువలనఁ • గలుగ లేదు.

—★—

# మత్సెలు

కలకలని నవ్వుచున్న వె ♦ న్నెల వెలుంగు
అమృతనిభమైన యీ ధవ ♦ ళాంశుకాంతి
నేల యీ మబ్బుతునక మా ♦ యింపఁ జూచు
ఈ నిశాకన్య యేల నీ ♦ లాలకములఁ
గప్పుచున్నదొ యీపరా ♦ గంబు దోఁగి
ఈ హిమాంబుధూమంబున ♦ నేకశత స
హస్ర కరములఁ గబళింప ♦ నరుగుచున్న
దీ మహాప్రేమ ప్రళయమం ♦ దేమి గలదొ
ఈ మహారాగరసమునం ♦ దేమి గలదొ ॥కల॥

జీవితం బను నీవహ్ని ♦ శిఖలనడుమ
హృదయనిర్భేదకం బైన ♦ యీ విషాద
గహనములమధ్య చిమ్మచీఁ ♦ కటులయందు
దేనిదో వెల్గు వెల్గదే ♦ గానవచ్చె
నింగి నేల లేదు ప్రణయ ల ♦ తాంగి నీల
నీరదాభ్యంతర పట కు ♦ టీరములను
తెఱచి మెఱపుతీఁగలు పన్ని ♦ యిరుల తెరలు
జారవిడువగ గాఢాంధ ♦ కారమైన
విశ్వనాటకరంగంబు ♦ వెడలిపోయె
ఘూకములు కూయుచున్న యీ ♦ చీఁకటులను
ఉల్కలును రాలుచున్న యీ ♦ యుగ్రములను

ఈ శిలావేదికలను మా • హృదయఫలక
మందు గల వహ్నిదగ్ధ (ప్రే • మాక్షరములు
కాలి డాగైన నాయంత • రాళ మిట్టు
లెవరు (వ్రాసిరో యీ లోతు • నీ రహస్య
మెవరు దీసిరొ ? యిది వార • లె ట్లెఱుంగఁ
జాలిరో ? ప్రేమపాతాలఁ • జదువుకొనుచు
మేఘములఁ బోయి గర్జించి • మింటి కెగసి
ఉడులఁ దిరుగుచు నేలకుఁ • బడెడు జడుఁడు
(వ్రాసియుండును ; అది మహా • జ్వాలలీల
మండుచున్నది ; ఆ వెల్గు • నిండుచున్న
దింక దీనిని జల్లార్ప • నెవరితరము ?
ఇంక దీనిని వారింప • నెవరితరము ?

—★—

# ఏది నా పాట

ఈ ప్రణయగీత మెందుండి • యేగుదెంచు
ఈ యమృతకంఠ మే వ్యక్తి • నెనసి వచ్చు
ఆ రసాత్మకాక్షర సమా • ధ్యాయ మెందు
నణఁగియున్నది యెవరి దా • స్యమునఁ గలదు.
దాస్యశృంఖలాబద్ధ వి • ద్యావధూటి
కేది యీ రీతి స్వాతంత్ర్య • మేది సొగసు
ఏది నా పాట నా గీత • మేది కవిత.
విహ్వల నిషిద్ధ దైన్య జీ • వితమునందు
విషసమారూఢ దగ్ధ • జీవితమునందు
ఏది యీ రీతి స్వాతంత్ర్య • మేది సొగసు :
ఇది యవాఙ్మానసంబు న • తీంద్రియంబు
ఇది మహాశూన్యగళదణు • పదరవంబు
నేను వాకొనుగీతంబు • నేఁ దలంచు
భావ మీ జరదశరీర • వాణి పాడి
పాడి ప్రకటించు ప్రకృతి ని • వాళి యొసఁగ
ఇంక నాకు స్వతంత్ర మిం • తేని కలదె ?
ఇంక నాకుఁ గర్తవ్య మే • దేని గలదె ?
మెఱుపుతీవలు, రత్నాలు • మేళవించి
మిణుఁగురులు వెన్నెలల వన్నె • లనువుపరచి
ప్రేమరసవాహినులఁ దేలు • వీచికలను
అల ప్రభాత నిశాంత నా • ట్యానుబద్ధ
శర్వరీకాంత మోహన • స్వరవిలాస
మాధురీ మార్గణంబుల • మాటునందు

మసలు జీవిత పాషాణ ♦ మండలంబు
మండి యెగయు బూడిదపయి ♦ నుండి రాలి
వ్రాయుచున్నది యీ పాట ♦ పాంథకోటి
చదువుకొనునట్లు, కోవిదుల్ ♦ చదువునట్లు
ఇంక నీపాట నా దని ♦ పించు టెట్లు
ఇంక నీగీతి నాదని ♦ బొంకు టెట్లు ?
ప్రణయ నిస్స్వాణ మదె మ్రోయఁ ♦ బయనమైన
యువక పథికుల వా గమ్య ♦ తోపవృష్టి
అదె ప్రహవావిధంబున ♦ నరుగుదెంచి
వీచికలచేత ఈ గీతి ♦ వెల్లివిరియ
ప్రతిలతాగుల్మములయందు ♦ ప్రతిఫలించి
ప్రతిజలాశయమం దభి ♦ వ్యక్తి నొంది
ప్రతినదీగర్భమందుండి ♦ బయలుదేఱి
మ్రోయుచున్నది దిశలు మా ♦ ర్మ్రోయునట్లు.
పాడుచున్నది జగము సొం ♦ పారునట్లు
ఇంక నీ పాట నాద ♦ ని పించు టెట్లు ?
ఇంక నీ గీతి నాదని ♦ పించు టెట్లు ?
ప్రాఁతపాఠాలు వల్లించి ♦ ప్రాఁతకథలఁ
జాటి యీ నాటి కవితావ ♦ ధూటి గట్టి
ప్రాఁత తొడవుల ముస్తాబు ♦ ఫరిఢవిల్ల
వెదకి పాశ్చాత్య ఫేసు బూ ♦ డిదను పూసి.
పులిమి తలదువ్వి బిచ్చపు ♦ వెలఁది చేతి
బొమ్మ నాడించి నవ్వించి ♦ బుగ్గిచేసి!
ఏడ్చి కన్నీళ్ళు దుడిచి మీ ♦ కింద మనుచు
నేను మీా ముందు పెట్టి మె ♦ ప్పించలేను ;

నేను కవిని నాకలమీ జ ♦ గాన నొక్క
మాఱు ఖడ్గంబు కైవడి ♦ మాఱఁగలదు
ఒక్కమాఱు స ంస్కర్తగా ♦ నోపఁ గలదు;
గాన కవితను సూత్న మా ♦ ర్గములఁ ద్రిప్పి,
క్రొత్త వన్నెల జగము రే ♦ కెత్తునట్లు
చేసి, చక్కెరతో నింపి ♦ వేసి నా స్వ
శక్తి యీశ్వరశక్తిగాఁ ♦ జాటలేనె ?
దివిని దివిజుల నేలకు ♦ దింపలేనె ?

మొగ్గగా లేచి పూచి యే ♦ మో విలాస
పూర పూరితకాంతులు ♦ పొంగి పొరలు
నట్టి నానా విశీర్ణ పు ♦ ష్పాసవములఁ
ద్రావి మైకొని విరహ ని ♦ ద్రాణమైన
రమణి పదరాగముల నైక్య ♦ రమ గడించి
ఆమెపారాణి మైనింత ♦ నలము కొనఁగ
ఆమె ప్రేమసామ్రాజ్యంబు ♦ నాచికొనఁగ
అమె దృక్పథ సర్వస్వ ♦ మందుకొనఁగ
వెడలి గేదంగి పూల పు ♦ ప్పొడుల ద్రమ్మి,
మూసి, రిమ్మెత్తిపోయి హ ♦ తాశమైన
భ్రమర మీ గీతి యెలుఁగెత్తి ♦ పాడుచుండ
తేటి యీ పాట నా దని ♦ చాటుచుండ
ఇంక నీ కైత నాదని ♦ బొంకు టెటుల ?

పంచమస్వరాళికిని వి ♦ పంచికలకు
విరహులకు రాగరస సము ♦ ద్వేలమైన
పాఠశాలను పెట్టి సొం ♦ పారునట్టి

కోకిలము చంచుపుటమున ♦ లోకమునకు
పాడి, వినిపించు నిది తొలి ♦ పాఠ మనుచు
చదివి వినిపించు నిది తొలి ♦ చదువుగాఁగ
ఇంక నీ పాట నా దని ♦ పించు టెట్లు ?
ఇంక నీ గీతి నా దని ♦ బొంకు టెటులు ?

మనసు మనసును గలిపి యే ♦ మాటకైన
మరపు రాకుండుటకుఁ దన ♦ వరుని మనసు
కొంగులోపల ముడి వేసు ♦ కొన్న యట్టి
ప్రేమకామిని హృదయార ♦ విందమందు
రేక రేక నీ పాట చి ♦ త్రించియుండ
స్వరము స్వరమున నీ పాట ♦ మెఱయుచుండ
పలుకు పలుకున నీ పాట ♦ కులుకుచుండ
ఇంక నీ పాట నా దని ♦ పించు టెట్లు ?
ఇంక నీ గీతి నాదని ♦ బొంకు టెట్లు ?

కవుల భాండార మిట్లు లో ♦ కము గ్రహింప
కవుల సర్వస్వ మిట్లు వ్రే ♦ క్కలయిపోవ
ఇంక శూన్యభాండముల తె ♦ క్కేమి గలదు ?
ఇంక ముక్తకంఠముల జో ♦ లేమి గలదు ?
గాన కవి విశ్వరూపంబు ♦ గాంచవలయు
ఇంక కవి విశ్వమై విని ♦ పింపవలయు.

— ★ —

# మేలుకొలుపు

మేలుకొనరే - జనులు - మేలుకొనరే ॥
మేలుకొనరే నిద్రపోయెడు
వేళ కాదిది తెల్లవాఱెను
కాలవాహిని పొంగి పొరలి వి
శాల విశ్వము ముంచుచున్నది ॥మేలు॥

క్షితిఁ జర స్థిర సంతతులు తమ
బ్రతుకు లను నాటకములోపలి
వెతలు ముగిసెడు నెదుటి తెరగతి
మతులు గప్పె సుషుప్తి యహహా
గతులు మార్చెడు కాలనాథుఁడు
ధృతి ప్రభాత నిశాత సాయక
వితతి యదె వినువీధి పరపఁగ
అతిప్రశాంత నిశా కవాటము
కుతుక మొప్పఁగఁ దెఱచివచ్చెను
అతివపోలిక వేగుజుక్క. ॥మేలు॥

కడలి సిరితోఁబుట్టు కలువల
పడవ లెక్కి నదీనదంబులఁ
బడి వనాళి వసంతుతో జత
పడసి మలయ ధరాధరంబుల
వెడలి భిల్ల సరోజనేత్రల
జడల ముడిచెడు మల్లియల పు
ప్పొడుల దాఁగుడుమూఁత లాడుచు
నడచి మలయజ శీతజలముల

కడిగి శుచియై సారభంబుల
నొడిని నిడుకొని వచ్చె పవనుఁడు ॥మేలు॥

కలయజాండము లడర నల్లని
వలువచే మేల్ముసుఁగు గప్పియు
చెలఁగుచును బరతెంచి చీఁకటి
కలికి కన్నులకాటుకను తన
వెలుఁగుతోఁ గడు దిద్ది కుంకుమ
తిలక ముంచినరీతిఁ దనరుచు
శలభములు ఫలకాంక్ష సేయుట
వలనఁ గలిగెడు ముప్పు లెట్టివో
తెలుపుచును సంస్కర్త పోలిక
నిలిచి వెలవెలఁ బాఱె దీపము. ॥మేలు॥

విరులుపరచి వనాంతమను ప
ళ్లెరములో కప్పురపుహారతి
వరలఁగా వనరమ యుషస్సున
కెరఁగి స్వాగతముల నొసంగఁగ
పరభృతాది శుకాంగనలు తమ
స్వరసుధారసధార లొలుకఁగ
గిరులు దరులు ప్రతిధ్వనింపఁగ
తరుల నెక్కి వసంతగీతము
లరసి పాడుచు నందులో నీ
శ్వరుని తేజము గాంచు సమయము. ॥మేలు॥

చెఱకువిల్లును వంచి విరహుల
విరుల శరముల ముంచి యెత్తిన
మరుఁడు క్రూరనిశాచరుఁడు తన

దురితముల కతిలజ్జఁ జెందుచు
మరలె దిక్కు మొగంబుతో నా
తెఱఁగుననె విహరించి వెన్నెల
లురులలోన వియోగులను కడు
మరలఁజేసి విషాదపెట్టిన
భరమునను సంబరము విడిచియు
చరమగిరి కేతెంచె చంద్రుఁడు. ॥మేలు॥

తోయజంబులు నిద్ర లేచెను
తోయజాక్షులు లేచి గంగా
తోయములకై పోవుచుండిరి
తోయజుఁడు రేయెల్ల వెన్నెల
గాయుచును చరమాద్రి నిలిచెను
ఆయు వల్పము తెలియ రేమని
తోయదంబులఁ బ్రకృతి గంటలు
వేయుచున్నది కోళ్ళు కొక్కొరొ
కో యటంచును దిసలు బీఁటలు
వాయగా నదె యఱచుచున్నవి. ॥మేలు॥

పవనములు కామములు నింద్రియ
వివశమైన మలీమసస్థితి
దవులకుండఁగ జ్ఞానజాహ్నవి
నెవఁడు హృదయము కడిగివేయునొ
అవల వారల బ్రహ్మజిజ్ఞా
సాంతరంబు తమంబు బాసియు

ప్రవిమలంబగు తెలివిలో నీ
శ్వరుని తేజము దోఁచుకైవడి
దివిని జలధిని నిసిని విడిచియు
రవి యదే యుదయించె నభమున. ॥మేలు॥

పవనములు కామములు నరిష
డ్వర్గముల బిగు వణఁగిపోయిన
నవల గంగాజలము పోలిక
నాత్మ మిగుల పవిత్రమై తొలి
పరిచయంబులు విడిచి విలసిత
బ్రహ్మజిజ్ఞాసాంతరము మతి
దవిలి తమసును బాసి యీశ్వర
తత్త్వమున తేజంబు గాంచెడు
ప్రవిమలాత్ముని తెలివికైవడి
రవి యదే యుదయించె నభమున. ॥మేలు॥

నిద్రబోయె నదే చతుష్క స
ముద్ర ముద్రిత లోకజాలము
నిద్రపోయెను భూతకోటి యు
పద్రవంబులఁ దగిలి మాయా
నిద్ర తొలఁగిన బ్రహ్మవేత్త ల
నిదప్రదీప్తి స్వరాజ్యదుర్గము
భద్రముగ కాపాడి దేశ ద
రిద్రమును తెగటార్పుఁడో యన

నిద్రపోదురె భారతీయులు
నిద్రపోదురె వీరవనితలు. ॥మేలు॥

కాల మనయము లోకమును నీ
లీల రేలఁ బవళ్ళ రథములఁ
దోలి తోలి రజంబు క్రైవడిఁ
దూర్చి పూచిన పుప్వులో యన
నేల రాల్చి విషాభ మగు నీ
వ్యాళమును తెగటార్చు మంత్రము
లాలకింపఁగ నదిగో శ్రీ యా
ఖైలలీగురుఁ డిచటనే ఉం
ఠాలిపాకవి కెఱుకఁ బలికెడు
వేళ బ్రహ్మముహూర్త మియ్యది. ॥మేలు॥

—★—

# జీవితనాట్యము

గడచిపోయిన జీవిత ♦ కాల నాట్య
రంగమున చేసినట్టి వ ♦ ర్తనము నందు
ప్రతిపదము క్రింద ముండ్లెగ ♦ న్పడుచు నుండె
ప్రతి నిషిద్ధ వాతావర ♦ ణ తతియందు
చీమలే పట్టుకొనుచుండె ♦ నేమొ గాని
శాంతి యెక్కడి దింక ది ♦ గంత దృశ్య
మైన సౌందర్యమున లీన ♦ మైన తెరల
చాటుమాటున బ్రతుకను ♦ నాట కాంత
రాగమెత్తి పాడుచు నను ♦ రాగరసవి
శేషవాహిని హృదయ సం ♦ క్షిప్త భూము
లందు పారించి ప్రేమ రా ♦ జ్యముల నేల
ఏది యవదాన మీ దగ్ధ ♦ పాదపముల
మ్రోల సుడిగాలి ముంగల ♦ బోర్లవడ్డ
శూన్యఘటము దీనిని నేరు ♦ చూడఁ గలరు ?
నెచ్చెలులపొంత ప్రాంత వ ♦ నీ విలాస
లాలస పథాల వెన్నాడి ♦ లాస్యహాస
భాసిత శ్రీల ప్రొద్దులు ♦ మోసులెత్తఁ
బుచ్చుటకు నీ ప్రకృతి తోడ్పు ♦ వచ్చుమాట
లేకపోయెను; రంగ వ ♦ ల్లికలయందు
మురువుసూపు నిగారంపు ♦ ముత్తెసరుల
క్రేవలందు పూఁదీవ వా ♦ కిళ్ళయందు

పచ్చ తోరణములఁ గట్టి ♦ పళ్ళెరముల
హారతి యుషస్సునకు నిచ్చి ♦ అంజలిని ఘ
టించి స్వాగతమిచ్చి య ♦ ర్థించి కురుల
యిరుకులను గాలి తలఁ బ్రాలు ♦ విరులు గురియ
వాసనలఁ దోఁగి, వలపుల ♦ వాలు విరియ
నవ్వులనుదేలి జీవిత ♦ నాటకాంక
మును చతుర్థాంకముగఁ జేయుఁ టనునది గన
లేదు; ముంగిళ్ళ ముసుగులు ♦ లేవనెత్తి,
యిరుల కాటుకపట్టి క ♦ న్నెరల నిరికి,
పరువులెత్తి రసస్వరూ ♦ పముల డాసి,
వాసిమెయి పాలయల్కలం ♦ దోసిళులను
బోసి, బతిమాలి, మోము మో ♦ ములను జేర్చి,
ఏడ్చి, కన్నీళ్ళు దుడిచి, యే ♦ మేమొ బాస
లాడి, వగలాడి వేడుక ♦ యాగడముల
కేసి కన్నెత్తి చూడలే ♦ దాసమాత్ర
ముండిపోయెను పగిలిన ♦ గుండెలందు.

—★—

# చాతకము

ఉ. చాతకపక్షి ! నీ విలు వి ♦ జంబుగ సద్గుణరాశివంచు నీ
నీతికి నీ మనోహర వి ♦ నిర్మల బుద్ధికి సంతసించి వి
ఖ్యాతిగఁ జెప్పుకొందురు గ ♦ దా నిను నీ దగు భాగ్యమేమొ నీ
జాతి ఖగంబు నింక వినఁ ♦ జాలము చూడము ముజ్జగంబులన్.

చ. పరభృత మున్నదన్న నది ♦ పక్షులలోఁ గడు ప్రౌఢయైనఁ దా
విరహులపాలి శత్రువు న ♦ వీన సుమాస్త్రుని పెద్దబంటు సుం
దర శుకచక్ర శారికలు ♦ దర్పకు సైన్యము రాజహంస మో
సరసిజనాళ భక్షకము ♦ చాతకమా యివి నిన్నుఁ బోలునే.

శా. గూడా లేదు; లతావనీరుహములన్ ♦ గూర్చుండ; వీ కుక్షికిన్
గూడా యొల్లవు; నీరు ద్రావవు బళే ! ♦ గ్రుడ్లెట్లుగాఁ బెట్టెదో
జోడేరీతిని గట్టెదో నిదుర యె ♦ చ్చోఁ బోదువో నింగిపై
నాడన్ రెక్కలు నొవ్వవో శ్రమముగా ♦ దా పేద సారంగమా

ఉ. చంచున గింజ లేరికొనఁ ♦ జాలవొ ? కూపనదీజలంబు భ
క్షించుటలేదొ ? యాకలి న ♦ శించెడి మందులు త్రాగినావొ? వ
ర్జించితొ కూడు యోగివయి ? జీవము లేగతి నిల్చె ? నెట్లు సి
ద్ధించెను నీకు నిర్మలిన ♦ దివ్యశరీరము వానకోయిలా ?

ఉ. సొంపగు నీచరిత్ర మతి ♦ చోద్యము వర్షజలంబు ద్రావ వాం
ఛింపుదు వంట నిత్యమది ♦ చేకురునే ? యిటు లెన్నినాళ్ళు జీ
వింపుచు నింగినాడెదవు ♦ విప్పిన రెక్కలు మూయకుండ ? నూ
హింపగరాదు నీకుఁ బర ♦ మేశ్వరుఁ డేమి యనుగ్రహించెనో.

ఉ. పక్షులలోన నీవు కడు ♦ పండితురాలవు గాగ నేదియున్
భక్షణసేయకుండ నుప ♦ వాసపు దీక్ష వహించితంచు నా
రక్షకుఁ డందరన్ మనుచు ♦ రాజగుటన్ నినుఁగూడఁ బెంపగా
వీక్షణజేసి వాన గురి ♦ పించునొ యేమొ యెఱుంగ శక్యమే.

ఉ. ఆకలిలేనివా రవని ♦ యందు గనంబడ రేదొవేళ కే
యాకులొ నీరక్షీరములొ ♦ యానఁగఁ బోయెడువారెగా, యినీ
నీకరణిం గనంబడరు ♦ నిర్జరు లొక్కరె తప్ప నౌనుగా
నాకనివాస మిర్వురకు ♦ నైజమె వేఱుగఁ జెప్ప నేటికిన్.

ఉ. భూమి వసించువారు పార ♦ పాచ్చెములం బడి య్యాలుబిడ్డలం
దే మమకార ముంచి పర ♦ మేశ్వరుఁ గొల్వరటన్న బుద్ధిచే
నేమివ్రతంబు సల్పినను ♦ నెచ్చటి కేగిన వానకారునం
దేమర కొక్కమాట స్మరి ♦ యింపుము సత్కవి వీవు గావుసన్.

చ. నెల లిరునాల్గు నింగిపయి ♦ నిల్వున నీరయి నిల్చియుంటి నా
కలరవ మారె నేటి దిన ♦ గంతము దాటె నటంచు ద్యోదిశన్
జలదము దోప వేడుకను ♦ సాగకు నీటికణంబొ లేక లో
పల వడగల్లొ చూచి మరి ♦ భక్షణసేయుము వానకోయిలా.

—★—

# పేదరికములోని రహస్యము

ఉ. పేదఱికంబుచేత కడు ♦ బేలగ పైకి నటించు మర్త్యుఁడా
పేదఱికంబు లేనియెడ ♦ వీరునికైవడి కన్నుగానకే
సాదుల బాధపెట్టుదు ని, జంబిది దైవ మెఱింగి శిక్షగా
పేదను జేయుఁగాని పర ♦ పీడనమున్ బొనరింపఁ డెన్నఁడున్.

ఆ. పైకి చూడ సాధు ♦ భంగియౌ పిల్లికి
రెండురెక్క లీశ్వ ♦ రుండె యిడిన
జగతిపైని నింక ఖ ♦ గకుల ముంచునే
వెదకి వెదకియు తిని♦ వేయుఁ గాని

ఆ. ఆవులకును గల్గు ♦ లావు శృంగంబులు
గాడిదలకు తలను ♦ గలిగెనేని
తిరిగి తిరిగి ప్రజల ♦ నురుమాడ కుండునే
సృష్టిలో రహస్య ♦ మెవఁ డెఱుంగు ?

తే. సహజముగ నెవ్వఁ డాత్మచే ♦ సజ్జనుండొ
యతఁడె భాగ్యంబు పొందుట ♦ కర్హుఁ డగును
ఈశ్వరుఁడు భాగ్య మిచ్చిన ♦ హీనుఁ డెపుడు
గర్వియై బాధలిడు జగ ♦ త్సర్వమునకు

తే. ఖలున కిల భాగ్యమబ్బినఁ ♦ గాని యది య
నర్థ మగును చీమకు ఱెక్క ♦ లబ్బినట్లు
కాక యది నడుమంత్రపు ♦ కలిమి యైన
మంచివారికి హాని గా ♦ వించు నిజము

తే. ఈశ్వరునిమాయ నెవ్వ డా♦ యీశ్వరుండె
యెఱుఁగుఁ గాని మనుష్యు లే ♦ మెఱుఁగఁ గలరు ?
కలిమిలేముల నీడ వాఁడె ♦ తెలియఁ గలఁడు
ప్రజలసంగతి మనకంటె ♦ బాగుగాను.

# ధనమా! అన్నమా!

తే. ఆణిముత్యాలు గడియించు ♦ నవసరమున
కూటికై బెంగ రాదను ♦ కొంటి నిప్పు
డొద్ద ధనమున్న కూడురా ♦ వద్దె పృథివి
విధివిధాన మలంఘ్య మే ♦ విధునకైన.

తే. ఎవరికైనను నే వేళ ♦ నే యవస్థ
వలన నా గంతుకంబుగా ♦ వచ్చునట్టి
కష్టశతములు దేవుండె ♦ గతపవలయు
గాని ముత్యాలు ధనములు ♦ గతపఁగలవె.

చ. ధన మొకజాతిలోహము గ ♦ దా యది మారిన సస్యమెంతొ వ
చ్చును ; నొకవేళ రాజ్యముల ♦ చొప్పునశించిన మారఁబోదు; దం
ధనధన మన్నమాటలు క ♦ థల్ వలెఁ దోఁచును ; నెన్నఁడైన నీ
జనులకు నన్నమే బ్రతుకు ♦ సాధన మీ ధనమౌనె యారయన్.

అ. ధనముకన్న నన్న ♦ దాతయే సంతృప్తి
సేయఁగలఁడు చేసి ♦ చెప్పగలఁడు
ధన మొసంగి చాలు ♦ ననిపింపఁ జాలఁడు
అన్న మొసఁగ జాలు ♦ ననును నతిథి.

తే. ధనము దినలేరు ; అన్నమే ♦ మనుజులకును
జీవనాధార మగుట నా ♦ శివుని భార్య
'అన్నపూర్ణ' యే గాని యే ♦ మన్నగాని,
యధమ ధన పూర్ణ గాదు ల ♦ చ్చమ్మవలెను.

చ. దగఁ గొని యాకటల్ దడసి. ♦ దప్యాత నొందెడువేళ నోటిలో
దిగుటకు నీళ్ళొ పాలొ మఱి ♦ తియ్యని పండులొ లభ్యమైనచో
దగు; నది ప్రాణముల్ నిలుపుఁ ♦ దద్దయు స్వర్ణమునాణెము త్రైపుం
నగలు లభించినన్ వృథ ధ ♦ నంబునకున్ విలువన్న దున్నదే.

ఆ. ఇట్టి ఘోరమైన ♦ యీ కానలోన దా
హాగ్ని కింధనంబు ♦ నైనవేళ
నోట ముత్య మున్న ♦ పాటి మన్నుండిన
ఫలము లేదు స్వాదు ♦ జలము వలయు

ఉ. ఆకటిచేత నేలఁబడి ♦ యాశలు రాలఁగ నంగలార్చు ని
వ్యాకుల శోకతప్తునకు ♦ స్వర్ణ కిరీటము నెత్తి నుంచినన్
లేకొక తట్ట పెట్టినను ♦ లేదు సుఖంబును సేగి త్యాగ భో
గాకరమైన యీ తనువు ♦ నన్నమయం బని యెంచఁగాఁ దగున్.

ఆ. కాన దీని నెల్ల ♦ గను గొని విబుధుండు
ఉన్నమట్టుకు దిని ♦ యుండు నింట
గాని యర్థవాంఛ ♦ కడగండ్లపాలయి
చావఁబోడు లోభి ♦ చచ్చినటులు.

—✶—

# అహింసా గీతము

జగము సృజియించినట్టి యీ ♦ శ్వరునిఁ జూడు
పంచభూతాలు వాని యే ♦ ర్పాటుఁ జూడు
సూర్యచంద్రుల చక్రాని ♦ శోభఁ జూడు
కాల పరిణామ వైచిత్ర్య ♦ గతిని జూడు
ఎంత వింతఁగఁ దోఁచు నీ ♦ యంతరాత్మ
నిన్న పూయని లతలు నేఁ ♦ డెన్ని పూలు
పూయుచున్నవి సొగసు పు ♦ ప్పొడుల జల్లి ;
నిన్న పారని యేళ్ళు నేఁ ♦ డెన్ని నీళ్ళ
నొసఁగుచున్నవి తల్లి పా ♦ లో యనంగ ;
ఫలరసాదులు వృక్షముల్ ♦ పగలు రేలు
గురియుచున్నవి జీవముల్ ♦ గురియునట్లు ;
గడ్డిగసరుల మేయు గో ♦ గణము పాల
నిచ్చుచున్నది కరుణ రే ♦ కెత్తునట్లు ;
వానికై మనఃపూర్వక ♦ స్వాగతంబు
పంపి మనయాత్మ వాని క ♦ ర్పింపవలయు
అదియె పుణ్యంబు మోక్షాన ♦ కదియె దారి
అదియె యోగంబు భాగ్యాన ♦ కదియె తెఱవు
దీని కన్యంబు వృథ యని ♦ తెలియవలయు
గోవులను బఱ్ఱెలను పాలు ♦ గ్రోలి వాని
గోయువాఁ డెంత క్రూరుఁడో ♦ వ్రాయఁదరమె ?
రాతికంటెను కఠినుఁ డా ♦ రాక్షసుండు
రాక్షసునికంటె ద్రోహి యా ♦ రాజసుండు
నోరెఱుంగవు కొట్టిన ♦ నూరకుండు

అరచి తమ మొఱ్ఱ నెప్పు డీ ♦ శ్వరునితోడ
చెప్పుకొను గాని మనతోడ ♦ చెప్పుకొనవు
మనబరువు మోచి యెంతొ బా ♦ ధను సహించు
మనకొఱకు పాల నిచ్చి వే ♦ ధన సహించు
వాని గోయుటకంటె ♦ పాపంబు గలదె
వాని దినుగంటె వేఱు ♦ పాపంబు గలదె
పాలు ద్రావి రొమ్మును గ్రుద్దు ♦ వారికంటె
యేరు దాటి తెప్పను గాల్చు ♦ వారికంటె
కఠినపాషాణ మని వాని ♦ గాంచవలయు
పిట్టపిడుగని వాని భా ♦ వింపవలయు
జీవహింస మాన్పిన బుద ♦ దేవుఁ దలఁచి
యజ్ఞధేనుల కాపాడి ♦ నట్టి ద్వైత
మతగురుండు మధ్వాచారి ♦ మార్గ మెంచి
వేదమున యజ్ఞమున బలి ♦ లేదటంచు
దెల్పు నలదయానందు సం ♦ దేశ మరసి
లేడిపిల్లను వదలి పా ♦ లిచ్చు తల్లి
నూఱడించు సిబక్తజీన్ ♦ తీరు గాంచి
పరమదయ కాకరంబైన ♦ వారి మన క
బీరు నలగాంధి మున్నగు ♦ ధీరమతుల
నెంచి జీవహింసను విస ♦ ర్జింపవలయు
పుణ్యధనులార ! భారత ♦ పుత్రులారా!

# విద్య

ఉ. విద్య మహాపదార్థము వి ♦ వేక కళాలసితంబు నైన దీ
విద్య చరాచరంబయిన ♦ విశ్వ మెఱింగెడు చూడ్కివంటి దీ
విద్య బలంబు, తేజము, ప్రి ♦ వీణత నిచ్చును సర్వధర్మ సం
వేద్యమునైన నీ పరమ ♦ విద్యకు మించిన భాగ్య మున్నదే.

చ. యవను లరబ్బు లార్యులు మ ♦ హా విభవంబున శౌర్యధుర్యులై
యవని జయధ్వజంబులు ది ♦ శాంతములన్ నెలకొల్పి రంచుఁ ద
త్పవిమల కీర్తిగీతములు ♦ పాడెద రా విభవంబు విద్యచే
గవిసెనుగాని దోర్బలత ♦ ఖడ్గబలంబునఁ గాదొకప్పుడున్.

సీ. మధుమాసముల ♦ మేయు మావిచిగుళ్ళకై
పంచమస్వర మభ్య ♦ సించుఁ బికము
కుసుమాసవము ప్రేమ ♦ మెసవి వినోదింప
వనచరత్వము నేర్చు ♦ కొనును తేటి
మేఘమాలికతోడ ♦ మిత్రానురాగంబు
బ్రకటింపఁ గఱచు న ♦ ర్తనము నెమిలి
పూఁదీవ తీవకుఁ ♦ బోయి తేనె గడించు
పాండితి నలవాటు ♦ పడును సరఘ

తే. ఇట్లె జడములు సహజ సా ♦ హిత్యగరిమ
ప్రకృతిని నలంకరింపుచుఁ ♦ బరఁగుచుండ
మనుజుఁడై పుట్టి విద్య నా ♦ ర్జనవిధంబు
వదలినాఁ డన్న జీవచ్ఛ ♦ వం బతండు.

సీ. కాటుకలట్లు చీఁ ♦ కటు లజాండము నిండఁ
దూలించి మెఱయు ఖ ♦ ద్యోతమందు
రోదసీకుహరంబు ♦ మ్రోయ నుషస్సుల
నెలుఁగెత్తి పాడు ♦ కోకిలమునందు
కంటకంబులు చుట్టు ♦ కఱకాకు లుండిన
నవ్వుచుండు గులాబి ♦ పువ్వునందు
మాంసమిశ్రిత మలీ ♦ మసమైన శుక్తిని
దీపించు నాణిము ♦ త్తెమ్మునందు

తే. ప్రణయవతి సాధ్వి ప్రేమ హృ ♦ ద్వనజమందు
కట్టయిను లోహ మగు కవి ♦ కలమునందు
గోపబాలుని పిల్లన ♦ గ్రోవియందు
విద్య రసముతో నైక్యమై ♦ వెలయుచుండు.

తే. విద్య చదువుటచేతనే ♦ వెలయఁబోదు
విద్య యాచరణంబున ♦ వెలయఁగలదు
విద్య లోకార్థమేగాక ♦ విద్య తనను
తానెఱుంగుటకై యుండు ♦ తథ్యముగను.

తే. విద్య కుక్షికినై వెచ్చ ♦ పెట్టరాదు
కోటివిద్యలు కూటికై ♦ కూర్చువారు
రేగుపళ్ళకు మణుల న ♦ ర్పించువారి
వంటివారని తెలియఁగా ♦ వలయు నెపుడు

తే. విద్య పొట్టకూటికి లేక ♦ విక్రయించు
వాఁడు పండ్లచెట్టును గొట్టి ♦ వంటకట్టెఁ
జేసినట్టుల యగును ; స ♦ న్యాసికైన
విద్య భాగ్యంబు గూర్చు నే ♦ వేళకైన

తే. రాజు నాశ్రయించెడువాఁడు ♦ భోజనమున
కిన్ని యటుకులు దొరకక ♦ ఖిన్నుఁ డగుట
సంభవించును ; మా సర ♦ స్వతిని నాశ్ర
యించువాని కాబాధ రా ♦ దించుకైన

తే. ఎందఱో విద్య నేర్చి యం ♦ దందు భైక్ష్య
పాత్రహస్తులై యాచించి ♦ బాధపడుట
నరయుచుంటిమి. నిజ మట్టి ♦ పురుషులందు
గల దురభ్యాసములె దాని ♦ కారణంబు

ఉ. అంచితవిద్య నేర్చి యది ♦ యాచరణంబునఁ బెట్టి దాని జూ
పించనివాఁడు వ్యర్థుఁ డవి ♦ వేకి నిజంబుగ గ్రుడ్డివాని చే
నుంచిన దీపమట్టు లతఁ ♦ డుర్వి జనావళికెల్ల మేలు గా
వించును గాని వాని కొక ♦ వీసము లాభములేదు జూడఁగన్.

ఆ. అట్టివాని వయసు ♦ వ్యర్థంబు నర్థంబు
బెట్టినాఁడు గాని ♦ యెట్టి వస్తు
వైన కొననివాని ♦ యటు పోవు నను జ్ఞాన
మెఱిఁగి పండితుఁడు చ♦ రింపవలయు.

—✶—

# నవ్వు

రూఢమై శాంత తేజస్వి ♦ రూప మగుచు
సదయమై ప్రపుణ్యమయి ని ♦ ష్కపట మైన
నవ్వు మోమును మేము నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

ద్యోదిశను మేఘమాలలోఁ ♦ దోఁచునట్టి
మెఱపుకై వడి రత్నాల ♦ సరములందు
తళుకువలె చంద్రచంద్రికా ♦ ధవళపరిమ
ళంబులై యొప్పు పుష్ప చ ♦ యంబుపగిది
నవ్వు మోమును మేము నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

ఇద్ధ జీవితవార్ధి దా ♦ టించు నావ
ఆయు వను గాలిపడగను ♦ నాపు త్రాడు
కాలకన్యాలలామ ర ♦ త్నాలమాల
నతి ప్రణయకోప మేఘజం ♦ ఝూనిలంబు
వైరి వీరవచస్సర్ప ♦ గారుడంబు
విమల శాంతరసంబుపై ♦ వీచుగాలి
ప్రేమలత మనోవని పెట్టి ♦ పెంచుమాలి
వాంఛ యను చారుశుక్తికి ♦ స్వాతివాన
రాగ రోగాగ్ని నార్చు వ ♦ ర్షాగమంబు
సకల విభవార్థ కుసుమ వ ♦ సంత ఋతువు
మోక్షలక్ష్మికి పరువకు ♦ మోహలేఖ
ఉదిత విజ్ఞానశరధి కిం ♦ దూదయంబు

ప్రేమ నిండార నవ్వి న ♦ వ్వించు నవ్వు
నవ్వు మోమును మేము నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

నవ్వులేని మొగంబును, ♦ పువ్వులేని
వనము, నవయౌవనంబున ♦ వలపులేని
తరుణి, జ్ఞానంబులేని వి ♦ ద్యా విధాన
మట్లు శోభావిహీనమై ♦ యడఁగుచుండు
పాచి తీయనియిల్లునా ♦ తోఁచుచుండు.
నవ్వు మోమును మేము నా ♦ నంద దేవ
తగ నుపాసింతు మరసి సం ♦ తతము దెలిసి.

నవ్వు నాల్గువిధంబుల ♦ నష్ట మనుచు
నవ్వు మాయాప్రధాన ♦ మున్మాద మనుచు
నవ్వు నీచసూచక జనా ♦ నంద మనుచు
నుడివినను మాకు వానితో ♦ నుబుసు లేదు
తెగడినను మాకు వానితో ♦ తగవు లేదు
మాకు నిర్మల మగు నవ్వు ♦ మహితమైన
ప్రేమ మానందజనక జీ ♦ వితము వలయు
విషపునవ్వును మొదలంట ♦ వీడవలయు.

మనుజుఁ డేగిన, వాని న ♦ వ్వును విలాస
భాసురంబగు ప్రేమ మీ ♦ ప్రకృతియందు
మలసి చిత్రింపఁబడు ; వాని ♦ దలఁచువారి
కతని నవ్వు మొగంబు ప్ర ♦ త్యక్ష మగును
నతని నిష్కపటాకృతి ♦ యర్థ మగును.

నవ్వు మోమున ప్రేమను, నివ్వటిల్లు
జవ్వని మనోహరాంగి నీ • చాన నెపుడు
మఱవఁగాఁ గలవొక్కొ ? యే • మాయమారి
మందు దిన్న వియోగార్తిఁ • గుందుచున్న
సతులతో వేఁక్క నుదయించి • శాంతశీత
కాంతి నల్దెస లలమ ని • శ్చింతలీల
నవ్వు వెన్నెల లలర శూ • న్యమునఁ దోఁచు
చంద్రు నెన్నఁడు మఱవఁగా • సాధ్య మగునె
తామరస మిత్రనేత్ర సం • దర్శనాప్తి
నిండి నిండారుమోదంబు • నెగడుచుండి
నవ్వునట్టుల వికసించి • నైజకాంతి
వెలసినప్పుడు వీక్షించి • కలలనైన
మఱవనేర్తువె నీవు నీ • సరసిజమును ?
ఇట్టులే నవ్వు గూర్చి యూ • హించుకొనుము
ఇట్టులే నవ్వుకై యుపా • సించుకొనుము
నవ్వు మోమును మేము నా • నందదేవ
తగ నుపాసింతు మరసి సం • తతము దెలిసి.

—✤—

# భారతీ సమితి

తే. ప్రకృతితెరలోన దాఁగి తాఁ ♦ బాటపాడి
రంగమున వచ్చి తానె పా ♦ త్రగ నటించి
ప్రేక్షకుండయి చూచు తా ♦ విశ్వమూర్తి
భారతీసమితికి నాట ♦ పట్టు నగుత

ఉ. భారతికిన్ నిరంతర ము ♦ పాస్యము నైన తెలుంగుబాస శో
భారతి తేనెతేట లగు ♦ పల్కుల నామె నుతించుచోఁ నలం
కారమునై యెసంగు రస ♦ గౌరవపక్కి సువర్ణదీప్త నా
నారవణాలమాలగ త ♦ నర్చు నిజం బిటఁ జెప్పవచ్చినన్.

ఉ. ఏ వసుధన్ జనించితివొ ♦ ఎవ్వరికోడలవో గదమ్మ వి
ద్యావతి ! యాంధ్రభారతి ! య ♦ థార్థముగా మొనమొన్న నీవు గో
దావరి తీరమందున గ ♦ దా లభియించితి వాంధ్రజాతి గీ
తావళి పాడుచున్ లయకు ♦ నందెలు మ్రోయఁగ నాట్యమాడుచున్

ఉ. ప్రాక్తను వెట్టిదో తెలియ ♦ రాదు భవత్సహజస్వరూప సం
సక్తినిబట్టు కాంచినను ♦ సంస్కరణంబులఁ బొందియున్న నో
వ్యక్తిగఁ దోఁచు భారత మ ♦ హా మహితంబగు సత్ప్రబంధ మాం
ధ్రోక్తినిఁ బాడుచుండ విను ♦ చున్నది లోకము నేఁడు భారతీ.

మ. సహజంబైనది కొంత కృత్రిమమునై ♦ సంస్కారలభ్యంబునై
మహితంబైనది కొంత తెల్గుకవితా ♦ మార్గంబుఁ జర్చించి త
న్మహనీయస్థితి భారతీసమితి సం ♦ భావించి భాషించు లో
క హితార్థంబుగ దీని నీశ్వరుఁడు ని ♦ క్కం బర్ధి కాపాడుతన్.

# అక్షరము

1. ఎంతకాలంబు కన్నీళ్ళ ♦ నీ విధాన
కార్చి యెలుఁగెత్తి యేడ్చి నిన్ ♦ గాంచలేక
జీవములు పుత్తునో స్వామి ♦ చెప్పవేమి ?
ప్రాణములు నిల్పుదునొ స్వామి ♦ పలుకవేమి ? ॥౨౦॥

2. అహములు ప్రభాతములు సంధ్య ♦ లరుగుచుండె
యుగములు యుగాంతరము లిట్టు ♦ లెగిరిపోయె
కరకురాతిని బోలు నా ♦ కఠినమనసు
కరగకున్నది నీప్రేమ ♦ శరధిలోన
సమయకున్నది నీ కళా ♦ జ్వాలలందు
యేవిధంబున నినుఁ జూతు ? ♦ నేపథాన
నిన్నుఁ జేరుదు ? నాకింక ♦ తెన్ను గలదె ? ॥౨౦॥

3. విశ్వమానవలోకంబు ♦ వెదకినాఁడ
వెడలి రోదసీకుహరాలు ♦ వెదకినాఁడ
గగనవీధులు, చొరరాని ♦ కాననములు
గిరిదరీద్వార ఘోర దు ♦ ర్భరవిషణ్ణ
నిమ్నసోపానములఁ బడి ♦ నేలరాలి
లేచి యెగఁబ్రాకి ప్రాకి నిన్ ♦ జూచుకొఱకు
జతన మొనరించినాఁడ నా ♦ శక్తి కొలఁది
గాని నీజాడ సుంతయు ♦ గానఁబడదు
నీస్వరూపం బొకింతయు ♦ నెఱుకఁ బడదు
పలుక రెవ్వరు తెలిసిన ♦ వారు లేరు ! ॥౨౦॥

4. స్నిగ్ధ ధూళిధూసరతమో ♦ చ్ఛిన్నతప్త
పులినసీమలో సెలయేటి ♦ పొంతలందు

విరులు గురిసెడుచోటొ ? సుం ♦ దర శకుంత
ముల రుతంబులు మిన్నులు ♦ ముట్టుచోటొ ?
యెందు నున్నావొ నీనెల ♦ వెందుగలదొ ?
పలుకరెవ్వరు తెలిసిన ♦ వారు లేరు !... ॥అ॥

5. తుద మొదలు లేని నీరూపు ♦ దోచ కెన్ని
పాట్లు పడి గొంతుకెత్తి నిన్ ♦ బాడి, పాడి
యలచినాఁడను కంఠంబు ♦ చిరిగిపోయె
వెన్ను పూసలు సడలె ని ♦ ర్వి ణ్ణమైన
వీణతంత్రులు తెగిపోయె ♦ వ్రేళ్ళనుండి
కటికిరక్తంబు బొటబొటఁ ♦ గారఁజొచ్చె
ప్రాణములు సొమ్మసిల్లె నో ♦ స్వామి నీవు
గానగారావు నేను నిన్ ♦ గాంచకుండ
బ్రతుకఁజాలను నీ ప్రేమ ♦ పట్టలేను. ॥అ॥

6. ఏమిసేయుదు నుసురైన ♦ నెగిరిపోదు
అకట అపుడైన నాకట్టె ♦ నరయుకొఱకు
వత్తువో లేదొ వచ్చిన ♦ వత్తు వేమొ
నీ పదరజంబు సోకి నే ♦ నెప్పటివలె
లేచివచ్చెద సుమ్మి నిన్ ♦ జూచుకొఱకు ॥అ॥

7. ఒక్క కన్నీటిచుక్క కొ ♦ క్కొక్కముక్క
వ్రాసినాఁడను నీప్రేమ ♦ పట్టలేక
హృదయకుహరంబు చింపి వీ ♦ క్షించినాఁడ
నీవు నవ్వుచు కన్పించి ♦ నావు దేవ
ఇట్టు లుంరాలిపాకవి ♦ యెఱుక చెప్పె.

—✦—

# సందె

## ౧

తీగ తెగిపోయింది
  అయ్యయ్యో
తీగ తెగిపోయింది
  తంబురా
తీగ తెగిపోయింది
  అలాగె
రాగ మాగిపోయి
జోగిపోతుంది
  రసములో
సాగిపోతుంది.

## ౨

సందె పడిపోయింది.
  అంతట
అంద మేదో వచ్చింది
  ఇందులో
చందమా మున్నాఁడ
  ఈ రేయి
చందురుని తెగనాడు
పువ్వొక్క టుంది
  ఆ నవ్వె
అంద మిస్తుంది.

3

పడవ పోతూ ఉంది
అ యొడ్డు
గడచి పోతూ ఉంది
అ యేరు
పొడిచి వడి యెక్కింది
అందులో
నడుపువా రెవ్వరో
పాడుచున్నారు.
పాటలో
ఒడలు మరచారు.

४

అ మధువు గొని వచ్చి
అ లేమ
సామగానము చేసి
నవ్వుచు
ప్రేమపాఠము చెప్పి
పోవుచు
తిరిగి చూచింది
గుండెల్లో
రాయి విసిరింది.

౭౮

ఆ ప్రొద్దు వ్రాలింది
ఇంతలో
ఈ ప్రొద్దు పొడిచింది
మాటలో
ఆ ప్రభాతవధూటి
ఎలుగెత్తి
ఆ పొలతి పాడిన
ప్రేమ ప్రళయంబు
రుధిరంబు
కురిసె హృదయంబు.

౭౯

మచ్చ పడిపోయింది
నా గుండె
ఉత్సవము పోయింది
ఈ జన్మ
వచ్చి పోయిం దిట్లు
వలపులో
చచ్చిపోయెనా
అపుడైన
స్వేచ్ఛ కలిగెనా !

—✶—

# నాకింక మరణమేది?

నా విషాద కథావిధా ♦ నంబుఁ జెప్ప
లేను, వ్రాయగా లేను, నా ♦ తోనె యీ మ
హాగ్ని చల్లారవలయు ; కా ♦ స్థానుషంగ
మైన ధూమంబు శిఖి లీన ♦ మైన పగిది
మెఱసి మేఘాలతోఁ బోవు ♦ మెఱపులాగు ॥నా॥

మరణవేదనా దోదూయ ♦ మాన మాని
తంబు నగు దీని నెవ్వారు ♦ తలఁపఁగలరు
ఘోరమగు దీని నెవ్వారు ♦ కోరఁగలరు ॥నా॥

కాదు తెలిసికొనెడు కోర్కె ♦ గలదయేని
నా విషాద కథావిధానంబు ♦ నా కవోష్ణ
బాష్పావృతాక్షు లీ ♦ యుర్వి రాలి
వ్రాయుచున్నవి నా రుధి ♦ రంబుచేత
అరయుచున్నవి నా హృద ♦ యంబుచేత
చెప్పుచున్నవి వినుఁడు నా ♦ జిహ్వచేత
సాంధ్యరాగాలవలె మీరు ♦ చదువుకొనుఁడు
ఆ ప్రభాతాలవలె మీర ♦ లాచికొనుఁడు
ఎఱ్ఱకలువలవలె నెత్తి ♦ నెత్తుకొనుఁడు
దీపకళికలవలె నెదఁ ♦ దీసికొనుఁడు ।నా।

ఏడ్పుచే బద్ధమైన నా ♦ హృదయసీమ
క్రిక్కుచున్నది నెత్తు రా ♦ కంఠలుంఠ
నోగ్రయగు యజ్ఞపశువన ♦ నొప్పి యహహ
ప్రేతభూతంబు లవి ద్రావి ♦ భీతిరహిత
ప్రేమగీతాలు స్వేచ్ఛగా ♦ పేరుఁబెట్టి
పాడుచున్నవి యారతా ♦ భ్రములు సుధను
గురియుచున్నవి నాకింక ♦ మరణ మేది

# అల్లా ప్రభు

శా. శ్రీలీజాలిన మేటి వంచెఱిగి నే ♦ సేవింపగాబోను, నా
శ్రీలన్ గైకొనవెంచి కుంటినయి స ♦ ర్థింపంగ రాలేదు నీ
శ్రీ లావణ్య ప్రపుణ్య మార్గమున నా ♦ చిత్తంబు సంధిల్ల నే
వేళన్ గొల్చెద భక్తి పూర్ణమతినై ♦ విశ్వజ్ఞ అల్లాప్రభూ ! 1

మ. నిను జింతించి భజించి మ్రొక్కి మదిలో ♦ నిత్యంబు సేవించి నీ
వినుతిం జేసియు దానికిన్ ఫలముగా ♦ విశ్వజ్ఞ మోక్షంబు దె
మ్మని నే బేరము పెట్టలేను భవ ♦ దీయంబైన ధ్యానంబు నా
పనిగా జేసెద నూపిరింబలె స్వభా ♦ వం బొప్ప నల్లాప్రభూ! 2

మ. జలరాశిన్ విలసిల్లు వీచికలతో ♦ సఖ్యంబు గావించి పు
వ్వులతో నెయ్యము సల్పి తన్సుధలతో ♦ బొత్తైనభోవీథి జు
క్కలతో వియ్యములంది నీ ఘనఘనా ♦ కారంబు జింతింతు ని
ర్మల సౌభాగ్యసుధా ప్రవృష్టి గురియన్ ♦ రావయ్య అల్లాప్రభూ! 3

మ. జల మధ్యంబున లేచు బుద్బుదము లో ♦ జన్ బెద్దలై కొన్ని కొ
న్నిలవాకారములై తనర్చు పగిదిన్ ♦ నీ యందు రూపించు మ
ర్త్యులు నీచాధిక తారతమ్య భవసం ♦ దోహంబులన్ భ్రాంతులై
కలహింపన్ జనుచుందు రీ వని యెఱుం ♦ గన్‌లేక అల్లాప్రభూ ! 4

మ. కలుముల్ లేముల్ వచ్చుపోవునవి మే ♦ ఘవ్రాతముల్ మింటిపై
కలయం ప్రాకుచు నేగునట్లు సుఖదుః ♦ ఖ ప్రాప్తమప్రాప్తముల్
కలలంబోలెఁ దనర్చు గోరికలు వృ ♦ క్షచ్ఛాయలన్ బోలె మ
ర్త్యుల వెన్నాడు మహేంద్రజాలము జగం ♦ బూహింప నల్లాప్రభూ

మ. కలడో లేడో పరాత్పరుం డనెడు శం ♦ కల్ గొంద రధ్యాత్మవా
దులు తామే పరమాత్ము లందురు సదు ♦ ద్యోగంబునన్ గొంద రా
శల జేయంబగ లౌక్యరీతి మతి ని ♦ ష్టన్ గొల్చుచున్ గొందఱా
వలనిన్ గాంతురొ లేదొ నీదు నిజరూ ♦ పంబర్థి నల్లాప్రభూ ! 6

శా. పాపంబెన్నడు సేయలే దెఱుంగ కే ♦ పాపంబు గావించినన్
నాపై కోపము జూపబోక కరుణన్ ♦ రక్షింపవే కావవే
యాపద్బాంధవ దేవదేవ సదయా ♦ యవ్యాజ తేజోమయా
నీపై భారము మోపినాడ గృప పో ♦ నీకయ్య, అల్లాప్రభూ ! 7

మ. ధనహీనుండయి పుత్రదార గృహయు ♦ క్తంబైన సంసార దుః
ఖ నిధిన్ మునుగుచు తేలుచున్ నిను మదిన్ ♦ గాసంత నూహింపలే
కనయంబున్ మృగతృష్ణకై జనెడు దా ♦ హాసక్తునిన్ బోలె బో
వును మోహావిలచిత్తుడై చపలుడై ♦ మూర్ఖుండు నల్లాప్రభూ ! 8

మ. ధనముల్ ప్రాప్తములోన లేనియెడ సం ♦ తాపంబునన్ గుందినన్
ధనికున్ జేరి విధేయుండైనను ప్రయ ♦ త్నప్రక్రియా కౌశలం
బున నెన్నేవి యొనర్చినన్ దుదకు రా ♦ బోదొక్క వీసంబు నిన్
ననయంబున్ మదిగొల్చు వారికగు స ♦ ర్వార్థంబు లల్లాప్రభూ 19

మ. నిను తేజో లసితాంతరాత్మ వనుచున్ ♦ వీక్షింతునో లేక లో
క నికాయ ప్రణుతాఖిల ప్రజనుగా ♦ గాంక్షింతునో పుణ్య స
జ్జన దృగ్గోచరతత్వమూర్తి వనినే ♦ సాధింతునో భక్తి నే
మని పూజింతుం బరాపరాత్మవు మహా ♦ త్మా, దేవ, అల్లాప్రభూ !

మ. నినుం జింతింపంగ లేక పెక్కు సదసత్ ♦ నీ నా వివాదంబులన్
జను లంధఃపతితాత్ములై చెడుదు రా ♦ శా పాశముల్ జిక్కి దే
నిని వర్జించిన నీ వెఱుంగజడుదో ♦ నిత్యంబు నాయాస బా
సిన నీ తేజము చూడవచ్చు నెదుటన్ ♦ సిద్ధంబు నల్లాప్రభూ ! 11

మ. కడియన్నంబున కానజేసి ధనికా ♦ గారంబులన్ జేరి క
ట్టడి నిట్టూర్పుల బుచ్చి యాచకులు క ♦ ట్టా వేడినన్ వార లె
క్కడి భూతంబిది యంచు రోయుదురు జ ♦ క్కన్ నిన్ను నర్థించితే
యిడవా యన్నము లోకరక్షకుడ వీ ♦ వేగాన అల్లాప్రభూ! 12

శా. రాజుల్ ధూర్తులు దుష్టచిత్తులు మృషా ♦ ప్రాగల్భ్యమోర్తుల్ వృథా
వ్యాజస్తోత్ర పరాయణుల్ కుమతులా ♦ పాపాత్ములన్ జేర నే
యోజన్ జెల్లదు కోవిదప్రతతి యు ♦ ద్యోగించి నీ కర్థులై
యోజింపన్ నిఖిలార్థముల్ బడయ లే ♦ రో రాదొ అల్లాప్రభూ! 13

మ. శునకాకారులు దూషకుల్ విటనటుల్ ♦ శుద్ధాంత కాంతాళిపై
కనువేయన్ వెనుదీయనట్టి కుకవుల్ ♦ కాసంత సందున్న స
జ్జనులన్ మాడిచి పొట్ట నింపుకొను ల ♦ జ్జాహీనులన్ రాజు లో
జను బూజింతురు వారి జేర్పవల దీ ♦ జన్మాన నల్లాప్రభూ! 14

మ. ఘనకర్పూర పరాగరాశులను వే ♦ ట్కన్ దెచ్చి వారాశి బో
సిన రీతిన్ నవరత్న భాండమున గా ♦ సిన్ జొన్న గుగ్గిళ్ళు వం
డిన లీలన్ జనులెల్ల ప్రేమనొక దం ♦ డీ పాటిగాఁ జేసి భూ
వని తార్థంబుల వెచ్చ పెట్టెదరు నీ ♦ పై బెట్ట కల్లాప్రభూ ! 15

మ. తపనోష్టంబున నీళ్ళు కాగి యవి సం ♦ ధ్యన్ జల్లనైనట్టు లా
తపముల్ జేసి గడించు మోక్షమునని ♦ త్యం బౌట తథ్యంబు నీ
కృపచే గల్గిన మోక్షమే నిరుకు భ ♦ క్తిన్ నిన్ను సాధించి నీ
యుపవర్గంబును బొందువారి కగు ని ♦ త్యానంద మల్లాప్రభూ! 16

మ. సిరి పుణ్యంబునరాదు పాపమునకే ♦ సిద్ధించు డబ్బున్న వా
రరయన్ బంధులచే సతీసుతులచే ♦ నజ్ఞానిచే జ్ఞానిచే
కరమున్ నిందలపాలు జెందుచును దుః ♦ ఖప్రాయులై యుందు రీ
కొఱతేలా భవదర్థసేవసుధ మా ♦ కున్ గూర్చు మల్లాప్రభూ! 17

మ. మృగముల్ బకులు కీటకంబులు దినం ♦ బెచ్చోటనో క్షుత్తు పో
వ గడింపన్ నియమించి తీ విడవు దృ ♦ వ్యంబేరికిన్ దాఁచ నీ
వగ మర్త్యాళికె యేలబెట్టితివి జీ ♦ వభ్రాంతి గర్వించి నీ
సుగుణారాధన సేయ నోపదుగదా ♦ సర్వేశ అల్లాప్రభూ ! 18

మ. ఎలుకల్ చీమలు తేనెటిగ అట నా ♦ ర్జించున్ ధనంబట్టి వా
రలకున్ గౌరవమేల నిత్తురొ, తృణ ♦ ప్రాయుల్ గదా భాగ్యవం
తులు వారిన్ గొనియాడుచున్ బ్రతుకు నం ♦ ధుల్ నిన్ను వీక్షింపలే
రలఘు ప్రాభవు నిన్ను వేడనిడవే ♦ య్యైశ్వర్య మల్లాప్రభూ! 19

శా. నీవే విశ్వమయుండవైన దివిపై ♦ నీ రేజజాండంబుపై
ఆ వైకుంఠముపై వసింతు వన మి ♦ థ్యావాదమే గాద బెం
కే వృక్షాకృతినైన వేళ్ళ నది వీ ♦ క్షింపంగ రానేర న
ట్లీ వెందుఁన్ గనరావుసర్వము భవత్ ♦ దృశ్యంబు అల్లాప్రభూ 20

—✶—

# శ్రీమహమ్మద్ రసూల్ ౧

అతఁడె శ్రీ మహమ్మదు ముస్త ♦ ఫా - రసూలు
అతఁడె మానవోద్ధారకుఁ ♦ డతఁడె ప్రభువు
అతఁడె మార్గదర్శకుఁడు మ ♦ హా ప్రవక్త.
ఎవనికై లోకములు సృజి ♦ యింపఁ బడెనొ
యెవనికై జీవజాల మ ♦ ర్థించునొక్క
యెవనిలో విశ్వ మొకపూస ♦ యేనికాదొ
యెవనిలో గతాగతకాల ♦ మెఱుకఁ బడెనొ ।అతఁడె।

అదియె యోంకారుఁ డక్షరుఁ ♦ డవ్యయుండు
భవ్య దివ్యావతార ప్ర ♦ భా ప్రపూర్ణుఁ
డఖిల కల్యాణగుణమూర్తి ♦ యనుపమాన
శమదయా స్ఫూర్తి లోకైక ♦ చక్రవర్తి ।అతఁడె।

ప్రకృతిమేఘాల గర్జించి ♦ వార్ధివీచి
కల శిరంబును వంచి వె ♦ న్నెల బయళ్ళ
తేటతెల్లంబుగా వేని ♦ దెలిసికొనెనొ
చేరఁజాలనిపాతాళ ♦ సీమలందు
వెడలఁజాలని నక్షత్ర ♦ వీథులందు
తేట తెల్లంబుగా వేని ♦ తెలిసికొనెనొ ।అతఁడె।

కుసుమసౌరభములఁ దోఁగి ♦ కువలయముల
దాఁగి, రోదసీకుహరాల ♦ కేఁగి యేఁగి
అణువు మొదలు మహామహ ♦ దంతరముల
నిండి దీపించు నెవని బ్ర ♦ హ్మాండ కాంతి ।అతఁడె।

అరబు సైకతసీమల ♦ కరకురాల
బోలు కరుణావిహీనులఁ ♦ బొడమె నే ప్ర
భాకరుఁడు, దోషదూషిత ♦ భావకలిత
తమసు నశియింపఁజేసి వి ♦ స్తారకాంతి
జీవములఁ బోసె భక్త రా ♦ జీవములకు ।నతఁడె।

దారుణదురంతదుఃఖ వ ♦ ధావిధాన
సంక్షుభితరక్తసిక్త వి ♦ శ్వంభరాల
ప్రేమరససుధానిర్ఝరీ ♦ స్తోమ మచట
వెల్లువలుగాగఁ బాఱించి ♦ విమలభ్రాతృ
భావకేదారములు తృప్తిఁ ♦ బండి పారల
సిరుల కాణాచిజేసి ర ♦ క్షించె నెవరు
నిత్యకళ్యాణదాయియై ♦ నిలిచె నెవరు ।అతఁడె।

చదువులోపల తత్వంబు ♦ చదివె నెవరు
సత్యశాంతాలలో తేటు ♦ చాటె నెవరు
విమలశీలంబు ప్రజకు నే ♦ ర్పించె నెవరు
విగ్రహారాధనలు విడి ♦ పించె నెవరు ।అతఁడె।

ఆసవము వ్యభిచారంబు ♦ నణఁచె నెవరు
మహి దురాచారములు బరి ♦ మార్చె నెవరు
బానిసతనంబు మొదలంట ♦ బాపె నెవరు
సతులకెల్ల స్వాతంత్ర్య మొ ♦ సంగె నెవరు
ఈశ్వరుని యేకతను ప్రబో ♦ ధించె నెవరు
అతఁడె శ్రీ మహమ్మదు ముస్త ♦ ఫా రసూలు
అతఁడె మానవోద్ధారకుఁ ♦ డతఁడె ప్రభువు
అతఁడె మార్గదర్శకుఁడు మ ♦ హా ప్రవక్త.

# ముసద్దసె హాలీ

క. చాలునిరాశా ! నీ కర
వాలంబున మా మనోజ్ఞ ♦ వాంఛాలతికా
జాలంబుఁ ద్రుంపఁబోకు మ
దాలసవృత్తులు సదా ము ♦ దంబిడవు సుమీ. 1

శా. ఓ వాంఛాలలనా ! భవన్మహిమచే ♦ న్యుద్యత్ప్రభాకీర్తి మా
కీవీయంగదె మా మనోరథ చయం ♦ బిష్టార్థముం గూర్చి మా
భావంబందు నిరాశఁ బోఁదుడిచి సౌ ♦ భాగ్యంబులన్ బొందు వి
ద్యావిఖ్యాత వివేక తేజముల ని ♦ య్యంగావలె న్నిచ్చలున్, 2

ఉ. తెరవుల గాసిఁజెంది కడు ♦ దీనత హైన్యముచేతఁ జిక్కి దు
ష్కరవిపదబ్ధులన్బడి ♦ విషాదమునొంది పథశ్రమంబునన్
బిరబిరఁబోవు పాంథుఁడును ♦ భీతిని జెందక వాంఛ నిన్ను సం
స్మరణముఁజేసి ధైర్యమున ♦ సంమదవృత్తిఁ జరించు నిమ్మెయిన్.

చ. పొలమునుదున్ను వాఁడయిన ♦ ప్రొద్దును గాలముఁ గాలరీతులన్
జలముల వర్షధారలను ♦ జారు నదీనదనిర్ఝరావళిన్
దలఁపక నిన్ను నమ్మికొని ♦ దైవముపై బరువుంచి కర్షవృ
త్తుల నొనరించు, లేనియెడ ♦ దుర్ఘట మన్నము ; ధాన్యమబ్బునే

ఉ. జోగుల భోగవంతులను ♦ శుద్ధదరిద్రుల భాగ్యవంతులన్
సాగరగాములన్ ధరణి ♦ జానులఁ జేసి సికందరప్రభున్
బాగగు రాజరాజుగ నొ ♦ నర్చి కొలంబసుపుణ్యమూర్తి కెం
తేగతియై వినూత్న జగ ♦ మిచ్చుట నీ మహిమంబుఁ గాదొకో 4

---

♦ హాలీకవి ఉర్దూభాషలో వ్రాసిన కావ్యమున కనువాద సంగ్రహము

చ. చెడితిమి మేము మాహితుల ♦ చేష్టలు విభ్రమమన్న చీఁకటిన్
గడుకొనియుండె, నా కొలఁది ♦ గాక నసూయవధూటి సంఘమం
దిడుమల రక్తపాతముల ♦ నెన్నిటిఁజేయఁగ నోచియున్నదో
కడువడి నీ మహామహిమ ♦ గాంచి నటింపఁగఁ గంటిమింతకున్. 6

ఉ. ప్రస్తుతసంఘ మెంతయును ♦ ప్రాణవిహీన మహీజమై పదా
నిస్తుల సత్ప్రభాపటల ♦ నిర్మలకీర్తి వివర్ణమై యినుం
డస్తమయంబు నొందుగతి ♦ నంధతమోవృతమౌచునున్నఁ బ్రా
శస్త మతాభిమాన భవ ♦ శస్త్రవివాదము మాన దింతకున్. 7

సీ. ధనమార్జనముఁ జేసి ♦ తగులమొందుటకంటె
డంబుమీఱెడు గౌర ♦ వంబు మేలు
పరువొకింతయులేని ♦ బ్రతుకు గాంచుటకంటె
సన్యాసి యైపోవఁ ♦ జాలమేలు
మోహపాశంబుల ♦ మునిఁగి వీఁగుటకంటెఁ
బ్రాప్తలాభార్థ సం ♦ తృప్తి మేలు
ఒరుల మేలును దన ♦ శిరముపై నిడుకంటె
మరణించి దివిపైకి ♦ నరుగ మేలు

ఇట్టివారలు భువిలోన ♦ నెట్టులున్న
నొక్క చోట విధేయులై ♦ యుండఁబోరు
వారు పడియున్నవారల ♦ భావరవి క
రాళిపైనుండు, మృతజీవు ♦ లగుటకతన.

సీ. మతసంఘమునఁ గొంద ♦ అతి విషాదాత్ములు
కొందఱు సంతోష ♦ కోవిదులును
దౌర్జన్యమునఁ బాప ♦ మార్జింత్రు కొందఱు
సాధులై కొందఱు ♦ సాగుచుంద్రు.

అతి మహావిభ్రాంతు • లౌదురు కొందఱు
కొందఱు విజ్ఞాన • మందుచుంద్రు
ఈ ప్రమత్తులలోన • నెసఁగు కొందఱు. వారు
సౌలభ్యవిజ్ఞాన • సదయ మతులు

ఇట్టు లన్యోన్య భేదము • లీసడించి
యెందఱీ సంఘమును దృఢీ • కృతి యొనర్చి
యలరుచున్నారు నిర్భాగ్యు • లైన వారి
యందు సౌభాగ్యవంతులు • కొందఱుంద్రు. 9

ఉ. ఒక్కొక్క వేళ మర్త్యహృద•యోద్యమముల్ దెరలించి మార్చి పెం
పెక్క వినేశసంఘముల • నెన్నిటి రూపఱఁజేసి లేపి యొ
క్కొక్కెడ వాహినీతతుల • నూఁతగఁగైకొని కాచి నావలం
దెక్కి ప్రపంచరాజ్యముల • నేర్పడఁజేయుదు వైభవంబుగన్. 10

తే. కష్టములు కొంత తలసూపి • నిష్ఠురముల
వెత లధోగతి పట్టించె • విశ్వవాంఛ
లేప నల్దిశల్ దిలకించి • లీలతో నొ
కింత యభివృద్ధిగాంచెదు • చింతసేయ. 11

చ. కటకటయంచు మా స్థితికిఁ • గంటను నీరును బెట్టుచుండ హృ
త్పుటములు ప్రయ్యలౌనటులఁ • బొక్కఁగ నేటికి సంఘమొందు చీ
కటులు వెలార్చు భాస్కర వి • కాస నిభంబగుతేజ మియ్యెడన్
బటుతరకీర్తితో జగతిఁ • బర్వగనున్నదటంచుఁ దోఁచెడిన్ 12

మ. మన యిస్లామున ప్రేమలేదు మతస • మ్యగ్గౌరవాధిక్య మం
దున నుద్దేశములేదు రేఁబవలు నే • దో దోచకున్నాము కా
ని నిరాలంబులు గాగలేదు జుఁడి ని • ర్నిద్ర ప్రభావంబుతో
ఘన సంతాపము తారసిల్ల నొకలై • కార్చింతు మత్యంతమున్. 13

మ. మన మన్యోన్య వివాదసంకుల మహా ♦ మాయాతమోనంత భా
వనలన్ బొర్లెడివారమై చెడిన, నా ♦ బాలంబు నూహింపనో
పును వైరాబ్ధి తరంగభంగనిజ నై ♦ పుణ్యప్రభాజాల చే
తనులై నారమటంచుఁ గాననిదియున్ ♦ ద్వద్భాగ్యమూలంబగున్.

తే. నిజపరిజ్ఞానశూన్యులై ♦ నిందనీయ
విషయ విజ్ఞానబాహ్యులై ♦ వెలయు కొంద
ఱున్న మన కధోగతిగల్గె ♦ నన్నమాట
యుంప ఔఱుఁగుదు రాపద ♦ లొందుకతన. 15

చ. మతమననేమొ కర్మచయ ♦ మార్గములందు విధింపఁబడ్డ స
న్మతహిత బోధనాక్రమ వి ♦ నోదకథా విషయంబు లేమొ యే
గతిని జరింపఁగావలెనొ ♦ కానకపోయినఁ బూర్వులేగు ప
ద్ధతులను బూజసేయు మల ♦ దారులమీరక యాశ్రయించెడిన్.

తే. ఆత్మగౌరవాధిక్యంబు ♦ హానిపడిన
బుధసమారాధనము మాపఁ ♦ బూనలేదు
వారి నడవడి వీడిన ♦ వారి గౌర
వించి కలనాడు జ్ఞప్తియుం ♦ దుంచి రిపుడు 17

చ. తమ చరితంబు వంశము మ ♦ తంబు యశంబు జవంబుసాహస
ప్రమద విలాసలాలస వి ♦ భావిభవంబులుఁ గాంచి యొక్కచో
విమల మనోహరాకృతిని ♦ వేమఱు సంతస మందునందు నే
మమున విరహాసాగర ని ♦ మగ్నతఁజెందును బ్రస్తుతస్థితిన్. 18

తే. ఇట్టి లజ్జయు సంతోష ♦ మే తలంచి
చూడ గౌరవ సౌభాగ్య ♦ సూచకంబు
ఏలనన్నను మనపూర్వు ♦ లీ విధానఁ
జేసిరని తాను నా రీతిఁ ♦ జేయఁగలఁడు.

చ. గడచినదానికిన్ వగవ ♦ గాఁ బనిలేదని తృప్తచిత్తులై
చెడుగునడంచి సంఘమున ♦ సిద్ధవచో విహితానులాపులై
వడివడి వృద్ధిచేకుఱఁగ ♦ వచ్చెడురీతు లుపన్యసించి యే
గెడువర కేగి పూర్వ నిజ ♦ కీర్తిగడింపగఁ జూడఁగావలెన్. 20

సీ. జనులార ఘనులార ♦ మన కెట్టికష్టంబు
లలవడెనో చూడ ♦ వలయు మీరు
మన వెంటవచ్చిన ♦ మన తోడివారు స
వారులైఁజనిరి యె ♦ వ్వారు లేరు
సార్థవాహులు నిజ ♦ స్థానంబు జేరిరి
మనము త్రోవ మొదటఁ ♦ గునికినాము
ఇపుడేగఁజూచిన ♦ నెన్నాళ్ళకో సిర్గ
మస్థానమును జేర ♦ మనకుఁ గలదు

కాని గూర్చుండుకంటెను ♦ గడవమేలు
ధైర్యమతులకుఁ దోడ్పడు ♦ దైవమెపుడు
నీడఁబోయిన నెంతకు ♦ నోడరాదు
కలదు కాలంబు నభివృద్ధి ♦ గాంచుకొరకు. 21

ఉ. మొక్కను వేయువాఁడె ఫల ♦ మున్ భుజియించెడు రీతికార్యముల్
గ్రక్కున సేయువాఁడె తన ♦ రార నభీష్టఫలంబులందు రే
కొక్కెడ మందభావమునఁ ♦ గూరుచునున్నఁ జెడున్ శశంబు పెం
పెక్కిన కూర్మరాజునకు ♦ బేలతనంబున నోడు కైవడిన్. 22

క. శ్రమయే ఫలదాయకమగు
శ్రమయే భగవద్దయా ప్ర ♦ సారంబొసఁగున్
శ్రమగౌరవ మిడు గౌరవ
మమరఁ గులంబునకు మనకు ♦ నతిశయ మదియే. 23

తే. పాటుపడకున్న మన పూర్వ ♦ ప్రజలు నేడు
కలిత విద్యాప్రసూన సు ♦ గంధగరిమ
వెలువడదు శేముష్షికుల ♦ విలువ లరయు
నింతయేటికి భగవంతుఁ ♦ డెఱుఁగలేడు. 24

తే. ఐహికాముష్మికంబుల ♦ కరయుగా ప్ర
యత్నమే ముఖ్యకారణ ♦ మగునుగాన
నిహము వీడినఁ బరమైన ♦ నెఱుగుకొఱకు
యత్నములు సేయుఁదగు మర్త్యుఁ ♦ డైనవాఁడు. 25

చ. నిముషము కష్టమున్ బడరు ♦ నిర్భయులై భయముండుచోటికిన్
ప్రమదముతోడఁ బోఁజనరు ♦ వచ్చిన దుర్యశనూర్పి వేయనే
శ్రమపడలేరు లజ్జను శి ♦ రంబునఁ దాల్చి చరింత్రుగాని సా
జములగు మంచిమార్గముల ♦ చర్చలొకింతయుఁ జేయలేరొగిన్.

ఉ. పూర్వులు దేశభక్తులును ♦ బుణ్య యశోవిభవాభిలాషులై
సర్వము జేసిపెట్ట మన ♦ సంఘమునందు విలాసదీధితుల్
పర్వఁ బ్రపంచవన్యమున ♦ బంధురకీర్తి సుమాళి పూయఁగా
నిర్వహణంబొనర్ప మన ♦ నేర్పులు చాలమిరాలఁజూచెడిన్. 27

కం. ఇంతయు సుఖమును మది వి
శ్రాంతియుఁ గోర కనుదినము ♦ శ్రమపడి సంఘం
బెంతయు వృద్ధికిఁ దెచ్చి ది
గంత మహాకీర్తి గాంచి ♦ గడచిరి యార్యుల్. 28

సీ. సరిలేని సంఘ సం ♦ స్కార పద్ధతులందు
సాహసౌదార్యంబు ♦ సలిపి సలిపి
మతసదాచార ప ♦ ద్ధతులందుఁ దన మనః
ప్రాణముల్ వెచ్చింప ♦ వలసి వలసి

హితవచః ప్రకట సం ♦ గతులందుఁ దమమేను
ప్రజలకై యర్పించి ♦ ప్రబలి ప్రబలి
దేశోపకార సం ♦ దేశంబు లలరించు
బుద్ధులు జనులకుఁ ♦ బోసి పోసి

తాము చచ్చినఁ బ్రజలను ♦ నోముకొఱకుఁ
బాటుపడినారు రేబవల్ ♦ పరమదయను
అట్లు జీవింప వారి స ♦ మిద్ధవరము
ఇట్లు మరణింప వారి ♦ సమిద్ధదివము. 29

చ. ఎవరు విపత్తులన్ శ్రమ వ ♦ హింతురొ వారెయశంబుఁ గాంతు రీ
యవనిని గష్టముల్ పడక ♦ యాత్మహితంబగు గౌరవంబు వై
భవము ధరాధిపత్యము ప్ర ♦ పంచసుఖంబులు రావు; వృక్షముల్
నవనవలాడి చిన్నవయి ♦ నన్ గడ పెద్దవియై ఫలించెడున్. 30

మ. ధర నేస్థానమునందుఁ గీర్తిగలదో ♦ దైన్యంబు బోనాడి సు
స్థిర సంఘం బభివృద్ధిచేయఁగల యా ♦ ధిక్యంబు లెందున్నవో
భరమై క్షీణతఁగాంచు సంఘమును లే ♦ వంజేయు దోశ్శక్తి యే
పరశక్తిం గలదో వృథావిడిచి సం ♦ బావించుచున్నా మొగిన్. 31

తే. చదువు చాలదు జనులార ♦ ముదముగనుట
కింక రోదసీ కుహరమం ♦ దంకురించు
వివిధవిద్యా ప్రపంచంబు ♦ లవని నెఱుఁగు
కొఱకు యత్నింపవలె మేలు ♦ కొఱకు మనకు. 32

సీ. మనయందు యోజింప ♦ మహిత సౌలభ్యమౌ
కొన్ని విశేషంబు ♦ లున్నవింక
మన మెఱుంగము గాని ♦ మరణించులోపలఁ
గాంచకుండిన మట్టిఁ ♦ గలియు నవియు

నీ మహామాణిక్య ♦ మీశ్వరేచ్ఛాదత్త
మై పరికాశించుఁ ♦ బ్రత్యక్షలీల
భ్రాంత చిత్తంబునఁ ♦ బ్రాల్మాలి దానిని
బోఁగొట్టవలవదు ♦ పొగలవలదు

ఎచట మాంద్యంబు నజ్ఞాన ♦ మెచటఁ గలదొ
యెవరు దౌర్జన్యమున భాగ ♦ మిడనివారొ
యట్టి హీనులు మనయందుఁ ♦ బుట్టిరిపుడు
గాన వారింపవాఖ్యల్ల ♦ మూనవలయు. 33

తే. ఎవరు విద్యాధికారమం ♦ దిద్ధశక్తి
పూని యాచం దతారక ♦ మైనకీర్తి
తో విజయలక్ష్మితోఁ దులఁ ♦ దూగిఁనారొ
వారి పుత్త్రికు లిపుడు ఫ ♦ కీర్తులైరి. 34

తె. జగతి విపరీత కార్యముల్ ♦ జరిపి మఱియు
భువిని దివిఁ జేసి దివిని నీ ♦ భువినిజేయఁ
జాలిన మహానుభావుల ♦ సహజరక్త
ధార నేటికి మనయుంముఁ ♦ బారుచుండె. 35

మ. అధికారంబది యస్తమించెఁ గల భా ♦ గ్యబెల్ల నున్నాయె నీ
పృధివీ రాజ్యము పూజ్యమాయె నిఁక సం ♦ ప్రీతిన్ మదోద్రిక్త దో
ర్వ్యధి వద్గౌరవముల్ నశించె మఱియున్ ♦ విద్యాప్రగల్భత్వ మీ
బుధవంశంబు యశంబు నిల్పుటకునై ♦ బోసై ప్రదీపించెడిన్.

మ. యవనారబ్బిక కాజిరోమకములా ♦ ర్యావర్తదేశంబు లీ
యవనీ భాగమునన్ వివేకజను లత్యం ♦ తంబు విద్యావధూ
నవలావణ్యకలాకలాపముల స ♦ న్మానించుటన్ గాదె యా
జవసత్వంబులు శేముషీకలితమై ♦ చర్చింపఁగానయ్యెడిన్. 37

శా. ఈ విద్యారమణీయరత్నము సదా ♦ యింపారుసొంపారు సం
భావింపంబడుఁగాని మూల్యమునుదె ♦ ల్పం దాని దర్శింపగా
నేవారున్ మదిఁబూన రింతకు మను ♦ ష్యేచ్ఛా మహాశక్తియై
యావిర్భావమునొందె దైవమువలెన్ ♦ నైకస్వరూపంబులన్. 38

చ. కులగిరులన్ బగిల్చి ఖగ ♦ కుంజరపంక్తిని బట్టియిచ్చి యీ
జలధి నిగిర్చి యంధతమ ♦ సంబును మాపి ధరిత్రిఁ ద్రిప్పి రి
క్కలగతులన్ వృథాగతుల ♦ గా నొనరించి ప్రపంచవాహినుల్
పలనునొనర్చు కార్యములు ♦ వారక యావిరిచేతఁ జేసి బొ
మ్మల రచియించిమానవుల ♦ మాట్కినటింపఁగఁజేసెదీవకా. 39

చ. చెడుశిల లింధనంబులుగఁ ♦ జేయుచు నావలఁ నేలపైని పో
నడుపుచు మూసలందున ని ♦ నాదములన్ రచియించిభూమిలోఁ
గడుకొనులోహముల్ వెలికిఁ ♦ గ్రక్కఁగఁజేసితటిల్లతాళితోఁ
గడుపుచు తంతివార్త తృటి ♦ కాలమునన్ గగనాంతరాళముల్
వడి జను పక్షనిర్దళిత ♦ వాహనముల్ రచియించె దెంతయున్. 40

సీ. నాగరికత్వంబు ♦ నాటి సింగారించి
వెలయించుచున్నదీ ♦ విద్యేసుమ్ము
అభివృద్ధి యను నేన ♦ కధికారియై చాల
వెలయించుచున్నదీ ♦ విద్యేసుమ్ము
కర్మకారుల కుప ♦ కరణంబు లలరించి
వెలయించుచున్నదీ ♦ విద్యేసుమ్ము
యోధవీరులకు నా ♦ యుధమై ప్రపంచాన
వెలయించుచున్నదీ ♦ విద్యేసుమ్ము

ధైర్యసాహసవంతుల ♦ ధరణిమాపి
వెలయఁజేయించుచున్నదీ ♦ విద్యేసుమ్ము

సింహములనైనఁ గుంజేళ్ళ ◆ఁ జేసి విడిచి
వెలయఁజేయించుచున్నదీ ◆ విద్యసుమ్ము. 41

చ. యవనుల నాంధ్రరాజులల ◆ ◆ యంబొనరించెను రాక్షసాలి పె
న్గవము నడంచి యుగ్రభయ ◆ సత్వమహాహవవీరపంక్తి నీ
భువి బలిపెట్టెఁ బౌరుషము ◆ బూడిదపాలొనరించె నంచిత
ప్రవిమలసత్కలాకలిత ◆ భావములన్ వెలయించె నింతకున్. 42

తే. కుంజరంబును దోమఁచేఁ ◆ గూల్పఁగల్గు
బండ్ల నోడల నోడలు ◆ బండ్ల జేయుఁ
గోటగోడలు గోటితో ◆ మీటఁజేయుఁ
గవచములనైన ముక్కలు ◆ గాఁగఁజేయు. 43

తే. విలసితంబగు విద్యావి ◆ వేకమొకటి
ధరణి సహకారిమార్గప్ర ◆ దర్శకంబు
నెవరు చేతురొ వారు మా ◆ నవులకంటె
శ్రేష్ఠతములగువారు ను ◆ త్కృష్టులగుట. 44

ఆ. ధరణి దాగియున్న ◆ ధననిధుల్ తెరలించి
విజయలక్ష్మినిచ్చి ◆ వెలయఁజేసి
గాలి నగ్ని జలము ◆ గాలంబు స్వాధీన
పఱచుఁజూవె విద్య ◆ పరమకృపను. 45

చ. ఇడుమలనైన ధైర్యము నొ ◆ కింతయు వీడరు దైన్యమైన నీ
పుడమి యశంబుతో నుదర ◆ పోషణ సేతురు విద్యయున్నచో
వెడలెద రెంతదవ్వయిన ◆ వేదురుపాటును లేక యిట్టిలే
పొడమును విన్నఁజూచినను ◆ బూర్వులజీవితముల్ తలంచినన్.

ఉ. అంచితమైనవిద్య గల ♦ దంచు వచించినమాత్రనే ప్రపం
చించి ప్రయాణమైజను వి ♦ చిత్రగుహాంతర మార్గగాములై
రెంచగనెల్లచోట్ల నిటు ♦ లేగెడు బాలురె గానవత్తు రూ
హించ మహమ్మదీయ నృపు ♦ లేలెడుకాలమునందు వింతగాన్. 47

తే. ధర నజామియ్యనూరియ్య ♦ దనరిరొకట
నాసమియ్యానఫీసియ్య ♦ షాహెబియ్య
సారెరియ్య యజీజియ్య ♦ వాసిగాంచె
నెరపేముస్తాన్సరీయ్యజీ ♦ నియ్యయనెడు
ఘనరవాహియ్య యిజ్జీయ్య ♦ యనెడు సర్వ
విధకళాశాల లమరును ♦ విద్యకొఱకు
నట హిజాజీబఖుర్ధిఖ ♦ ప్చాఖియనెడు
సంఘములవార లానాడు ♦ చదువుచండ్రు. 48

ఉ. ధైర్యమువీడబోక యల ♦ దైవముపై భరముంచి నాత్మపుం
గార్య మొనర్చుచేయెరువు ♦ గా గనుశక్తిని వీడి పుణ్య చా
తుర్యముతో మనోరథము ♦ దోలుచు నిట్టటు లూగనీక గాం
భీర్యముపూని సుస్థిర వి ♦ వేకముతోఁ జనఁగావలెన్ జుఁడీ. 49

తే. గడవఁదలచినఁ గష్టముల్ ♦ గడవఁగలరు
చేయఁగలిగిన కార్యముల్ ♦ చేయఁగలరు
ధైర్యకరములఁ బ్రాప్తంబు ♦ దాగియుండు
ధైర్యమతులకుఁ దోడ్పడు ♦ దైవమెపుడు 50

తే. దాసులకు దాస్యవృత్తియు ♦ ధరణిపతుల
కరయ బరిపాలనా విధుల్ ♦ గఱపుచుండు
హృదయ వైరాకరంబుల ♦ నెల్లఁజెఱుపుఁ
జిన్న పెద్దల సమదృష్టి ♦ నెన్నఁజేయు. 51

క. నిరుపేదల మొరవినుచును
శరణార్థులఁ గాచెనిదియు ♦ స్వాతంత్ర్యములన్
బరపునిజేచ్ఛను నెసగుచుఁ
జెరనిడు విడిపించునిదియె ♦ చిత్రాకృతితోన్. 52

తే. వర్తకము వ్యవసాయంబు ♦ ప్రాభవంబు
దినదినాభివృద్ధినిగాంచె ♦ దీనిచేత
గర్మవిద్య లతివ్యతి ♦ కరముగాఁగ
ధరణివెలయించె సంఘ సం ♦ స్కరణములను. 53

చ. మతములయందు సంతత స ♦ మంజసమంజుల సాభిలాషమున్
హిత మభిమాన మాదర మ ♦ హీనకళావిభవంబు లిచ్చి సం
తతముప్రజానురాగమును ♦ దారముగ్రుచ్చిన పూసలోయనన్.
హితమునుజూపు నందఱి క ♦ హీనవిలాసము లీయఁజాలెడిన్. 54

ఉ. ఎచ్చటవిద్య లేదొ యట ♦ హీనతయున్ విపరీత చేష్టలున్
ముచ్చటలాఱుమూర్ఖతలు ♦ ముద్దులుగుల్కని గట్టిమాటలున్
హెచ్చగు నపప్రతిష్ఠలు న ♦ నేకములైన పశుత్వ బుద్ధులున్
బెచ్చుగఁబుట్టుఁగాన నది ♦ వీడ్కొలుపందగు మర్త్యకోటికిన్. 55

ఆ. ఎచట విద్య లేదొ ♦ యచ టరాజకమగుఁ
గిర్తులుడుగు దుష్ట ♦ వర్తనంబు
పెరుగు సంప్రదాయ ♦ విభవముల్ జోకార్చు
చెడుగు వచ్చు బమ్మ ♦ చెవుడుపగిది. 56

తే. పనులు సాగవు వ్యాపార ♦ మును నయించు
ధనము నశియించు కొంపల ♦ తగులు బడును
దినదిన క్షీణతలుపట్టు ♦ దీనదశలు
వచ్చు రోగంబు లలమును ♦ ప్రజలకంత. 57

తే. శాస్త్రచర్చ చికిత్సా ప్ర • శస్త్రరీతు
లస్తమించును నాగరి • కాది పద్ధ
తులు నశించు నౌన్నత్యంబు • తొలగిపోవు
కలిత బయలక్ష్మిగతి లేక • కానఁబట్టు. 58

ఉ. బట్టలు పచ్చడంబులును • బంధురదీపిక లాటవస్తువుల్
బుట్టలు పెట్టె లన్ వివిధ • భూషణముల్ నిరతంబు వాడుచున్
గట్టుచు నుండు వస్తువులు • కాగితముల్ కలముల్ సమస్తమి
ప్పట్టునఁ జూడ స్వాంతమగు • వస్తువుగానఁగ రాదు గీములన్. 59

ఉ. ఆపదలయ్యె విద్యలు మ • హాంబుధి ముంచుటచేతఁగాదె యా
రూపమువచ్చె దేశమున • రోత జనించెను దీనికింకనే
కావును గానరాదు మన • కాపురమందు జనించెముప్పు హా
దీపము గాలిలోఁ బడియెఁ • దీరని చెట్ట మఱేమి పుట్టునో. 60

తే. కాలపురుషుఁడు మతము సం • ఘంబులరసి
యోగ్యతా యోగ్యతలఁ బట్టి • యొసఁగుచుండె
భూరి రణభేరి కేతువు • క్రూర సాధ
నాధికారంబు గౌరవ • స్వాభిగమము. 61

దండకము - ఓ దేవ మాంపాహి పాహీ యిలాహీ రసూలిల్ల మా దైన్యముల్ బాపిరక్షింపుమా యార్తరక్షా కటాక్షించి మాక్షేమముల్ గూర్చి నిక్షేపముల్ చేర్చి సాక్షాన్మహామోక్షలక్ష్మిన్ ప్రసాదించి కాపాడుమో దేవదేవా నమస్తే నమస్తే నమః.

—✶—

# పా రా ణి

గీ. ముసుఁగు దీయవు రావు నా ♦ ముందు కబల
ఏల యడియాసపెట్టె దీ ♦ లీల బాల
నే నొనర్చిన యపరాధ ♦ మేమొ చెప్పుమ
హృదయమును జింపిపెట్టెద ♦ నిదిగొ గొనుము
వేడి క్రొన్నెత్తు రదిగొ నీ ♦ ప్రేమగీత
మును బఠించుచు బుసబుస ♦ పొంగి పారలి
పోవుచున్నది నీ పాద ♦ ములను దాఁక
వేరె పారాణి నీవిఁక ♦ బెట్టుకొనకు.



# శ్రీ రాజా రామ మోహన రాయ్

ఉ. భారతభూమియే పరమ ♦ పావనమూర్తి మహానుభావుఁ డిం
పార సముద్ధరించెఁ దన ♦ బ్రహ్మసమాజము పేర నమ్మహా
వీరుని రామమోహనుని ♦ వేడెదు నీ శత వార్షికోత్సవ
శ్రీ రమణీయ వైభవ మ ♦ శేషశుభంబుల గూర్చు గావుతన్.

ఉ. భాసుర బ్రహ్మగాన మొగి ♦ భారతభూమి ప్రతిధ్వనించి వి
న్యాస మొనర్చినప్పుడె య ♦ ఘౌఘ భయంబులు వాసె నీశ్వరో
పాసనతోడి మానవులు ♦ భ్రాతలు ప్రేమమయౌ యాత్మయన్న వి
శ్వాసముగల్గె నెంతయు ను ♦ పస్న మయం బది దేశలక్ష్మికిన్.

ఉ. ఈశ్వరు డొక్కఁడే ప్రతిమ ♦ లేటికి గొల్చెదరంచు ధీరుడై
శాశ్వతబోధ యా యుపని ♦ షత్తులనుండియుఁ దీసి వక్తయై
విశ్వమునందు జాటె దన ♦ ప్రేమయు సోదరభావమున్ మహా
శశ్వదుదార బ్రహ్మమత ♦ సారముగా శిరసావహింపగన్.

ఉ. క్రూరపు సాగుమానమును ♦ గూల్చుటకై కులిశంబు గొన్న జం
భారివిధంబునన్ వెడలె ♦ నాంగ్లము తత్ప్రభుకోటిబట్టి సం
స్కార మొనర్చె సంఘమును ♦ సాంతముగా మన రామమోహనుం
డారయ భారతావని మ ♦ హాత్ముని నేమఱనోప దెన్నడున్.

సీ. సహగమనమె యింక ♦ సాగుచుండిన నేడు
తరుణులు సగపాలు ♦ తరిగి యుందురు
భ్రాతృభావమె ప్రజల్ ♦ పడయకుండిన నేడు
మత కలహంబుల ♦ మడిసి యుంద్రు

---

★ శతవార్షికోత్సవ సందర్భమున వ్రాసినపద్యములు.

విధవావివాహముల్ ♦ వెలయకుండిన నేడు
భ్రూణహత్యల సతుల్ ♦ పొలిసి యుందు
సంఘసంస్కారంబె ♦ సలుపకుండిన నేడు
స్త్రీలజాతులు రూపు ♦ మాసి యుండ్రు

ఇట్టి వెన్నిటి నెలకొల్పి ♦ యెసకమెసగె
మహిత బ్రహ్మసమాజ స ♦ న్మతము ధాత్రి
నీ శతాబ్దోత్సవమున ని ♦ న్నెంచవలదె
రాజరామమోహనరాయ ♦ ప్రణుతగేయ !

ఉ. ధర్మము చెప్పనున్న తలి ♦ దండ్రుల నైనను లెక్క సేయ డే
కర్మలనైన శాంతమును ♦ గౌరవమున్ విడనాడబోవ డా
నిర్మలచిత్తు నీశ్వరు న ♦ నింద్య చరిత్రునిగా దలంచు నే
మర్మములేని రాజు జన ♦ మాత్రుడె మోహను డీజగంబునన్.

మ. అవతారాలు పదే పురాణముల వ్రా ♦ యంబోలు లెక్కింపగా
అవతారాలు పదొండుచూడ మన రా ♦ యారాజరాంమోహనుం
డవతారంబె నిజంబు బ్రహ్మమత వి ♦ న్యాసంబునన్ లోకసం
స్తవ సౌందర్య సుధర్మ శాంతములు సం ♦ స్థాపించె దేశంబునన్.

చ. క్రమముగ వచ్చి రాయుగ యు ♦ గంబున రాములు ధర్మ రక్షణా
ర్థము ; కృతమందు నా పరశు ♦ రాముడు త్రేతను రామచంద్రుడ
క్రమగతి ద్వాపరాన బల ♦ రాముడు ; నీ కలియందు బుట్టె ని
క్కముగను రామమోహను డ ♦ ఘప్రకరంబుల రూపుమాపగన్.

ఉ. దేశము నుద్ధరింప నిజ ♦ దేశము వాసి విదేశ మేగి సం
దేశము లచ్చటం దెలిపి ♦ దీనత ప్రాణము వాసినట్టి నీ
తో శిబి యేసు హాతిమును ♦ తొంటి బలిప్రభు లీడువత్తురే
కాశికి కాకినాడకును ♦ గల్గెడు నంతరమున్న దారయన్.

చ. సకలము నీదు సంస్కరణ • సారము గావున రామమోహనా !
శకమున కీవు నాథుడవు • సత్యము నీయదె భిక్ష భారత
ప్రకట మహామహీతలము • భాసురమై యలరార విద్యచే
సుకర వివేకసంపదల • సూడిదగా నిడినాడ వన్నిటన్.

గీ. మరలె నూఱేండ్లు బ్రహ్మ స • మాజలతకు
గాలవాహిని పడిపోక • క్రమము విడక
క్రొత్త పూవులు పూసి ది • క్కులకుఁ బ్రాకి
వెలయుచున్నది దేవతా • విభవ మొంది.

ఉ. ఒక్కొకక్క సన్మతంబు ధర • నొక్కొక సంస్కరణంబు జేసి పెం
పెక్కెను గాని బ్రహ్మమత • మెంతయు సారముగాగ నొప్పె. నీ
ఫక్కి మతంబె మున్ భరత • వర్షమునన్ జనియించియున్న నీ
చిక్కులు భ్రాతృ వైరములు • చేకురునే మన రాజ్యమూడునే.



# కథకుఁడు

క. దేవుఁడు నెల్లెడఁగలఁడది
భూవలయమునందు జీవ ♦ బుద్ధి దిరుగు నీ
కేవలము తెలిసికొనినచొ
నావల నద్వైతసిద్ధి ♦ కది యేకమగున్. 1

సీ. ఈకక్షపాలలో ♦ నీకావి వలువలో
దేవుని వెదకినఁ ♦ దెలియలేదు
ఈజపమాలలో ♦ నీజడా దేశాల
శోధించి యాత్మను ♦ చూడలేదు
ఈగిరిదుర్గాల ♦ నీచిమ్మచీఁకట్ల
నీశ్వరరూపు ద ♦ ర్శించలేదు
ఈయుపవాసాల ♦ నీ యుపన్యాసాల
మోక్షసామ్రాజ్యంబు ♦ పొందలేదు

గీ. ఆఱుమూఁడైన మూఁడాఱు ♦ లైన దాని
నేకముగఁజేసి మదిని ని ♦ ర్జించలేదు
శూన్యములవంక నెలుగెత్తి ♦ చూచి యేడ్చి
మ్రొక్కి ఫలసిద్ధిలేక వా ♦ పోయినాము.

సీ. ఈ స్వర్ణశృంగార ♦ మీ శాటి వలెవాటు
వేసినవాఁడె నా ♦ భిక్షకుండు
కక్షపాలను కన ♦ కంబొ దినారాల
తండులంబులొ తిని ♦ యుండు నితఁడు

ఇతని పేరాసకు ♦ నే మేఱయును లేదు
నే నీతనికిఁ బ్రియ ♦ మైనవాఁడ
నా భక్తి పెద్దది ♦ నాఱేఁడు కొద్దివాఁ
డైనను నా ముక్తి ♦ యలతి కాదు

తే. ప్రేమ మూర్తీభవించిన ♦ విపణివీధు
లందు రాగరసంబు చె ♦ న్నారుదాని
వెలకు నెవరేని కొనెడువా ♦ రలునుఁ గలరె
ప్రేమ బాహ్యంబటంచు భా ♦ వింప వలదు. 3

శా. నీవే బ్రహ్మవు గాఁదలంచినను నీ ♦ నిర్నిద్ర తేజంబులో
దేవుం డుండెనటంచుఁ జూడనిదె నీ ♦ దివ్యత్వ మేరూపు రాఁ
బోవంబోదు రహస్యముల్ తెలియకీ ♦ వున్ వామమార్గంబులో
నెవో కల్లలు బొల్లు లల్లవలదో ♦ యీకూటి కాకూటికిన్. 4

ఉ. జీవము భారమయ్యె మఱి ♦ సీధువుఁ ద్రావిన వానిభంగి ని
ర్జీవ సమాధిలో మతిని ♦ జీర్ణముఁజేసి నిజానురాగ సం
భావిత వృత్తి కాలమునుఁ ♦ బాడొనరించుట యేమి లాభమా
దేవుఁడు రాఁడు మేమచటి ♦ దివ్యులఁ జూడము నుత్తదంతయున్.

ఉ. పూతలువెట్టి మట్టి నొక ♦ బొమ్మనుజేసి నిపాత వస్తు సం
జాత మలంకరించి తెర ♦ చాటున దాఁగుడుమూఁతలాడు స
త్యేతరమైన వస్తు వొక ♦ యింతయు దాఁచఁగలేవు నీ మహా
ఖ్యాతికి నెగ్గుకాదొ భవ ♦ దాత్మ కెదో గుడి కట్టరాదొకో. 6

ఉ. ఆ నెలలేని నింగి కన ♦ కాదులశాటి నిశావధూటికిన్
గానుకఁబెట్టి రిక్కలను ♦ కాంచనతారకహార పంక్తు లా
జాను విలంబకేశముల జా ♦ రఁగఁ గుంకుమబొట్టు పెట్టిన
ట్టానఁగ వేఁగుచుక్క నుద ♦ యాద్రిని బంపెఁ దపస్సు సేయగన్.

ఉ. వేటలు కోటలెక్కి తన ♦ విశ్రుతగీతము పాడిపాడి క
ర్ణాటకుహూసముజ్జ్వల ప ♦ రంపరఁబొల్చెడు నీపికంబు యీ
బాట రసాలదాస్యమును ♦ బాయనికారణ మేమొ కుక్షి యా
రాటము పెట్టెనో మతి మ ♦ రల్చి తపస్సు తరింపజూచెనో. 8

చ. చితి నొక కట్టెకాలుచును ♦ చేట్పడుచుండుటఁజూచి నీవు నీ
మతి దలపోయు భావముల ♦ మాటున నీ నిజమున్న దన్న నా
కుతుకము భావదాస్యముల ♦ కున్ దెగి స్వస్తిని చెప్పుచున్న దీ
ప్రతిమలు మృత్తికాభ సము ♦ పాస్యములేగద తత్త్వవేత్తకున్. 9

ఉ. మోసము సేయుబుద్ధి తల ♦ పోయుచు జీవితమందు పెద్ద వి
శ్వాసలుబుచ్చి యీగతి స్మ ♦ శానముజేరినఁ గాని పూర్వ వి
శ్వాసము మాఱలేదు జడ ♦ భావముమన్నగు దాఁకనుండు రా
కాసి తమస్సు ప్రమాన్పడినఁ ♦ గాని ముముక్షున కర్థమున్నదే. 10

క. ప్రతిబంధకంబులన్నియు
బ్రతుకునకే దీనియందు ♦ ప్రత్యహమును నీ
మతియేర్చు విచారంబులు
సతతముఁ గన్నీళ్ళుఁ గార్చు ♦ సంగతి నెసఁగున్. 11

గీ. ఈశ్వరుని జూచు కోర్కెతో ♦ నేగెవయసు
వయసు రాలేదు దేవుని ♦ జడయులేదు
ఆశ చిగురెత్త ప్రేమ మ ♦ ధ్వాసవంబు
పిలుచుచున్నది యానంద ♦ వీధులందు
లాగుచున్నది యానంద ♦ వాగురులకు 12

ఉ. సోదెలు చెప్పవచ్చు నొక ♦ క్షుద్రునిపై గలభక్తి యోగ మ
ర్యాదలెఱుంగు తాత్త్వికుని ♦ యం దెసలారదు మాయలోక మిం
దేది నిజంబొ యేది జడ♦ మించుకఁ జూడదు, నాస్తికుండు దు
ర్వాదియె భక్తరూపమున ♦ వచ్చును వానిని నమ్మజెల్లునే! 13

చ. నిజములుఁ జెప్పనేని యవి ♦ నింద్యములంచు దలంతు రీ మహా
ప్రజల కబద్ధ నాటకము ♦ ప్రాయికమైనది దానియందు త
ద్విజిత విలాససంపదల ♦ విహ్వలముల్ నడిపించు భక్తిలో
గజిబిజిలేని దారిని నొ ♦ కండునుఁ బోఁడు యథార్థమాఁడగన్. 14

సీ. ఎవ్వరేమన్నారొ ♦ యెవ్వ రెఱుంగునో
మఱుఁగులో మాట ♦ లెవ్వరికిఁ దెలుసు
ఏ యూరొ యేపల్లొ ♦ యెందు దాఁ గున్నాఁడొ
జాడఁ జెప్పెడి నెర ♦ జాణ యెవరు
చూపేది యొకటి యా ♦ రూపున్న దొకటి యీ
మాపులో గుర్తించు ♦ మార్గమేది
అందరఁ జూచుచో ♦ నందర దాచుచో
కొందర కైనను ♦ నందదేమొ

తే. అది యవాఙ్మనసం బది ♦ యర్థహీన
మది మహత్తర మది దారు ♦ ణావగాహ
మది ప్రళయకాల మాది మ ♦ ధ్యాంత రహిత
మది సుధాకలశంబు న ♦ వ్యము నిజంబు.

ఉ. దారులు కట్టిపోయినవి ♦ దాఁగొనుచోఁటులులేవు వైరి సం
హరముసేయు నేర్పుఁ బడ ♦ యం దలపోయఁగ లేదు నేఁడు కాం
తార నివాసమున్ సలుపు ♦ దా మనితోఁచె జితేంద్రియత్వ మీ
తీరునఁగాదు నీదొపఁగు ♦ తెచ్చిన దెవ్వరొ చెప్ప రెవ్వరున్. 16

ఉ. మా హృదయంబు మచ్చుపడి ♦ మాసి యనే వసివాడియున్న దా
శాహి సతంబు నేదొ విష ♦ మాశయముల్ పచంలచుకాని వ్యా
మోహము బాయలేదు మఱి ♦ మోద మొచావొ యొసంగునట్టి యా
కూహక మెన్ని నాళ్ళు కథ ♦ కుంతది చెప్పడు వేయిమొగ్గిక్కనన్.

ఉ. ఏమిటిదృశ్య మిందొకటి ♦ యేని నిజంబుగలేదు శూన్యమం
దే మఱుగైన యీ సొగసు ♦ లేటికివ్రాయును చిత్రలేఖకుం
డీమతిమాలిపాటకుఁడ ♦ దేపనిగా పఠియించు సేల న
య్యో మహనీయమార్గములు ♦ మాసులెఱుంగని వారిచర్యముల్.

ఉ. మీకట గోచరంబయిన ♦ మేదిని మాకును గోచరించు మీ
నాకము మాకవాటముల ♦ నారయవచ్చె నుమీమనన్నులో
అ కలధౌతసాధముల ♦ యందు పథ్రశ్రమఁబడ్డ పెద్ద యా
శా కనకాంగిముందర త్వ ♦ దాకృతిచిత్రమునుండు జూడఁగన్. 19

సీ. ఈపాటిదానికై ♦ యీపాటపాడితే
చేటలముత్యాలు ♦ జెరఁగఁగలమె
ఈలాటి సొగసుకై ♦ యీసీధుఁద్రావితే
గంగపొంగేధార ♦ గాంచఁగలమె
ఈగతి రాగాల ♦ నాగళ్ళదున్నితే
పైడికంచాలు రాఁ ♦ బాడఁగలమె
ఈప్రేమప్రళయాల ♦ సేళ్ళండిపోయితే
నాకాశవీధుల ♦ నరయఁగలమె

తే. జీవితంబను నీవహ్ని ♦ శిఖలమధ్య
నేది దిగఁబెట్టి యేది మా ♦ యించెఁ జెప్పొ
మేదియమృతంబు నింక మా ♦ కేది స్వర్గ
మేది దేనికి నదిసరి ♦ పోదు గంటె !

ఉ. మే మపకీర్తిపాలయి ని ♦ మీలితలోచనముల్ ఘటించి యీ
భూమిని చాలకాల మయి ♦ పోయెను మాది నిషిద్ధజీవితం
బేమిటిలెక్క ? మీరు రచి ♦ యించెడు త్రోవలుమాకు కిట్ట వీ
సోమరసంబు నాకమును ♦ జూపెడు కాదనలేరు తాత్త్వికుల్. 21

ఉ. చూడుఁడు ఫకీరువీఁడు తన ♦ చుట్టుగల లోకము జూచుచున్న నా
నాఁడె జగత్తునే మఱచి ♦ నాఁడు యుషస్సును మేళవించుచున్
బాఁడెఁడు గీతముల్ రజని ♦ పాఁడినవేయని నాట్యమాడు వె
న్నాఁడు తదర్థ మీకపట ♦ నాటకు లేమిగ్రహింత్రు నెచ్చెలీ ! 22

ఉ. మాటలుచెప్పనపుడు కొఱ ♦ మాలిన భైక్షుకజీవితాంకమున్
నాటకమాడెనేల ? పద ♦ నంబునఁ బూతలు గోచరించు నీ
లాటి కళావిదుం డవిసి ♦ లాజలహారతులిచ్చితేని వా
చాటులు నవ్వి పోదు రర ౘాఁటున దాగుఁడు మూఁతలోయనన్.23

చ. ఎచటకుఁబోదువోయి విష ♦ యేచ్ఛలు నీమదిబాసియున్న వా
యచట పిపాసకై యొక జ ♦ లాశయముండఁగనోపదా ! పదాం
కచయము బాటసారులకుఁ ♦ గాదనలేము నివాళితో జగత్
ప్రచలితమంత్రమాన్పుడు నె ♦ భైక్షుకమేపనికాదు చూడుమీ. 24

శా. అపుడే కాలము మాఱిపోయినది నీ ♦ వారంభశూరత్వ మీ
యపవాదంబులఁబడ్డదోయి యికఁనీ ♦ యధ్యాత్మతత్త్వంబు నే
రుపుమార్గంబులు కట్టిపోయినవి నీ ♦ రున్ నిప్పులున్ గాల్లు నీ
జపహోమంబులు పేరుకై కలవు వి ♦ జ్ఞానంబు మాయింవఁగన్.

ఉ. ఆడిన దాడకుండఁ దెగ ♦ నాఁడితి వెంతయుగాని నిన్ను వె
న్నాడుట మానలేదు మరి ♦ యాదలరూపును మాపివేసి యీ
నాఁడు నిజంబు చెప్పవు త ♦ నంత నిశాకలశంబుబట్టి యీ
బూడిదనెత్తి బోసితివి ♦ బొక్కిన మాకిఁకమోక్షమున్నదే. 26

ఉ. లోపములేనినీనడత • లో పలినంబులుఁబెట్టువారినే
లోపము భౌతికంబయిన • లోకము చీఁకటివెల్గుఁజూడఁగా
నోవక ధిక్కరించు గమ • నోన్ముఖయ్యై నిశిబద్ధ నీమహా
దీపము కేమిలోపము ప్ర • తీతికిఁ దాఁగుడుమూఁతలున్నవే ! 27

చ, గుణములు కట్టివేసినవి • కోర్కెలులేవు విధూతదగ్ధ మీ
తనువుమలీమసంబయిన • ధారుణి కేవలనామమాత్రమీ
ఘనతరరాగదోషములు • గావు మహాత్ముడనంచు నెంచు నీ
వెనుకవచించు నిందలను • వింటివె? లోకముమాయనేర్తువే. 28

ఉ. మాకునిహంబుమోక్షముల • మార్గములన్నియుఁ జ్రాడవచ్చు నీ
వేకరువెట్టు తత్త్వచయ • మేమియు నం దగుపించఁబోవ దీ
చీఁకటి కాంతివాకళుల • చెంగటనాట్యముసేయనెంచు నీ
వేకరణిన్ వచించెద వి • సీ! సెలయేళ్ళను రాళ్ళుమొల్చునే!

ఉ. మావలె నేరికిన్ వగచు • మార్గములేదు నివాళిబట్టి మీ
దేవునిగొల్చుకొం డతని • దీవన మీకు త్రిలోకసాధకం
బై విలసిల్లునంచు ముద • మందిన నొందుఁడుగాని లోకులన్
మీవలెఁ జీఁకటిన్బడి ని• మీలితవృత్తినిఁ ద్రిప్పబోకుఁడీ. 30

గీ. మీరు చెప్పెడువేదాంత • మోరుగాలి
గానుగెద్దులవలె నాగి • కదలఁబోదు
మాముక్షుత్వరథ మన్ని • మార్గముల వి
శాలశాద్వములఁబోవు • శరనివృత్తి. 31

సీ. ఈచిమ్మచీఁకట్లు • నీచెట్లదారులు
చేరినలేదు చే • సేదిలేదు
ఈనదీతీరాల • నీగుహద్వారాలఁ
గూర్చుండపడదు ప్రమొ • కుక్కలకురాదు

ఈ తపోవనముల ♦ నీతరుచ్ఛాయల
వసియించలేదు కై ♦ వసముకాదు
ఈమంత్రతంత్రాల ♦ నీహోమజపముల
సాధింపజనదు క ♦ శ్మలముపోదు

తే. తెగి జితేంద్రియపదము సా ♦ ధించి యీ ర
హస్యము విధూతమలినాంక ♦ మైన తెరవు
మబ్బు తెరలనుచించి ప్ర ♦ మాదశర ప
రంపరలలోన నిన్ను ద ♦ ర్శింపఁగలవు. 32

చ. జడలుధరించి దండకము ♦ జార కమండలవల్కలాజినం
బడరెడు భైక్షకుండు నశ ♦ నాశను తండులకక్షపాలతో
కడుపును నింపుకోఁదలఁచి ♦ గానముచేయుచు పోవు చూచితే
చెడి యతియై తపోమహిత ♦ సిద్ధిసి జెందుట కేవియత్నముల్.

సీ. తపసుజేసితినంచుఁ ♦ దలఁచెదవేకాని
తపసులో మర్మంబు ♦ తరచినావె
తపను నాపోజ్యోతి ♦ తరఁగల వెన్నాడి
వెలుఁగులో వెలుఁగయి ♦ వెలయవలయు
అవలనాదబ్రహ్మ ♦ మై సోహమైశాంతి
రేకెత్తి మనసును ♦ లేపవలయు
మనసులేచినమీఁద ♦ మాయమాయైపోవు
మాయలో మహిమల ♦ మరుగుకలదు

తే. అదెసమాధి యున్మనియుంబు ♦ నదియె జీవ
దేహముల రెంటి విడదీఁయు ♦ తెరవు కఱవు
దీర నానందవార్ధిని ♦ దేలిపోవు
నావ ! నాయన్న తపసుక ♦ న్నావ నీవు 34

శా. రేలన్ జెట్లవిహంగపంక్తులు నిశా ♦ శృంగార మీక్షించి యా
వ్యాళంబేటికి నింగిబట్టెను జనా ♦ వాసంబు కంపింప క
ల్లోలంబయ్యె జగంబు పూర్వరజ నీ ♦ లోలత్వ మేపార నీ
వేళన్‌బాడును క్రొత్తప్రాంతలు మహా ♦ వేదాంతముల్ వింటివే.

ఉ. జానపదంబు నీతరుల ♦ చాటున సైకత సీమలందు పం
తానకు నాడుపిల్లలు రు ♦ తంబున కొంగలు త్రొక్కు చెర్వు చం
దాన జగంబు మట్టి ప్రిమ ♦ దంబులఁ బుచ్చుము దుఃఖమన్న మా
ర్గానకుఁబోకు మీతపసు ♦ కాదనువారు నెఱుంగ రేమియున్. **37**

సీ. తెల్ల తెల్ల వారనీ ♦ తెలివిలోఁ గోళ్ళును
కాకులు కూసెనే ♦ వేఁకుజాము
స్ఫురియించె నే పిల్ల ♦ తెమ్మరల్ వీయుచు
పూల సుగంధాల ♦ మోసితెచ్చి
ఆయంతరిక్షాన ♦ ఆవేఁగు చుక్కలో
ఆవెల్లఁదనము నీ ♦ కర్థమైన
దా ! పదా! యిది నీ ప ♦ దార్థంబుగా నర్థ
మైనదా ! యెన్నాళ్ళ ♦ కైన గాని

తే. నీవు పడికట్టుమాటల ♦ నేకరవిడి
పాడుచున్నావు నీశ్వర ♦ భక్తి పాఠ
ములు మహాయోగివలె నవి ♦ మోక్షమిడవు
నీ నిజంబంత నీలోనె ♦ నెగడుఁగంటె.

గీ. ఏడ్పులోనవ్వు నవ్వులో ♦ నేడ్పు తొంగి
చూచు చున్నది మా కంట ♦ చూచువారి
కీ రహస్యాలు తెలియును ♦ నితరు లేమి
చూడనేర్తురు ప్రకృతిలో ♦ సొగసులరసి

మ. బహూదూరాన నిపాతవాతములలోఁ ♦ బాటేదొ విన్పించు నీ
యిహ సంబంధము లేదు దాని కమర ♦ త్వేచ్ఛావిభాసంబు దోఁ
చు హిమాంశుండును దోఁచు జ్యోత్స్నఁ దలపిం♦చున్ బ్రేమరూపంబులే
కుహనా సంస్కృతి లేదు వింటివె యతీ ♦ క్రొక్కారు మేఘంబులన్.

శా. ఏదో కిన్నరపాటఁ బాడు నది నీ ♦ కిష్టంబుగాకున్న నీ
వా దారిన్ బడిపోకు నీమనసులో ♦ నారాగరూపాప్తి యే
లేదో మోదము బంధరూపమని నీ ♦ బుద్ధిన్ వితర్కించితో
కాదో! కాదనలేము గాని సొగసున్ ♦ గారింపఁగాఁ గర్జమే. 41

సీ. అలకించే దేమి ♦ యాలాటి దృశ్యాలు
శూన్యాల చూపులు ♦ చూడవచ్చు
అలపించే దేమి ♦ యాకాశ వీథుల
మబ్బు రథాలు శ ♦ బ్దములు సేయు
నడచిపోయే దేమి ♦ కడల పగ్గాలు ము
క్కలుజేసి నూర్ధ్వలో ♦ కముల కెగయు
మాటలాడే దేమి ♦ మాయలో మహిమలు
పాలవెల్లి నుతించి ♦ పడయునపుడు

గీ. వేణువునుబట్టి పూరించు ♦ వేళలందు
నొకరి కానందమును మఱి ♦ యొకరి కేడ్పు
వచ్చు నిజమేదొ తెరచాటు ♦ మాటుపడి ర
హస్యమార్గాల నడుచు హా ♦ స్యములఁబడుచు. 42

శా. పాతాళంబు పెకల్చివచ్చెను సుషః ♦ ప్రాగ్జ్యోతి యీరీతి సం
ధ్యాతత్త్వంబు నిజావకాశము నిధి ♦ ధ్యానంబు గావించి నీ
పాత్రల్ క్రొత్తలు పెట్టి పాడెదవు నీ ♦ ప్రావీణ్యమేపార నీ
చాతుర్యం బెవ రాలకింతు రది వా ♦ చాగోచరంబౌ నొకో. 43

ఉ. ఆ వెలుగందు నేను గల ♦ నారయ నీవనుకొన్న వేల్పులే
డావల మృగ్యమై శబళ ♦ మై కనుపించెడు చిమ్మచీఁకటిన్
నీవు నిమీలితాక్షుఁడయి ♦ నిల్చినచోట విశాలమైన నీ
కేవల స్వస్వరూపమునఁ ♦ గేంద్రము నేనని జూడు నెచ్చెలీ. 44

చ. ఇతఁడొక యైంద్రజాలకుఁడు ♦ నీతనికుంచె జగత్త్రయంబులన్
బ్రతినవహించి జూపు నది ♦ వస్తువుఁ గాదనుకొండు వానిలో
మతి జడభావ మొందదియె ♦ మాయ నిమిత్తములన్ని నిట్టి సం
గతి గలవే గతాగతముఁ ♦ గాదని యీ తెరదాట శక్యమే. 45

గీ. వెతకుచున్నాము మమ్ముమ్మా ♦ వెనుక ముందు
జన్మ జన్మాంతరంబులు ♦ జారిపోయి
గడ్డివలె లేచి చేటుల ♦ వడ్డ జీవి
యే విధంబున ముక్తి వీ ♦ క్షించునోయి. 46

శా. నిద్రా ముద్రితమైన నీతలపులో ♦ నిర్వాణ తేజంబు యే
సదూపంబును మోసి కానఁబడె నా ♦ సౌదామినుల్ చీఁకటిన్
ఛిద్రంబున్ బొనరింప నేర్చె నది నీ ♦ జీర్ణాశయ భ్రాంతిలో
భద్రాకారముఁ జూపు నా యమృతసా ♦ మ్రాజ్యంబు సామాన్యమే

ఉ. నాకు యతీంద్ర పంక్తియొక ♦ నాఁ డెదురైజని వారి వారి నా
నా కలనాదవాదకల ♦ నంబున ముచ్చిలు ప్రేమతత్త్వ మం
దేకరువెట్టె పాపభవ మీ ♦ శ్వరునందొక రాగమంచు నీ
లోకము వృత్తిభేదముల ♦ లోఁ జెడిపోయె మతాల పేరిటన్ 48

శా. ఈ సంసార మసారమైనను మహా ♦ ఘేచ్ఛా విహారక్రియా
వాసంబుల్ విడనాఁడ వెప్పటికి తే ♦ నన్ బ్రహ్మజిజ్ఞాసచే
నా సంస్కారముబోవు గాని యది యీ ♦ హా మాత్రచైతన్య వి
న్యాసంబందు లభింపఁబోవదు జడా ♦ ధ్యాహార పర్యంతమున్. 49

శా. రోళ్ళంబాడిరొ నీ నిజంబు సముదీ ♦ ర్ణోదగ్ర భావాల నా
కళ్ళన్‌బెట్టిరొ రంగవల్లికల ము ♦ క్కారుల్ విడంబించి యా
కళ్ళాపుంచిన మీదఁ నీ తెరఁగు వ్యా ♦ ఖ్యానాల తెంపేమి మీ
యిళ్ళన్ పూజలుసల్పుఁడీ యమృత స ♦ ద్వృష్టిన్ ముముక్షప్తికై

ఉ. ఏటినిఁదేలి యీ పడవ ♦ యేకడనుండి యెవండుఁదెచ్చె మి
న్నేటికిఁ బోవుదారి యిది ♦ యెన్నఁడు గాదు తదీయయత్న మా
పాటిదిగాదు నీ సుడిని ♦ బద్ధ విధంబది నేరకున్న దీ
పాటికి నింటిమార్గమునుఁ ♦ బట్టుటకర్జ మదైన సాధ్యమే. 51

ఉ. ఓ వెదురా ! మహాగరిమ ♦ నున్న ద్వదాత్మకు వేణురూపమే
లా వరియించెదో సె ? భవ ♦ లాలసబుద్ధి జడావభావ మం
దే విలపించు రంధ్రముల ♦ నింపి నఖంబుల నోటనొంపి నీ
లావును సన్నగిల్ల నబ ♦ లత్వముఁ గూర్తురు పోకుపాటకై 52

శా. ఆశాంతంబుల నుండి యీ వెలుఁగు న ♦ వ్యక్తధ్వనుల్ ప్రేమసం
దేశంబుల్ జలదంబులన్ మెఱసి దో ♦ తెంచున్ సమాధిన్ జడా
దేశంబుల్ దిగజారు నీ మరుగు ను ♦ ద్దీపించి నీ స్వాంత మా
దేశంబుల్ బుచ్చిన మోక్షలక్ష్మి యెదురై♦యర్థించు విశ్వాకృతిన్.

సీ. ఆకారమేది ని ♦ రాకారమేది నే
శూన్యభాండంబులు ♦ జూచు నీకు
రసమేది రవసుధా ♦ రస మేది రాగాలు
యెండ మావులజాడ ♦ నిరుకు నీకు
మతియేది విబుధసం ♦ మతి యేది చదువులో
సాహిత్యవీథుల ♦ జనెడు నీకు
ప్రియయమేది మనసులో ♦ బ్రియమేది శుష్కవా
హిని సైకతముల వ ♦ సించు నీకు

తే. ఇదిగొ సెలయేళ్ళు హృదయ వా♦కిళ్ళ ముందు
పాటి మోసులెత్తిన ప్రేమ♦పాఠములను
నేర్పుచున్నవి తరగల♦నెపముచేత
వాసనలమీరి సత్త్రపో♦వసతి కోరి. 54

ఉ. ఈ కథకుండు మాకు విని♦పించిన సత్యము మోహనాటక
ప్రాకటమంచు నెంచితిమి♦పాపము మోసముఁజేయునట్టి యీ
వ్యాకరణాంక మీగతిర♦హస్యములన్ విడఁజెప్పె నిట్టియ
స్తోకమనీష కేవలముఁ♦జూడఁగరాదు ప్రవక్తలందొగిన్.

ఉ. కుర్రంకునినుండు నీనిశల♦కున్ దెగత్రెంపులుతేవు నిద్రలం
దుంకువఁజేసి యీరజని♦యూసులుఁ జెప్పుచునున్న దా రహ
స్యాంకముఁ నాలకించు మన♦సంయమిలోకము వెల్లడించలే
దింక జనాపవాద ముద♦యించె నినీ! విను నెవ్వఁడాడినన్. 56

ఉ. పట్టి జలాంజలిన్ విడిచి♦పాడెదు హారతిపాటలోన నీ
కెట్టి స్వతంత్రతున్నదొ యి♦సీ! విధియందు నిషేధమందు మా
కట్టి స్వంత్రతున్నది మ♦హామహితంబగు ప్రేమపాఠ మా
కట్టడితత్త్వవేత్తలకుఁ♦గాదు తపస్సన త్యాగమారయన్. 57

చ. విధియు నిషేధముల్ విడిచి♦పెట్టితివేల స్వతంత్రజీవిత
ప్రథితవిలాసముల్ పడయ♦వచ్చితివా! యువి నిష్ఠకంటె న
త్యధికతరంబు కష్టమును♦మా! యపకీర్తి శిరానఁబెట్టి యీ
పృథివి తృణంబుకంటె కడు♦హీనునిగాఁ దలపోయనేర్తువే. 58

శా. పాడై పోతివి చోటుబాసితివి యీ♦పాషండవేదాంతమం
దాడన్ గల్లలుబొల్లులల్లి మృషలన్♦వ్యామోహముల్ పెట్టి మై
నాడన్ జీవసమాధిగన్నవిచల♦న్నాదంబు మోక్షంబుగా
పాడన్ నేర్చితివేమి యోకథకుఁడా♦బాటేది దోతెంచగన్. 59

చ. ఒరు లపచారముల్ బడెడు ♦ నూసులు నేకరుఁబెట్టినేల నీ
తెరఁగున గాథగాథలను ♦ దించుకుఁబోయెదుఁగాని లేవఁగా
నెఱుగవు తెల్లవారునిఁక ♦ నేటికి నాటకపాత్ర గానమా
ధురి జెడకున్న యందమిఁక ♦ దోయి యదేపనిగా ధ్వనించినన్.

ఉ. శూన్యముఁజూచి నీవు నగ ♦ శోభిత దివ్యసరిత్తటాది ప్రా
వీణ్య రమావినోదఫల ♦ విశ్రుతి నేర్పడఁగాంచుచుంటి వా
వన్యము మాకుఁజూపెదవె ? ♦ బాయనిగూర్మిని నిన్నుఁ గొల్తుమో
మాఁన్యుఁడ ! రొమ్ముగుద్దిజను ♦ మార్గముమంచిదిగాదు చూడుమీ.

ఉ. మాకు నుషస్సు సంధ్య లను ♦ మాటలువచ్చునుఁగాని వానిలో
లోకముఁజూచుభేదముల ♦ లో నొకటైనను గానుపించ దా
రాకయుపోకయున్గృహము ♦ ప్రాంగణముక్తకవాటమట్లు తా
మై కనుపించు నీసొగసు ♦ నందు రహస్యము తెల్లకన్పడున్. 62

శా. ఏదో చెప్పఁగవచ్చుచుంటి వది ♦ నీకేరాదు మూకుమ్మడిన్
వాదంబుల్ పచరించు నీమునుఁగులో ♦ వాయెత్తితే యర్థముల్
భేధించున్ మధుమాసవాసరము మై ♦ రేయంబుదుష్కీర్తి యా
పాదింపన్ లలనాప్రసంగముల వి ♦ శ్వాసంబు వేదాంతమే. 63

ఉ. ఆ సరసిన్ సరోజములు ♦ నప్పటినుండియు బాయలే దదే
వాసము తేటి పెట్టికుని ♦ పాడుచునున్నదిగాని నీకు స
న్న్యాసమునచ్చె నేల యది ♦ యైనను పూర్తిగవచ్చినట్లు వి
శ్వాసము లేదు కారడవి ♦ వాసము వాసనలన్ వెలార్చునే. 64

ఉ. ఆసవమందు నీకుపరి ♦ హాసము మాటలయందు బ్రహ్మజి
జ్ఞానిషేధముల్ విధులుఁ ♦ గాదనలే వలభావదాస్యమం
దే సముపాసితంబు నిటు ♦ లేమటి దాఁగుడుమూఁత లీ యుప
న్యాసములందు తాత్త్వికమహా ♦ శయముల్ ఘటియింపవెంతయున్

ఉ. దేవుఁడొకండు నాత్మకునుఁ ♦ దికొక్కకటేయనుచో జగంబు నే
ద్రోవకులాగెదోయి యిది ♦ తోఁచినతోఁచని యెండమావులం
చేవొ వచించినావు మతి ♦ హీనుల సామెత లంతరిక్ష సం
భావితముల్ విదుండు నిజ ♦ వస్తువులం గను రెండు వేరుగన్,

శా. ఊహామాత్రములన్ ప్రసంగముల నే ♦ వోవచ్చు దృశ్యాలు సం
దేహంబుల్ పచరించువస్తువులలో ♦ దీపించు తార్కాణముల్
మోహావేశములన్ సతంబులనుచున్ ♦ బోధించు నీసూత్రముల్
దేహభ్రాంతిని బాపలేవు నిజసం ♦ దేశంబు మైజూపుమా. 67

ఉ. కాలెదుకట్టె దగ్ధమయి ♦ కాష్టములన్ జితిబద్ధధూళితో
బోలి నశించుచుంత మతి ♦ బోయినజీవికిఁదావు స్వర్గపా
తాళము లుండునన్న మతి ♦ తార్కికుఁడా ! యొకటన్న వాదమిం
కేలనిజంబు బోర్లఁబడె ♦ నేగద ! దీనికి దారియున్నదే. 68

గీ. ఈరహస్యంబు మాటల ♦ నెఱుఁకఁబడదు
ఈముడిని విప్పువారు లే ♦ రేమి సేతు
మాదిమధ్యాంతరహిత మై ♦ నట్టి యాత్మ
కేదినిజమైనతావు నిం ♦ కేది తెరవు 69

గీ. వాదభేదాలలో తత్త్వ ♦ గాథ తేల
లేదు యతియు ఫకీరు మ ♦ ర్యాదలందు
తార్కికులనోళ్ళుగట్టించి ♦ తాళములను
వేసి రనుభవమందుఁ జూ ♦ పించి నిజము

చ. యతికథకుండుఁగాఁడు యతి ♦ యాకథకుండనిఁ గొందరందు రా
యతి మతిమంతుఁడన్నిట న ♦ జాండముఁజూచు నిపాతదీపమ
ట్లతులిత సత్కళాకలిత ♦ మైన నినాదమునాలకించి యా
గతి శ్రుతిఁబెట్టిపాడుఁ దన ♦ కన్నను స్వర్గములేని కైవడిన్. 71

చ. జపములు సంధ్యలున్ సలిపి ♦ సాకి 'నఖండము' బట్టుకొన్న ని
ష్కపటుఁడు సాధకుండు నరి ♦ షట్కముఁబాసి కళాప్రపంచమం
దుపకృతిబోయిపోయి విభ ♦ వోజ్జ్వలమైనదశన్ గడించు దా
నపుడు సదూర్ధ్వగామియయి ♦ యాత్మ నెఱుంగునుఁదన్ను దానుగన్

క. నేను పరబ్రహ్మం బది
దానంచు నెఱింగి తనకుఁ ♦ దానై దపమం
దానంద మొందువానికి
గానఁగబడు తత్త్వగాథ ♦ గాథలు తొలఁగన్. 73

మ. భగవద్భక్తిగతించువారల మహా ♦ భాగ్యంబు లైశ్వర్యముల్
నెగడంబోవు లయాంతసన్నిభరణా ♦ గ్నిజ్వాల లేతెంచి యా
యుగమేకాల్చు తదీయభూరజము ♦ నుద్యోగించి యాయీశ్వరున్
బొగడన్ గ్రమ్మర తజ్జనాగమము లా ♦ మోదింప రేకెత్తెడున్. 74

సీ. రణదుందుభులు మ్రోయు ♦ రాలును చుక్కలు
శరవాహినులుపొంగి ♦ పొరలు పెద్ద
ప్రళయకాలానల ♦ జ్వాలలువీచు ఘూ
ర్ణిల్లునుభూమి ము ♦ న్నిటమునిఁగి
ఆకాశవీధుల ♦ నర్కబింబంబు ము
క్కలుముక్కలై కాంతి ♦ తొలఁగిపోవు
కొండలుపగిలి బ్ర ♦ హ్మండంబు బ్రద్దలై
పాతాళగంగ యే ♦ పాఱు పోరు

తే. నెత్తుటేరులు పొంగు ♦ నువ్వెత్తుగాగ
కలిమహారౌద్రమునను ది ♦ క్కులకుబాఱు
జ్ఞానసభ్యుడ ! నీతపో ♦ సాధనమున
వాని మడియించి నిజము కా ♦ పాడుమయ్య. 75



# * హాఫీజ్

౧

జయ మీవెజ్జునిరాక నాడిని పరీ ♦ క్షన్‌జేయు జీసస్సు దు
ర్జయ దుఃఖాల వెలార్ప కశ్రువుల; జో ♦ స్యంబాడుచుంటిన్ ద ఢ
క్షయ తేజస్సున కేనెకా దవసి 'మూ ♦ సా' వచ్చి యాచించు ని
శ్చయ మీవీటికి వచ్చువారలు నిరా ♦ శన్ వోయిరే యెవ్వరేన్.

౨

గమ్యస్థాన మెఱుంగ రెవ్వ ; రటులే ♦ ఘంటానినాదాగమా
దేమ్యంబుల్ తెగి మ్రోగు ; నాసవము ♦ తెమ్మీ యెల్ల రేయాసకో
సామ్యత్వంబు ఘటింతు ; రీవనఖగా ♦ క్షయ్యంబు ప్రశ్నింప కా
సామ్యం బే నొక యార్తనాదమున వి♦ స్పష్టంబుగాఁ గాంచితిన్.

౩

వ్యసనరుజాభరత్వమును ♦ వాకొన నేరికినైన దోఁచినన్
శ్వసనము ముక్కునున్నదదె ♦ సంతసమంచని యెంచుకొమ్ము; ఓ
రసికుఁడ ! నీవు హాఫీజుని ♦ రాయిడి వేఁట మరల్ప వచ్చితౌ
పసచెడి డేగ యీఁగలను ♦ బట్టఁగ వచ్చినయట్లు గాదొకో !

౪

ఉ. ఓచెలి ! భద్ర మీచషక ♦ మొండు నొసంగుము; పంచిపెట్టు మీ
కాచగతాసవంబు కుతు ♦ కంబని తోఁచెనుగాని యిప్పు డా
లోచన సేయగా నిది య ♦ లోక మహాకఠినావశేషమై
దోఁచెడుఁ జూచితే గడవ ♦ దుస్తర మింకెవ రెన్ని చెప్పినన్.

---

★ పారసీకమహాకవి హాఫీజ్ పద్యముల కనువాదము.

౨౬

ఉ. ఒంటెను నెక్కి పోవు నిత ♦ డొండు నుషస్సునఁ జల్లగాలి వెన్
వెంటఁ గుళాయిఁకుచ్చు కడు ♦ విహ్వలలీలను విప్పి విప్పి త
న్నంటిన బ్రేమవీథి మృగ ♦ నాభి సువాసనలన్ వెలార్చు నొం
డొంటి విలాసజూటముల ♦ నుండి ప్రియాహృదయాలు త్రుంపగన్.

౨౭

ఉ. నీ నిజమార్గగామి ప్రియు ♦ నిన్ నిరసింపకు ; నీతపస్సులో
నీ నిరవద్యమైన జప ♦ నిర్ఝరి శీధువు ముంచుచున్న వి
న్నాణముఁ జూపి కాదనకు ♦ నాథునిమించిన మూఁడులోకముల్
గానగరావ ; యీ నిజము ♦ గాననివారు దరిద్రులేగదా !

౨౮

ఉ. ఆ ప్రియురాలికై చనెడు ♦ యానమునన్ వెత లేదు ; సంతత
శ్రీప్రద మైనవైభవము ♦ శ్రేయముగూర్చు సతంబు ఘంటికా
స్వప్రతిపాదకధ్వనులు ♦ సందడి సుంత యెఱుంగనయ్యె వి
ద్యాప్రతిపత్తి నానెలవు ♦ దాక ప్రయాణముఁ జేసితీరెదన్.

౨౯

ఉ. చీఁకటిరాత్రి పెద్దనది ♦ చెంగట తుంగతరంగమాలికా
లోకనఁ జేసి దూకి చను ♦ లోపల సంక్షుభితంబు నోపఁగా
లేకను నొడ్డునుండి యవ ♦ లీలను వ్రేల్మిడి మేలమాడి చీ
కాకిడుకూళ ప్రేమగల ♦ కైపు నొకింత యెఱుంగనేర్చునే.

—★—

# తానేషా

సీ. ఇంటింటికిని భిక్ష ♦ కేదైన నొకకడి
యన్న మిమ్మని ముష్టి ♦ నడుగునాఁడు
బైరాగులనుగూడి ♦ మసలుచు సుఖ దుఃఖ
ములు పంచుకొని ప్రొద్దు ♦ పుచ్చునాఁడు
చినిఁగి జీర్ణంబయి ♦ చెన్నారు చేలంబు
చుట్టి నేలను బడి ♦ జోగునాఁడు
పస్తులు సేయుచు ♦ పాటలు పాడుచు
పుడమిని దిట్టుచు ♦ పోవునాఁడు

తే. ఒక్క నాపొట్టకై దుఃఖ ♦ ముండెఁ గాని
నేఁడు దినమెల్ల జనుల కా ♦ పాడి వారి
జీవనోపాధికై సేవఁ ♦ జేయవలసె
నకట ! రాజ్యంబు దుఃఖ భో ♦ జ్యంబు గాదె.

తే. సౌధముల పంక్తి కాల్బల ♦ సాధనములు
డాబుడీబులు, మిడిసిపా ♦ టా బడాయి
బూటకపు వేషభాషల ♦ పాలుపె గాని
యకట ! రాజ్యంబు దుఃఖ భో ♦ జ్యంబు గాదె.

తే. అవనిరాజ్యంబు చేఁజిక్కె ♦ నైన నాకు
నిది మహాదుఃఖజలధి ; యిం ♦ దీదవలసె
నిది మహారాగరసము నా ♦ కిదియె శోక
భరిత దావాగ్ని గాఁ జిక్క ♦ వలసి వచ్చె.

తే. లేమికంటెను కలిమియే ♦ లెస్సయైనఁ
గాని, వేదనా దోదూయ ♦ మాన మాన
సమున కే కల్మి హేతువో ♦ సహజముగను
నదియె నరకంబు వేఱ లే ♦ దవనియందు.

తే. అభిలషింపకు ధనము సౌ ♦ ఖ్యంబుకొఱకు
అభిలషింపుము సహనంబు ♦ నహరహంబు
అదియె నీకు మహాభాగ్య ♦ మగును గాని
రాజ్యభారంబు భారంబు ♦ ప్రణుతచరిత.

తే. రాజ్యపదము లేకుంటచే ♦ రాజ వగుట
కభిలషించెదు గాని రా ♦ జ్యంబె యున్న
దుఃఖభోజ్యం బటంచును ♦ దూఱఁగలవు
లేనిదానిపై కడుప్రీతి ♦ మానవులకు.

తే. ధనము ధాన్యంబు జ్ఞానంబు ♦ త్యాగభోగ
కారణం బని తలపోయఁ ♦ గలవు గాని,
ఆ యథార్థంబు విన్న నీ ♦ యాత్మయందె
ఱోత పుట్టును ధనికుల ♦ రీతిఁ గన్న.

చ. ధనికుఁడు సేయు దానము య ♦ థార్థముగా నది పుణ్యమిచ్చు నం
చనుకొనెఁబోల దాతని సు ♦ ఖార్థమె యర్థ మొసంగుఁ గాని· స
జ్జన సహకారదీక్షమెయి ♦ సాకఁడు చూడడు వానివేడఁగాఁ
జనియెడుకంటె పస్తుపడి ♦ చచ్చుటయే పదిరెట్లు మే లగున్,

తే. ఇట్టి హీనమైన ♦ యీరాజ్యమును ధన
కనక వస్తునిచయ ♦ కాంక్షఁ జేసి
విఱ్ఱవీగి పాప ♦ భీతి విసర్జించి
చెడుటకన్న వేఱే ♦ చెడుగు గలదె.

ఉ. కావున నాకు రాజ్యమును ♦ గౌరవమున్ఁ యశమున్, ధనంబు· భో
గావిలచిత్తవృత్తి వల ♦ దంచును వేడితి మున్ను ; గాని యా
దేఁవుడు నాలకింప కిటు ♦ దీనత మాన్పు నెపంబు బెట్టి మి
థ్యావిభవంబు గూర్చి కడు ♦ దైన్యదావాగ్నిని బెట్టె నామదిన్

తే. రా జనుచు ప్రజలన్న బై ♦ రాగి నేను
నే కిరీటంబు పెట్టిన ♦ నాకు చిరుగు
చేదకన్న ఘనం బని ♦ చెప్పఁబోను
అధికములు స్వల్పములు మన ♦ స్సందె కలవు.

—★—

# * జీవగీతము ౧

ప్రణుతమై, యభేద్యమయి, నీ ♦ రంధ్రమైన
వెదురుపొదయందు నానంద ♦ విలసనముల
సహచరులఁ గూడి తల యాక ♦ సమున కెత్తి
సహజతేజంబుతో విలా ♦ సములఁ దేలి
కాలవశమున ముక్కలై ♦ కత్తికోఁత
బడి జలంబుల లుప్తమై ♦ పైకి మరల
వచ్చి వికలాంగకములతోఁ ♦ బరగునట్టి
మురళి యేమేమొ కథలు చె ♦ ప్పును వినుండు
వెదురుబిడినుండి ననుఁ గోసి ♦ వెతల డించి
చెక్కి బహురంధ్రములు చేసి ♦ నొక్కి నొక్కి
యూదుచున్నారు ఇటు నటు ♦ నూపి యూపి ;
దాన నాకేమి సౌఖ్య ప్ర ♦ దంబు గాని,
అవని యానందమున నోల ♦ లాడవచ్చు
నన్నుఁ గైకొని యూదుచు ♦ పొన్న నెక్కి
జగము చక్కెరతో నింపఁ ♦ జాలె నొకఁడు
గోవు లశనంబు మానెనో ♦ గొల్లచిడె
లట్టె నిర్విణ్ణులైరొ యే ♦ మైనఁ గాని-
చారు యమునాతరంగిణీ ♦ సలిలమింక
పాడుచున్నది అనాటి ♦ పాటలెల్ల,
వినుము నేనందు మూర్తీభ ♦ వించి యుందు
నాకొఱకు వాఁడు వెదకి వె ♦ న్నాడుచుండు
అపుడె ముగియఁగలేదు నా ♦ యాత్మచరిత

---

✶ మసనవీ అను పారశీక తత్త్వగ్రంథమునుండి

మురళిగా నుంట నాకెంత ♦ పరువటన్న
నేను నా నిజవాసంబె ♦ యేగుకొఱకు
చూచుచున్నాను నాబుద్ధి ♦ సొబఁగదేమొ
మరల నా వంశమునఁ జేరి ♦ వఱలుకొఱకె
వ్యసనపడుచుంటిఁ గాని శ్రా ♦ వ్యప్రదీప్త
గానమని మీరు భ్రమపడ ♦ వలదుసుండు
భ్రమము వర్జించి నా పరి ♦ భ్రమణవిధము
తెలిసికొనఁగోరువా ♦ రున్నఁ దీరుబడిగ
వినుఁడు మీ స్వీయచరితమే ♦ కనెద రందు
మీరు నావలె వ్యసనమే ♦ కోరుకొంద్రు
వీరు వా రనుభేదంబె ♦ విడుచుకొందురు
జారిపోయిన భాగ్యంబె ♦ సంగ్రహింతురు
మఱచిపోయిన స్వపదంబు ♦ తిరిగి కొంద్రు
కడచిపోయినకాలంబు ♦ గడన సేతు
నట్టితత్వంబు వెన్నతో ♦ బెట్టుచుంటి
నేను వగచెడి దేమన్న ♦ నింక నాకు
పరగ నాతొంటిరూప మై ♦ భవము తిరిగి
రాగనెడు బెంగ హృదయాంత ♦ రాళమందు
జీర్ణమై, వాని భిన్నంబు ♦ జేసి విడువ
రంధ్రములు వక్షమునఁ బడె ♦ రాలుపడగ
చిక్కి సగమయి దురవస్థఁ ♦ జెందవలసె
యేది యెటులైనఁగాని నా ♦ యాదిరూపు
రావలయునన్న ప్రేమాగ్ని ♦ ప్రజ్వరిల్లి
కాల్చియైనను దానిలోఁ ♦ గలియునట్లు
చేయునెడ నేను మరికొన్ని ♦ ఛిద్రములను

వేసికొని పాటపాడెద ♦ దోసిలొగ్గి
ఆ విషాదాంతగానంబు ♦ నస్మ దాప్త
విమల వంశాభివర్ణనా ♦ విలసనముల
పరిణమించును నింపు సొం ♦ పారినట్లు
నే ననేకులతోఁ గూడి ♦ యేగినాను
మంచిచెడ్డలవారితో ♦ మసలినాను
కాని, నాకొక్కఁడును మిత్రుఁ ♦ డైనవాఁడు
గానరాలేదు తన యను ♦ మానమందె
నిలిచి యెవరును నా గుట్టు ♦ తెలియలేరు
నా రహస్యము నాయశ్రు ♦ ధారలకును
వేరుగా లేదు గాని నా ♦ విధమెఱుంగు
వారు గనరారు ; అందఱి ♦ వల్లకాదు
అంజురపుకాయ ప్రతిపక్షి ♦ కశనమగునె
యేది యెవ్వారు వచియింప ♦ నెంతవారు
భ్రాంతులకు నాత్మ స్వాతంత్ర్య ♦ భావ మేది ?
కంధి యెఱుఁగదు తనలోని ♦ కల్మషంబు
వృక్ష మెఱుఁగదు తన పుష్ప ♦ విభవభరము
ఎఱిఁగియుండినవారి వై ! ఖరులె వేరు.

—✶—

# సంకేతనము

ఎవరు చెప్పేది కాదు వి ♦ నేది కాదు
చూచుటకు రాదు చూపించు ♦ చోటుకాదు
ఈ జగన్మధుశాల ర ♦ సేతరంబు
లైన ప్రాగభావంబుల ♦ నవలద్రోసి
రోదసికుహరాల వి ♦ చ్ఛిన్నదగ్ధ
కాండపటముల పెక్కు బ్రి ♦ హ్మాంతజీవి
తములఁ బొర్లించి శూన్యథా ♦ మములకేసి
దృష్టి మరలించె దాని నిం ♦ కేమి కలదొ ?
ఈ యగాధ సత్యంబులో ♦ నేమి కలదొ ?
ఈ యహస్సుల సంధ్యల ♦ నేమి గలదొ ?
ఈ రహస్య మెందుండి యా ♦ తీరు తీరి
తోరణాలు గట్టుచుండె వా ♦ గ్ధోరణులకు
బారుగా నిందపాలయి ♦ పట్టుపడ్డ
నన్నుఁ బోలుమురళి యొక ♦ టున్న దదిగొ
ఈ మురళి గుండెతూట్లు న ♦ న్నెన్నొ పెట్టు
కొని మహాబాధ నెల్గెత్తి ♦ కొసరి యేడ్చి
చెప్పవచ్చు నందెన్నెన్నొ ♦ ముప్పులుండ
వచ్చుఁ గాని, దానివియోగ ♦ వాసరములు
పెద్దగాథగా జడలల్లి ♦ పెరిగిపోయె
జిలుగుఛిద్రాలు మైనింత ♦ నలముకొనియె
'పెక్కుచేతుల నోళ్ళలోఁ ♦ జిక్కిపోతి
నింక నాకేది శాంతి యిం ♦ కేమి కాంతి
వంతల నితాంతచింత లా ♦ క్రాంత మయ్యె'
నని గతించినజన్మ జ ♦ న్మాంతరముల
నేకరువుపెట్టు తనగుట్టు ♦ నాకళింప

అరవాభ్రంబు కన్నీళ్ళో ♦ యనఁగ కురియు
నాకణంబులు మీరుము ♦ త్యాలఁబోలె
నెంచుచున్నారు కావని ♦ యింగలములు ॥ఎవరు॥

ఈప్రభాతాల నిశల భే ♦ రీలపైని
వేణువును పెట్టి వాయించి ♦ విహ్వలంబు
లైన రాగాల రేకెత్తి ♦ యాలపించు
నీ యధోముఖ పాషాణ ♦ మృణ్మయినింద
లంచుకొన్న దీనిని వల ♦ పించు చంద్ర
రేఖ కాసారతీరాన ♦ రేల మెఱసి
పోవు, ఖద్యోతలవలీ ల ♦ తా వసంతి
యూసులాడుచు నువ్వెళ్ళు ♦ లూరుకనుల
చూచి నవ్వుల హాస్యాల ♦ సొక్కిపోయి
మధురసాస్వాదరసముల మా ♦ మాటలాడి
వెక్కిరించుచునున్నారు ♦ వేవిధాల
ఈ మహాదృశ్యమందు నే ♦ మేమి గలదొ
ఈ మహాప్రేమ విళయమం ♦ దేమి కలదొ ।ఎవరు॥

ఈ యతుకుమారిజీవిత ♦ మీ బ్రతుకు ర
వంత విశ్రాంతిలేని వి ♦ హ్వాల దృగంచ
లంబు! భావద్యాసంబు, వి ♦ లాసవిసర,
మైనరోదసీకుహర లా ♦ స్యంబు, దగ్ధ
ప్రణయపథముల నగచాట్లు ♦ వడ్డ నశని
పాతములమ్రోల ఈనేల ♦ పాతుకొన్న
కాల పాశాలఁ జిక్కి ము ♦ క్కలయి పోయి
ఏల జీవింపవలయు నిం ♦ కేమి యాశ
లతల జీరాడవలయునో ♦ వెతలఁ దగిలి ? ॥ఎవరు॥

# భ్రాంతి

వెడదలై స్వచ్ఛమైన నీ • బెళుకు కనులు

కులుకు జవ్వన మొయ్యార • ములును సుధలు

జిలుకుపలుకులు రత్నాల • తళుకులీను

చిన్నిపొన్నారి ! నన్నేల • చేరినావు

లీల నిద్రించు నన్నేల • లేపినావు

ఱేపు మాపనకుండ నీ • రూప మవని

ధూళిధూసరతలమున • దొర్లి దొర్లి

ప్రొద్దుపొడుచుట క్రుంకుటే • ప్రొద్దు చూచి

యెఱుఁగ నీలోక మెట్టిదో • యెఱుఁగనట్టి

స్థాణు నన్నేల కరమునఁ • దట్టినావు

భస్మధారుని నన్నేల • పట్టినావు

కరకురాలను తాకునే • గాజుదివ్వె

అనలమును నాశ్రయించునే • యంబుజంబు

యెఱిఁగి నాచులో చిక్కునే • యీఁతగాఁడు

పాముకలుగునఁ జొత్తురే • బ్రతుకువారు

నారి, యీలీల నన్నేల • కోరె దీవు

ప్రేమలో నాకు పాండిత్య • మేమి గలదు

సొగసులోఁ జూడ నాకేమి • చోటు గలదు

రాగమునఁ దేల నాకేమి • రసము దెలియు

తెలియ కీ లీల నన్నేల • పిలిచినావు

పిలిచి నన్నేల యీరవ్వ • పెట్టినావు

వలపులవలంతి మరుని ప్రాం • జలులబంతి

యింతి రత్నాలదొంతి చే ♦ మంతి కుసుమ
కాంతు లీను నితాంత శృం ♦ గారమైన
మేను దొలకాడ మేఘాల ♦ లోన మెఱపు
మెఱసినట్టుల ముత్యాలు ♦ కురిసినటుల
స్వర్గతేజంబు భువి దిగి ♦ వచ్చినటుల
నీవు నడురేయి యిట్లు రా ♦ నేల బాల
గేలిసేయఁగ నన్ను నీ ♦ కేమి తోఁచె
మేలమాడఁగ నిట్టు నీ ♦ కేల తోఁచె
నేల రేబవ లీ లీల ♦ నిద్రవోవు
జడగృహస్థుడ నగు నన్ను ♦ వడఁతి నీవు
కోరఁజెల్లునె యో సుకు ♦ మార చారు
పూర్ణచంద్రనిభాస్య నీ ♦ బోటి బోటి
నెందరు తపోధనులు గోర ♦ కుందురొక్క
వారి వరియించి మించి ప్ర ♦ పంచసుఖము
లంఁదగారాదె నీచంద ♦ మందకత్తె
లీడు జోడయి నినుఁగొని ♦ యాడుచుండ
వాని వర్జించి నిర్జిత ♦ వైభవుండ
నైన నన్నేల కదిసెద ♦ వతివ నీవు
ముండ్లపై బండ వచ్చితే ♦ ముదిత నీవు
పస్తుపడి యుండ వచ్చితే ♦ భామ నీవు
అనిన నాలేమ నవ్వి యౌ ♦ నౌ నటంచు
మెఱపు మెఱసినరీతి సుం ♦ దరవిలాస
భాసమాన మనోల్లాస ♦ భరిత యగుచు

పులకితశరీరయై కర ♦ పుండరీక
మునఁ గల గులాబిపూదండ ♦ పొదలుచుండ
మెడను వేసి నమస్కార ♦ మిడి మృదూక్తి
ననియె కన్నీళ్ళు కాల్వలై ♦ యాననమున
పారుచుండ ప్రేమరస మే ♦ పాఱుచుండ
శశివి నీవైన నేనొక ♦ నిశిని గానొ
శరధి నీవైన నేను ని ♦ ర్ఝరిని గానొ
భవుఁడ వీవైన నేను పా ♦ ర్వతిని గానొ
ఇంక నర్ధాంగ మియ్యవో ♦ యేమొ చెపుమ
ఇంక నెడఁబాటు బాయవో ♦ యేమొ చెపుమ
అనిన తేజంబు రసమున ♦ నైక్యమైన
తెరఁగు దోఁచె నచ్చట వధూ ♦ వరుల తెరఁగు
మబ్బు విడిపోయె కడు శాంత ♦ మబ్బె నంత
నిదుర తొరగెను కథ నింగి ♦ నిలిచిపోయె.

—✶—

# బంతి

అదిగొ పగబెంచ నెన్నొత్తి ♦ నాకళించె
ఆయుషస్సు తిరోధాన ♦ మయ్యె ననలు.
వాడె ఖగములు పొలముల ♦ వైపులరచె
ఆట కట్టేయ రేమి యీ ♦ పాటికయిన
కందిపోయెను బంతి యా ♦ క్రందనమున
కాలనిహతిని బూడిద ♦ పాలయి తన
సోయగము చెడ నిందల ♦ సొమ్మసిల్ల
యుల్లమును తలక్రిందయి ♦ యుద్ధతి చెడి
మాసిపోవని మచ్చలు ♦ మానసమున
పెట్టుకొన్నది యతుకులు ♦ పెట్టుకొన్న
దింక చెరఁబట్టి దాని నే ♦ డ్పించనేల
పట్టుకో నేల నేలపైఁ ♦ గొట్టనేల
గోడు గని చెంపపెట్టును ♦ గోడపెట్టు
తిన్న దీబంతి కెంతటి ♦ తెలివిలేదొ
నేల మోదువారలవంక ♦ నే ప్రియాన
వచ్చుచున్నది నిను వీడు ♦ నిచ్చలేదు
చూచితే దాని యభిమాన ♦ సూచనంబు
అట్టిప్రియురాలి నేలను గొట్టు ♦ చుంటి
వకట! దయలేనివారి చ ♦ ర్యలు నివేను
బంతి కెంతటిప్రేమయో ♦ పలుకలేము
ప్రేమ యేకపక్షంబు గా ♦ వింపరాదు
ప్రేమపాఠాలు నేర్పెడు ♦ ధామమేది
స్వార్థ మీలోక మెన్నాళ్ళు ♦ పట్టుకొన్న
దొరక దీమాయ నాటకాం ♦ తరవినూత్న

శోభల నెపాల ఆశల ♦ స్రుక్కి సొక్కి
నాటకం బాడి జీవిత ♦ నాటకమును
ముగియ నీబంతి యత్నించు ♦ మూర్ఖ యగుచు
అగ్ని కబళింప నీబంతి ♦ యరుగుచున్న
దాహవంబుల వెన్నాడ ♦ నభిలషించు
పైకి క్రిందికి నిది పోవ ♦ పరువులెత్తు
బంతి ! నీకధోలోకమే ♦ వాసభూమి
గానుగెద్దును బోలె నే ♦ గానికైన
కాక, తిరిగిన నింనేమి ♦ కలదునీకు ?
ఆడి యాడి నిన్నట్టులే ♦ తోడివారి
వెంట నేమూలకొ నిన్ను ♦ విసరివేసి
పోయెదరుసుమ్ము విసిగి వా ♦ పోవవలదు
నీకు నీ తొల్లిరూపు రా ♦ నేరదింక
నీవు నీ వాసనావాసి ♦ తేతరంబు
లైన యాసలనుడివి ఆ ♦ యాసపడెదు
నీవు నిమ్న సోపానాల ♦ కేగెదేల
ఏళ్ళు పాఱును, వెనుకకు ♦ మళ్ళవెపుడు
పూలు రాలినచెట్లను ♦ ముట్టుకోవు
నీవు నిను మోదువానికై ♦ పోపుచుంటి
వతని సోయగమును చూడ ♦ నరుగుచుంటి
వతనిచేతిని విడువ గా ♦ దంటి వకట
ఏమి నీవెఱ్ఱి నీవు పో ♦ వేమి నేరు
గా రసాతలమునకు నీ ♦ దారి దూరి ?
ఈవు నేనును నొక చోట ♦ నిరికి పోయి
పోల్చుకొందాము జీవిత ♦ ముల విధాలు

—✶—

# ఉండిపోయేదేమి ?

౧

ఉండి పోయేదేమి ?
నిండి వచ్చేదేమి ?
రెండు రెండే వాటి
నుండి తేలే దేమి ?

౨

బ్రహ్మాండ మందులో
పాతివేసిన మీద
బ్రహ్మైవమని ముక్కు
మూసి కూర్చోవాలా ?

౩

ఆదర్శములు కొన్ని
అద్భుతంబులె కాని
పాదాలు మోపేటి
పాటి చోటేముంది ?

౪

ఎవరి కెవరు లేరు ;
ఎవరి కేదీ రాదు ;
చవిలేని యీ పాట
చాలించ రాదా ?

ఏ

ప్రొద్దు పొడిచేవేళ
ప్రొద్దు కుంకేవేళ
వద్దన్న రాగాలు
వాలి పోతాయా ?

ఓ

ప్రేమలో లేనట్టి
పేరుసాగ సేముంది ?
ఆమాట యీమాట
లో మనసు పెట్టునా ?

ఐ

విచ్చి రాలేపువ్వే
వచ్చి వాలేపిట్ట
మెచ్చి చూచే దేరు ?
ముచ్చట్లు మూన్నాళ్ళు

ర

పారాణి పెట్టినా
పాదాల మెట్టినా
దారిలో ముంగుర్లు
జారి పోతాయా ?

౯

బుగ్గపై చేర్చుక్క
పొడిచి నవ్వే నవ్వు
యొగ్గులగ్గుల నెంచ
నెవరితర మౌనో ?

౧౦

ముసుగులో కేరింత
రసికతకు సింగార
మొసగు నెన్నొసటి బా
సటలు చూపించాయి

౧౧

ఊడల్లో ఉయ్యాల
ఊగుచుండే ఊసు
వాడల్లో చెప్పితే
అర్థ మవుతుందా ?

౧౨

కడుపులో కదిలేటి
కబురు కాస్తేకాని
అడిగితే ఆకొంప
లంటుకొని పోవా ?

౧౩

ఈ ముళ్ళదారిలో,
ఈ మాపు ముసుగులో
ఏమాట చెప్పినా
ఏమి లాభము లేదు.

—*—

# వాణి

నిండుజవ్వనమునఁ దూఁగు ♦ చుండుదాని
చారు సౌందర్య సకల ల ♦ క్షణము దాని
ధవళ కేతకీకుసుమగా ♦ త్రింబుదాని
జిగినగవు వెన్నెలలఁ బర్వఁ ♦ జేయుదాని
తరళనయనాంబుజంబులఁ ♦ దనరుదాని
కలిత రత్న నూపుర ఝుళం ♦ ఝుళులదాని
లలిత నవపల్లవాధర ♦ మలరుదాని
కరము ఘనసారగంధ వి ♦ గ్రహముదాని
అవఘళించెడు కంకణా ♦ రవముదాని
అలరులను మించు కోమల ♦ మైనదాని
కాంచనము దెచ్చి కరఁగి వి ♦ గ్రహము బోసి
నవమణిప్రోత వివిధావ ♦ యవము లుంచి
మెఱుఁగువెట్టిన పాంచాలి ♦ కరణి మెరయు
పాటవము గల శృంగార ♦ వల్లి యనఁగ
నొప్పుదానిని నొయ్యార ♦ మొప్పుదాని
నొక్క వంకను, కవితను ♦ నొక్క వంక
చూచినార మాలోచించి ♦ చూచినార ;
మాతొడవు లీతొడవులకు ♦ భాతిగావు ;
ఆసొగసు లీసొగసునకు ♦ వాసిగావు ;
ఆవిలాస మీవిలాసాన ♦ కలతి యయ్యె
అది త్రికాలసబాధ్య మి ♦ య్యది యబాధ్య
మది ప్రకృతిబద్ధమలిన మి ♦ య్యది యమలిన

మది యనేక పరిగ్రహ ♦ మిది యనేక
జనపరిగ్రహ సాహిత్య ♦ జన్మభూమి
వివిధపుష్పాసవంబుల ♦ వెలయు సీమ
అఖిల సౌగంధముల నెల ♦ వైనతావు
ఏదియుమ దీనిసాటి రా ♦ లేదు మాకు
మామనోహరకాలంబు ♦ మాప్రతిజ్ఞ
మాజవంబును సత్వంబు ♦ మావివేక
మంతయును సాహితీనదీ ♦ ప్రాంతమందు
కామ్యకర్మనొ నిష్కామ ♦ కర్మముననొ
దగిలి సదసద్వి భేదబం ♦ ధములు వదలి
ఈ తనూయాత్రగడప నూ ♦ హించినాము
ఈ శరీరసుఖంబు వ ♦ ర్జించినాము
ఈశ్వరుఁడు వచ్చి మాప్రోల ♦ నివిగొయనుచు
నర్థరాసులు పోసిన ♦ స్వార్థబుద్ధి
వదలి కవితకె యంజలి ♦ వట్టువార
మంతియే గాని యొండేది ♦ చింతలేదు
కలిమిలేములు నిలువెల్ల ♦ గాల్చుచున్న
క్షుత్పిపాసలు మావెంటఁ ♦ జొచ్చుచున్న
తిండి లేదని బంధువుల్ ♦ తెగడుచున్న
తండులంబులకై భామ ♦ తడవుచున్న
దేహియని కానువీసంబు ♦ దీనమతిని
కోరఁబోము మా కవితా కు ♦ మారి దెచ్చు
కీర్తిధనమున్న చాలు మా ♦ కార్తిలేదు

కలము మాచేత నున్న దుః ♦ ఖంబు లేదు
రసము గ్రహియించు వా రున్న ♦ రట్టు లేదు
కాల మొకరీతి నిలువదు ♦ గడచి పోవు
ఇదియె మాతపస్సని నివే ♦ దించినాము
ప్రకృతి పువ్వులలో దిద్దు ♦ రంగులట్లు
కోకిలము కంఠమును విప్పి ♦ కూయునపుడు
వరలు నవ్యక్త మధుర ర ♦ వంబులట్లు
వాణి మాకావ్యమున కట్టి ♦ వన్నెఁబెట్టి
మమ్ము చరితార్థులను జేసి ♦ మనుచుఁగాత.

—★—

# జగత్ప్రవృత్తి

జగము మాయాప్రధానమో । స్వప్రకాశ
కమొ చిదాభాసరూపమో । కాంచలేము
సొగసులను దీని వర్ణించి । చూపలేము
శాప మిడి దీని యుద్ధతిఁ । జంపలేము.
ద్వాదశార్కులు కబళించి । వైచుటకును
పదునొకండు రుద్రులఁ । దినివైచుటకును
వెస నవబ్రహ్మలను మ్రింగి । వేయుటకును
యుగయుగాంతరముల । మార్చి నెగడుటకును
కాలమున కిది తోడ్పడెఁ । గాదె మఱియు
ధూమకేతునిపాత ని । ర్ఘాతములకు
ప్రళయమేఘౌఘ నిర్ఘాత । పతనములకు
చండ హాలాహలానల । జ్వాలలకును
రాక్షసామర సంగ్రామ । రంగములకు
నోర్చి యెప్పటి కప్పుడు । నుదయశిఖరి
బొడమ భాస్కరతేజఃప్రి । పూర్ణకళల
నైక్యమై వింతగాఁ దోచు । నట్టి జగమ
నీ కశాశ్వతపదవి రా । నేర్చు టెట్లు ?
ఒకట నీలోన నీశ్వరుఁ । డున్నవాఁడొ
ఈశ్వరునిలోన నొకట నీ । విమిడినావొ
చెప్పఁగాలేము. మాకది । చేతఁగాదు
నీవిచిత్రచరిత్రంబు । నీ ప్రసంగ
మభిమతార్థంబు లీజాలి । నట్టి వగుట
గీతమును గూర్చి పాడెదఁ । గేలు మోడ్చి
మంచి చేయుట కర్జమో । మాను టొప్పొ

తెలియ దాశాప్రధాన భూ ♦ వలయమందు
చూరగొనబడుచుండె క ♦ స్తూరి యుంట
పాపమెఱుఁగని హరిణ శా ♦ బకము కంటె
తగులముల నొందుచుండె దం ♦ తములు నుంట
తత మహాభీల మత్తదం ♦ తావళంబు
తెఱవబడుచుండె మంచిము ♦ త్తెములు నుంట
నబ్ధి డాఁగిన యాణి ము ♦ త్యాలచిప్ప
ద్రుంపఁబడుచుండె వాసనల్ ♦ దోఁగుచుంట
బంతి చేమంతి మల్లికా ♦ ప్రసవచయము
వీనిబట్టి విచారించి ♦ తేని గుణము
హానికారణ మయ్యె నే ♦ మనఁగవచ్చు
సృష్టియంతయు నీరీతి ♦ చెఁలగుచుండె
మేలు చేసినవారినే ♦ మ్రింగు జగము
చెలిమికానినె మోసంబు ♦ చేయు జగము
జగము తప్పన్నదే ♦ వృత్తి సలుపుచుండె
కోకిలము గ్రుడ్లు పొదుగంగ ♦ కాకికేల ?
జుంటితేనెను మానవుల్ ♦ జుఱ్ఱనేల ?
వృకమునకు మాంస మశనంబు ♦ బెట్టనేల ?
తరుణి గర్భాంతమున బిడ్డ ♦ దాఁచనేల ?
మనుజరక్తంబుచే నల్లి ♦ మనుచు టేల ?
ఏల యంచు విచారింప ♦ నేల జగము
ఏమిచేసిన సాగ దీ ♦ యిహమునందు
ఓషధీశుని మ్రింగు రా ♦ హువు కడంగి
అప్పుగొనువాని యిల్లు మ్రింగు ♦ నసలు వడ్డి
అన్ని భాగ్యంబులను మ్రింగు ♦ నల్పుహితము
హితము వలసినఁ గల్గ దై ♦ హికమునందు

# ప్రేమగానము

అగచయంబుల ప్రోతస్సు ♦ లరుగుదారి
శ్వాదలంబుల సురభిళ ♦ శ్వసనములను
చిగురుజొంపాల రాలెడు ♦ నిగురులందు
సాంధ్యరాగంబు రాగాన ♦ సమయునట్లు
ఇంపుసొంపార వీణ వా ♦ యించుచున్న
వెలఁది వ్రేళ్ళలో జీవంబు ♦ వెలయునొక్క
తంత్రిలే పాడుచున్నవో ♦ తలఁపరాదు
పాటకై కేకినోరె కా ♦ వలయునొక్క
పరభృతాంగనాగళమె కా ♦ వలయునొక్క
మ్రోడు వీణగ మార్చి యా ♦ మోహనాంగి
పాడుచున్నది నేల మ్రా ♦ న్పడిన జీవ
కోటి ప్రేమరసాబ్ధిలోఁ ♦ గ్రుంకిపోవ
పాటలోపలిసాహిత్య ♦ పంక్తులందు
అక్కరాలను రాలు నీ ♦ రై వధూటి
దానిలో ప్రతిబింబిత ♦ మైనపగిది
తోఁచుచున్నది కాంతి దో ♦ బూచు లాడ
తూగు నయనాబ్జముల కాంతి ♦ తొణకులాడ
గానవాహిని జగము శ ♦ ర్కరను నింప
దంపతులు మోదవార్ధియ ♦ ర్థింప వేడ్కఁ
జూచుచున్నవి చుక్కలు ♦ చూట్కు లలర
మబ్బుతెరలను దీసి, ప్రే ♦ మ యెదమోసి

నేననంత మహాక్లేశ ♦ నిరతవిరహ
దుర్నిమిత్తాల మొత్తాలు ♦ దూఁగి తూఁగి
పొంగి పొరలెడు దుఃఖ స ♦ ముద్రమందు
నిలుపు నీరయిపోవ త ♦ జ్జలధిలోన
నావయై యేగుచున్నది ♦ నా మనంబు
దానిపై నెక్కి యింతి కుం ♦ తలము లారఁ
బోసికొనుచున్న దెంతొ వి ♦ కాస మొప్ప
రాగ మానందవనులకు ♦ లాగుచుండ
వీణ నావను నడుపు చు ♦ క్కానిలీల
పంచుచున్నది నాద ప్ర ♦ పంచమునకు
నాదసంజనితాగ్ని చే ♦ నావ దగ్ధ
మై మహాతేజమున లీన ♦ మయ్యె తుదకు.

౧

తే. నగలకంటెను శీలమే ♦ సొగసు సతికి
సతికిపతికంటె వేఁరె దై ♦ వతము లేఁడు
సతి పతివ్రత గల్గుసం ♦ సారమరయ
స్వర్గ మగునంచు నార్యోక్తి ♦ చాటుసతము

౨

తే. రమ్యకమనీయ యౌవనా ♦ రంభవేళ
రవికలోనున్న పైటలో ♦ గ్రాలుచున్న
ఒత్తుకొని వచ్చునట్టి యా ♦ యువిదచనుల
చూచుకంబులు తలలూపి ♦ చూపుచుండె.

—✶—

# జాతీయవిద్య

చ. పొలముల గింజ లేరితిని ♦ పోయి కులాయములన్ వసించు ప
క్షులు మధుపానమత్తమతి ♦ జొక్కెడు తేటికొలంబు, వన్యభూ
ములఁ దిరుగాడుసత్వములు ; ♦ భూజములున్, సచరాచరంబులే
వలనను జాతివిద్య కుల ♦ పారముగాఁ బఠియించు నిత్యమున్.

మ. జననీవర్గము జన్మభూమిచయమున్ ♦ జాతీయ విద్యా సమా
ర్చనముల్ సేయుఁబ్రపంచమంతయు సము ♦ త్సాహంబుతోనందుమా
తెనుఁగుంబాస రసానుమోదమున నెం ♦ తే నింపు సొంపారు దీ
నిని పూజించెడువారిభాగ్య మిఁక ప ♦ ర్ణింపంగ సామాన్యమే.

మ. అరయన్ గోపదకోటి లోకమునఁగ ♦ ల్యాణంబు చేకూరఁ బ్రే
మరసోత్పాదిత జాతిగీతములు ర ♦ మ్యంబొప్పఁగాఁ బాడి సో
మరసాస్వాదనమత్త చిత్తు లెఱుగం ♦ గారానిమాధుర్య ధు
ర్యరసోత్సాహము నింప నింపొసఁగు కా ♦ వ్యంబన్న సామాన్యమే

చ. వనము రసాలసాలమునఁ ♦ బాడెడుకోకిలగానఫక్కి యిం
పును మఱి సొంపునింపు నవ ♦ మోహనగీతము కోవిదుండు పా
డును నిదురించుసంఘము క ♦ డుంగడు భావరస ప్రపూర్ణమై
కనులను విచ్చి చూచు రవి ♦ గాంచినపద్మచయంబుకైవడిన్.

శా. జాతీయప్రతిభా విభాసగుణ వి ♦ జ్ఞానప్రదంబైన వి
ద్యాతేజస్సముదాయ మజ్ఞులు దివాం ♦ ధఃప్రాయులౌ వారికిన్
ప్రీతిన్ గూర్పకపోవుఁగాక నిజ మా ♦ తృప్రేమతో పాటు స
చ్చేతంబుల్ వికసించు దానను ప్రకా ♦ శించున్ స్వసంఘౌఘముల్

సీ. గగనవీధిని సుధా ♦ కరుడుఁ వెన్నెలఁగాసి
భూమి నానందాబ్ధి ♦ ముంచినట్లు
మొల్లమల్లెలు గులా ♦ బులు నొత్తుఁగా బూసి
వెలలేనిచెలువు గా ♦ వించినట్లు
మధుమాస సంధ్యా స ♦ మయ రాగరుచి రాగ
రుచి ప్రజామతియందు ♦ నునిచినట్లు
జంత్రపాంచాలికా ♦ చయము సుధామధు
రసము పాత్రలఁబోసి ♦ యొసఁగినట్లు

తే. నేత్రపర్వంబు పులకిత ♦ గాత్రమహిత
మానసికసమారాధన ♦ మండితంబు
దివ్యసౌఖ్యంబు నిచ్చు జా ♦ తీయవిద్య
అట్టివిద్యనే సంఘంబు ♦ లాశ్రయించు

సీ. వనధిలోపలముగ్గి మణులు తీసినరీతి
నిసుకలో బంగార ♦ మేరినట్లు
అరటులనుండి క ♦ ప్పురము గైకొనుభాతి
పూలలోపలి తేనె ♦ బొందినట్లు
తారలలో నరుం ♦ ధతిని జూపినమాట్కి
లతలయందత్తరు ♦ లాగినట్లు
కుటజములనుండి రం ♦ గుల నెత్తు కైవడి
పాలలోపల వెన్న ♦ బడసినట్లు

సీ. స్వర్గంబుతో బోలు ♦ సౌధంబు నందన
వనముతో నెనసెడు ♦ వనము మాకు
గాంధర్వసదృశమౌ ♦ గానంబు వివిధ వి
జ్ఞాన పరిసంగ సం ♦ గతులు మాకు
అమృతసన్నిభ ఫలా ♦ హారాన్నతో యముల్
సొబగైన సకల వ ♦ స్తువులు మాకు
నిరత మానందంబు ♦ నిత్యకల్యాణంబు
పచ్చతోరణముల ♦ పంక్తి మాకు

తే. దేశభాషలఁ దెల్గట్లు ♦ దీసినారొ
లేక సహజమాధుర్య ర ♦ త్నాకరంబు
గలదొ గీర్వాణవా ♦ణి నౌ గాదనంగ
జేయుచున్నది యొండేది ♦ సేయలేదు

తే. అఖిలభాగ్యాలవాలమై ♦ యలరుమాకు
నీప్సితార్థము లేవేళ ♦ నిచ్చు మాకు
అట్టి జాతీయవిద్య మా ♦ యాత్మలందు
నిలుచుఁగావుత తేజంబు ♦ నిలుచునట్లు

—★—

## సంశయము

౧

ఈ మంచు కొండల్లో
ఈ మిట్ట పల్లాల
ఈ మబ్బు యీ మాపు
ఈ మాడ్కి నేనుండిపోనా
ఈ ముసుగులో నేకలిసిపోనా

౨

ఈ చెట్లు ఈ తీగ
లీ చేల ఈపూల
ఈ చిత్ర చిత్రాల
జూచి నే నాగిపోనా
వేచి నేనై కలిసిపోనా

౩

ఈ గొడ్డు గుహలలో
ఈ గోగు పొదలలో
ఈ గోరువంకల
మూగి నే నుండిపోనా
ఈలాగు నేనిం దాగిపోనా

౪

ఈ యేటి దారుల్లో
ఈ యెల్లు లీ పుల్లు
లీ యిసుక పుంతల్లో
నాయంత నే దూరిపోనా
నాయంత నేనై యుండిపోనా

౫

ఈ చంచు మూకల్లో
ఈ చిమ్మ చీకట్లో
ఈ చట్టు బండల్లో
నాచికో నుండిపోనా
దాచికో నుండిపోనా

౬

ఈ యేరు గాలిలో
ఈ యడవి వీథుల్లో
ఈ యాకు పొదలలో
నే యొంటిగా నిల్చిపోనా
నే రాయినై కలిసిపోనా

౭

ఈ కారు మేఘాలలో
ఈ కొండ పొంతల్లో
ఈ కోదు కొంపలా
నాక మంచెంచుకోనా
యేకమై నే యుండిపోనా

౮

ఈ పక్షి పాటల్లో
ఈ పూల చెట్లల్లో
ఏ పూట కాపూట
నే పాడుకొని నిల్చిపోనా
ఈ పాటలో నే కలిసిపోనా

౯

ఈ తిప్ప లీ తిన్నె
లీ తీరు సెలయేరు
లీ తోట లీ పేట
లేతావులని చూచుకోనా
నా త్రోవలనె నే వెళ్ళిపోనా

౧౦

ఈ పుణ్య భూముల్లో
నా పూజ సలుపుచూ
ఈ పండు ఫలములా
నా పొట్ట నింపుకోలేనా
నా ప్రొద్దు నేగడపుకోలేనా

౧౧

ఈ పంట కోలతో
ఈ పొలము పండించి
నా పాటచే జగము
నే పాలనము చేయలేనా
నేనా ఆలీషా నౌన కాన.

—★—

# విరహము

చ. అసువులు నోటవచ్చినవి ♦ యక్కట నీకయి నిల్చియుండె నో
బిసరుహనేత్ర నేచనిన ♦ వెన్కను వచ్చిన లాభమేమి నిన్
కనిమన వీడునే వలపు ♦ నన్ గలశక్తి నినున్ దహింపఁగా
ససియని రాకపోయిన శ్మ ♦ శానమునొద్దకు రాకపోదువే



# జీవగీతము ౨

1. మురళిచే వినుకథ కట్టు ♦ మొదలుపెట్టె
తన వియోగార్తి వెలిఁబోసి ♦ కొన గతంగె
వెదురుబిడెమున నను గోసి ♦ నదియె మొదలు
అస్మదాప్తవిషాద స్వ ♦ రాప్తివలన
నశ్రువులు రాల్చుచున్నవా ♦ రాలుమగలు
ఏను కోరిన దేమంటె ♦ యీయురమ్ము
విరహమున ముక్కముక్కలై ♦ వెలసెనేని
అస్మదాప్తవిషాదంబు ♦ నన్వయింతు
ఎవఁడు నిజనివాసమును బాసి ♦ యేగునొక్క
వాఁడదేచోటు తిరిగి పో ♦ వఁగఁ దలంచు ॥ముర॥

2. నే ననేకులతోఁ గూడి ♦ యేడ్చినాను
మంచిచెడ్డలవారితో ♦ మసలినాను
గాని నాకొక్కఁడును మిత్రు ♦ డై నఁవాడు
గానరాలేదు తన యను ♦ మానమందె
నిలిచి యెవరును నాగుట్టు ♦ తెలియలేదు
నారహస్యము నాయశ్రు ♦ ధారలకును

వేరుగాలేదు గాని యీ ♦ వీక్షణములు
శ్రోత్రములకది నిర్ణయిం ♦ చుటకు రాదు
తనువునకుఁ బ్రాణమును బ్రాణ ♦ మునకు తనువు
దాగి లేదు గాని కనెడు ♦ దారి యెవరి
వాడుకను లేదు చూచిన ♦ వారు లేరు ॥ముర॥

3. ఈ మురళినాద మునురు గా ♦ దింగలంబు
ఎవనియొద్దను నీయగ్ని ♦ యెసఁగఁబోదొ
వాఁడధోగతిఁ బడి చెడ ♦ వలసి వచ్చు
కూర్మిగల యగ్ని మురళిలోఁ ♦ గూర్పఁబడియె
ప్రేమఁగలమత్తు సురలోనఁ ♦ బెట్టఁబడియె
ప్రియుని బాసినవారి కీ ♦ వేణు వాప్త
శరణమగు దీనితెరలు మా ♦ తెరలుచించె
మురళివంటి విషాగ్ని యె ♦ వ్వరును గనరు
మురళివంటి కృతజ్ఞ నె ♦ వ్వరును గనరు
మురళితెరవున రుధిరోక్తి ♦ ముచ్చటించు
'మజును' విరహార్తిచరితంబు ♦ మాటలాడు ॥ముర॥

4. మురళివలెఁ బల్కుదాని మే ♦ మిరుమొగంబు
లున్నవని యెంతు మొకటూదు ♦ చున్నవాని
నోట దాఁగె రెండవకొన ♦ పాటమిషను
బాష్పములు రాల్చుచున్నది ♦ బయలునందు
దీని నాదృష్టిగలవారె ♦ తెలియగలరు
దీనిమర్మ మామర్మము ♦ లోనఁ గలదు
దీనిరవ మాత్రఁ డూదుట ♦ లోనఁ గలదు

నిస్పృహుఁడు గాని యాస్పృహ ♦ నేరఁ డెపుడు
పలుకు వెలఁబెట్ట చెవిగాక ♦ గలరె యొరులు
ఈ మురళినాదమున ఖేద ♦ మెసఁకున్న
జగతి చక్కెరతో నింపఁ ♦ జాలకున్నె ॥మురళి॥

5. మావగను పెక్కుదినములు ♦ మాసిపోయె
మావిపత్తులఁ బెక్కెండ్లు ♦ మరలిపోయె
ఎన్నినాళ్ళేగినను భయ ♦ మెఱుఁగవైతి
వీవు పూతుఁడ వని మది ♦ నెంచుకొనుము
బంధము త్యజించి స్వాతంత్ర్య ♦ పదవి గనుము
ధనమునకు దాసుఁడై యెన్ని ♦ దినములుందు
వబ్ధి గాజుపాత్రను నింప ♦ నదియునొక్క
దినము సరిపోవు వ్యయము జేసి ♦ నను నీవు
ఆశయను పాత్ర నింపఁబో ♦ దరయ శుక్తి
యందు తలమున్నఁగాని ము ♦ త్యములు గావు
ప్రేమచే వేనిదుస్తులు ♦ పిగులునొక్క
యతని కాశామలీమస ♦ మణఁగిపోవు
సుఖివగుము ప్రేమ మాయాత్మఁ ♦ జొచ్చి నీవు ॥మురళి॥

—✶—

# నా కేటి సిగ్గు

ఆచికొంటిని ప్రణయ ర ♦ త్నాలగనుల
కొల్లఁగొట్టితి ప్రేమ ని ♦ గూఢసీమ
దోఁచుకొంటిని విరహకా ♦ ణాచిఁ జూచి
సంగ్రహించితి రాగ ర ♦ సంబుతంబు
పాలుగూడితి ప్రణయ ర ♦ త్నాలగనుల
నింక నస్తేయ మేది నా ♦ కేటిసిగ్గు
ఇంక వ్రతభీతి యేది నా ♦ కేటియెగ్గు
మేఘముల తొంగిచూచెడు ♦ మెఱపుపసిఁడి
కుసుమసతు లిచ్చు పుప్పొడి ♦ కుంకుమంబు
కులుకుబేడిసమీల కొఱం ♦ దళుకు వెండి
శర్వరీకన్య తలమీఁది ♦ చంద్రవంక
నెచ్చెలీ ! నీవని యెఱింగి ♦ నెమకినెమకి
దోఁచుకొనిపోయి దాచుఁకో ♦ జూచినాను
ఇంక నస్తేయ మేది నా ♦ కేటిసిగ్గు
ప్రకృతిజవరాలి కేదార ♦ రాగరసము
రిక్కగము లంటి రాచు గో ♦ రింట కెంపు
కలువ వగకాని తేట వె ♦ న్నెలలసుధలు
అబ్జసన్నిభ విహృతివే ♦ ణ్యంబకములు
నెచ్చెలీ నీవని యెరింగి ♦ నిలిచి నిలిచి
దోఁచుకొని పోయి దాఁచుకో ♦ జూచినాను
ఇంక నస్తేయ మేది నా ♦ కేటిసిగ్గు
ఇంక వ్రతభీతి యేది నా ♦ కేటి యెగ్గు.

—★—

# ప్రాతివ్రత్యము

చ. సతులు వివేకవంతులును ♦ సాధ్వులు గావలెఁ గాని విద్యయే
గతి యనరాదు గృహ్యమగు ♦ కార్య మనుశ్రుత మభ్యసించి స
చ్చతురతతోఁ బనుల్ సలిపి ♦ చారుయశంబును పొంది మంచి సం
తతి గనుచుండగా భరత ♦ ధాత్రి కొఱంతల నెంచనేటికిన్.

క. మీతల్లి మీవిధంబున
వ్రాతయు విద్యయు కవిత్వ ♦ పద్ధతి గనియే
ఖ్యాతిగ మిము గన్నదొ సతి
యై తనతల్లివలె గన్న ♦ దారయవలదే.

తే. విద్యలేనట్టి యువతులు ♦ విధవలనుట
సభ్యమే నాతిజాతికి ♦ సరస మెఱుఁగ
కూరకే చేతికొలఁది వ్రా ♦ యుటకు జంకు
వలదె కోవిదతతి లేరె ♦ వసుధయందు.

తే. స్త్రీ కవస్యంబు చదువని ♦ చెప్పవలయు
చదువు వలదని వారించు ♦ సారమతులు
లేరు మనధాత్రి నిప్పుడు ♦ భారతాఖ్య
భూమి క్రమముగ నభివృద్ధి ♦ బొందుచుండె.

క. చదివియు నజ్ఞానముబడి
పదపడి భ్రష్టైయిన స్త్రీలు ♦ వారాంగనలన్
పదుగురఁ గాంచగలేదే
చదువు వివేకంబు వలయు ♦ సత్సంతతికిన్.

ఆ. చిలుక చదువగలదు ♦ చిన్నారి శారిక
శాస్త్రచర్చ సేయ ♦ సాహసించు
ముద్దుపళని మున్ను ♦ ముద్దరాండ్రును విద్దె
నేర్చియున్న గుణము ♦ నేర్చినారె

క. నీతికి విద్యకు పరిచయ
మేతీరుననైన లేదు ♦ హీనాత్ములు దు
ర్జాతులకు విద్య ♦ యుండిన
నీతి యలవడదు విరించి ♦ నేర్పిననైనన్.

క. పుట్టకనుండి వివేకము
పుట్టఁగవలెఁగాని మధ్య ♦ పుట్టదు విద్యన్
దుట్టతుదకు చదివిన ని
ప్పట్టున వాదించువారి ♦ వాదము చదురే

క. తెలియని యంశంబులలో
తెలిసినయటులన్ నటింప ♦ ధీరగుణంబే
మలకలు తగులంబెట్టిన
బలుకోశాగార మేదొ ♦ బలుకగవలదే

తే. ధనము దేశంబు విజయ సా ♦ ధనముచేత
తురక లార్యులయట్లు సం ♦ గరమునందు
బడసిరే గాని గ్రంథముల్ ♦ బల్కిగాల్ప
లేదు నిజ మింకను తెలియ ♦ లేదు మీకు

క. సతి సభకేగుట లజ్జా
వతి కది సంగతము గాదు ♦ భరతావనిలో
పతియన్న గౌరవము స
ద్వ్రతము ననుశ్రుతముగాను ♦ వచ్చుటకతనన్.

తే. గార్హ్యకృత్యముల్ కులకాంత ♦ గాక యొరులు
చేయఁజాలరు సద్విద్య ♦ చిన్ననాఁడె
తల్లినేర్పును నదియెపో ♦ తరుణులకును
భూషితం బగు సభ కెక్క ♦ దూషితంబు

క. ఏనాటిసతులు సభలను
న్యూనాధికపక్క గదిరి ♦ నుడివిరొ మనకున్
జ్ఞానోదయకాలం బపు
డేనాఁడొ వదలిపోయె ♦ నే లీ యుబుసుల్.

సీ. ఆ నాటి యజ్ఞంబు ♦ లీ నాఁడు నున్నవా
వానియర్థము మన ♦ వల్లగాదు
ఆ నాటి పెండ్లిండు ♦ లీ నాడు నున్నవా
వానిచైదము మన ♦ వల్లగాదు
ఆ నాటి రణవిద్య ♦ లీ నాడు నున్నవా
వానివైఖరి మన ♦ వల్లగాదు
ఆ నాటి జాత్యైక్య ♦ మీ నాడు మన్నదా
వానిసంగతి మన ♦ వల్లగాదు

తే. నాటిరాజ్యాంగ నీతియు ♦ నాటిపక్క
యేదియును మనవల్ల కా ♦ బోదు గాన
ఆ దినంబు లా కాలంబు ♦ లరిగె నిపుడు
ప్రస్తుతపురీతి నవరింప ♦ వలయు జాతి.

క. శ్వేతముఖాంగనవలె మన
శాతేక్షణకున్ హితంబు ♦ సలిపిన నది వి
ఖ్యాతయశం బిడ దిల నే
జాతిఖగం బట్లు పలుక ♦ శ్లాఘ్యముగావే.

ఆ. కోయ కొండజాతి ♦ కోమలు లాత్మనా
థులును పరులు నృత్య ♦ ములు నొనర్చ
నట్లె శ్వేతముఖులు ♦ నల్లారుముద్దుల
నాట్యమాడుదు రదె ♦ నాగరికత.

శా. గోషాపద్ధతి మంచిదంచు వడి మీ ♦ కున్ జెప్పగాలేము సం
తోషంబార వివేకులైన తమతో ♦ తుల్యోన్నతిన్ బొందు స
ద్యోషారత్న సభాంతరంబు నరుగన్ ♦ యుక్తంబు కాదేని దు
ర్దోషం బన్యులతో సయాటము సదు ♦ ద్యోగంబుగా దింతికిన్.

ఆ. గర్భధారణంబు ♦ కడుకష్టమునకాన్పు
పాలు నీరు పోయు ♦ పనుల నింట
కష్టపడఁగ నింతి ♦ నొష్టవ్రాసిన స్రష్ట
సృష్టి తెగడవలయుఁ ♦ జేడెలార.

తే. బ్రహ్మచర్యంబు వనితకు ♦ బనికిరాక
కాదు బ్రహ్మచారిణియైన ♦ కాంత లితర
దేశమున నెట్టులున్నారొ ♦ తెలియవలదె
వలదు మనకట్టి యగచాట్లు ♦ కలలనైన.

క. సతి యతికావచ్చును దు
ర్మతు లామెను బట్టి బల్మి ♦ మానము జెరుపన్
గతియేమి పురుషయతి కా
గతి పట్ట దరాజకంపు ♦ కానలనైనన్

తే. కడుపులోపల చల్లైన ♦ గదలకుండ
హాయిగా నాంగ్ల రాజ్యాన ♦ నలరుకతన
నెన్నియేనియు నవరణల్ ♦ పన్నవచ్చు
కాని కాలధర్మముఁ జూచి ♦ కడఁగవలయు.

తే. మీ కవిత్వంబు మీ విద్య ♦ మీ ప్రబోధ
మందముగ దోచె మాకు నా ♦ నందమయ్యె
నందులోపల మా హిత ♦ మరయుటకును
వ్రాసియుంటిమి గాని దూ ♦ రగను గాదు



# రేపు

౧

మాకు ఇచ్చేదేమి ?
మాకు నచ్చేదేమి ?
మాకు వచ్చేదేమి ?
మాకు బిచ్చంబేమి ?
పెట్టబోతారా ? లేక
కట్ట వస్త్రార ?

౨

మాది మాకుండేది
మాసొత్తు మాసొమ్ము
మాసొంత పొలములు
మాది మాకిచ్చేది
మాకు చెప్పాలా ? లేక
మీకు చెప్పాల ?

౩

మావారి రక్తంబు
మా వారి కండలు
మావారి ప్రాణాలు
ఈనేల బలివేసి
ఈభూమి తెగకోసి
ఈపొలములో దోసి
మేము గడియించి ; ఇటి

మేము నివసించి
పండించినాము ఈ
ఎండిపోయిన బీళ్ళు
ఖండించినాము దో
ర్దండరక్కసి రాళ్ళు
నిండించితిమి ప్రేమ
రసవాహినులనేల
స్వర్గలక్ష్మిని దింపి
పూజించినాము, అట్లు
రూపించినాము.

౪

మా నెత్తురేరులు
మా కండపత్రవలు
మా యుద్ధభూముల్లో
మేము నడిపించి
మేము సాగించి
మేము లంఘించి
మా జన్మహక్కును
మేము గడియించి
మాకున్న తేజంబు
మేము చూపించి
మాకున్న శౌర్యంబు
మేము నడిపించి
మా యెఱ్ఱజెండాను

మేము ఎగరేసి
మా శక్తి మారక్తి
మేము కనపర్చి
మా జన్మహక్కును
మేము గొన్నాము
మా జన్మసొత్తును
మేము గొన్నాము

౨౩

దివి నున్న గంగను
నేల దింపాము
మందిరము సావేలు
మలిపించి నాము
వాసుకిని కవ్వంబు
గా గొట్టినాము
రాకాసిమూకల
కడతేర్చినాము
మిన్నంటిపోవగ
మెట్లు గట్టాము
వింధ్య హిమాలయా
లెక్కి ఏలాము
హాలాహలంబులా
ద్రావి చూచాము
సప్తసముద్రాల
దాటివెళ్ళాము

అలంక యీలంక
కలచివేశాము
సామగానంబుల
చేసి విన్నాము
సోమకాద్యసురుల
చూరగొన్నాము
త్రిపురాసురుల మట్టి
పాతేసినాము
శరవాహినుల నీడ
మేము పెరిగాము
అరిశతఘ్నులు రొమ్ము
ఎదురొడ్డినాము
మమ్ము నేలంటేసి
మా సౌరు కడతేర్చి
మా సంగతిని మార్చి
మా పైని ప్రళయాలు
మా పైని ఘోరాలు
అగ్ని కురిపించి
మము పరీక్షించి
చూచితివి కాలంబు
ఏచితివి బాణాలు
రాచితివి నేలంట
ఆ చిత్రచిత్రాలు
ఆ అష్టకష్టాలు
అనాటినుండి మా

ప్రాణాలపై పిడుగు
లెన్నిటినో రాల్చి మా
చెన్ను కడతేర్చినా
మాపేరు మాడదు
మాజాతి మాయింప
గా లేక పోయావు
నీవల్ల కాదింక
నీశక్తి లే దింక
మేము మారాజ్యంబు
నేలుకొంటాము
జగ మాచికొంటాము

౬

కొనవూపి రుంటేను.
కొనచూపు లుంటేను
విను ఓపికుంటేను
డబ్బంత మీయింట
మబ్బంత మాయింట
బెట్టుకొంటామా
తనబిచ్చ మడిగెదయా ?

౭

రాట మెత్తిననాడె
అరాట మెత్తెను మీకు
కాటకం బాసాడి
తోక ఝాడించి

మీ త్రోవ పట్టించి
మీ చెంత చేరింది
ఆదెబ్బతో మీరు
దొబ్బి వేసారు
ఆ దెబ్బతో మీరు
సాగిపోయారు

౮

దినవెత్స ముంచేను
తినకూడు కనబడితె
ఇను వెంట బోవుచు
మనచూచు మాపల్లె
జనము కాపాడెటం
ఘన శాశనంబేది ?
గావించినారె మమ్ము
వీక్షించినారె.

౯

ఆ కంచురథములు
ఆ కారుమెకములు
నల్లేరుపై బళ్ళు
నడిపించినారు
పాతేరులను బట్టి
పీడించినారు.

౧౦

రాగలలో నున్న
రాగాలు మీగుండె
లాగేటి పికెటి
నాగేటిచాలల్లో
మాగొంతుకల కోత
క్రొన్నెత్తురుల మోత
లో దాగియున్నట్టి
యోగ మాయశక్తి
మీగొంతుకల పట్టి
సాగి దీసేరోజు
వేగిపోయె ఫౌజు
లాగివేసే రాజు
మీరు గంటారా ?
మీరు వింటారా ?

౧౧

నెలవంక నుదురుబా
వలిగ్రాలు చెవులు చే
రలగొల్చు కనులు చా
రలగొల్చు కురులు ఆ
తిలకంబు నుదిటిపై
నలుసంత చేర్చుకక్క
నలుపుతో చెక్కిళ్ళు

వెలయించు సింగారు
గల కాటుకల సారు
తులలేని బారు న
వ్వులపారు రస సము
జ్వలమైన సెలయేరు
ఎలజవ్వనపుతీరు
కలిగెడు బంగారు
పొలముల కాచు
కాపుల తెలుగునేల
వెలలేని వెలయాలి
తెలతెల్లబోయేటి
తులువల కలకట్టి
కలగూరగంపలో
పలనుంచి దుగ్గాని
వెలకమ్మి అంగళ్ళ
గల సోయగముజూచి
వెలయించు కాలంబు
తలచేవు చూచేవు
ఆలీషా పాటలో
నైక్యమై పోయి
ఆనందవశమయి పోయి.

—★—

# గాంధి

ఉ. పూజితమై దిగంతముల ♦ బ్రోయ సహాయ విదూరచారు వి
భ్రాజితపుణ్యమార్గము స్వ ♦ రాజ్య రథంబున గాంధి యెక్కె రం
డో జనులార ! యంచును స ♦ ముజ్జ్వలశైలిని బిల్చుచుండె మీ
రా జనకున్ మహాత్మకుని ♦ వెంట పదండి కరంబు మేలగున్

శా. ఇంద్రుం డప్పుడు గొల్లపల్లెపయి రా ♦ యిన్ రప్పలున్ రువ్వ ని
స్తంద్రుండై నమురారి కొండ తన త ♦ ర్జన్యగ్రమం దెత్తి ధీ
సాంద్రుండై ప్రజ గాచినట్టుల కరమ్ ♦ చంద్గాంధి మిమ్మెల్ల నా
చంద్రార్కంబు సముద్ధరించును స్వరా♦జ్యంబున్ బ్రతిష్ఠించియున్

మ. తనదేహం బణుమాత్రమైనను మహా ♦ త్మాగాంధి యధ్యాత్మ వి
ద్యను బ్రహ్మండ శరీరుడై భరత దే ♦ శానర్థమున్ బాపగా
ఘన యజ్ఞం బసహాయమంత్రమున దా ♦ గావించుచున్నాడు వే
జనుడీ క్రూరనిరంకుశ ప్రభు దురా ♦ చారాజ్యమున్ బోయగన్.

సీ. హిందూముసల్మాను ♦ లేకమైనా రన్న
గాంధీమహాత్ముని ♦ కతనగాదె
మధుమాంసములు మెక్క ♦ మానివేసి రటన్న
గాంధీమహాత్ముని ♦ కతనగాదె
అన్యదేశపుబట్ట ♦ లంట మాని రటన్న
గాంధీమహాత్ముని ♦ కతనగాదె
దాస్యశృంఖలత్రెంచి ♦ తల్లిఁగాచి రటన్న
గాంధీమహాత్ముని ♦ కతనగాదె

గీ. ఆపదలుబాసె నిహసౌఖ్య ♦ మబ్బెనన్న
గాంధికి జయ మనియెడు శం ♦ ఖమున గాదె
అతిపవిత్రమైన స్వరాజ్య ♦ మబ్బెనన్న
గాంధికి జయ మనియెడు శం ♦ ఖమునగాదె.

సీ. శాసనసభలు మీ ♦ సాలపై తేనెలు
కుక్షింభరుల కొల్వు ♦ కూట మనియు
ఆంగ్ల కళాశాల ♦ లవి గులాంఖానాలు
బానిసీలకు రచ్చ ♦ పట్టు లనియు
బ్రిటిషు కోర్టులు జ్యూత ♦ గృహకదంబంబులు
కలి! పేరితుల కది ♦ కాణయాచి
బిరుదులు విందులు ♦ నుఱిపోత్రయుతాత్రిళ్ళ వి
ఖూనిక్రై దీల సం ♦ కులము లనియు

గీ. వీని వర్జించి బ్రతికెడు ♦ విధము జూపి
రాట మను విరాట్పురుషు నా ♦ రాధనంబు
నేర్పినాడు విజ్ఞానంబు ♦ నేర్పినాడు
సౌందర్యగుణకంధి శ్రీ కరం ♦ చంద్రగాంధి.



# ప్రకృతి విలసనము

చ. సలలిత శక్రనీలమణి ♦ సన్నిభమైన నభంబునందుఁ దా
రల మఱపించి మించు తిమి ♦ రంబును రూపడఁగించి కాంచనో
జ్జ్వల జలజాత పుంజముల ♦ ప్రజ్వలతన్ దొలఁగించి వేడ్కతో
గలువలతేఁడు వెన్నెలలఁ ♦ గాయును మోదముతోడ నైక్యమై.

చ. జలకములాడు తామరల ♦ చాడ్పునఁ బ్రేక్షణమాలికామనో
జ్ఞ లసితమండలంబులు భృ ♦ శంబుగఁ దన్ని జనాథుపైఁ దమిన్
జిలుకుచుఁ జంచలేక్షణలు ♦ చిత్ర లస త్పరిరంభసంభ్రమం
బులను వెలార్చునప్పుడు ప్ర♦మోదము లీసము జెందు కాంతితోన్.

ఉ. వారని ప్రేమలూరు వన ♦ వాటికలన్ జెలువారు చారు కా
సారములన్ మృణాళములు ♦ సాగి సరోజములన్ వెలార్చు సిం
గారము మీరునప్పు డవి ♦ గానము సేయుచు నున్న యప్పు డిం
పారురసంబు మోదమున ♦ నైక్యము నొందు విలాస మేర్పడన్.

చ. అరవిరులందు సూర్యకిర ♦ ణావళి బంగరుమేలిపూఁతలన్
బరపి నవీనసౌరభము ♦ పాదుకొనన్ బచరించి సంధ్యలన్
దరుణ విలాస కాంతుల న ♦ జాండము ముంచి ప్రచండదీధితుల్
తొరగి మనోహరం బగుచు ♦ దోచు రసం బెనయించుఁ గాంతితోన్.

చ. అలిగి లతాంగి వెండియు ద ♦ యారస ముప్పతిలంగ నాథుపైఁ
గలిగిన ప్రేమఁ బట్టక వి ♦ కాసముఖాబ్జమునందు లేత న
వ్వొలయ నొయారమున్ వెలికి ♦ నుమ్మలికంబుగ సంతరించి క
న్గొలుకుల నీరు నించుతరి ♦ గూర్కొను హర్షముతోడఁ దేజమున్.



## ఎవరు?

ఎవరు నవ్విరి ? ముత్యాల ♦ నెవరు రాల్చి
నారు దోఁగు నీ యెల జవ్వ ♦ నంబు ధవళ
కేతకీధూళి నెనసి యీ ♦ రీతి సొగసు
సాంధ్యరాగాల రాగాల ♦ సంతరించి
ఎగురుచున్నది వాసనా ♦ హ్నిక సుషుప్తి
మైమఱచిపోయె భ్రమర మిం ♦ కేమిపాడు
కీటకం బిది దగ్ధ సం ♦ కీర్ణరాగ
రససముజ్జ్వలమైన యీ ♦ రజని తమసు
హస్తములు చాచి యెలుఁగెత్తి ♦ స్వస్తి చెప్పె
నింక ప్రేమపాఠాలు కో ♦ యిలకు నేర్పి
పంపె నెవ్వరు ? ఈ నవ్వు ♦ పట్టరాని

అట్టహాసాల దోయిళ్ళఁ ♦ బెట్టి లాజ
లవె తలంబ్రాలు జల్లు ♦ నీలవలినూత్న
పుష్పలావికకేసి యే ♦ మోము వెట్టి
పళ్ళు నికిలించు నొకరేయి ♦ పట్టు గ్రహణ
కాలమని యెంచదేమి ? శృం ♦ గారరవ సు
ధా సముత్సవ మెద ముద్రి ♦ తంబులైన
మచ్చలను మాపఁగలదె యే ♦ మాపుకైన
నవ్వు ముత్యాలు నొడులందు ♦ నివ్వటిలఁగ
ఏరు ద్వారాలు విప్పి రా ♦ రేమిచెప్ప.



# కావ్యము

చ. కచ కుచ వర్ణనాలసిత ♦ కావ్యము లెన్ని తెలుంగుబాసలో
ప్రచురములై వెలార్చుచు ప్ర ♦ పంచమునందు చికాకుసేయ వా
ప్రచురము ప్రాతదప్పటము ♦ భ్రాంతిని దెచ్చియుకొత్తకుండలో
వచనము జేసినట్లగు సె ♦ బాసన నొప్పు చరిత్ర లారయన్.

చ. కవియుఁ జరిత్రకారుఁడు యు ♦ గంబును దేశము కాలభేదముల్
దవిలి విమర్శఁజేసి తన ♦ దారికి వచ్చు ప్రమాణవాక్యముల్
సవరణఁ జేసి వ్రాయు స్తవ ♦ శల్యపరీక్షలఁ జేసిచేసి యా
జవమును లేఖినీలసిత ♦ సంగతి గాంచి నుతింత్రు సత్కవుల్.

మ. ఘను లౌనౌనన నొక్కపూతమగు స ♦ త్కావ్యంబు నిద్రాత్రిఁ జా
లును, పెక్కేల ? నుళక్కి పాత్రములు వే ♦ లున్ వందలున్ బోసి
యచ్చున గుద్దించెడు కొలుకట్టలవి బూ ♦ జుల్ పుర్వులున్ బట్టిపో
వును కాలంబె విమర్శసేయు సదస ♦ త్తూజ్యప్రకారంబులన్.



# విమర్శకుని కలము

పాచకుని చీపు రిది శుభ్ర ♦ వస్త్రములకు
వెల్ల వేయ వచ్చెను నిలు ♦ వెల్ల నదిగొ
గాలిచే ప్రచలితమై వి ♦ కాస వికచ
మైన నెమలి పింఛముతో స ♦ మాన మనుచు
పోల్చు హాస్యగాని వచస్సు ♦ పోలె నీ వి
మర్శకుని చేతికలము క్రు ♦ మ్మరెడుగంటె
ఈ యుషస్సు సంధ్యారాగ ♦ మిరుల నెనసి
వెలుగు చీకట్లు పురుడించు ♦ వేగు చుక్క
చక్కగా నొష్టనిడుకొన్న ♦ సోయగంబు
నవ్వులో పెట్టి యెగతాళి ♦ నివ్వటిలఁగ
ఈ యుజంతము మేల్ముసుఁ ♦ గో యనంగ
దాల్చి పలికెడు నీ ప్రేమ ♦ పాఠములను
కుంచెతో రాగరసము నే ♦ కొంచమైన
పూయఁగలవారు గలరె యే ♦ ప్రొద్దుకైన
ఇదిగొ మైరేయ భాండంబు ♦ ఇది ప్రశాంత
మైన మధుశాల యిందు వే ♦ దాంతు లుండు
కొలువు కూటంబు జవరాండ్ర ♦ కురుల రాలు
కుసుమ సౌరభ మదె ♦ నొష్ట కుంకుమంబు
పదములను గ్రాలు పారాణి ♦ పట్టు పగ్గ
ములు వెలార్చెడు జవ్వన ♦ ముల విలాస
లాలసంబు తొల్కారు మే ♦ ఘాల మెఱపు
తీగ రతనాల కమ్మల ♦ వేగు లందు
గుల్కు ప్రణయిని వెట్టిన ♦ కోపరసము

నీరసము సేయఁదగునె యె ♦ వ్వారికైన
ఈయమోఘ జీవిత నిర్ఝ ♦ రీయ సుప్ర
శాంతి నట్టేట పారి బా ♦ హ్యాంతరముల
పొంగి పొర్లి పొలాల వా ♦ పోవునట్లు
జేరి కేదారముల నెల్ల ♦ జీర లొలయ
తిరిగి వెన్నాడి యీ వేడి ♦ తిన్నెలందు
పారుచున్నది తన పూర్వ ♦ వాసనా ప్రి
సక్తి వదలక యీ సము ♦ త్సాహమందు
ఏదొ ప్రళయంబు రూపించు ♦ నేదొ గొప్ప
నాశనంబున్న దీ రహ ♦ స్యాశయమున
ఎన్ని నేర్చినఁ దెలియ లే ♦ కున్నగాని.

-★-

# శుష్క పుష్పాలు

నేల రాలిన శుష్క పు ♦ ష్పాల వంక
నెవరు చూతురు ? దోయిళ్ళ ♦ నెవరు గొందు ?
రీ మహాతపదగ్ధార్త ♦ భూమి గ్రాగి
సమసి పోవలసినదె జం ♦ ఝూనిలాన
నెగిరి పోవలసినదె వా ♦ హినుల దోఁగి
చనవలసినదె సాగర ♦ సంగమముల
కింక గత్యంతరంబు వే ♦ ఱేమి కలదు
ఇంక మార్గాంతరంబు వే ♦ ఱేమి కలదు ?
వాసనల జిమ్ము లతలంటి ♦ వాలుగొమ్మ
లందికొని చల్లగాలి క ♦ ల్లారు ముద్దు
లొలుక నుయ్యాల లూగి న ♦ వ్వాలయ వికసి
తాకులను నెత్తి విశ్వం సౌం ♦ దర్య గరిమ
నీసడించుచు కేరి కై ♦ చేసి చేసి
కాలహతి రాలినట్టి యా ♦ పూల నెవరు
దీసికొందురు తొంటి యు ♦ దీర్ణభావ
భావరస వాహినులఁ దేలి ♦ పోవు నట్టి
సొగసు దిద్దగ లతనంటి ♦ నెగడు గనఁగ
నిమ్న సోపానములఁ బడి ♦ నిద్రవోవు
ఈ పరాగా వరోహ ♦ సు మాప జయము
వాసనలఁ గూర్చి తనదు సం ♦ దేశ మీ యు
జాండమునఁ బెట్టి పోవఁ గూ ♦ ర్చుండె కాని
గుణము గ్రహియించు వారు నె ♦ క్కుడుగ లేరు
పతనహతి పోవు వారిభా ♦ వముల యందు

పెద్దపెద్ద కోర్కులు తాంశ ♦ వించు నంతె
కాని కొనసాగ దందు నొ ♦ క్కటియుఁ గూఢ
ఈ పరాగంబు పుష్ప ప ♦ వృత్తి జేసి
వాసనల దోఁగి పరిణామ ♦ వాసరముల
దాగి తద్దీక్ష మృత్తికా ♦ రాగములను
మార్చుకొన్నది పూజ్యత ♦ గూర్చుకొన్న
దిదియె జన్మాంతరంబు ము ♦ క్తిత్వ మిదియె
ఇదియ వస్తువు ; వస్తువౌ ♦ టిదియె తునిగి
రాలినట్టి పువ్వు లవె ప ♦ రాగ రూప
మున సుధాకలశంబులై ♦ పువ్వు బోండ్ల
మస్తకము లెక్కి సొంపారు ♦ మధుసమృద్ధిః

—★—

# ప్రకృతి పాడిన గీతము

ఎదుటివానిపచ్చను జూచి ♦ యేడ్చుచెనఁటి
వానికంటెను మఱి పగ ♦ వాఁడు లేఁడు.
ఎదుటివానిపచ్చను సహి ♦ యించునట్టి
వానికంటె హితుండగు ♦ వాఁడు లేఁడు
యోగ్యతయు విద్యయును గల్గి ♦ యొప్పునట్టి
వారల నసూయపడునట్టి ♦ వారు చూచి
యేడ్చెదరు ; వారిసొమ్ము పో ♦ యిన విధానఁ
గాన వారినిఁ జేరఁగఁ ♦ గడఁగవలదు.

సొగసుగానుండు పువ్వును ♦ జూడలేని
కూళలకు కంటకము రీతిఁ ♦ గూర్చుచుండు
కరమువెలుఁగొందు సూర్యునిఁ ♦ గాంచలేని
గబ్బిలముతిట్టు రవి కర్మ ♦ సాక్షి గాదె
ఎండమావులయందు నీ ♦ రుండవచ్చు
కటికవానిమనస్సులోఁ ♦ గనికరంబు
గలుగవచ్చు నసూయను ♦ గ్రాగువాని
హృదయసీమ దయాలేశ ♦ మెసఁగఁబోదు
ఎవఁడు కష్టాలు పడి పడి ♦ యెప్పుడో యొ
కప్పు డనుకొనకుండ ♦ సుఖానుభూతి
కలిగెనేని వానికి దాని ♦ విలువ తెలియు
కూటిరుచిఁ గాంచు నాకలిఁ ♦ గొన్నవాఁడె
ప్రేయసిని జెంత గూర్చుండ ♦ బెట్టుకొనిన
వానికిని ప్రియావిరహంబు ♦ వలనఁ బరిత
పించుచును నామెరాక వీ ♦ క్షించువాని

కరయుఁ గొంతంత తారత • మ్యంబు గలదు
జ్ఞానధనము గడించిన • వాని కరయ
దుర్లభంబులు లేవు పా • థోధిముంచి
పైకి తెచ్చిన బుద్ధి యె • వ్వనికిఁ దోఁచు
విద్య మూఁడవకన్ను భా • వించెనేని.
ధనికులగృహాంగణములు భూ • తలమునుండి
పడి నశించు ; విద్వాంసుని • వాణి దిన ది
న ప్రవర్థమానము గాంచు • సుప్రసిద్ధ
శుక్లపక్షక్షపాకరు • శోభఁ దనరి.



కరిణి యగచాట్లు వడుటకై • ధరణి ధరము
నెక్కిపోవగఁ గరినాథుఁ • డెఱుఁగఁడయ్యె :
గండముల్రవాలు తుమ్మెద • దిండు రేఁపి
పోవునేకాని సహచరిఁ • బొక్కి వినఁడు.



భానుబింబంబు చెడదు స్వ • ర్భానువలన ;
చంద్రుఁ డుడుగఁడు నీరదా • చ్ఛాదనమున ;
అహము లాఁగవు గతయార • మాఁగియున్న ;
భస్మ మలఁదిన నుదిటిపై • వ్రాఁత పోదు.

—★—

# భారతమాతకాలము

ఉ. భారతమాత ! నీ స్వపద ♦ భాగ్య మనంత మగాధమిహ్మదా
గారము పాఠశాలవలెఁ ♦ గ్రాలి మహామహిమాస్పదంబునై
ధారుణి నెల్లవిద్యలకుఁ ♦ దావలమై విలసిల్లి "సైన్సు" కా
ధారము నై జగద్ధిత వి ♦ ధానము దెచ్చె సుధాప్రవాహమై

ఉ. భారతమాత ! నిన్నుఁ బరి ♦ పాలనఁ జేసినవారు కీర్తి గ
న్నారు ; విలాస మేర్పడ న ♦ నంతశుభంబులు గాంచి స్వర్ణ దీ
నారములన్ గడించి చని ♦ నారు ; వసుధరలందు మేటి వ
న్నారుగదమ్మ నిన్ ధరణి ♦ నాథులు యోధులు చిత్రమేర్పడన్.

ఉ. భారతయుద్ధవీరు లెవి ♦ వాడిరో ఆ నిశితాస్త్రశస్త్రవి
స్తారమె నేటికిన్ విజయ ♦ సాధనమై విలసిల్లు ; వారి దు
ర్వార తపస్సమాధియె ప్ర ♦ పంచవిధానపదార్థవాద సం
స్కారము ; ధాత్రి నిప్పు డదె ♦ శాంతిని నేర్పుచునున్న దారయన్

ఉ. ఆ యమునానదీ పరిస ♦ రావని వేణువుఁ బూని యా సుధా
మేయమనోజ్ఞగానరవ ♦ మిశ్రితగీతము లేవి పాడెనొ
ఆ యపురూపరాగరస ♦ మందు యథార్థమె గీతయం దుపా
ధ్యాయునిరీతిఁ గృష్ణుఁ డమృ ♦ తాకృతిఁ జెప్పె జగంబు మెచ్చగన్

సీ. ఈరేడు జగములు ♦ వీరులై గెల్చి ఘం
టా పథంబులు చేసి ♦ చూపునాఁడు
దివ్యుల మెప్పించి ♦ దివ్యాపగను బట్టి
దివినుండి నేలకు ♦ దింపునాఁడు

రక్కసులను బోర ♦ రక్తముల్ పాఱించి,
శరవాహినుల ప్రోల ♦ బెరుగునాఁడు
సామగానంబులు ♦ సవనంబు లొనరించి,
సర్పాల నాహుతి ♦ సలుపునాఁడు

తే. భారతీయ యశఃకాంత ♦ ప్రణుత గీతి
కలను దిక్కుంభికుంభాల ♦ నిలిచిపాడె
నాటి జాతీయగీతి యే ♦ నాటికైన
మఱవఁగాలేవు కాలమా ♦ చెఱుపలేవు.

శా. నీకున్ జ్ఞాపకముండవచ్చు విశిఖా ♦ నీకంబు వర్షించి ము
ల్లోకంబుల్ తెగమాడ్చునాఁడు దనుజుల్ ♦ పుత్తెంచి విశ్వంబు దా
మాకర్షించెడునాఁడు కాలయవనుల్ ♦ మార్కొన్నయుద్ధాల ని
స్సీ కాలంబ జయాంకదుందుభు లవే ♦ ప్రోయింపఁగాలేదొకో.

—★—

# ప్రేమం

శా. ఏఁడీ మాయలబాటసారి హృదయం ♦ బేనాఁడొ గొంపోయి యా
వాడే త్రొక్కఁడు రాఁడు మాయుబుసులన్ ♦ వర్జించి మాజోక్యమే
తేఁడే యీవిసుఁ గేల యీముసుఁగులో ♦ దింపన్ గతం బేమి హా
నేఁడీ యశ్రువు లేఱులై యరగి వా ♦ నిన్ దోడి తేకుండునే.

శా. లేవో దొంగిలిపోవు సొమ్ములు ధరన్ ♦ లేవో హిరణ్యంబులున్
లేవో మానస మిట్లు దొంగిలిన గే ♦ లిన్ సేయరే లోకు లెం
తే విశ్వాసిగఁ బ్రేమపాఠములు చె ♦ ప్పె వానిగా వచ్చి యా
త్రోవే మానితి వాసఁబెట్టితివి స్వా ♦ ర్థుల్ మైత్రి నూహింతురే.

శా. పాటల్ పాడిన నాటలాడిన ప్రగ ♦ ల్భంబార వర్ణించి మో
మాటం బేమియు లేక వెంటఁ దిరుగన్ ♦ మావాడలన్ ద్రొక్కి మా
మాటేయెత్తఁడు నేఁడు మాహృదయముల్ ♦ మానుండి కొంపోయి యె
చ్చోటో పెటెను జీవహీనులగు మా ♦ జోక్యంబు లేకుండగన్.

శా. ఏమో వచ్చును మోసగించఁడు మహా ♦ స్వేచ్ఛా విహారక్రియా
సామర్థ్యంబున ప్రేమపాఠకలనా ♦ సాహిత్య సర్వస్వ వి
ద్యామాహాత్మ్యము లిచ్చిపోవునను మి ♦ థ్యాభ్రాంతి నాస్వాంతమ
య్యోమాటాడక నిచ్చివేసితి గృత ♦ ఘ్నోద్యోగ మూహింపకే.

శా. బాసన్ జేసితి వాసఁబెట్టితివి మా ♦ భావంబులోఁ బ్రేమలన్
బూసల్ గ్రుచ్చినయట్లు పేర్చితివి యా ♦ మోదంబు రాగంబు మా
కోసంబో భవదీయవంచన కళా ♦ గారాంతరప్రాభవా
భ్యాసంబో మము పీడి పోతి విటు మా ♦ యా నాటకం బుండునే.

శా. అహా యా మురళీనినాద మదె సం ♦ ధ్యారాగమం దైక్యమై
ఊహాతీతరసైకమాధురి నదే ♦ యూరించు నీతీరు వ్యా
మోహంబేటికిc బెట్టు మాధవుcడు నా ♦ ముందేల రాబోవc డీ
దేహం బాతని పాటకై యిడితి సం ♦ దేహించునే కైకొనన్.

శా. నీకై నీమహనీయమైన మురళీ ♦ నిర్వ్యాజగానామృతా
స్తోకై కోక్త్యనురాగ రాగ నటనా ♦ శోభావిలాసంబు నెం
తే కన్నారగc జూచి జీవితము తృ ♦ ప్తిన్ బుచ్చి నీ కిచ్చు మా
పై కారుణ్యము లేదె లేదె యెద వి ♦ శ్వాసంబు విశ్వాత్మకా !



# కాలము

కాలమా ! నిన్ను వర్ణింపc ♦ గా తరంబె
ఎవరు నీ నా వివాదము ♦ లెఱుcగువారు
ఏది రేయుంబవళ్ళచే ♦ నెఱుగcబడెనొ
ఏది పరిణామకలితమై ♦ యెలమి గలదొ
ఏది రవితారకలచేత ♦ నిముడనిదియె
ఏది నేను కొలిచి చెప్ప ♦ నీయనిదియె
ఏది క్షణికంపు మోపుల ♦ నెనయనిదియె
ఏది పలుకంగ వేనోళ్ళ ♦ కేని గాదొ
ఏది యూహింపరాదొ వే ♦ దాది యేదొ
ఏది బ్రహ్మకంబెను పూర్వ ♦ మేది నిజమొ
అదియె సదసత్పదార్థమౌ ♦ నదియె నీవు.



# దృశ్యము

అల సురాలయములు విచి ♦ త్రాధ్వగమన
వేగమున మేఘమాలల ♦ విరిసి విరిసి
యెగసి వినువీధి కాల వా ♦ హినుల విజయ
గీతములు పాడు వింటివే ♦ కేలుమోడ్చి
గాలికెరటాల ఘన శిఖ ♦ రాలు కదలి
ప్రకృతిలోపల సౌందర్య ♦ భాగ్యములకు
వలనులాగినరీతి న ♦ భంబు పంచ
రంగులతివాసి పరచు తె ♦ రంగు దోఁప
దిక్తటంబుల జలదముల్ ♦ దిమ్మరించె
వానవరదల మ్రాకులు ♦ వంగి వంగి
ప్రేమహృదయాల తెరలెత్తి ♦ వేసె ; యువక
యువతిధృక్పథచిత్త స ♦ ముత్సవంబు
లందు తొల్కాడువలపు వి ♦ లాస భాస
మాన మహనీయ సౌందర్య ♦ మహితమైన
లజ్జ కెంగేల దిద్దు నీ ♦ లాలకముల
గురియుచేజంబు ; మెరపుల ♦ మెఱసి యమృత
కలశములను బొర్లించి ము ♦ క్కారుసొగసు
పొంగి పొరలునీయందు నీ ♦ పులినసీమ
లాచికొనుచున్న వదిగొ మ ♦ ధ్వాసవముగ
ఆ మనోహర యవని కా ♦ భ్యంతరముల
నాటకాంకంబు లీ వన ♦ వాటియందు
ప్రణయగానాల వినిపించు ♦ రాగరస వి
నూత్నపదముల గోరింట ♦ నులిమి వ్రేళ్ళు
మీటు నీవీణ పారాణి ♦ మెదపి హృదయ
వీధిఁ జిత్రించె నే యలి ♦ వేణీ యడుగు
జాడలో యవి వచియింపఁ ♦ జాలనంత
వింతసింగారు గూర్చు ర ♦ వంత దనరి

# ప్రభాతకిన్నెర

కిన్నెర కంఠమెత్తి తన ♦ గీతిక దిక్తటకుంభికుంభముల్
తన్నుచుఁ బాడు ; నా స్వర సు ♦ ధారసధారల మోసులెత్తు రా
గోన్నతి విశ్వభారతికి ♦ నువ్వీళులూరు నివాళిగూర్చు న
ట్లున్నది దేశదాస్య విప ♦ దోదధిబాడబ మీప్రభాతమున్.

కాదంబరిని నొక్క ♦ కణమైన మూఁడు లో
        కములను జూపించు ♦ కాణయాచి ;
ప్రియురాలు వేడుక ♦ వీణెపాడిన ప్రేమ
        గీతాక్షరంబు స్వ ♦ ర్గీయవృష్టి;
వెన్నెల బయలులోఁ ♦ గన్న ప్రేయసి సోయ
        గము సుధాంశునిచేతి ♦ కలశసమితి ;
ఆ రూఢమునకు నిం ♦ ద్యాభాసమైన య
        వ్వేలఁది దృగంచల ♦ విలసనంబు

ఎవరుకొలుతురు రాగర ♦ సేతరంబు
లైన బాళులఁ జేరల ♦ కందరాని
ప్రేమపాఠాల నవసిన ♦ వీధులందు
వాసనలదోఁగు మధుమాస ♦ వాసరముల

గగనముశూన్యవీథి నుడి ♦ గాలి మలీమసధూళిధూసరం
బగునొక వ్యక్తి దాల్చి విల ♦ యాలయ మేగుచు దగ్ధకాష్ఠమ
ట్లగపడు నంచు జీవితము ♦ నందు మరీచికఁ బోలు విశ్వమం
దగపడుచున్న దీప్రళయ ♦ మందు నుషస్సగు ప్రేమకిన్నెరన్.

—*—

# చదువు - కవిత

మాసరస్వతి శుభ్రభవ ♦ స్త్రాసనమున
తెల్లని సరోజ పుంజాల ♦ దీర్చి కూరు
చున్నదదె చేతిలో కల ♦ మున్న దదిగో
ప్రాతకొత్తలు కలుపు పా ♦ త్రలు రచింప
ఒకట పాలును, నొకట నీ ♦ ళ్ళున్న వదిగో
ఒకటబాణంబు నొకట వి ♦ ల్లున్న దదిగో
ఒకట నుసిరిక యొకట ను ♦ ప్పున్న దదిగో
రుచులభేదాల కలిపి వా ♦ గ్రచితదివ్య
భవ్యకవితా విలాసంబు ♦ బయలుదేర
జీవములుపోసి నడిపించి ♦ జీర్ణమైన
కళలు లేవనెత్తెడుకోర్కె ♦ కలిగి వాణి
చూచుచున్నది దేశాన ♦ సొగసులుంచ
పెద్దమార్పు భాషను తెచ్చి ♦ పెట్టఁగోరి
ఇంక రాద్ధాంతములకు తా ♦ వేమి గలదు
ఇంక నభివాదములకు జో ♦ టేమి కలదు
ఒకడు రచియించు గణముల ♦ నూసుపోక
ఒకడు గణములు తీసి వే ♦ యును కడంగి
ఒకడు వ్యాకరణంబు తే ♦ కుండ జేయు
నొకడు కొత్త సమాసంబు ♦ లుంపఁజూచు
ఇట్లై యర్థాలు విపరీత ఁ మెసఁగఁగూర్తు
రిట్లై భావాలు వివిధార్థ ♦ మెసఁగఁగూర్తు
రీ తుపానులఁ బడి కవి ♦ తాతనూజ
మీనమేషాలు లెక్కించు ♦ వానకారు
చదువు సాహిత్యమునకు సా ♦ గదని తెలిసి.

—✦—

# పరిషత్ప్రశంస

మ. పరమాత్ముండు జగన్నియంత భువన ♦ బ్రహ్మాండమ న్నాటకాం
తరకూలంకషసూత్రధారి తనప్ర ♦ స్తావంబున న్నాంది సు
స్థిరనీరాజనగానముం జలుపుతన్ ♦ శ్రీయాంధ్రసాహిత్య స
త్పరిషత్కన్యక మాకుఁ గూర్చుటకు సం♦ భావించి యర్థించుచున్

శా. ప్రాచీనాంధ్ర మహాప్రబంధముల సం ♦ పాదించి సత్సత్కళల్
ప్రాచుర్యం బొనరించి తద్విషయభా ♦ వవ్యక్తి గల్పించి వి
ద్యాచిత్రంబులమూట విప్పి తెలుఁగం♦ దం బందుఁ జూపించియెం
తేచాతుర్యముఁ గంటి వాంధ్రపరిష ♦ ద్దివ్యాంగనారత్నమా

మ. ధనవంతుల్ మదవంతులౌ నృపులు వి ♦ ద్యావంతులౌ పండితుల్
నిను నర్థించిరి గాని నీ వెవరికై ♦ నీరాజనం బిచ్చి పో
యినజాడ న్వినలేదు నీ యశము నే ♦ డీ రేడులోకంబులం
జనె నీ భాగ్యమె భాగ్యమమ్మ పరిష ♦ త్స్వర్గాంగనారత్నమా.

ఉ. వేలకు వేలు వెచ్చమును ♦ బెట్టి తెలుంగు నిఘంటు సూర్యభూ
పాలునిపేర భారతి కృ ♦ పామతికిం దొలికాన్కగాఁగ నీఁ
జాలెదవంచు నాంధ్రపరి ♦ షల్లలనా నినుఁ జూచుచుంటి మే
వేళను జాతకంబు విను ♦ వీధిని వానకుఁ జూచు కైవడిన్.

ఉ. నీవు తెలుంగుభూమిని జ ♦ నించితి వాంధ్రులపాలి కల్పకం
బై విలసిల్లినావు మహి ♦ మాస్పదమైన తెలుంగుబాసకున్
జీవముఁ బోసినావు చెడి ♦ జీర్ణమునై చను వాఙ్మయంబు నీ
వీవలఁ దీసినావు గను ♦ లేఱిన రత్నచయంబు పోలికన్.

—✱—

సీ. గోదావరీదేవి ♦ కొంగుపట్టిన దివి
నుండి చంగున వచ్చి ♦ యుఱికినావు
నెల్లూరి నెఱజాణ ♦ నెత్తమ్ము లాడఁ బి
ల్చిన తోడనే పోయి ♦ చేరినావు
పలనాటివీరప ♦ త్నులు పాడు జాతి గీ
తములకు శ్రుతివేయఁ ♦ దరలినావు
ఏకశిలాశైల ♦ మెక్కి తీఁగలఁదూఁగు
టుయ్యాలలోఁ బండి ♦ యూఁగినావు

తుంగభద్రాజలంబానఁ ♦ దూఁటినావు
కృష్ణవేణమ్మ చెలిమి హ ♦ ర్షించినావు
తెనుఁగుకవితామతల్లి యా ♦ తణుకు పిలువఁ
దెలిసి పరిషత్తుతోడ నే ♦ తెంచినావు.

—★—

# అ కా ప ట్య ము

1. బీరువోనిది మిగుల సిం ♦ గారుగలది
స్వర్గతేజంబుతో నెన ♦ వచ్చునదియు
ప్రేమచే స్వచ్ఛమైనది ♦ విమల లసిత
మగు నకాపట్యపదము నే ♦ నాశ్రయింతు ॥బీరు॥

2. క్షణికమైనది జీవ ల ♦ క్షణము క్షితిని
మెఱపువంటిది బ్రతుకు సం ♦ బరము ధరణి
ప్రాప్త మప్రాప్తముల కాల ♦ వాల మగుచు
బంధమోక్షంబులకును సం ♦ బంధ మగుచు
చెలఁగుఁ గాన దీనిని విశ్వ ♦ సింపలేము ॥బీరు॥

3. ఎండమావుల జలము నీ ♦ కుండునెడల
శశవిషాణంబు మొలిపింప ♦ జాలునెడల
గగనకుసుమముల్ నీవు తె ♦ గలుగునెడల
కలగనినదంతి వాకిటఁ ♦ గట్టునెడల
కాలచక్రంబు నీ వాపఁ ♦ గలవు గాన
నుదయమధ్యాహ్నసంధ్య లా ♦ పెదవు గాన
నీకు నలువడునేమొ చీ ♦ కాకులేని
మహితదేహంబు మాకు న ♦ మ్మకములేదు ॥బీరు॥

4. ఇంద్రియంబులు నొకమూల ♦ నేచుచుండు
నీషణత్రయ మొకమూల ♦ నీసడించు
కామషట్కము నొకమూలఁ ♦ గలఁచుచుండు
రాగ సంస్కారముల మది ♦ రగులుచుండు
కలిమిలేములు నిలువెల్లఁ ♦ గాల్చుచుండు
క్షుత్పిపాసలు నిరతంబు ♦ గోయుచుండు ॥బీరు॥

5. ఎవనికి స్వతంత్ర మున్నదీ ♦ యిహమునందు
ఎవనికి భవాబ్ధితఱిఁగె నీ ♦ యిహమునందు
ఎవఁడు సర్వజ్ఞనాముఁ డీ ♦ యిహమునందు
ఎవఁడు కాలనిర్జేత యీ ♦ యిహమునందు
ఎవని కెవ్వఁడు కర్త యీ ♦ యిహమునందు ॥బీరు॥

6. ఇహము నిత్యమొ కాదొ మే ♦ మెఱుఁగలేము
ఇహము మిథ్యయొ నిజమొ మే ♦ మెఱుఁగలేము
ఇహము భ్రాంతియొ వస్తువో ♦ యెఱుఁగలేము
ఇహము మహిమాస్వరూపమై ♦ యెసఁగుచుంట
గగనముల కాశ్రియం బని ♦ తెగడలేము
మరుమరీచిక యని స్థిర ♦ పరచలేము
నిన్న నేఁడును నొకరీతి ♦ నెగడుకతన ॥బీరు॥

7. దేనిపై నది మోసి యీ ♦ తీరు మనకు
ద్వంద్వములఁ బెట్టి తాను న ♦ ద్వంద్వమగుచు
బవలు రే యన కొకరీతి ♦ బరఁగు నదియొ
ఆ పరాత్పరు నిత్య స ♦ త్యస్వరూపు
నా పరబ్రహ్మ మాతేజ ♦ మభినుతించి
దానిపై దీనిభారంబు ♦ వైవఁగలము
వానికై మేము నిరతంబు ♦ బాడఁగలము
వాఁడు మాకోర్కె లిచ్చ ♦ వచ్చువాఁడు గాన
వానికై మే ముపాసింప ♦ వలయుఁగాన
వాని వెదకఁగ మేముంచ ♦ వలయుఁగాన ॥బీరు॥

8. కపట మనునది యెంతటి ♦ కానిపలుకొ
కపట మనునది యెంతటి ♦ కఠినపదమొ

కపటమున జగ మంతయు ♦ కరఁగిపోయె
కపటమున జన మంతయు ♦ కాంతిదఱిగె
కపట మనునది జాణ ర ♦ క్కసి పిశాచి
ప్రకృతితొలిచూలు మాయకు ♦ ప్రథమపుత్రి
కలికి ప్రియురాలు వలపువా ♦ కలికి యిక్క ॥బీరు॥

9. పంచభూతంబు లిల సృజి ♦ యించినపుడె
జీవరాసుల నడయాడ ♦ జేయునపుడె
సూర్యచంద్రుల మింటిపై ♦ జూపునపుడె
పచ్చకొమ్మ యెఱ్ఱనిపువ్వు ♦ పట్టినపుడె
లతలు పెనఁగొని చెట్ల ప్రే ♦ లాడునపుడె
నెమిలి పురి విప్పి యాడఁగా ♦ నేర్చినపుడె
పంచమరవంబు పిక మభ్య ♦ సించినపుడె
పంచబాణుఁడు చెఱకువిల్ ♦ వంచినపుడె
వికచకుసుమంబు లళిపంక్తి ♦ వెదకునపుడె
మిధునములు రాగములఁ దేలి ♦ మెలఁగునపుడె
పడతి ప్రియునిపై క్రీఁగన్ను ♦ పరపినపుడె
ప్రకృతిపాడినకృతి వినఁ ♦ బడియె మాకు
ప్రకృతిపాడినరుతి వినఁ ♦ బడియె మాకు
దానితో సరివచ్చు మం ♦ త్రంబు లేదు
దానితో సరివచ్చు హి ♦ తంబులేదు
అదిఁసుధామధురోక్తుల ♦ నలరునదియు
అది కళాలసితాత్మయై ♦ యలరునదియు
నది గభీరభావంబుల ♦ నలరునదియు
నాలకింపగ నింపు సొం ♦ పారునదియు

పాతకులకెల్ల నూరింప ♦ వలసినదియు
జగము నాకర్షణము జేయఁ ♦ జాలినదియు
చిత్రవర్ణంబుగలదాని ♦ జెప్పుచుంటి
సృష్టియందు రహస్యంబుఁ ♦ జెప్పుచుంటి
సృష్టియందు జడత్వంబుఁ ♦ జెప్పుచుంటి
సృష్టి సకలంబు ''కపటంబు'' ♦ చేత నయ్యె ॥బీరు॥

10. కపటనాటకమె యీ జ ♦ గంబు గాన
దైవమే దీనికిని సూత్ర ♦ ధారి గాన
గోచరము గాక వెలిఁ దోఁచి ♦ తోఁచకుండ
బూచివాఁడయి జగములఁ ♦ బూర్ణుఁడగుచు
మేఘమాలికలను దోఁచు ♦ మెఱపులట్లు
ఖిన్న హృదయులకోరిక ♦ లున్నయట్లు
కాంచనోదయసౌగంధ ♦ కలనమట్లు
చంచలాకీవిలోచనాం ♦ చలములట్లు
ప్రకటితముగాక దేనిచేఁ ♦ బట్టువడని
వానిసారూప్య మందిన ♦ వస్తువేది
వానిచైతన్యమున సాటి ♦ వస్తువేది
వాని కవ్వలనైనట్టి ♦ వస్తువేది
వాని గమ్యమానముజేయు ♦ వస్తువేవి
వాని రూపరఁజేసిన ♦ వస్తువేది
అదియెపో ''కపటంబు'' మా ♦ యన్న వింటె ॥బీరు॥

11. కపటమున కొకరూపంబు ♦ గాంచలేము
కపటమున కొకకలచోటు ♦ గాంచలేము
కపటమున కొకత్రోవని ♦ కాంచలేము
చంద్రుఁ డుదయింపఁ జుక్కలు ♦ చనఁగనేల

భానుఁ డుదయింప శశి తెల్ల ♦ బారనేల
కలువ కినుఁ డేమిచేసె తా ♦ వెలయ దేల
అలచకోరము లగచాటు ♦ లందనేల
నళిని తొగఁ గాంచి పక్కున ♦ నవ్వనేల
చంద్రసూర్యుల రాహు వే ♦ చంగనేల
అమృత మసురుల కిడకుండ ♦ నరుగుటేల
శ్వపచు నంటినఁ బాపంబు ♦ వచ్చుటేల
ఎఱిఁగి న్యూనాధికంబుల ♦ నెంచనేల
కపట కారణమునఁజేసి ♦ కాదె సఖుఁడ ॥బీరు॥

12. చాతకమునకు ద్యోధునీ ♦ జలమెగాని
కుటిలజల మాననను నిష్ఠ ♦ కుదురుకొనియె
కుసుమములె గాని వింటను ♦ గూర్పననుచు
మదనుఁ డొకమేటి నియమంబు ♦ వెదకికొనియె
వరునిగాని మఱెవ్వరి ♦ నరయ ననుచు
లేమ సూర్యాగ్నిసాక్షిగా ♦ నోముపట్టె
ఘన వసంతాగమంబున ♦ గాని పికము
గాన మొనరింప నని మడి ♦ గట్టుకొనియె
కాంచన సుగంధములకు నా ♦ శించ ననుచు
బంభరం బొకజన్నియ ♦ బట్టుకొనియె
తాడిచెట్టును జువ్వి పా ♦ దపము మిగుల
రాగమున గౌఁగిలించెడు ♦ వ్రతముపట్టె
నిట్టి నియమప్రకాండంబు ♦ లెంచిచూడ
కపటతత్త్వకలాపంబు ♦ గానఁబడును
కపటలోకవిలాసంబె ♦ కానఁబడును ॥బీరు॥

13. కపటమునుగూర్చి మఱియొక్క ♦ కథగలాదు
కపట మనునది లేకున్న ♦ కథయె లేదు
కపట మూర్తిభవంబె లో ♦ కంబు జూడ
కపటమునఁజేసి యెందరో ♦ కడలఁబడిరి
కపటమూలంబె సంగ్రామ ♦ కారణంబు
కపటహేతువె జనవధ ♦ కారణంబు
కపట ముడిగినఁ గలహంబె ♦ కానరాదు
కపట ముడిగిన మోక్షంబు ♦ గానవచ్చు ॥బీరు॥

14. కపట తత్త్వవిచారంబు ♦ గడవఁదలఁచి
క్షీరనీర విభాగంబు ♦ జేయదలచి
విశ్వబుద్ధిని మొదలంట ♦ విడువఁదలఁచి
బాహ్యపరివర్తనంబును ♦ బలుక మింక ॥బీరు॥

15. జీవచైతన్యమును విమ ♦ ర్శించి చూచి
కేవలాభాసములజోలి ♦ బోవ మఱచి
నిజకళామధురంబుల ♦ నేర్వఁదలఁచి
సహజసౌందర్య మగువ్యక్తి ♦ చాటఁదలచి
చూచినారము కాపట్య ♦ శూన్యమైన
యునికి యెందున్నదో యని ♦ యుబుసుపోక ॥బీరు॥

16. నవనవారంభయౌవన ♦ ప్రవిమలోజ్జ్వ
లాంగిబంగారువన్నె సా ♦ రంగలోల
లోచనంబుల బెళుకుల ♦ లోనఁగొంత
ముగ్ధమురిపెంపు ముద్దుల ♦ మోహనాంగి
వరుని ప్రథమ సందర్శన ♦ వాసరమున

హృదయవాసన లటునిటు ♦ చెదరి నిదుర
పోయినప్పుడు వెన్నెల ♦ రాయఁ డామె
మోముతో నైక్యమైన య ♦ ప్పుడును గొంత ॥బీరు॥

17. తనదు ప్రియురాలికై యాత్మఁ ♦ దలఁచి తలఁచి
యామె సోయగమున కంగ ♦ లార్చియార్చి
ఆమె ఋజుమార్గమున కెంతొ ♦ యలరియలరి
ఆమె యెడబాటును సహింప ♦ ననుచుఁ ద ద్వి
యోగ సంతప్తమానసుఁ ♦ డురు విలాసుఁ
డాకసంబునఁ జుక్కల ♦ యందు తనదు
కాంత లభియించునో లేక ♦ కానఁగలదొ
యనుచుఁ దలపోసి తలపోసి ♦ యా ప్రశాంత
మా నిశాంత సమయమందు ♦ వ్యక్తమైన
సైకతనదీతటంబున ♦ శాద్వలమున
విహగ కూజితములవంక ♦ వీను లొగ్గి
ధారగా న్రశువులు గార్చు ♦ తలఁపులోన
వాని ప్రియురాలు ప్రత్యక్ష ♦ మైన నామె
తేజమును పరమేశ్వర ♦ తేజ మనుచు
మననమును జేసి విషయ త ♦ మంబుఁ బాసి
తెలివి గాంచిన పురుషుని ♦ తెలివిలోన
జూడఁబడె నకాపట్యంపు ♦ సోయగంబు.

# పతంగము

పశ్చిమదిశాంగనా గృహ ♦ ద్వారమందు
పాదమును మోపెఁ బద్మినీ ♦ బాంధవుండు
నవమణి స్థాపితంబైన ♦ భవనమందు
చక్కనై యొప్పు బంగారు ♦ సౌధమందు
దీపమును బెట్టి మ్రొక్కి ము ♦ ద్దియ చనంగ
యామినీకాంత యామెతో ♦ ననుగమించె
సొగసుగా వెల్గుదీపంబుఁ ♦ జూచి చూచి
మిడుత లేచెను స్వాగత ♦ మిడుట కొఱకు
తనదు పూర్వసదాచార ♦ మని యెఱింగి
తనదు వంశానుగతమైన ♦ పనిగనెంచి
స్వర్గ సన్నిభమైన శా ♦ ద్వలమునందు
అలరు జొంపములందు హి ♦ మాంబుపూర
పూరితములైన చల్లని ♦ పొదలయందు
గడ్డిగనురులు పూసి వి ♦ కాసమొందు
నట్టి రమణీయ వనసీమ ♦ లందు నిరత
మాత్మనాయికతోడ వి ♦ హారగరిమ
నొప్పుశలభమా ! మండెదు ♦ నిప్పు నెత్తి
పైని దాల్చిన దీపంబు ♦ వంకఁ జూచి
యేల సంతోషపడెద వీ ♦ వేల తెలివి
మాలి ఱెక్కల నార్చి ర ♦ మ్యంబులైన
గీతములఁ గూర్చి పాడెదు ♦ జీతబత్తె
ముల నెఱుంగని కవివలె ♦ మోసపోయి ?
కాని, దీపంబు కడుకృత ♦ ఘ్నతను గలది
దాని కిసుమంత విశ్వాస ♦ మైన లేదు

సాకునని ముద్దు లిడిన మీ ♦ సములు గాల్చు
ఇంటిదీపంబు చూరున ♦ కంటెనేని
కాల్చివైచు నగ్నికె లేదు ♦ కనికరంబు
ఆహితాగ్ని నిరంతర ♦ మగ్నిఁ గొలిచి
అగ్నిలో జారిపడిన దే ♦ హంబుమాడ్చు
నట్టిదానితో నీకు స్నే ♦ హంబు వలదు
ప్రాణహాని తెచ్చును నస ♦ మాన మైత్రి
తెలియకున్నావు అజ్ఞాన ♦ తిమిర మాత్మ
యందు గల దింక నది పోయి ♦ నపుడె గాని
తేజమున లీనమైపోవు ♦ తెరువు లేదు

గడ్డిలోపల నివసించు ♦ కారణంబొ
గడ్డితో నతిమైత్రిని ♦ గలుగుకతమొ
గడ్డికసురులు తినియున్న ♦ కాంక్షవలనొ
గడ్డిచే జీవములు నిల్పి ♦ కాలమంత
వెళ్ళబుచ్చిన హేతువో ♦ విడువకుండ
వాసనారూపమున నిన్నుఁ ♦ బశువుఁజేసెఁ
గాక దీపంబుపై నీకు ♦ కాంక్ష యేల

దీపకళికపై నేకాగ్ర ♦ దృష్టి యేల
దీపమును మోహమునఁ జూచు ♦ దీట దేల
దీపమును గాంచి వలపు సం ♦ ధించు టేల
దీప మశనిపాతము భవ ♦ దీయజీవి
తాసువులఁ గాల్చు తీవ్ర దా ♦ వానలంబు
నీదుధృఢతరగర్భ ని ♦ ర్భేదనంబు
సేయునట్టి యాగ్నేయాస్త్ర ♦ మాయుదహన
కారణంబైన వజ్ర మా ♦ ర్గణచయంబు

చలితవిషదావదవము చం ♦ చలనిభంబు
దీనిపై నింత నీ కభి ♦ మాన మేల
మరణహేతు వటన్నను ♦ మాన వేల
ఎఱిఁగి యెఱిఁగియు నిప్పుల ♦ నురుక వేల
ఇంత వైరాగ్యమునకు నీ ♦ కేమి వచ్చె
ఇంత ప్రాణాశ వీడ నీ ♦ కేమివచ్చె
ఇనుఁడు వాసినమీఁద నీ ♦ హీనజన్మ
మేల యని నీకు విసుఁగు జ ♦ నించె నేమొ
లేక దీపంబు సౌమ్య క ♦ ళాకలాప
ప్రథితతేజః ప్రపంచ మా ♦ ర్గముగ దాని
నెంచితో యుదియైన వ ♦ చింపవైతి
వెఱిఁగి బడబానలముఁ దాక ♦ నేగుచుంటి
వకట ! విషవహ్ని మ్రింగుట ♦ కరుగుచుంటి
వేమిపాపంబు బ్రతుకుపై ♦ నిచ్ఛ లేదె
ఏదిపోయినఁ దిరిగి గ ♦ డింపవచ్చు
ప్రాణ మూడిన గడియుంచు ♦ వారు లేరు
గాన నా మాట విని దీప ♦ కాంతిఁ జూచి
సంభ్రమింపకు నీకది ♦ శత్రువుసుమి !
ఱెక్క లున్నవటంచును ♦ ఱెలుగూడ
ఎగిరిపడి పోకు మెల్లైత ♦ ఖగమ యిదదు
దీప మిది యగ్నిబాణంబు ♦ దీనిఁ దాకి
నిలువఁగలవారు లేరు మీ ♦ కులమునందు
అనుచుఁ బలుకుచు నున్నంత ♦ ననలశిఖను
దాకె శలభంబుఁ ♦ కలభంబు దాకినటుల
చుఱ్ఱుమనెఁ గడ్పు చుమ్మలు ♦ చుట్టుకొనియె

ఱెక్క లరముక్క లయ్యె మ • ఱొక్కమారు
ధనువు విడిచిన బాణ వి • థంబు దోఁప
కలియఁబడె దీపకళికతో • శలభరాజ
మంత నేలను గూలి వి • శ్రాంతినొంది
కవి వచించిన హితము ని • క్కమని తెలిసి
దీప మన నెట్టిదో ప్రబో • ధించుకొనియెఁ
గాని వెంటనె మఱచి దీ • నాననమునఁ
దిరిగి యెగిరి దీపంబుపై • నురుకఁబోయె
మెదడు కడు చిన్నదగుటచే • మేలు, కీడు
జ్ఞాపకము నుంచుకొనుశక్తి • చాలదొక్క !
అసలు మేదస్సె లేదొ నీ • కబ్జభవుఁడు
దీపమునఁ జావు మని పట్టి • తీర్చి మూడు
పంక్తులుగ నీనుదుట వ్రాసి • పంపె నేమొ
ఎండమావులకై పారు • నిఱ్ఱి పగిది
జూదమున డబ్బు గడియింపఁ • జూచునట్లు
అకట ! సుస్వర్ధునీజల • మానఁబోయి
కరకమును చాతకము నోటఁ • గొఱికినటులు
మావికిసలయ మనుచును • మ్రాకుఁగొఱుకు
కోకిలమురీతి నీవును • దాకినావు
దీపమని దీని దెలియవై • తివి కరంబు
తినెడు వస్తువుగా నీకుఁ • దెలిసె నేమొ
ఫలములను దిను నలవాటు • గలదె నీకు
క్రొత్తగా నేఁడు తిన నేర్చి • కొంటివొక్క
దీని దిని యమరత్వ సి • ద్ధిని వహించి
స్వర్గమును జూరగొన నీకు • వాంఛ గలదొ

లోక మోహనకాంతిఁ దా ♦ ల్చుటకుఁ జనెదొ
అనుచు నున్నంత శలభంబు ♦ నట్టె యెగిరి
దీపమునఁబడి తత్తీవ్ర ♦ దీప్తి నెనసి
భస్మమైపోయె నెవరితోఁ ♦ బలుకకుండ
హరునికంటను మాఱిన ♦ మరునిపగిది
మిళితమైపోయె భాసురో ♦ న్మీలనమున
మునిఁగిపోయెను శాంతి స ♦ ముద్రమందు
పంచఁబడిపోయెఁ దేజః ప్ర ♦ పంచమందు
లీనమైపోయె దాని మ ♦ లీమసతయు
భూతములు నైదు బూడిదై ♦ పోయె నచట
ఆ రహస్యంబు, ఆ ప్రేమ, ♦ మామతంబు,
ఆవలపు, ఆ వికార, మా ♦ భావపక్వ
మెవరి కర్థంబు గాదు మా ♦ కెఱుకపడదు
కాని, శలభంబు మాకు మా ♦ ర్గమును జూపె
పెక్కు పాఠంబులను నేర్పి ♦ విడిచె దాని
తనువు విడచిన జ్ఞానచిం ♦ తనము విడువ
లే దుషఃకాలమందున ♦ లేచి కోడి
పెద్దతప మాచరించెడు ♦ విధము గొంతు
కెత్తి కూయును గాని లో ♦ కోత్తర మగు
ఆ పరబ్రహ్మతేజస్సు ♦ నరయలేదు
ఆ పతంగంబు చనుత్రోవఁ ♦ జనఁగలేదు
అద్వితీయ, మనిర్వాచ్య ♦ మైన నీదు
పథము నజ్ఞానులకుఁ దోఁచఁ ♦ బడదు నిజము
ప్రతిసుమంబును సంపెంగ ♦ పాటిగాదు
ప్రతిఖగంబును జివురులఁ ♦ బట్టి తినదు

ఆలిచిప్ప లన్నిటను ము ♦ త్యాలు రావు
ప్రతిమృగంబున గస్తూరి ♦ పరఁగఁబోదు
ఎల్లమక్షికములు తేనె ♦ నియ్యఁబోవు
ప్రతిపతంగంబు నీవలెఁ ♦ జితిని బడదు
నిన్నుఁ జూచి దయారస ♦ మున్నవారు
కరఁగి నీరౌచు నుండి రీ ♦ కరణి ధరణి
నెవరు ప్రియునకై ప్రాణంబు ♦ లియ్యఁగలరు
ఎవరు స్వార్థపరిత్యాగ ♦ మీవిధంబు
సేయనోపుదు రని చాల ♦ సేపు వగచి
పోయి రంతట నీ ధర్మ ♦ జాయగూడ
సహగమనదీక్షఁ బూని నీ ♦ చన్న త్రోవఁ
జూచుచున్నది కడుఁ బ్రేమఁ ♦ జూడ్కి నశ్రు
కణ పరంపర ధారలై ♦ కారుచుండ
శాంతిగీతికను బ్రకృతి ♦ కాంత పాడె.

# భ్రాంతి ౨

భ్రాంతియన నేమొ మేమును ♦ బలుకలేము
భ్రాంతియన నేమొ మేము ను ♦ ద్భ్రాంతలీలఁ
బటముపై దాని మేమును ♦ వ్రాయలేము
భ్రాంతి నైసర్గికంబు స్వ ♦ భావ మనుచు
పొల్లుమాటలతో మసి ♦ పూయలేము.

ధరణి పరమాణువులు సము ♦ ద్రంబు జలము
బిందువులు తారకలు లెక్క ♦ బెట్టవచ్చు
సూర్యచంద్రాగ్ని లోకముల్ ♦ చూడవచ్చు
వచ్చు నన్నియు వివరింప ♦ వచ్చుఁగాని
భ్రాంతికలనంబు వివరింప ♦ వశముగాదు

ఎటుల నీచూడ్కి ద్రిప్పిన ♦ నేది గనిన
నేది కాంక్షించుచున్నను ♦ నేదివినిన
భ్రాంతిగాక మఱేదియుఁ ♦ బడయలేము
సొగసు గాక మఱేదియుఁ ♦ జూడలేము
కాంతి గాక మఱేదియుఁ ♦ గాంచలేము

మానసాక్షుల నలుదెసల్ ♦ మలపినపుడు
భావ మాకాశమునకంటెఁ ♦ బైకిఁ బోవ
నిచ్చినపుడు క్రిందయి ♦ వచ్చినపుడు
భ్రాంతియే చుట్టి విభ్రాంతి ♦ పాలుజేసి

నింగి వెలుఁగొందు వెన్నెల ♦ నిశలయందు
తతమనోహర సైకత ♦ తలమునందు
హరిణకుణకముల్ చెరలాట ♦ లాడునపుడు
ఏ మనోజ్ఞ విలాసంబు ♦ లెనయఁగలవొ

యందులోపల భ్రాంతినే ♦ యరయుగలము.

యభ్రశకలంబు లిరువాగు ♦ లైనయపుడు
మింటఁ దెరలట్లు మెల్లన ♦ మెలఁగునపుడు
అస్తమిత సూర్యబింబ మా ♦ యుపరవార్ధి
కభిముఖంబయి పోయి మే ♦ ఘాంచలముల
స్వర్ణవర్ణంబులను దిద్ది ♦ వరలునపుడు
సాంధ్యరాగంబు పర్వత ♦ సానువులను
జారు సెలయేళ్ళ నైక్యమై ♦ చన్నయపుడు
కాంతి మోదంబుతోడ నై ♦ క్యంబునొందు
నందులోపల భ్రాంతినే ♦ యరయుగలము.

భ్రాంతి నానాముఖంబుల ♦ వరలుచుండు
నైన మేమిరు వాగుల ♦ యందు దాని
జూచుచున్నాము మొదటిది ♦ సుదతిమోము
మహిత నవయౌవనవికాస ♦ మంజులంబు
లలిత లావణ్యమైన గు ♦ లాబిపూల
సౌరభంబులఁ దోఁగు శ ♦ రీరకాంతి
వెడదకన్నులు బారెడు ♦ పొడవు కురులు
దానిబెడఁగునఁ బురుషుని ♦ మానసంబు
సలిల బింబిత సూర్య మం ♦ డలముభాతి
సతత సంచలితంబు భా ♦ స్వంతమగుచు
వింతమార్పులఁ జెందుచు ♦ నంతకంత
కతిశయించి మహాభ్రాంతి ♦ నతిశయించి
మోహనారాశి తుదకది ♦ ముంచివేయు
మోహబడబాగ్ని తుదకది ♦ బూదెసేయు
మోహ మనునది యెంతటి ♦ ముద్దుపలుకొ

మోహదేవత యెంత నై ♦ పుణ్యవతియొ
మోహమున లోక మంతయు ♦ మునిఁగిపోయె
మోహమున లోకజాలంబు ♦ మూర్ఛవోయె !
యువతిరత్నాలపేరున ♦ కొదవెనొక్క
తండులంబుల కాశించి ♦ తరలనొక్క
రంగుచీరల కొఱకు జీ ♦ రాడెనొక్క
భర్తృ హృదయంబుబట్టి సం ♦ భ్రమముతోడ
ఘల్లుఘల్లున నందెల ♦ కలరవంబు
మ్రోయఁజేయుచుఁ దిరుగు న ♦ మ్మోహనాంగి
మానసమునందు మోహ బం ♦ ధమ్ముగలదొ
ఆశయే యన్న దో యది ♦ యడుగరాదు
గాని, సతి యామె యని చెప్పఁ ♦ గలముమేము
ఊడిగంబులు సేయఁగా ♦ నుంచినారొ
తెచ్చిన ధనంబు దాచఁగాఁ ♦ దెచ్చినారొ
బాహ్యకామేచ్ఛలను దీర్పఁ ♦ బడసినారొ
కాయలనుగాయు సాల వృ ♦ క్షాలలీల
నింట సంతతసంతాన ♦ మీనుకొఱకొ ?
నిలువఁబెట్టినపురుషుని ♦ నెమ్మనమునఁ
బ్రేమయున్న దో లేక ప ♦ విత్రమైన
కులసతీగౌరవమె యందుఁ ♦ గలదొ యేమొ
ఎవరు చెప్పఁగనేర్తు రా ♦ ప్రవిమలంపు
మైత్రి యొక్కొక్కచోట వి ♦ చిత్రలీల
గంటి మావధూవరుల క్రీఁ ♦ గంటిచూపు
లందు మోహానురాగ రా ♦ గాచ్ఛవ్యక్తి
వ్యక్తిగతమైన మహనీయ ♦ వైభవంబు.

విభుని నొకలేమ దాచెను ♦ వీక్షణముల
నొకతె సంగోరుచీరచే ♦ నొడలు గప్పె
నొకతె యశనాంబువులు మాని ♦ యొలలాడె
నొకతె జీర్ణాంబరంబుల ♦ నొప్పియుండె
నొకతె యక్షయవసనంబు ♦ లొలిచి యిచ్చె
వారితలఁపున నే ప్రేమ ♦ వార్ధి గలదొ
వారిసర్వావయవము లే ♦ పాశమందు
గట్టఁబడి దుర్నిరీక్ష్యమై ♦ గ్రాలునవియొ
అదియె మోహనమంత్ర మా ♦ ధ్యాత్మికంబు
అదియె యనురాగరస మహా ♦ ధ్యానగరిమ.
గానలోలుఁడు కృష్ణుఁడు ♦ కానలోనఁ
జారుయమునానదీ పరి ♦ సరములందు
వేణునాదంబు పూరించి ♦ విమలచారు
గీతికల నింప వల్లవీ ♦ కీరవాణు
లాలమందలతోఁ గూడి ♦ యాలకించి
మోహమున మున్గి రపుడు మ ♦ నోహరత్వ
మేమితట్టెనొ వారి కం ♦ దేమి శక్తి
వెలువడెనొ మేము చెప్పగా ♦ వెఱచుచుంటి
మా రహస్యము విప్పగా ♦ నేరకుంటి
మది కలుషితము గాఁజాల ♦ దది నిజంబు
అది రసస్వరూపమును ది ♦ వ్యామృతంబు
దానిలో దాఁగియున్న య ♦ ర్థముల నెల్ల
చెప్పగాలేము మాకది ♦ చేతకాదు
మాకలము వ్రాయ దందున్న ♦ మహిమయేమొ
మాకలము వ్రాయ దందున్న ♦ మర్మ మేమొ.

యెఱింగియుండియు మాటాడ ♦ దెఱుఁగనట్లు
తెలిసియుండియు పలుకదు ♦ తెలియనట్లు
కవి యెఱుంగని యర్థంబు ♦ కల మదెట్లు
తెలుపు నని మీరు లోలోనఁ ♦ దలఁపవచ్చు
జడమునకుఁ దెల్వి లేదని ♦ నుడువవచ్చు
నిజమె యది గాని వాసనా ♦ నియతిచేత
సాహసించును నొక్కొక్కప్డు ♦ సహజబుద్ధి
ఉవ్విళుల నూరుచుండును ♦ నుబుసుపోక
మురళియును మాకలంబును మున్నొకప్డు
కానలోఁ గఱ్ఱలగుట శ్రీ ♦ కాంతుఁ డచటఁ
బాడి మోళ్ళఁ జిగిర్పించెఁ ♦ బట్టరాని
మోదమున రాగరసముతోఁ ♦ బోల్చి పోల్చి
యమ్మహావాసన కుల క్ర ♦ మాగతముగ
వచ్చి యావేశమునఁ జెప్ప ♦ వచ్చుచుండు
చెప్ప నని చెప్పి వెంటనే ♦ చెప్పుచుండు.
ఆ చరిత్రంబు లా కాల ♦ మా విలాస
మావినోదపుచర్య లీ ♦ యకులకును
గట్టినట్టుల రూపింపఁ ♦ గడఁగినపుడు
ఎవని స్మరియించునో యది ♦ యెవనిమూర్తి
లీలఁ బరికించునో చెప్పఁ ♦ జాలదైన
నాలుకనుబోలు తన రెండు ♦ నాలుకలను
విప్పి బ్రహ్మాండభాండముల్ ♦ విప్పునట్లు
వ్రాయఁగల దది ప్రజల హృ ♦ త్ఫలకములను

వ్రాసి చూపించు నది ప్రేమ ♦ పాఠములను
ఈ మహాసృష్టి ప్రకృతి వ ♦ ర్ణించునట్లు
ఈ మహాసృష్టి భ్రాంతి ♦ నిర్జించినట్లు
తేలిపో దింత అంత వా ♦ గ్జాలమందు
అగిపో దింత యంత ద ♦ ద్వైవచోట
అమల ప్రత్యూషసమయ శీ ♦ తానిలంబు
లురలు తటినీతటపుఁ బరి ♦ సరమునందు
పులినసీమలఁ గూర్చుండి ♦ విలస దభ్ర
గోళమందున దృక్కులు ♦ గొలిపి కొలిపి
చాతకము రెక్క లల్లార్చి ♦ చాలసేపు
విసువకుండఁగ నెగురుచు ♦ మసక లోన
కరిగి తిరిగి క్రిందకు వచ్చి ♦ నట్లు చూచి
విశ్వనాటకరంగ ప్ర ♦ వేశమైన
భ్రాంతి నిజసతీ ప్రేమాక్ష ♦ రములయందు
తొలఁగి నిర్వాణపదముతోఁ ♦ గలసిపోయె.



# గాలిపాట

౧

గాలిలోన మేడ గట్టీ
గాలిపడవ యెక్కిపోయీ
గాలిలోనే లంగ రేసితినీ
గాలితోనే పోరజూచితినీ
గాలిబాణము వేయదలచితినీ

౨

గాలికెరటా లందుకోగా
ఓడచాపలు ఎత్తినారు
గాలిధూళిని రేపివేసినదీ
గగనమంతా కప్పివేసినదీ
జగము చీకటి చేసివేసినది

౩

మిన్ను మన్నునొకలిసిపోగా
మేఘమాలిక లందువాగీ
ఉన్నచుక్కల్ల చూడలేనయితీ
నావ తెన్నున నడపలేనైతీ
త్రోవగన్నుల గానలేనైతీ

౪

సుడులబడియెను పడవ లంగరు
ముడిని విప్పే తెలివి తెలియక
పుడమిపైకే కూలిపోయినదీ
పడవ రెండుగ పగిలిపోయినదీ
నడుము రెండుగ చీలిపోయినది

ఎ

కంటినీరూ కంటిలోనే
కారి కారీ సమసిపోయేనూ
మింటి పువ్వులు తెంపబోయితినీ
మంట లెగసేచోటు చేరితినీ
వంటరినై నిలిచిపోయితినీ

ఉ

ఉదయశిఖరిని ప్రొద్దుపొడిచెను
ఊహలన్నీ విచ్చిపోయెను
హృదయమంతా చెదరిపోయినదీ
ఇహము శూన్యముగాగ దోచినదీ
బ్రతుకు నాశయు లేకపోయినధి

ఎ

ఎండమావుల నీరునమ్మి
ఎండుయూడల పాలుపిండి
ఎండవానల గలయ దూరితినీ
నిండు తేజము వాదాయ చూచితినీ
పండువెన్నెల మాయ జేసితినీ

అ

అంతులేని క్రిందిమెట్లకు
ఆలిపాకవి వలెను నడచిన
సుంతచింతయు గల్గబోదుగదా
వంతలేమియు నుండబోవుగదా
శాంతియీగతి తూలిపోదుగదా

—★—

# నిర్వాణము

1. ఏదియో వెల్గు నాకుఁగ ♦ న్పించుచున్న
దేదియో కాంతి నా కగు ♦ పించుచున్న
దేదియో జ్యోతి నాకు రూ ♦ పించుచున్న
దేదొ పైనుండి ఈ వెల్గు ♦ ఇప్పుడిపుడె
వచ్చుచున్నది నాముందు ♦ వచ్చుచున్న
దీ మహాదీప్తితో తుల్య ♦ మేది గాదు
ఈ మహాజ్యోత్స్నతో సామ్య ♦ మేదిగాదు
ఇది మహాకాశపటము ఛే ♦ దించివైచె
ఇది మహావాయుపథము స్తం ♦ భించివైచె
ఇది నవద్యోధునీమార్గ ♦ మేనడంచె
నదిగొ అమృతాభము ప్రశాంత ♦ మైన వెలుఁగు ॥ఏది॥

2. ఇందులో నాకు నీశ్వరు ♦ డెసగుచుండె
ఇందులో నాకు నా రూప ♦ మిమిడి యుండె
ఇందులో నాకు నా గురు ♦ డెఱుకపడియె
ఇందులో నాకు సురలెల్ల ♦ నెదురుపడిరి
ఇందులో ముక్తులెల్ల నా ♦ ముందు వచ్చి
మాటలాడుచు నున్నారు ♦ మనుజులట్లు
మూడుకాలాలు ముల్లోక ♦ ముల నెసంగు
వారి హృదయరహస్యాలు ♦ పలుకుచున్న
వెన్నొ మేఘాలు గర్జించు ♦ చున్నయట్టి
దెంతొ దూరాన ఈవెలుఁ ♦ గంతొ ఇంతొ
అనుచున్నది ఆహహా ♦ అనుచున్న

దిందులో గొప్ప మైకంబు ♦ నొందుచుంటి
నిందులోఁ జాల స్వాతంత్ర్య ♦ మొందుచుంటి
నిందులోఁ బెద్దతెలివి వ ♦ హించుచుంటి
నిది నభోవీధి సంకెళ్లు ♦ కదిపివైచి
ఇది మహావహ్ని శిఖల గ్ర ♦ సించివైచి
ఇది మహాపృథ్వి పాతాళ ♦ మదిమివైచి
నవ్యదిక్కుంభికుంభాల ♦ నాట్యమాడి
రిక్కలను ప్రోవులుగఁ జూపు ♦ దృక్కులకును
ప్రణవగానంబు వినిపించు ♦ శ్రావ్యముగను ॥ఏది॥

3. ఏది యాశర్వరీకన్య ♦ నూదివైచె
ఏది యాధ్వాంతశకము ఛే ♦ దింపఁగలిగె
నేది యాతమోరాశి వా ♦ రింపనేర్చె
నేది యాచీకఁటిని నిట్టె ♦ యెగురఁగొట్టె ॥ఏది॥

4. తారకల కడ్డుదూరి బ్రం ♦ దారకాది
నాకలోకాల దాగి వి ♦ న్యస్తమైన
పెద్దశిఖిశిఖాజ్వాల లే ♦ వీటినుండి
వచ్చుచున్నవొ యేమొ అ ♦ స్వచ్ఛమైన
రాగరసమిశ్రితములగు ♦ ప్రభలు కుప్ప
తిప్పలై వచ్చి మెఱపుల ♦ తీరు సుధలు
పొంగి పారలు తరంగాలఁ ♦ బోలెఁ దనరి
భూనభోంతరాళంబులు ♦ ముంచివైచె
శూన్యహృదయాలలో జ్యోతిఁ ♦ జొనిపివైచె
జగము చక్కెరతో నింపి ♦ యెగసివైచె ॥ఏది॥

5. ఇది యనంతప్రభాభాస ♦ మిది త్రిలోక
పూజితంబు చరాచర ♦ భూతకోటి
నెనసి నడిపించి తోడయి ♦ యీప్సితార్థ
సిద్ధి గలిగించునట్టి జే ♦ జేల వెలుఁగు
జిలుగురత్నాలతళుకులు ♦ గలుగువెలుఁగు
వెలుఁగులకు వన్నెపెట్టు వె ♦ న్నెలవెలుంగు ॥ఏది॥

6. ప్రేమచే బద్ధమగు నీ ప ♦ విత్రకాంతి
తపసుచే రూఢమైన యీ ♦ ధవళదీప్తి
కేది యవరోధ మేదిమా ♦ యింపఁగలదు
ఏది చీఁకటి యేది ని ♦ ర్జింపఁగలదు ॥ఏది॥

7. ఇది యభౌతిక మిదియు న ♦ తీంద్రియంబు
ఇది యుపాధిరాహిత్య మ ♦ ధ్యాత్మికంబు
ఇది యవాఙ్మానసంబు బ్ర ♦ హ్మస్వరూప
మిది యదార్థ మగోచర ♦ మిది నిజంబు
ఇది యలోకాతిసుందర ♦ మిది పరంబు ॥ఏది॥

8. ఆ మహాదృశ్యమెంత ద ♦ వ్వైనదొక్కొ (లోతు)
ఆకళారూప మెంత సాం ♦ పైనదొక్కొ
అప్రభారాశియందు దుః ♦ ఖానుషంగ
మైనసంగతి యీసున ♦ కైన లేదు
భయము సంక్షుభితంబు ల ♦ వంబులేదు
వంతయు కృతాంతమలిన మా ♦ వంతలేదు ॥ఏది॥

9. సాంద్రవిభ్రమ మాయా ప్ర ♦ సక్తసక్త
బంధరహితంబు విజ్ఞాన ♦ బంధురంబు

అనుపమానంబు నానంద ♦ మవ్యయంబు
ద్వంద్వరహితంబు దగ్ధా జ ♦ వంజవంబు
నైన దీని విమర్శించి ♦ దీనిలోతు
దీసి శూన్యంబులోనున్న ♦ దీనిదగు న
గాధగాధను వివరింపఁ ♦ గలుగుటెటుల
దీని మీముందుఁ దెచ్చి బం ♦ ధించుటెటుల
దీని మీకర్థమట్లు బో ♦ ధించు టెటుల ॥ఏది॥

10. గాలి నెవరేని మూటగాఁ ♦ గట్టిరేని
వెలుతు రెవరేని గాదిలో ♦ వేసిరేని
కాలవాహినికిని గట్టు ♦ కట్టిరేని
సాంధ్యరాగాల నొడిఁబట్టఁ ♦ జాలిరేని
మెఱపుతళుకులు దోసిళ్ళ ♦ నెఱపిరేని
వారి కేమైన నిది చెప్ప ♦ వచ్చునేమొ !
వారి కేమైన నిది చూప ♦ వచ్చునేమొ ॥ఏది॥

11. ఈమహాసత్య మెవరు గ్ర ♦ హింపగలరు
ఈమహాశక్తి యెవరు వ ♦ ర్ణింపఁగలరు
ఈ మహాకాంతి యెవరు ద ♦ ర్శింపఁగలరు
మెసవునే పక్షులెల్ల మా ♦ మిడి చిగుళ్లు ॥ఏది॥

12. ఎన్ని చెప్పదు బ్రహ్మాన్వడి ♦ యున్ననేను (మూర్ఛిలి)
ఎన్ని చెప్పదు రుద్ధమై ♦ యున్ననేను
అగ్ని కాహుతియై పోవు ♦ నాజ్యమట్లు
నీళ్ళఁ గరఁగిపోయిన యుప్పు ♦ గల్లుపగిది
గాలి నెగిరిపోయిన మట్టి ♦ కణమురీతి

ఎవనిదేహేంద్రియంబు లై • హికము మఱచు
ఎవనిజీవాణువులును స్తం • భించిపోవు
ఎవనిచైతన్య మిష్టిని • ర్జింపఁబడును
ఎవనిరక్తంబు పొంగి వే • డెక్కునొక్కొ
ఎవని కన్నీళ్ళు నానాటి • కేఱులగునొ
ఎవని కంఠంబు నేడ్పుచే • వివశమగునొ
వాని కీకాంతి కన్నులఁ • గానఁబడును
వాని కీవెల్గు ముందట • వచ్చి నిలుచు ॥ఏది॥

13. నేను నీవెల్గులో నింక • నిలిచిపోదు
నేను నీకాంతిలో నింక • లీన మగుదు
నేను నీ జ్యోతిలో నింక • నెనసి యుందు
నేను రానింక నిది వీడి • రాను రాను
నేను నీ పుణ్యభూమిని • మాని రాను
నేను రానింక నెన్నాళ్ళ • కైనఁగాని
ద్వారములు మూసికొండు నిఁక • దలఁపవలదు
పిలువఁబోకుఁడు నన్నింకఁ • బిలువఁబోకుఁ
డాగిపోయెద నీయను • రాగమందు
నిలిచిపోయెద నీశాంతి • నిలయమందు
నాది యీశాంతిసదనమే • ఆదియందు
నాది యీస్వర్గధామమే • అదియందు
నాది యీ మోక్షభవనమే • ఆదియందు ॥ఏది॥

14. నాకు ఈమాయప్రజలతో • శోక మేల
నాకు ఈదుర్మదాంధుల • జోక యేల
విడిచి పొండిక నన్నింక • విడిచి పొండు

మఱచి పొండికఁ నన్నింక ♦ మఱచిపొండు
వెక్కిరించుచు నన్నింక ♦ వెడలిపొండు
బూది గొనివచ్చి నాపైని ♦ పోసిపొండు
చూచి నిందించి నాయొద్ద ♦ లేచిపొండు
నాకు మీతోఁ బనేమి యే ♦ నాటికైన
మీ రధోలోకగాములై ♦ జారిపొండు
మీరు పాపాలు పల్కుచు ♦ పారిపొండు ॥ఏది॥

సిద్ధులు ఫకీరు లాత్మ నీ ♦ క్షించినట్టి
దిదియె నిర్వాణమనియెడు ♦ ఈ మెలుంగు
ఇట్టు లుంరాలిషాకవి ♦ యెఱుకఁజెప్పె.

—★—

# ప్రేమనర్తకి

తలఁపఁగానిండు ఆచల ♦ చ్చంచలాక్ష
ఆ మహాప్రేమనర్తకి ♦ ఆ వధూటి
ఎచట దాగెనొ యేజాడ ♦ నేగెనొక్క
చూడఁగా నిండు ఆమె వె ♦ న్నాడనిండు
అహ ! ప్రియోదంత మీ జగ ♦ దంతరాళ
ములఁ ప్రబదీపించు ; గను లెట్లు ♦ మలపుకొన్న
ఆమెయే తోఁచునట్లుండు ♦ నేమొగాని
ఆ విశుద్ధప్రియైక సం ♦ భావితార్థ
ప్రేమనాట్యంబు జాతీయ ♦ భూమి కిద్ధ
జీవితాంకంబు సార సం ♦ జీవ సుధము
మేఘమాలల మెఱపులు ♦ మెఱసినట్లు
వానచినుకుల సెలయేళ్లు ♦ పారినట్లు
వనముల విలాసములవెంట ♦ పరుగునట్లు
పక్షులు కుహూరుతంబులు ♦ పరఁగినట్లు
వెన్నెలబయళ్ల నాడుకో ♦ వెళ్లినట్లు
పువ్వుల సువాసనలవెంటఁ ♦ బోయినట్లు
ఏళ్ల సైకతసీమల ♦ నెసఁగునట్లు
పాడుచున్నది దిక్కుల ♦ పరిథవిల్ల
దోఁచుచున్నది యామె దో ♦ బూచులాడి
ఆ విలాసంబు విశ్వమ ♦ యాకృతి నదె
ముగ్ధుగాఁ జేసె ఆమె వి ♦ దగ్ధవిభవ
ప్రేమ శృంగారరస సమా ♦ వృత విశేష
మీయజాండంబు నిండి యెం ♦ తేప్రసన్న

తను నిరూపించు నీ యువ ♦ తరణవిధము
దీనిలో నాకు శాంతి సం ♦ ధిల్లుచుండు
దీనిలో నాకు శాంతి వ ♦ ర్ధిల్లుచుండు
దీనిలో నా మనస్సు సు ♦ స్థిరతఁగాంచు
దీనిలో నామనస్సు భ్రాం ♦ తినిదహించు
నేను ప్రకృతి కతీతమై ♦ ఏగుచుంటి
ఏను విశ్వజీవిత మేవ ♦ గించుచుంటి
ఏను శూన్యాలయంబుల ♦ నేదొ గల ద
టంచు నా ప్రేమమూర్తి కా ♦ సించుచుంటి
ఆ మహాప్రేమ ప్రళయాల ♦ నాచికొంటి
ఇంక నామాట మీకు స ♦ హింపఁబోదు
ఇంక నాయూసు మీకు భ ♦ ర్జించబోదు.

—★—

# ప్రకృతి

ప్రకృతి సత్య మిథ్యా స్వరూ ♦ పములఁ దెలిసి
భావి పరిణామ భాగ్య సం ♦ పదలఁ దెలిసి
కాలచక్ర పరిభ్రమ ♦ కారణంబు
కాలపరిణామ సంస్కార ♦ కారణంబు
తెలిసి తెలిపెడు తెలివిని ♦ దెలిసి ప్రజల
కెపుడు నీచాధికంబుల ♦ నిచ్చుచుండు
ప్రకృతి తేజస్స్వరూప సం ♦ పదలనీను
ప్రకృతిలో తేజ మైక్యమై ♦ పరగుచుండు
నంతె కాని యవ్యక్త మ ♦ హాంధకార
బంధురంబయిలేదు ఈ ♦ శ్వరుని ప్రకృతి
ప్రకృతి పరమేశ్వరులకు సం ♦ బంధ మొకటె
ప్రకృతి జడ మని కొందఱు ♦ పలికినారు
ప్రకృతి యనదని కొందఱు ♦ పలికినారు
పలుకులకు నందరాని యీ ♦ ప్రకృతిఁ జూచి
ప్రకృతి పరమాత్మ యని మేము ♦ పలికినాము
ప్రకృతి యోగసిద్ధిని గాంచి ♦ పలికినాము
ప్రకృతి కధ్యాత్మతత్త్వ భా ♦ వములు గలవు
ప్రకృతి సకలార్థసిద్ధికిఁ ♦ బట్టుకొమ్మ
ప్రకృతిపురుషులే లోక సం ♦ గ్రహము, ప్రజలు
వికృతరూపులు ఆత్మ యే ♦ విషయమందు
నప్రమత్త మబాధక ♦ మై వెలార్చు
కపిలుఁ డిది లెక్కఁబెట్టి సాం ♦ ఖ్యమని వ్రాసెఁ
గాని స్వాతంత్ర్య మాత్మకు ♦ గలుగు ననుచు

నెఱుఁగ దయ్యెను మాయను ♦ నెఱుఁగఁ దయ్యె
జడునిపగిది భవాంబుధి ♦ నుడుగడయ్యె
కొమ్మ చిగురించు ; కోయిల ♦ కూయనేర్చు ;
కాకి యరచును ; పురి విప్పి ♦ కేకి యాడు ;
పద్మిని ప్రభాతవాత సం ♦ పదను జూచి
నవ్వనో యన వికసించు ; ♦ జవ్వనంబు
ప్రేమపూరిత కలశమై ♦ వెలయు నిట్లొ
ప్రకృతి బహుభంగులై కానఁ ♦ బడుచునుండు
నీవు గుణముల నరికట్టి ♦ నెనరు గలిగి
విశ్వమానవలోకంబు ♦ వెదికితేని
సత్వసంపన్నుఁడే ప్రపం ♦ చమున యోగ్యు
డతని మ్రోలనే ప్రకృతి జో ♦ హారు సేయు
నతనియెదుట తృణప్రాయ ♦ మై వెలార్చు
అతని బూజింత్రు విబుధు ల ♦ త్యంత మతఁడు
బ్రాహ్మణుండైనఁ గడజాతి ♦ శ్వపచుఁడైన
పూజ్యుడగు గాని సద్గుణ ♦ పూజ్యుఁడైన
వాఁ డుదగ్రపీఠం బెక్కి ♦ వాగుచున్న
వేదవేదాంగములు నేర్చి ♦ వెలయుచున్న
నిష్ప్రయోజన మన్నిట ♦ నింద్యుఁ డతఁడు.

# ప్రార్థన

గీ. జ్ఞాన మజ్ఞానములమధ్య ♦ గ్రాలు నన్ను
అన్నపానాలకై యంగ ♦ లార్చు నన్ను
బహుళ తాపత్రయంబులఁ ♦ బడయునన్ను
దుఃఖచితి కింధనంబునై ♦ దొరలు నన్ను
ఎటులఁ గాచెదొ నీలోన ♦ నెటులఁ జేర్చి
కొందువో దేవ నేను నీ ♦ యందె భార
మాని యర్థించుచుందు రే ♦ యంబగళ్ళు
నిన్నె వీక్షించుచుందు నే ♦ తెన్ను కన్ను
మలిపి చూచిన నీ రూపె ♦ తెలియుచుండు
నిలిచి కాంచిన నీ కాంతి ♦ వెలుఁగుచుండు
పిలిచి చూచిన నీ పేరె ♦ పలుకుచుండు
నీవె సకలంబు నీయందె ♦ నేను గలను.

వెడలఁ జాలని పాతాళ ♦ వీధులందు
చేరనేరని యాకాశ ♦ సీమలందు
ప్రాకనోపని జలధి గ ♦ ర్భములయందు
నీవె యున్నావు నాయందు ♦ నీవు లేవె.

సాంధ్యరాగములందు ను ♦ షస్సులందు
కిసలయంబుల నెత్తిని ♦ ప్రసవములను
సానువులఁబాఱెడు నదీ ♦ సలిలమందు
తరచు నాగుండెలోని ర ♦ క్తమును పిండి
పూత పూసితివా లేద ♦ పుడమి నన్ను

బెట్టు కష్టాల నే లెక్కఁ ♦ బెట్టునెడల
ఏది విశ్రాంతి నీ ధ్యాన ♦ మేసమాధి
ఏది యవధి నీ పూజె ♦ యభీష్టసిద్ధి
వేరు గత్యంతరము లేదు ♦ వెదుకరాదు.

శాంతిగీతాలు పాడు శ ♦ కుంతలములు
ప్రకృతిసతి రిక్కలను తలఁ ♦ బ్రాలుజల్లు
నగములొగి లేచి నీ మహో ♦ న్నతికి మ్రొక్కు
ఎల్లలోకాలు నీ యిండు ♦ లేను నీదు
పాదసేవకునైనను ♦ పనికిరానె.
వెఱచి కాపాడుమనుట క ♦ క్కరకురానె
చూడుమీ న న్ననుటకు నో ♦ చుకొనలేదె
రమ్ము నాలో వసింపు మా ♦ లస్య మేల
రమ్ము నాయెట్టయెదుట కూ ♦ హ్యమ్ము తేల
తే పనుసడి లేనే లేదు ♦ లేదు తండ్రి.

—★—

# జన్మభూమి

మహితమాణిక్య కలధౌత ♦ మయసమున్న -
తంబులైనట్టి హిమవన్న ♦ గంబు లుదిత
కుధరములు మాకు పెట్టని ♦ కోట లవిగొ
ఫలములును పూలు కేదార ♦ ములు రచించు
క్షేత్రముల చారుజాహ్నవి ♦ సింధునర్మ
దాది గోదావరీకృష్ణ ♦ యమున వాఃప్ర
పూరపూరిత పుణ్యస్ర ♦ వంతులెన్ని
గలవు మానేల రత్నాల ♦ గర్భయనఁగ
ఇదియె నాజన్మభూమి నా ♦ కిదియె తల్లి.

శాంతమతిని కల్లోలినీ ♦ స్వామి రెండు
హస్తములు చాచి యక్కున ♦ నద్దిమమ్ము
కడుపులోపల జట్టైన ♦ గదలకుండ
హాయిగాఁ బూవుతొట్టెల ♦ యందుఁ బెట్టి
యూపుచున్నది జోకొట్టి ♦ రేపుమాపు
సాకుచున్నట్టి భరత వ ♦ ర్షమ్ము సతము
ఇదియె నా జన్మభూమి నా ♦ కిదియెతల్లి.

వాఙ్మయంబున కిది తొల్లి ♦ వాసభూమి
తత్వగానంబునకు నిది ♦ తల్లినేల
పూతచరితలు సాధ్వుల ♦ పుట్టినిల్లు
కవులకును వీరులకు నిది ♦ కాణయాచి
ఇదియె నా జన్మభూమి నా ♦ కిదియెతల్లి.

తతయుగాలంకృతుండు మాం ♦ ధాత యెచట
తొల్లిరాజ్యలక్ష్మికిఁ గురుల్ ♦ దువ్వినాఁడొ

ఎండుమ్రాకుల్ చిగుర్ప శ్రీ ♦ కృష్ణుఁ డెచట
ప్రకృతి కంపింప మురళి వా ♦ యించినాఁడొ
అతిమహాశాంతిఁ బాదుషా ♦ అగ్బ రెచట
భ్రాతృస్వాగతగీతముల్ ♦ పాడినాఁడొ
ఇదియె నాజన్మభూమి నా ♦ కిదియెతల్లి.

జీససు కబీరు బుద్ధస ♦ న్న్యాసులెచట
పచ్చిరక్తంబు స్వాతంత్ర్య ♦ పట్టమునకు
నేరులై పార నంచెదు ♦ రీది రెచట
వెన్నెముక విల్లుకై యిచ్చి ♦ వేసె నెచట
కవచకుండలముల నియ్యఁ ♦ గలిగి రెచట
అఖిలజగముల కేది వి ♦ ద్యల నొసంగె
అఖిలలోకములకు నేది ♦ యన్న మిడియె
అఖిలజాతుల కేది యు ♦ పాధి యయ్యె
మట్టిలో నేని బంగారు ♦ మహిమగలదొ
పాడిపంటలు మితిలేక ♦ పండునేదొ.
అదియె నా జన్మభూమి నా ♦ కదియె తల్లి.

పారసీకనభంబునుఁ ♦ బాసినట్టి
చుక్కలేచోట తిరిగి త ♦ ళుక్కు మనెనొ
అవనియందే పురాన న ♦ ధ్యాత్మగీతి
మురళిలో వినుభాగ్యంబు ♦ పరగెనొక్క
ఎచటఁ గాళిందిఫణముల ♦ నెక్కి త్రొక్కు
గజ్జెలరవంబులను వినఁ ♦ గలిగినారొ
శ్రీ మహమ్మద్రసూల్స్వామి ♦ సేదదీర్ప
చల్లనగుగాలి యేధాత్రి ♦ చల్లెనొక్క
రామ చంద్రునివంటి వీ ♦ రప్రతాప
శాలిశాలికి నేధాత్రి ♦ జన్మభూమి

పశుగణంబుల పచ్చిక ♦ పట్టు నేది
వసువు లెచ్చోట నుండు రే ♦ ఖవలుఁ విడక
కర్మసాక్షికి నెచ్చోట ♦ ఘనతగలదొ
కర్మవీరుల కెచ్చోట ♦ కాపురంబొ
అదియె నా జన్మభూమి నా ♦ కదియె తల్లి.

ఎచటి భక్తులు మూసాసు ♦ నెనయువారొ
ఎచటి నగములు సీసాను ♦ నెనయునొక్క
నూహునౌక ప్రయాణమై ♦ యేహమాల
యమున నిలిచి జలప్రళ ♦ యాంతవేళ
ఏది స్వర్గసౌధమునకు ♦ నెక్కిపోవు
పూజ్యసోపానమై యొప్పు ♦ పుణ్యతలమొ
ఏప్రదేశమున వసంత ♦ ఋతువునందు
కాపురముసేయ స్వర్గ సం ♦ కాశమగునొ
అదియె నా జన్మభూమి నాఁ ♦ కదియె తల్లి.

బౌద్ధముని యిల్లు, జాపాను ♦ వారి కాశి,
క్రీస్తుభక్తుల చిన్ని "జ ♦ రోసలేము"
అవనిలోఁ బ్రాతపడిన మ ♦ హమ్మదీయ
వైభవంబుల కేది ని ♦ వాసభూమి
పుణ్యసతులకు నదులకు ♦ పుణ్యమిచ్చు
క్షేత్రములకు పవిత్ర చ ♦ రిత్రములకు
నేది కాణాచి ఋషులకు ♦ నేది యిల్లు
ప్రతిసుమంబును నేదేశ ♦ వసుధయందు
స్వర్గసుమములఁ బోలు వా ♦ సనలఁ వీయు
నదియె నా జన్మభూమి నా ♦ కదియె తల్లి.

# రాటము

ఉ. రాటము సాంఖ్యరూపము వి ♦ రాట్పురుషాకృతి చూచినన్ జగ
న్నాటకసూత్రధారి యిది ♦ నాఁడును నేఁడును కల్పవృక్షమై
కాటక మన్ పిశాచమును ♦ గాల్చు ఫిరంగి ; పరంగిపాలికిన్
చేటులమూట ; మా ప్రజలు ♦ చేసినపుణ్యము గణ్య మన్నిటన్.

సీ. కామదేవత తోక ♦ జాడించి పార నా
రాట మెత్తించిన ♦ రాట మిదియె
కలి ఖిలాధముని డొ ♦ క్కలు వాలికలుజేసి
యోడయెక్కించిన ♦ ప్రోడ యిదియె
రౌలట్పిశాచ మా ♦ రణహోమమును జేసి
దండింపఁగల మంత్ర ♦ పిండ మిదియె
దాస్యశృంఖల త్రెంపి ♦ తల్లికిఁ జెఱ విడి
పించి స్వరాజ్యమి ♦ ప్పించె నిదియె

తే. భారతీయగౌరవము కా ♦ పాడు నిదియె
చెడుగు ప్రజలకు రాకుండఁ ♦ జేయునిదియె
మద్యపానాదికృత్యముల్ ♦ మాన్పు నిదియె
చరపదంబు విరాట్స్వరూ ♦ పంబు నిదియె.

శా. హిందూమూసలిమానులొక్కటయి యా ♦ హిందూమహారాజ్యమం
దెందున్ వైరిపిశాచమండలము రా ♦ నీకుండఁగాఁజేసి ని
స్సందేహంబుగ రాజ్యలక్ష్మిని ప్రతి ♦ ష్ఠానంబుగావించి యా
నందంబీయఁగఁజాలు రాటమునకున్ ♦ గై మోడ్పులర్పింపుఁడీ !

# పాంథుఁడు

చ. ఇది ప్రియురాలుపూర్వమువ ♦ సించెడుసౌధమువిన్నఁబోయియు
న్నది యిట నామె లేదు విపి ♦ నంబునఁ బూపొదఁబాసి తేటి పో
వధు; పిక మారసాలమునుఁ ♦ బాయదు నా ప్రియబాసిదుఃఖమన్
ప్రహదముననన్ను డించెనక ♦ టా ! యిటనశ్రులురాల్చుచుండెదన్.

ఉ. చల్లని పిల్లగాలి తెర ♦ చాటున వచ్చి వనంబు సొచ్చి సం
ఫుల్లసుమాళితోఁ గలసి ♦ పోవుచుఁ గొన్నిటి రాల్చినట్లు నా
పల్లవపాణినిన్ గుసుమ ♦ బాణుఁడు గూల్చెనొ శీధుపాత్రమ
ట్లుల్లము తల్లడిల్లు నది ♦ గో కనుఁగొంటివె వాని నెచ్చెలీ !

తే. సూర్యుఁ డపరాద్రి గ్రుంకెను; ♦ సూనబాణుఁ
డడవిమల్లెల నేరికో ♦ నరుగుదెంచె
కాలకన్య నల్లనిచీర ♦ గట్టుకొనియె
ఉడుగణంబులు నింగిపై ♦ బొడవుసూపె.

వ. నాచెలి యింకెక్కడిది ? ఇది నెలవంక.

చ. మిడుతయు దీప మొక్కెడ శ ♦ మించెనుగాని పతంగమాశకై
విడిచెను ప్రాణముల్ విసిగి ♦ వేదన గాలుచు దీప మారెని
ట్లడరు వియోగభార విప ♦ శాత్మలసంగతి నవ్వు చొక్కఁడున్
బుడమినినేడ్చు చొక్కఁడును ♦ బోవు ప్రియావిరహాగ్ని ద్రుగ్గుచున్.

—★—



ప్రాణములు నీదు పాదాల । పైని విడిచి
మట్టినై నీవు త్రొక్కెడి । మార్గమందు
నుండ నూహింతు జీవిత । ముండువఱకు
నేడ్చుచుందును నిన్ను వీ । క్షించు కొఱకు.



# రాధ

ఏల యేడ్చెదు కన్నీళ్ల ♦ నేలకార్చె
దబల ! ప్రతిబాష్పకణము నీ ♦ యంతరంగ
వేదనారూపదందహ్య ♦ విషరహస్య
పేటికనువిప్పుతాళమై ♦ వెల్లియుఁగాదె
ప్రేమలోపలి జ్వాలయై ♦ పెరుఁగు గాదె ||ఏల||

ఏల తెలియవు బాల నీ ♦ కాలిప్రేల
నేలవ్రాసెదు వ్యసనగీ ♦ తాల నడుగు
జాడలను దీసి విరహు లీ ♦ నాఁడు మురిసి
చదువుచున్నారు తమకళా ♦ శాలలందు
వెదకుచున్నారు తమమనో ♦ వీధులందు ||ఏల||

ఏలతెలియవు నీగుట్టు ♦ లింకదాఁగి
యున్నవనుకోకు పికము నూ ♦ రూరుప్రజలఁ
బిలిచి నీయూసె యేకరు ♦ వెట్టుచుండు
నిలిచి నీపేరె యెలుఁగెత్తి ♦ పలుకుచుండు
మబ్బుతెరఁ దీసి చీకట్లు ♦ మాటు విడిచి
చూచుచున్నవి నీవంకఁ ♦ జుక్క లవిగొ
చూచుచున్నవి ప్రకృతిలో ♦ సొగసు లవిగొ ||ఏల||

కొసరియింటింటఁ గలదు నీ ♦ గోడు వింటె
విరిసి ప్రతినోటఁ గలదు నీ ♦ వింతఁ గంటె
రవ్వ పాలైతి వింక నీ ♦ ప్రాయమెల్ల
ఎవరికై పెట్టితివొ యతఁ ♦ డిచట లేఁడు
లేఁడు మఱి రాఁడు నీ ♦ తోడ మాట
లాడఁడిఁకఁ గలనాటి స ♦ య్యాట విడిచి
పొమ్ము యమునా తరంగిణీ ♦ పులినసీమ
లందె వెదకుము మురళివా ♦ ద్యమ్ములోఁ ద్వ
దాఖ్య వినవచ్చునేమొ రా ♦ ధావధూటి !

—★—

# ఆలకింపు

ఈ నిషిద్ధ దురాగత ♦ మైన జీవి
తంబు ; ఆశామలీమ ♦ సాధ్వాన్నమైన
ఈ తమోరాశి, యీ పరి ♦ ధూత శిత వి
ఖిన్న సంఛిన్నవర్తన ♦ మెన్నినాళ్లు
గడపెదో శాంతిలేని యీ ♦ పుడమిపైని
నడపెదో పేర్మిలేని యీ ♦ యెడద పూని
అల్పప్రభాతంబు గడచి సం ♦ ద్యాప్రదోష
మిటు ప్రయాణంబు సలుపు టిం ♦ కేమిఫలము
తోట పువుపూయుకాలంబు ♦ తొలఁగిపోయె
ఇచట ముళ్ళేరుకొంట నీ ♦ కేమి ఫలము.
పక్షులన్నియు గూళ్లల్లి ♦ పవ్వళించె
ఇపుడు పుల్లలు త్రెంప నీ ♦ కేమిఫలము
గుఱ్ఱములు పందెములు గెల్చె ♦ కొన్నవపుడె
ఇపుడు లాయంబు విప్పె దిం ♦ కేమిఫలము
తోడివారలు చదివి యు ♦ ద్యోగులైరి
ఇపుడు నీ యక్షరాభ్యాస ♦ మేమిఫలము
పొలము పండించి కోసుకు ♦ పోయినారు
ఇట్టు పరగేరుకొనుట నీ ♦ కేమిఫలము
మూడుజాములు నాటక ♦ మాడినారు
ఇపుడు టిక్కెట్లు కొనెద విం ♦ కేమి ఫలము
వలపువాకిట వయసెల్ల ♦ వెడలిపోయె
ఇంక నెఱసినతలను పూ ♦ లేమి ఫలము.

—★—

# భాష

భారతదేశమం దెపుడు ♦ భాషను వృద్ధికిదెచ్చుమార్గ మె
వ్వారు నొనర్పరైరి కవి ♦ వర్గము పేదరికాననున్న దా
మే రచియించినా మని ని ♦ జేచ్ఛ మహాకవితావిశేష వి
స్తార రసాస్పదంబయిన ♦ సంగతి రాజులు బిత్తవోయినన్.

భాష నశించిపోయినది ♦ భాషను నుద్ధరణం బొనర్చునో
పోషకుఁడైన లేఁడు మరి ♦ పోయిన రాజ్యము రాదుగాని ఈ
భాషలు వచ్చుఁగాన పరి ♦ పాటిగ వాని సముద్ధరింప సం
తోషముతోడ రండు మన ♦ తో చనుదెంచును వాణి రాణియై.

పూర్వ హరూన్‌రషీదు మహ ♦ మూద్‌గజనీకుల మీనిజాము లా
పూర్వ మహాప్రబంధముల ♦ బోధలు గాదులఁద్రవ్వి పోయుచున్
నిర్వహణం బొనర్చి రవి ♦ నేఁడును దోఁచెడుఁ గాని భారతిన్
బర్వఁడొకండు పాత్తములు ♦ వ్రాయుట కూత నొసంగు దాతయై.

ఏల నిఘంటు వీ తెనుఁగు ♦ కెన్ని ప్రబంధములున్న వీ మహా
భీల దురావగాహ పరి ♦ విశ్రుత దివ్యపదావలోకనో
ద్వేల లసత్ప్రయోగములఁ ♦ దెల్పఁగ; మున్ను కవిత్వ సంపదల్
తేలగనిందు అర్థములు ♦ దేల్చుట కవ్వలఁ జూడఁగూడదా ?

—★—

# కవి

మోళ్ళు చిగురింప, నెండిన ♦ బీళ్ళు పచ్చ
బాఱ, రాళ్ళు ద్రవింపగా, ♦ పతనమైన
జాతి రేకెత్త, ప్రేమైక ♦ గీతికలను
పాడి పాడి రసావేశ ♦ భరితుఁడై య
జాండ మలరిందు కవి యిప్పు ♦ డుండవలయు.

ఆంధ్రయువకుల స్వాంతాల ♦ యందు గలుగు
నగ్ని బీజాలు మొలిచి యం ♦ తంతలైన
పూర్వచారిత్రములు గాన ♦ పూర్వకముగ
పాడి ప్రకటించి వైరి గ ♦ ర్భములనుండి
మండి యెగసెడి దారుణా ♦ ఖండ ఖండ
మండితానలదందహ్య ♦ మానములగు
జ్వాలలైనమ చల్లార్పఁ ♦ జాలునట్టి
ప్రేమరసవాహినులు భావ ♦ వీధులందు
పొంగి పారల వియద్గంగ ♦ బోలె దనరు
చుండు శ్రుతిఁ బాడుకవి యిప్పు ♦ డుండవలయు.

మతమతాంతర వైషమ్య ♦ మహితమేఘ
మాలికలు విచ్చిపోవ రో ♦ మాంచములను
బొడమ భేదసందేశ త ♦ మోవివృత్తి
వాయ వాయెత్తి ముగ్ధ భా ♦ వములతోడ
ప్రౌఢహృదయాలు కరిగి నీ ♦ రములుగాగ
ముక్తకంఠాన దశదిశల్ ♦ మ్రోయునట్లు
విమలమగు మైత్రియనెడి గీ ♦ తమును వ్రాసి
స్వరసుధారసపూర్ణమౌ ♦ మురళి నెఱపి
నిండుమతిఁ బాడుకవి యిప్పు ♦ డుండవలయు.

ఏది మఱపించె మానవ ♦ త్వాది సకల
విశ్వజాలంబు నేది హృ ♦ ద్భేదకంబు
నగుచు వార్ధుల నింకించి ♦ గగనమునకుఁ
దాఁకి నేలకు దూఁకి చీ ♦ కాకు సేయఁ
గలిగెనో యట్టి భాషాప్ర ♦ గాఢమైన
పట్టుదల నీర్ష్య యిసుమంత ♦ పట్టకుండ
సర్వసమభావమును భ్రాతృ ♦ సమితికుండు
సహజమగు శాంతి నౌచితి ♦ సహనమనెడు
కంచుఢక్కను గొట్టి వా ♦ యించి మతులు
మార్చి భ్రమరంబు పురుగును ♦ మార్చునట్టు
లమల విజ్ఞానతత్త్వ మ ♦ ధ్యాత్మశక్తు
లొలుక రచియించు కవి యిప్పు ♦ డుండవలయు

జననియును, జన్మభూమియు ♦ స్వర్గమునకు
మించినవి యని యెదను బూ ♦ జించి యాత్మ
దేశదాస్యంబు దారిద్ర్య ♦ దీనమైన
బంధములఁ ద్రెంపి సౌభాగ్య ♦ భవనసీమ
జయజయధ్వానములఁ గీర్తి ♦ సతి పతాక
మెత్తి దిక్కుంభికుంభాల ♦ నృత్యమాడ
నెండవానల జనపద ♦ మండలములఁ
గలయదిరిగెడు నాది భి ♦ క్షుకునివంటి
స్వార్థలోభ పరిత్యాగి ♦ యాత్మగాన
మొండు గొని పాడు కవి యిప్పు ♦ డుండవలయు.

—★—

# అడవిపాట

తెల్లుపువ్వులు పాపట ♦ నల్లుకొనుచు
గొజ్జఁగులదండఁ జేతఁ గై ♦ కొని విలాస
మడరఁ గర్పూరపనఁటి పు ♦ ప్పొడులఁదోగి
వచ్చి యొకకోనఁ గానలో ♦ బాటపాడు
నట్టి కాపులపిల్ల యే ♦ మనెను వినుము
ప్రియుఁడ! యెందేగినావు నన్ ♦ విడిచి యిచటఁ
గానఁగారావు కానలోఁ ♦ గానలోల
బాల గోలను నను గేలి ♦ పాలుజేసి
వెడలఁ జెల్లునె ? వికచార ♦ విందనేత్ర
రమ్ము ఈదండ నిడుదువ ♦ క్షమ్మునందు ॥తెల్లు॥

గానపాండిత్యగరిమ లో ♦ కము జయించి
పంచమరవాబ్ధి జగమును ♦ ముంచివైచి
మధురగంభీరరవమున ♦ మరలనెత్తు
కోకిలముకన్న వింతగా ♦ నీకు నచ్చు
పాట పాడెద రావయ్య ♦ ప్రాణసఖుఁడ
ఆటలాడెద రావయ్య ♦ ప్రాణసఖుఁడ. ॥తెల్లు॥

తేనెసోనలకంటెను ♦ దియ్యనైన
ఇక్షురసమునకంటెను ♦ నెక్కువైన
సోమపానంబుకంటెను ♦ జొక్కమైన
చక్కెరకు మించి యమృతంబు ♦ ధిక్కరించి
మధురతేజంబునకుఁ జూడిక్క ♦ మలపునట్టి
రచనములఁ బ్రొద్దుపుచ్చెద ♦ రమ్ము రమ్ము
వచనముల వేడ్కఁ గూర్చెద ♦ వడిగరమ్ము. ॥తెల్లు॥

పువ్వుఁబువ్వును యాచింపఁ ♦ బోవునట్టి
మధుపమును జూడు సహచరి ♦ మఱచెనేమొ
కొమ్మకొమ్మకుఁ దిరుగుచుఁ ♦ గూయుచుండు
పికవరముఁ జూడు సహచరి ♦ విడిచెనేమొ
మదనుకొలువున భృతికయి ♦ కుదురుశుకము
వంకఁ జూడుము సహచరిఁ ♦ బాసెనేమొ
మిన్ను మన్నెఱుఁగకయుండు ♦ మేఘజలము
కొఱకు నెలుగెత్తి చను వాన ♦ కోయిలంబు
కలువతూండ్లకుఁ గొలఁకులఁ ♦ గాలికొలఁది
బారు రాయంచపిండుల ♦ దారిఁ జూడు
సహచరులఁ బాసి యెందైన ♦ సాగునేమొ
ఈవు నను వీడిపోవంగ ♦ నేమికతము
ఈవు నాముద్దు దీర్పవ ♦ దేమికతము. ॥జెల్లు॥

ఆకు తొడిగిన దెల మావి ♦ ప్రాకు గంటె
పువ్వు పూచెను మల్లికా ♦ మోహనాంగి
పెనఁగొనియె జాజిలత గురు ♦ విందతీఁగ
గెలవిడిచెఁ బోకబోది, వా ♦ గుల మృణాళి
పువ్వువిడిచె ప్రకృతికాంత ♦ నవ్వుచుండ
వరలుచున్నవి మధుమాస ♦ వాసరములు
వెలయుచున్నవి మణిదీప ♦ విలసనములు
సొగసుగల యౌవనమువంకఁ ♦ జూడవేమి
సొగసుమీరెడి నావంకఁ ♦ జూడవేమి
జవ్వనంబును, కుసుమ వా ♦ సనయు, గ్రిహణ
కాల మెంతకాలంబుండఁ ♦ గలవొ చెపుమ
అనుచుఁ గన్నీళ్లు రాల్చె నా ♦ యతివమిన్న ॥తెల్లు॥

# లేఖిని

కలము సత్కావ్యకలన ని ♦ క్కము సరస్వ
తీ స్వరూపంబు నముపాస్య ♦ దివ్యభవ్య
వైభవ మహామహంబు శా ♦ శ్వతపదంబు
ఈ ప్రభాతాల సాంధ్యరా ♦ గప్రసార
శాద్వలంబుల సెలయేళ్ళ ♦ సైకతాల
అలల తిరుగళ్లఁ బడెడు వె ♦ న్నెలబయళ్ల
గళ్లుదీర్చిన మేఘాల ♦ గగనమందు
తరలు శృంగార రాగ సౌం ♦ దర్యజలధి
నావవలె నాకలంబు వె ♦ న్నాడిపోవు
చాపవలె నాతలంపుకై ♦ చోపులెత్తు
ఊహ లను గాలివీవ నే ♦ దో తటాన
కరుగుచున్నది స్వేచ్ఛా వి ♦ హారసీమ
వేగుచున్నది యానంద ♦ విభవవీధి
కాసవము ద్రావి మైకాన ♦ నాలపించు
వాని సురభాండ వర్ణనా ♦ పాటవంబు
నేర్చినట్టుల కవితలు ♦ గూర్చినటుల
దోగుచున్నది వివిధ పా ♦ థోధులకును
నిట్లు శరవేగము రస వా ♦ హినుల నెనసి
తేలిపోయెడు నావకు ♦ తెడ్డు కలమె
కదలపోయెడు నావ చు ♦ క్కాని కలమె
అన్నియును తానెయై రూప ♦ మన్నియెడల
మార్చుచున్నది కవితలఁ ♦ గూర్చుచున్న
దిది, నడుపువార లెవ్వరో ♦ యెఱుకపడదు

ఇది గడుపువార లెవ్వరో ♦ యెఱుకపడదు
నావ నడిచిన త్రోవలో ♦ తీవలును ప్ర
ఫుల్ల హల్లకములు, తెలి ♦ ముత్తెముల కొ
టార్లు జాళువా పసిడి కొం ♦ డల చివళ్లు
నీలమణిమంటపముల ర ♦ త్నాల దీప
ముల తటంబుల రాజిల్లు ♦ ముదితలార్చు
కురులఁ దురిమిన మల్లె ♦ పూసరులు, వరుస
సంజకెంజాయతోటి ♦ నిశావధూటి
నల్లవలువలు ముసుగిడి ♦ నాట్యమాడు
సొంపు, నిద్దంపు పక్షుల ♦ గుంపు గూళ్ల
వైపు నభిముఖమై ప్రణి ♦ పాతమైన
దినము వీక్షించి విలపించు ♦ దీనమైన
గానములఁ దోచు వివిధ వి ♦ జ్ఞాన గరిమ
తిమిరమును మాన్చి రాగ ల ♦ తికల వినోద
బాష్పముల నించి అలించి ♦ పడవ నిలిచి
పోయె కల మదే దారులై ♦ పోయె; ప్రకృతి
సాగరమునందు హర్షాప్తి ♦ సన్నగిల్లె
విశ్వసదనంబు ముంగట ♦ వెలవెలార్చి
నేను నాకల మొకసారె ♦ నిలిచినాము
చలనమును దక్కి యొకసారె ♦ నిలిచినాము
శబ్ద మొక్కటె నిలిచి నీ ♦ జాడ నీ య
జాండమం దుండుటకు శబ్ద ♦ జాల మందు
చోటు లేదయ్యె గూఢ క ♦ వాటములను
తెరచుచున్నది బిగంబు ♦ తెరచునట్లు
ప్రేమస్రోతస్సు వెడల బా ♦ టించుకొఱకు

—✶—

# రుజ

ఈ రుజాజ్వాల లార్ప నె ♦ వ్వారు కలరు ?
దీనికిఁ జికిత్స లేదు, శాం ♦ తియును లేదు.
వ్యసన దోదూయమాన మా ♦ నసమునందు
ఈ విచిత్రతంబు నీ ప్రేమ ♦ ఈ విషాద
మీమహారాగరసముఁ జో ♦ ర్లించిపోయి
రెవ్వ రీజాడ ? చెప్ప రిం ♦ కేమిదారి ?
దూరి వగఁగూరి కోరి యె ♦ వ్వారి జీరి
ఏడ్చి నిట్టూర్పు లేకరు ♦ వెట్టి తిట్టి
వ్రాత తుడువఁగ నెవ్వారు ♦ వత్తు రెవరు
కలరు? ఇది సైకతపు తిన్నె ♦ గాదు చదలఁ
బరువు మేఘాల రేఖల ♦ పంక్తికాదు.
మెఱపుతీఁగల క్రొందళు ♦ కిరుల నెనసి
శూన్యమై పోవుటకు దివం ♦ జ్యోతిగాదు
ఈరుజా జ్వాలలార్ప నె ♦ వ్వారు కలరు.

ప్రణయపాతాల విరసరూ ♦ పముల నొగిలి
ముంగురుల జారు బంగారు ♦ రంగులీను
మేల్ముసుంగుల కొంగుల ♦ మేలమాడు
సొగసువాసనావేశిత ♦ స్ఫురితమైన
దృశ్యమిదమిత్థమని యేరు ♦ దిద్దఁగలరు ?
ఎవరు వర్ణింపఁగలరు? ఇం ♦ కేమి కలదు ?
ఈ మహాగాధ సత్యంబు ♦ లే రహస్య
మెవ రెఱుంగుదు రీవ్యాధి ♦ యెటులపోవు ?

భైషజం బేది భిషగుల ♦ వల్లఁగాదు
ఏదిమార్గంబు ఈ మనో ♦ న్మాదమైన
మచ్చ లెవరికిఁ దోఁచు ? స ♦ ముత్సవంబు
లై నదినములు రోగాల ♦ యందుఁ గలసి
సమసిపోయెను నేఁడు వ ♦ సావికార
మైనకట్టైను. ప్రాణంబు ♦ నంటియున్న
దిది శశవిషాణసన్నిభ ♦ మిది మృషా ప్ర
వృత్తి దీనికి నవధి యిం ♦ కేమికలదు
ఈరుజాజ్వాలలార్ప నె ♦ వ్వారు కలరు.

—★—

# మూషికము - ముని

ఒకమహనీయుఁ డార్యనుతుఁ ♦ డుగ్రతపంబును చేయుచుండగా
నొకయెలుకార్తి గ్రద్ద తను ♦ నొంచుటఁ జూచి శరణ్య మంచు నూ
రక బ్రతిమాలగాఁ దపసి ♦ రాజు దయామతి గాంచి దాని నో
ర్తుక సొగసైన ప్రోఢగ వ ♦ ధూటిగఁ జేసెఁ దపోబలంబునన్.

అమెను సూర్యునంతటి మ ♦ హామహురాజ్ఞి నొసర్పఁబూని నీ
వీమెను బెండ్లియాడుమని ♦ యిచ్చిన నాఁతడు చూచి యిట్లనెన్
"ఓ మహనీయ నేనొక మ ♦ హోజ్జ్వలమూర్తినె గాని నా కళా
గ్రామము మేఘుఁ డాచికొనుఁ ♦ గావున మేఘున కిమ్ము ఈసతిన్."

"ఘనుఁడను నేను లోకము న ♦ ఖండముగా జలరాశిఁ జేయు నే
ర్తును సరిగాని, గాలి వడి ♦ రువ్విన నిల్వఁగలేను గాన నా
యనిలుఁడు గొప్పవాఁ" డన మ ♦ హర్షి నిజంబనియెంచి పిల్వఁబం
చెను ; శ్వసనుండు వచ్చి తన ♦ శీర్షము నేలకు వంచి నిల్చినన్

వ. వానిని తాపసి క్రీగంట వీక్షించి జగత్ప్రాణమహాశయుఁడ వైన నీవు నా కూతు నీమూషికరాజజాతను పెండ్లియాడుము మన నాతండు నతవదనుడై, "స్వామీ !

ఏను సమీరుఁడన్ జగతి ♦ కెల్లను బ్రాణము పోయు తేఁడ నే
నీ నిఖిలావనీతలము ♦ నెంతయు నూపెదఁగాని కొండ నిం
తేనిఁ గదల్పలే నచలుఁడే ♦ నను మించును గానఁ గొండ కీ
మానిని నియ్య మేలగు స ♦ మానులె చుట్టరికాన కర్హులున్."

వ. అని సమీరుఁడన్న మాటకు ముని హిమవంతుని బిలిచి "ఓపర్వత వరేణ్య ! ఈ యెలజవ్వనిని బెండ్లియాడు మన నాతఁడుఆమెతనకు దగదని తలపోసి తపసికిజంకిముకుళిత కరకమలుండై యిట్లనియె.

"ఓ మహనీయమూర్తి భవ ♦ దుజ్జ్వలకీర్తి జగత్త్రయంబులన్
దామనియై వెలుంగు భవ ♦ దాజ్ఞకు బద్ధుఁడఁగాని నేను నీ
కేమని చెప్పనేర్తు నెలు ♦ కేదయినన్ ననుఁ బట్టుకొన్న నా
ధామము గుద్దలించును య ♦ థార్థము వావి కొసంగు మీసతిన్."

వ. అని చెప్ప నాతపసిరేఁడు మిగుల వగచి తనయ తుదకు ఎలుక యైనది అని ఆఎలుకసాని మానిసిరూపు మార్చి ఎలుకను చేసి కలుగులోనికి పంపివేసెను.

ఎలుకను రాజ్ఞిఁ జేసి విమ ♦ లేచ్ఛ జగత్త్రయమందు మేటిగా
నిలిపెద మన్న సాగినదె ♦ నీచుల కెప్పుడు గొప్పసద్గుణం
బులు సమకూడఁబో వినుము ♦ పుత్త్రడి కానివిధానఁ జెల్మి దా
మెలమి ఘటింపరాదు కుల ♦ హీనులతో తెలివైనవారలున్.

మల్లెపూవులు లేకున్న ♦ నుల్లిపూలు
ముడువఁగారాదు తలను ♦ ఏ వడువునైన
మంచివారి హితంబు ల ♦ భించనియెడ
చెడ్డవారి హితంబులో ♦ చేరఁదగదు.

—★—

# శృంగార పద్యములు

ఉ. ముంగురు లుంగరాలు నెల ♦ బోలు మొగంబును చేరెడేసి క
న్నుంగవ బారెడేసి సుమ ♦ నోజ్ఞ కచంబులు పైటచాటులో
తొంగిలిచూచు చన్గవలు ♦ తొట్రిల గాజుల నిక్వణంబుతో
నంగజరాజ్యలక్ష్మివలె ♦ నంగస వచ్చెను గౌఁగిలింపగన్.

ఉ. ఆ నళినీదళాయతము ♦ లైన కనుంగవ మేనితావి యా
జాను విలంబమౌ కురులు ♦ చారుపయోరుహముల్, మనోహరం
బైన తనూవిలాసము బ ♦ యల్పడ గాజులు గజ్జెలందెలున్
వీణియఁబోలె మ్రోసె నలి ♦ వేణి ప్రియున్ ముదమారముద్దిడన్.

చ. నిగనిగలాడు నీతనువు ♦ నీకనుదమ్ములు నీయొయారముల్
సొగసగు నీదుతీవి కడు ♦ సొంపులునింపు పయోరుహంబులున్
నగుమొగమున్ విలాసము ఘ ♦ నాఘనసన్నిభకుంతలంబులున్.
మగువల మేలిబంతి వని ♦ మాటికిఁ దోఁచెద వీవు కోమలీ.

చ. అలికులవేణి వీణను గ ♦ రాబ్జములన్ గొని ప్రేమగీతి వె
న్నెలబయలందు పాడుచు వ ♦ నిన్సుమశయ్యలశాద్వలంబులన్
వలపుసుధారసమ్ము మధు ♦ పాత్రలఁ బోసి యొసంగి వల్లభుల్
బిలుచుఁ జకోరదంపతుల ♦ వేడుక చూచి రసప్రపూర్ణయై.

తే. నెమిలిపించంబు నాణిము ♦ త్తెములసరులు
వరలు కుళ్లాయి ధరియించి ♦ వనవసంతుఁ
డనఁగఁ బ్రత్యక్షమయ్యె న ♦ య్యవసరమున
వన్నె వగకాఁడు మురళిని ♦ బాడుకొనుచు.

సీ. నివసింతునా నట • న్నీ రేజనయన వ
క్రాలకమ్ముల నీడఁ • గాచికాచి
వగతునా వగలాడి • బాలమృగీదృగం
చల విలాసంబులఁ • దలఁచి తలఁచి
నిల్పుదునా ప్రాణి • నెలఁతనెమ్మోము సుం
దరహాసచంద్రిక • లరసి యరసి
వీక్షింతునా ప్రేష్ఠ • వెలఁది వాగమృత వా
హినులందు రసమునై • యేగియేగి

తే. పాటపాడెదనా నాతి • ప్రణయగీతి
తో సుధాధారలను దొప్ప • దోఁగితోఁగి
మోహవార్ధిని వేసారి • మునిఁగిమునిఁగి
కరగిపోయెద నానాతి • కొఱకు వలచి.

తే. నీవు వ్రాసిన మోహంబు • నింపులేఖ
చదివినాఁడ తిరిగి నచే • చదివినాఁడ
యెంతచదివిన చవులూరు • నింతియేమొ.

సీ. ప్రణయినీ! నీ ప్రేమ • వార్ధి వీచికలందు
సొక్కి సోలుచునున్నఁ • జూడవేమి
ప్రేయసీ! నీరాగ • వీథిలో తెగి రక్త
సిక్తమై యుండ వీ • క్షింపవేమి
నెచ్చెలీ! నీ మోహ • నివహ దావాగ్నిలో
నిలువు నీరైనఁ జిం • తింపవేమి
మానినీ! నీవచో • మాధుర్యవాహిని
కసువు లర్పించిన • నరయ వేమి

గీ. చుట్టలుగఁ జుట్టి యురులట్ల ♦ సోలుచున్న
ముంగురుల నాదుహృదయ వి ♦ హంగ మట్టె
చిక్కువడి వియోగాబ్ధి వీ ♦ చికలఁ దోఁగి
యశ్రువుల రాల్చుచున్న న ♦ న్నరయ వేమి.

గీ. కురు లురులలీల ననుఁ జుట్టు ♦ కొనియె నేను
వెఱ్ఱినైపోబుతిని మోహ ♦ వీచికలను
దొప్పదోగియు నాదు చే ♦ దోయి కతివ
నీవె సంకెళ్లు వేయు మిం ♦ కేమి వలదు.

గీ. ఈవియోగాగ్ని చేత నీ ♦ యింటిలోని
దీపములు వెలిఁగించి నీ ♦ రూపమందు
చూడనెంచితిఁ గాని నీ ♦ జాడ దెలుపు
వారు గనరారు వచ్చెడు ♦ దారిలేదు.

గీ. ఎద వియోగాగ్ని రవిలించి ♦ యింధనముగ
తనువు గాల్చుచునుండ లో ♦ చయనయుగంబు
అశ్రువులఁ జాల గురిసి చ ♦ ల్లార్చుచుండె
నీవిచిత్రంబుఁ జూడ రా ♦ వేమి యువిద.

గీ. ప్రియుని యసువులు నీవస ♦ వీధివీచు
వాయువులఁ బోలుటకు నైనఁ ♦ బనికిరావె
ప్రియునివిరహాగ్ని నీయింట ♦ వెలుఁగు దీప
పంక్తులను బోలుటకునైన ♦ పనికిరాదె.

గీ. కారుమొయిళుల చిమ్మ చీ ♦ కటులఁ బోలు
నీదుకురు లంధకారంబు ♦ నింపుచుండె
నీమనోహరవదనంబు ♦ నిండుచంద్ర
బింబమును బోలె వెలిఁగించు ♦ విశ్వమెల్ల.

ఉ. గాలములట్లు గ్రాలి తమ ♦ కంబున నెందఱిమానసంబులన్
గాలిచి కారుచీకటుల ♦ కైవడి నీకురు లొప్పుచున్న వో
బాలకురంగలోచన భ ♦ వత్ప్రరిఫుల్లముఖాబ్జ మెందఱిన్
దేలిచి నవ్వు వెన్నెలల దీర్చుచు ♦ నున్నదొ చెప్పఁగూడదా ?



# గీతము ౧

నీ వియోగంబునకు నశ్రు ♦ లీవిధాన
కారుచీకట్లు క్రమ్మి ము ♦ క్కారువాన
కురియు ; హృదయాంతరాకాసం ♦ కుచితదగ్ధ
కాష్ఠమున వేగి మచ్చలై ♦ కరఁగిపోయి
నట్టి తమసు విశీర్ణమై ♦ నట్టి సొగసు
మండి మసియయి నీకంట ♦ మసలుచుండు
వేళ కాటుక నీవిఁకఁ ♦ బెట్టవలదు,
నీదు ప్రేమను రాగైక ♦ నిర్ఝరీ శ
తంబు శరవేగమున పాఱి ♦ నెమ్మనమ్ము
చింపుకొని వచ్చి సాంధ్య రా ♦ గంపుకెంపు
సొంపునింప సంపాదించి ♦ యొంపుచున్న
మద్యచషకంబు లావణ్య ♦ మంజులంబు
గైకొని ప్రశాంతవేళ సిం ♦ గారుకళల
నీను నీమోమువాతెర ♦ నానవచ్చె
వేళ తాంబూలరాగంబు ♦ బెట్టవలదు.



# జడత్వము

గ్రహములేమానవుని ద్రిప్పఁ ♦ గలుగు నొక్కొ
మానవుఁడె గ్రహగతులను ♦ మార్చునొక్కొ
అరహస్యంబు మనకు గ్రా ♦ హ్యంబుగాదు
స్థావరము లొక్కటేపుట్టు ♦ తలమునందు
జీవములు పోసికొను గాని ♦ జీవులకును
గ్రాసము లభించుచోటి కే ♦ గంగవలయు
పశువు జలమున్న చోటికి ♦ పరువువెట్టు
చీమ కలకండగలతావు ♦ చేరుచుండు
కోకిలము మావిచిగురులఁ ♦ గూర్చి పోవు
మధుపరాజంబు తేనెకై ♦ మసలుచుండు
ఉదర మెవరినైనను వీడి ♦ యున్నదొక్కొ
పిండివంటలు సంసారి ♦ వండితినిన
ఆకలంబులు సన్న్యాసి ♦ యారగించు
క్షుత్తునకు నిర్వ్యా రొకటె జ ♦ గత్తునందు.

—★—

# పాంథుని శిథిల పుర ప్రవేశము

చ. ఇది శిథిలావశేష పుర ♦ మే యనుకొమ్ము ; కళాకలాప సం
పద చెడి వాసిఁ బాసి తన ♦ ప్రాతలు క్రొత్తలఁ బెట్టి చూపఁగా
మొదలిడెనంచు నెంచుము ; ప్ర ♦ మోదపదంబున మోరలెత్తియా
కదుములు చెప్పవచ్చు కథ ♦ కాదనలేరు చరిత్రకారకుల్.

చ. వెలగలదే యిదే విపణి ♦ వీథుల బెట్టినఁ బ్రేమపాత్ర మీ
యిల కెవరిచ్చిరన్న మఱి ♦ యేమిటి యుత్తర మామనస్సులోఁ
గల యనురాగవీచికలఁ ♦ గ్రాలెడు సోమరసంబు సీధు పా
త్రలనిడదేని యాప్రణయ ♦ ధామము నాదని చెప్పుకుందునే.

చ. కళ యిది సౌమనస్యము ప్ర ♦ కాశకమైనమహాపదార్థ మీ
లలితవిశాలవిస్ఫురిత ♦ లాస్యమునందు జగత్రయైక సం
చలితవినూత్న కార్యకల ♦ నంబులు ప్రేమజనించునీ సుధా
కలశము బోర్లవడ్డ దొడి ♦ కంబునఁ బట్టఁగనౌనె యేరికిన్.

చ. ఇదియొకప్రేమబాష్పముల ♦ నెత్తి ప్రతిద్యుతిఁ జెందు నీమహా
సదనమునందు వ్యక్తిగత ♦ స్వార్థములొక్కటియేనిలేవు; త
న్ముదము రసానుషంగములు ♦ భూమికి రాలిన శిల్పమందు దో
చుఁ దదను రాగవాహినులఁ ♦ జూడుము పోయినవిశ్వరూపమున్.

చ. ఇదినిశ ఇందువెన్నెల లి ♦ వేయుదయాద్రినితొంగిచూచు కౌ
ముది ముదితానురాగముల ♦ మోసినదోయన జీర్ణకుడ్యమం
దుదయమునొందునీకళల ♦ నువ్విళులూరుచు గ్రుక్కత్రిప్పుకో
దది ప్రతిభావిభాసమని ♦ నాడిన నాడున్నగాక ప్రేముడిన్.

చ. ఇది ధ్వజమెత్తి ప్రేమకొక ♦ యేకతయున్న దిగాఁగ చాటి నీ
మది యనురాగపూరితము ♦ మాటున మచ్చలువడ్డమాటకై
కదల దొకింతయూసు మఱి ♦ కాల్పనికంబులు పెక్కులున్నఁదా
మొదటి తుపాను కొట్టుకొని ♦ పోయెను ప్రేళ్ళ పెకల్చి నెచ్చెలీ!

శా. ఈదృశ్యంబులచాటుమాటులమహా ♦ శృంగార శృంగాటకా
పాదంబైన జనానుషంగము భవ ♦ ప్రత్యేకతన్ గేంద్రమై
యీదారిన్ జనుఁ గ్రిందిమెట్లకు మహాం ♦ ధీభూతమైయుండు నే
నాదిత్యేందుఖగోళమారసితి బ్ర ♦ హ్మానందమేపారఁగన్.



ఆ.వె. వేషభాష లరసి ♦ వివరింపరా దంత
రంగమెట్టిదో యె ♦ ఱుంగరాదు
సంచిలోనిలేఖ ♦ సంగతి తెలియునే
పైకిఁజూడ; వ్రాయు ♦ వాఁడెగాని.



తే.గీ. కావి వస్త్రంబులను వేసి ♦ కానఁబడిన
జగము యతి యని చెప్పు వే ♦ షమునుబట్టి
గానవేషభాషలు నెట్టి ♦ వైనఁగాని
యంతరంగము తపసులో ♦ నలరవలయు.



తే.గీ. తల కిరీటంబు భుజముపై ♦ ధ్వజము దాల్చి
యున్న తప్పేమి జ్ఞానియై ♦ యున్న యపుడు
బాహ్యసన్యాసి బ్రహ్మవి ♦ ద్వరుఁడు గాఁడు
కామషట్కము మొదలంట ♦ గడపవలయు.

—★—

# తెలుగు భాష - దాని దురవస్థ

(ఉత్పలమాలిక)

"క్రొత్త తెలుం"గ టంచు నొక ♦ క్రొత్తపథంబును దీసి వాసి ను
న్మత్తపు వ్యాఘ్రవృత్తమున ♦ మాలిక వ్రాసె నృసింహుఁ డొలినా
సత్తముఁ డేమినోచెనొ వి ♦ చార్యముగా దలచేత లల్లవో
తత్తకబుత్తశబ్దముల ♦ తామర తంపరలట్లు చేసి వి
ద్వత్తని సాటుచున్ దెలుగు ♦ పాండితి నేరనివారిమ్రోల నె
గ్గెత్తియు వృత్తమాలికల ♦ నీడ్చి వెసన్ గణబద్ధమైన యా
చెత్తను శ్రోత్రపేయముగఁ జేయఁ ♦ బఠించిన వారు మెచ్చి మీ
చిత్తమురీతి మే మడఁ య ♦ చేతుమటంచును సాయపడ్డ గ్రీక్
మిత్తును "సొడ్డ" గమ్ములను ♦ మేలి ప్రబంధములన్ రచించి వా
రత్తరి గ్రామ్యభాష యను ♦ నండజయానముసుంగు దీసి రా
బిత్తరి చంచలాక్షులను ♦ విప్పి వివేక విశాలలోక ము
వ్వెత్తుగఁ జూడసాగె నల ♦ వెత్తికటాక్ష విలోకనంబులున్
మొత్తముమీద నాంధ్రజన ♦ ముఖ్యులకున్ విపరీతచేష్టగా
నొత్తెను నంత మేల్కని స ♦ మున్నతి వాని విమర్శఁజేసి లో
కోత్తరమైన హాని సమ ♦ కూడె నటంచు విభీతభావులై
ఇత్తరి వ్యావహారికపు ♦ టింతి ప్రబంధపుసాధ మెక్కఁ గా
లెత్తె నటంచు నెంచి గతి ♦ యించినదానికి చింత సేయ కా
విత్తును వ్రేళ్ళతోఁ బెఱికి ♦ వేయుట కున్ముఖులైరి యాశ్వరం
దత్తునొ యత్తఁథో తెలియ ♦ దైన ప్రయత్నము కర్జమౌట వి
ద్వత్తములార! నానుడులు ♦ స్వచ్ఛమనస్కులరై వినుండు సం
పత్తె విపత్తె భాష కిది ♦ పల్కుఁడు "అమ్మకు" "లమ్మ" ఇంక మే
నత్తకు "లత్త" "నేను" నకు ♦ నాననువర్ణవిరూపముల్ మఱిన్

"వత్తును" బోతి, "నిస్తు" నను ♦ వర్ణవిలిప్తపదంబు లొక్కచో
బొత్తునఁ గూర్చి కావ్యముల ♦ బుద్ధికి వచ్చినరీతిఁ జేర్చి పె
న్వృత్తములన్ గడింపఁ బడి ♦ పిల్లలచే చదివింప నుంచి రా
పొత్తము లక్కటా! చదువు ♦ పోయెను వ్యాకరణంబు మాసె యా
వత్తును, మాతృభాషను "శ ♦ వంబు" గఁ బోల్చి గళంబులోపలన్
గొ్రత్తగ పుస్తె గట్టకుఁడు ♦ కోవిదులార యిదేమిపాపమో
చిత్తరువయ్యె నార్చుల వి ♦ చిత్రచరిత్రలడంగె నాంధ్ర రా
ష్ట్రోత్తర సత్ప్రయత్నములు ♦ నూరకపోయె విరోధభావముల్
పొత్తమసాధువేదొ యెది ♦ పూజ్యమొ తోచక తన్నులాడి సం
విత్తు దొలంగి పాఠకుల ♦ వేసటపా లొనరించుఁ గాన నీ
కొ్రత్త తెలుంగుబాస "దిన ♦ కొ్రత్తగ" మారుచు నద్భుతంబుగాఁ
దత్తరమొంది పేశల ను ♦ ధామధురోక్తుల నీనఁబోవ ద
త్త్యుత్తమమైననే కవిత ♦ నూరక పామరపాళిచేత "చె
ప్పిత్త" మటన్న సాగ దది ♦ వెక్కిఱితలంపగు కుక్కతోకతో
సత్తటినీ తటంబులను ♦ చల్లఁగ దాఁటఁగోరునట్లు మీ
రిత్తప్రయత్నముల్ విఫల ♦ రీతిని దాల్చును చేమకూర పూ
ర్వోత్తరకోవిదుల్ విబుధు ♦ లుండిననాడె యపప్రయోగముల్
మెత్తఁగలేదె యన్న నది ♦ మేలము కొక్కటిరెండుమాత్రమే;
పొత్తమునిండ బూతులను ♦ పూరణసేయగలేదు; చేసినన్
గత్తములీల నింద్యమయి ♦ కావ్యవధూటి మహాచిపడ్డలా
గుత్తకురూపియై చెడదె ♦ యుజ్జ్వలకాంతి వహింపనేర్చునే
ముత్తెము లగ్నివేల్చుటయు ♦ భూరజమందు పటీరవారి జా
్రగత్త దొలంగి వేయుటయు ♦ కార్యమటం చనుకొన్న మీకు మే
ముత్తర మీయనేరము స ♦ మున్నతి ముజ్జగముల్ జయించియే
వత్తురు, గోత్రభిత్తయిన ♦ వందనముల్ పచరించిపోవు మీ

కత్తికి రెండువైపుల ని ♦ గారపువాడి గలాదు ; భూపతుల్
బత్తులు మీకు గ్రామ్యములు ♦ వాడినవారని బొంకజంక రీ
బుత్తురు బట్టు నప్పకవి ♦ ముఖ్యుల లాక్షణికాగ్రగణ్యులౙ
గుత్తకు గొన్నయట్లు నిది ♦ గో యది యేమిప్రయోజనంబుఁ దో
షోత్తరణంబు జెంది పర ♦ మోన్నతివైఖరి గల్గుకావ్యమే
యుత్తమమై చెలంగు ♦ కవి యుండిన పోయిన కావ్యముండు సీ!
బొత్తిగ నీచసూచకపు ♦ బొంతసుడీ! వ్యవహారభాష యే
యెత్తున దానికుట్టి నిల ♦ యెత్తిన కుక్కయె గంగగోవునౌ
నొత్తదు దేశభేదముల ♦ నొంది జనుల్ పఠియింపనోప రా
పత్తు ఘటించు రూపముల ♦ పద్ధతిమార్చిన సత్తిబాస వ్యా
వృత్తము వచ్చు భ్రంశమయి ♦ యీాల్గు దరిద్రము వచ్చు వాణి రే
కెత్తదు సత్ప్రబంధముల కేమి రుచింపదు హాస్యనాటకా
యత్తవిదూషవాక్యముల ♦ కై పనిసేయునొ యేమొగాని యా
వృత్తితరంబుగాదు ; బుధు ♦ లెవ్వరు నవ్వరు ? వాఙ్మయంబునం
దొత్తిడిగాని గల్గుఫల ♦ మొక్కరవంతయు లేదు ; తొల్లి యే
పత్తనశాసనంబు లుప ♦ పత్తి వహించెనొ గ్రామ్యబాసచే
లత్తయెగాని యర్థబహు ♦ ళంబున నింపానరింపనేర దె
త్తెత్తి కరంగిపోసినను ♦ నిత్తడి బంగరు గానిరీతి నీ
జిత్తులలోనఁ గూలక వి ♦ శీర్ణత నొందక తల్లి దానిపై
ముత్తయిచే యొనర్పుడు ప్ర ♦ మోదము జెందగ నార్యలోకమున్.

—★—

# పరిణామము

సంధ్యలు నుషస్సులట్లు స ♦ జాంతరేఖ
ప్రాతక్రొత్తలు బండి చ ♦ క్రములఁ బోలె
కలిసి విడిపోవుచున్న వొ ♦ క్కటియు కంటి
నీరు కార్చక పోలేదు ♦ నేటిదాక
ప్రకృతి కలహించు భౌతిక ♦ రంగమందు
విశ్వశైలూషి తెరగు ని ♦ వ్వెరగుగూర్చ
కళల యంత్రాలపేటిక ♦ కప్పివైచె;
వెన్నెలబయళ్ళ విద్యుత్తు ♦ వెడలచేసె;
నాటకాల సినీమాల ♦ నణఁచివైచె;
యానములు వ్యోమయానాల ♦ నంతరించె.
ప్రాణులు శతఘ్నికలకు ని ♦ ష్ప్రాణమయ్యె;
ప్రకృతి మారిపోయినది ప్ర ♦ వాహవేగ
మున జలాఘాతములు మారి ♦ పోవునట్లు.
క్రొత్తప్రాతల కలయిక ♦ నెత్తుటేరు
వచ్చి వరదల ముంచి రా ♦ పడక మున్నె
మేలుకోవయ్య తమ్ముఁడా ♦ మేలుకొమ్ము
నీవులే విప్ప నీనేల ♦ నీది కాదు
నీకుటీరంబు కుడ్యంబు ♦ నీది కాదు
నీది యనునది ఆనాడె ♦ నీటఁ గలిసె
నీవు వ్యక్తిగ గర్వించి ♦ పోవుచుంటి
వాతృషను బాపువారి ద ♦ వ్వయ్యె నీకు
నీవు రాగాలఁ దేలి యే ♦ వేవొ పాడి
పాడి ప్రకటించుచున్నావు ♦ ప్రాలుమాలి
పల్లెటూరుల పొలముల బయలునేటి. ||తత||

నాగరీకరథంబు వి ♦ న్నాణమైన
మేల్మొనుంగులు ఘంటలు ♦ మేళవింప
లీల నేతెంచు రంగవ ♦ ల్లికల దాటి
కోటగోడల మీటు శృం ♦ గాటకముల
ద్వారముల నెట్టి తూర్పు ది ♦ వాణమెక్క ; ॥తత॥

ఒక్క తృటిలో జగంబు న ♦ వోఢ యగుచు
నాట్య శైలూషియై నయ ♦ నంబులార
కాటుకను దిద్ది నేఁడు క ♦ ర్నాటఫక్కి
భరత మొనరించు తత్ప్రతి ♦ పదమునందు
వీనిగారంబు నీరీతి ♦ నీ విలాస
భాసమాన మహానంద ♦ వైభవంబు
గాన మొనరించు నీయందు ♦ గానబడవు
నీవు నాటి ప్రభాతాల ♦ నీవు నీ క
పోష్ణరక్తంబు చల్లారి ♦ పోయె నేమొ
నీవు పందలమాటున ♦ నిరికినావు
నీవు బేరుల వణిజుల ♦ నిలిచినావు
నీవు కడుపు కక్కూర్తికి ♦ నీల్గినావు
నీవు చావన్న భయపడి ♦ పోవుచుంటి
వకట ! మూనాళ్లు నీ బ్రతు ♦ కగునొ కాదొ
నీ కళాధ్వాంతమందు ♦ వినిశ్చితంబు
నైన తేజస్సులేదు ; నీ ♦ యంత నీవు
లేచునట్టి మనోబలం ♦ బాచికొన్న
వారి కాణాచి నీకు ని ♦ వాసభూమి
గాగఁ దోచెను; తమ్ముడా ! ♦ వీగిపోయి

నావు భావదాస్యాన ను ♦ న్నావు భైక్ష
కంబు నైనట్టి స్వర్గంబు ♦ గట్టుచుంటి
విది విషాదంబు వదలు మా ♦ దృక్ప్రథంబు.
ఐంద్రజాలకుని కరాన ♦ నలరునట్టి
కుంచె విశ్వరూపంబుఁ జూ ♦ పించి నీకు
నీవు నిలువెల్ల విశ్వ రూ ♦ పావసథము
గాగ నందఱ నీవుగాఁ ♦ గాంచవేమి ?
అస్తిపంజరమున ప్రోగు ♦ లైన రేణు
కా నికాయమె కాయంబు ♦ గాన నీ స్వ
మాతృ పుత్రుల గర్హింప ♦ మానుకొమ్ము.
నీ కులాచారములు నీవు ♦ నిశ్చయించు
కొన్న వనుకోకు ; ప్రాతవి ♦ క్రొత్తలందు
గలఁపఁ జూడకు ; నీదు స్వ ♦ ర్గమును నీవు
కట్టుకొమ్ము వివాదాల ♦ నెట్టుకొమ్ము
నీవు జగతి కాదర్శమై ♦ నిలిచి నీదు
విజయము చరాచరాల దీ ♦ పింపనిమ్ము
తమ్ముఁడా ! నీ పదమ్ము వ ♦ క్రమ్ము సేయ
కిదె సురాసవ మిదె బహు ♦ శేప్సితార్థ
మైన మహనీయ జీవిత ♦ మదె స్వరాజ్య
వీథి ; యిట్టి జాతీయ జీ ♦ వితమునందు
వెన్నెముక జారనీక నీ ♦ మేరుదండ
మును ప్రతిష్ఠించు దేశాన ♦ మోసులెత్త
కీర్తి రేకెత్త తమ్ముడా ! ♦ కినుక మాను.

—✶—

# దేశమాత దండకము

శ్రీమన్మహాభారతాంబా ప్రపూర్ణ ప్రభాభాసురోదీర్ణ సౌవర్ణ
వర్ణావలంబా నిరాలంబ దంచాద్యనంతప్రలంబా లసత్ చారు శృంగార
సంపత్కదంబా భవచ్చిత్రచారిత్ర్యముల్ స్తోత్రపాత్రంబులై మిత్రసంప
త్సదారామచైత్రంబులై లోకకళ్యాణ సూత్రంబులై జన్మ జన్మాంత
రాదర్శపాత్రంబులై యెన్ననెన్నం బవిత్రప్రధానంబులై క్షేత్రమున్
క్షాత్రమున్ గల్గి వెల్గొందు; నీరూపు నీయోజ నీ శక్తి నీ కీర్తి యెవ్వారు
వర్ణింప శక్యంబు తల్లీ! జగత్కల్పవల్లీ! మతల్లీ! సముల్లాసహాసాననా
వాసవాదిప్రజావందితా హిందుమాతా కనత్కాంతిపూతా గుణఖ్యాత
సత్కాశ్యపబ్రహ్మసంజాత నీశీర్ష మాచంద్రసూర్యాది తారగ్రహానీకముల్
సప్తలోకంబులన్ దాటి భాసిల్లు నీపాదమీ సప్త పాతాళ లోకంబులన్
మీరి రాజిల్లు నీయిల్లు ముక్కోటివేల్పుల్ మహాజీవ జీవాణువుల్
జంగమస్థావరంబైన యీ సర్వ విశ్వప్రపంచంబు నెంచన్ గళావాసమై
యొప్పునొప్పుల్ ఘటించున్ భవన్మస్తకన్యస్తమై వెల్గు జాబిల్లి విన్నాణ
ముల్ సొంపునింపారు మేల్ రత్నవైడూర్యగోమేధికామూల్య మాణిక్య
సంస్థాపితంబై ప్రకాశించు నామేల్ కిరీటంబు దీపించు, నీరూపమోం
కారమేమో నిరాకారమో లేక సాకారమో పంచతన్మాత్రలన్ గల్గియున్
సత్యమిథ్యాది సంకల్పముల్ గల్గి, నీనాధ్వనుల్ చెప్పలేనట్టి
నీయట్టి దివ్యావతారంబు ఘోరార్తి సంహారమమ్మా! శుభాకార
నీకొప్పుపై వెండిచామంతిపూవొయనన్ జెల్లు కైలాసమున్ చంద్రచూడా
కలాపంబుతోనాడు గంగాధరుం డెంతయున్ నాగరంబై ప్రదీపించు
నీనీలపుంగుంతలంబుల్ హిమాద్రి ప్రభాభాసితంబుల్ వియద్గంగ
యున్ బ్రహ్మపుత్రానదుల్ నీకు రత్నాలహారాలుగా నీమెడన్ వేడ్క

ప్రేలాడుచున్ లోకకళ్యాణముల్ చేయుచున్ ప్రాయికంబై సదా పారుచున్ గేరుచున్ నీరు మున్నీరుగాఁ జేసి వాసిన్ వెసన్ భూములన్ బుట్టలన్ పైరుపంటల్ ఫలింపంగ మాగాణిగాఁ జేసి కేదారముల్ రాజనాలన్ విరాజిల్లగా నీకవే పచ్చలున్ ముత్యముల్ దాపియున్నట్టి మఖ్మల్ బుటేదారు చౌకట్టురంగారసింగారమైరంగురంగుల్ పిసాళించుచున్ కంచుకంబోయనన్ వింధ్యయొడ్డాణమై కృష్ణగోదావరీ భూరి పుణ్య స్రవంతుల్ నితాంత ప్రమోదంబులై మేఖలన్ బోలు నయ్యంగవంగల్ కళింగంబు కాశ్మీర సౌవీర సౌరాష్ట్ర కేరాళ పాంచాల కర్ణాట ఛప్పన్న దేశంబులే గళ్ళచీరల్ బిరానన్ దగన్ దాల్చి యొయ్యార మేపారగా బంధురంబైన సౌందర్యమున్ గల్గి త్రింశన్మహాకోటిసంతానమున్ తన్ను నిత్యంబు పూజింప భావింప నర్థింప నర్థిన్ ప్రదీపించు నీ వెన్నొ విన్నాణముల్ గల్గి యెన్నో మహావిద్యలన్ తంత్రమంత్రంబులన్ పెద్ద యంత్రంబులున్ సల్పి శిల్పాది బల్ కర్మనిర్మాణ నిర్వాచ్య నిర్ద్వంద్వ నిర్మాణ నిస్తంద్ర సాంద్రప్రభాగారముల్ గల్గి వెల్గొందుచున్ సర్వ ప్రపంచంబున్ తన్నెంతయున్ దేహిదేహీ యటంచున్ కరాబ్జంబులన్ సాచి యాచింపగా కుక్షి నిండారగాఁ బోసి పోషించుచున్ లోకమాతాకృతిన్ దాల్చి కర్ణాది విఖ్యాత తేజస్వులౌ మేటి దానప్రవీణుల్ (పురాణ ప్రసిద్ధంబులౌ దివ్యచారిత్రముల్ గల్గి). వీరారులన్ జీల్చి చెండాడు నుద్దండకోదండపాండిత్యముల్ గల్గు శూరుల్, మహావీరులున్ సాహసోదారులున్ గల్గి సావిత్రి సీతాసతీ పార్వతీభారతీముఖ్యసాధ్వీమణుల్ నీయశోగౌరవంబుల్ ప్రపంచింపగాఁ గాళిదాసుండు వ్యాసుండు వాల్మీకి బాణుండు నన్నయ్య తిక్కన్న సోముండు శ్రీనాధుడున్ భట్టు పోతన్న సూరన్న నీకీర్తినిన్ బాడి నీఖ్యాతినిన్ వ్రాసి నీవన్నెవాసిన్ బ్రతిష్ఠించి రా బౌద్ధచార్వాకకాపాలికానీక శాక్తేయ సిద్ధేశ్వ రాద్వైత ద్వైత ప్రజాపత్య-మై రాళదారాళ విశ్వేశ్వ రానేక పాషంద బ్రహ్మాంత

మాయా మతాచార్యసంకీర్ణమై నీమనోవీధి ధారాళమార్గంబునన్
బోయి యెంతో స్వతంత్రించి రూపించి దీపించుదీపాకృతిన్ ప్రాకృతిన్
వైకృతిన్ సంస్కృతంబైననీయాన మత్యంతచోద్యం బభేద్యం బవేద్యం
బసాధ్యంబు నైయున్న నెన్నో అభిప్రాయ భేదంబులన్ గల్గి నీ పుత్రు
లాత్మైకమత్యంబు వర్జించి నిర్జించి దుర్జేయులై యుండునొండున్ విత
ర్కించుచున్ విద్య గోల్పోయి వెంటన్ విదేశీయులన్ జేరి అవ్వారిగా
వారి కారుణ్యముల్ గోరి యాత్మీయ రక్తంబుచే భూమి సిక్తంబుగా
జేసి పేరుల్ ప్రతిష్ఠల్ నశింపన్ గృశింపంగ ఈ ప్రాజ్యరాజ్యంబు
పూజ్యంబుగా నుండిపోవఁ ముసల్మానులుఁ వచ్చినిచ్చన్స్వరాజ్యంబు
స్థాపించినారంతటఁ దానిసత్యంబు ప్రారంభమై వారి యాస్థానసీమన్
వహల్దార్ సర్దార్ జమాదార్ సుబేదారు లన్పేర నుద్యోగముల్ పూని
ప్రేమన్ అనే మోక్షముఁ స్వర్గముఁ శాంతముఁ దాంతముఁ గాగ
భావించి వెయ్యేడు లున్నారు ఆకాల మారీతి యాతీరు లాపద్ధతుల్
శాంతికిఁ ఆలవాలంబులై జాతికిఁ మిక్కిలిఁ పొందికఁ దెచ్చి యిచ్చా
విలాసంబులఁ కాలమున్బుచ్చి రాదారి వే రయ్యె నయ్యె యయో
మార్గముఁ లేదు.

# నీతిపద్యములు

ఆ.వె. ఈశ్వరుండు మనల ♦ నేనాఁడు కాపాడు
మనము నీశ్వరు నెద ♦ మాపు తేపు
వేఁడుకొనఁగవలయు ♦ తోడునీడై యుండ
దాన జయము లెన్నొ ♦ కానఁగలము.

ఆ.వె. నిజము చెప్పువారె ♦ ప్రజలలోఁ బెద్దలు
విద్య చెప్పువారె ♦ విబుధు లనఁగ
నీతి చెప్పువారె ♦ నిజముగాఁ జుట్టాలు
మంచి నెపుడు గౌర ♦ వించవలయు.

తే.గీ. దయయు ధర్మంబు సత్య శాం ♦ తములు గలుగు
సుగుణసంపద గలవారె ♦ సూరిజనులు
విద్య యున్న వివేకంబు ♦ వెలయకున్న
వారి చదు వేల వట్టి ని ♦ ష్ఫలము సుమ్ము.

తే.గీ. విద్యచే వివేకంబు వి ♦ వేకమునను
మంచిదశ వచ్చు దానిచే ♦ మానవుండు
పూజ్యుఁ డగుఁ గాని, ధనముచే ♦ బూజ్యుఁడగునె
కాంతిగలరాళ్ళె రత్నాలు ♦ గాఁ దలంతు?.

తే.గీ. పాపములు చేయువారి కా ♦ పదలువచ్చు
కోపమున మండిపడువారి ♦ కొంప మునుఁగు
కడుదురాశ గల్గినవారె ♦ చెడెద రెపుడు
మంచివారికి నివి కూడ ♦ వెంచి చూడ.

తే. గీ. పూజలం గాచెడుకొఱకు నీ ♦ శ్వరుండు గలండు
ఈశ్వరుని పూజ లెపుడు ప్రా ♦ ర్థింపవలయు
కోరికలు దాన మనకు నీ ♦ డేరుంగాన
నింతకన్న మహాభాగ్య ♦ మేది గలదు.

తే. గీ ఉదయమున తూర్పు దిశ సూర్యుం ♦ డుదయమగును
పక్షు లాసంగతినె పాట ♦ పాడుచుండు
పూలు వికసించు పొగమంచు ♦ రాలుచుండు
అట్టి సమయాలు గనుట భా ♦ గ్యంబు గాదె.

తే. గీ. పక్షు లెన్నెన్నొ చెట్లపై ♦ పాట పాడి
వనమహాలక్ష్మికయ్యెడే ♦ స్వాగతంబు
లిచ్చుచున్నవి హారతు ♦ లిచ్చుచున్న
వదిగొ యెఱ్ఱగల్వలు చెర్వు ♦ లనెడు మిషను

తే. గీ. చదువు వచ్చిన లోని నీ ♦ చత్వబుద్ధి
మారవలయును లేకున్న ♦ మానవుండు
ఘనమహాకార్యములు సేయ ♦ పనికిరాండు
గాన చదువు సుదారత ♦ గలుగవలయు.

తే, గీ. నీచులకు పెద్దభావాలు ♦ తోచ వెపుడు
హీనులెప్పుడు పరుల నిం ♦ దించు చుందు
రాతతాయులు దుష్కృతు ♦ లాచరింతు
రట్టివారలవిహితంబు ♦ పట్టరాదు.

తే, గీ. పరులధనములు హరియింప ♦ నరుగవలదు
పరుల నిందించి నేరాల ♦ పన్నవలదు
పరుల చెఱిచెడునురులను ♦ తెఱవరాదు
మంచిమార్గాన నడుచుట ♦ కెంచవలయు.

తే. గీ. దానధర్మాలు చేసెడు ♦ మానవుండె
మంచిపేరును కీర్తి గ ♦ డించఁగలఁడు
తనకుఁ గలిగినదితరుల ♦ పనికి నిడుట
యన్న నెంతకష్టము దాత ♦ యన్న నతఁడె.

తే. గీ. కనికరము లేనివాఁడు దుః ♦ ఖములఁ బొందు
పరులదుఃఖాలు గని జాలి ♦ పడెడువాఁడు
మంచిమార్గంబు ప్రజకు బో ♦ ధించఁగలఁడు
చేరి ప్రజలెల్ల వాని పూ ♦ జింపఁగలరు.

తే. గీ. ప్రభువుతోడను ప్రజలను ♦ ప్రజలతోడ
ప్రభువు కలహింపరా దెట్టి ♦ పనులనైన
ప్రభువు ప్రజలును దేశంబు ♦ బాగుసేయ
వలయుఁగాని రక్తము చిమ్మ ♦ వలను పడదు.

తే. గీ. తెలివి గలిగిన తనమేలు ♦ తెలియవలయు
తనదు మేలునకై యెట్టి ♦ తప్పునైన
చేయఁగారాదు హింసలు ♦ చేయఁరాదు
మంచిమార్గాన నెప్పుడు ♦ మసలవలయు.

తే. గీ. పెద్దలను జూచునెడ గౌర ♦ వింపవలయు
మంచి చెప్పిన విని ప్రవ ♦ ర్తించవలయు
పెద్దవారలమైత్రి వ ♦ ర్జింపవలయు
నీతిగా రాజకీయాల ♦ నెగ్గవలయు.

తే. గీ. తనదులోతును గుట్టు నె ♦ వ్వనికిఁగూత
చెప్పగారాదు చెప్పిన ♦ ముప్పు వచ్చు
ఏ రహస్యంబునైనను ♦ ఏ నిగూఢ
తత్త్వమైనను యోచించి ♦ పలుకవలయు.

తే. గీ. చాటునను గూడ పాపంబు ♦ సలుపరాదు
నవ్వులకునైన కల్లల ♦ నాడవలదు
హానివచ్చిన శాంతంబు ♦ మానరాదు
కాలమును వట్టిమాటలఁ ♦ గడపరాదు.

తే. గీ, గడియగడియలుగా మారి ♦ నడచిపోవు
కాల మెప్పుడు చెడి వృథా ♦ గడపవలదు
నడచునట్టికాలమును ప ♦ గ్గములు పెట్టి
లాగినను రాదు తెలియు మే ♦ లాగునైన.

తే, గీ. మందబుద్ధికి తిండి యా ♦ నందమగును
నీచునకు గౌరవంబులు ♦ తోచ వెపుడు
అల్పుఁ డధిపతియైన క ♦ య్యములుబెట్టు
సతి పతివ్రత కానిచో ♦ చావు దెచ్చు.

తే. గీ. ధనము గలిగిన యంతనే ♦ ఘనత రాదు
ఘనత కావలె నన్న యో ♦ గ్యతయు వలయు
యోగ్యతనునది జన్మలో ♦ నుండు నిజము
జన్మ మంచిది కావలె ♦ జనుల కెపుడు.

తే, గీ. ఆపదలయం దధైర్యంబు ♦ నందవలదు
నిందఁ జేసిన మదిలోన ♦ కుందవలదు
ఫలము గనుదాఁక యత్నంబు ♦ వదలవలదు
చెనటివారల స్నేహంబు ♦ చేయవలదు.

తే. గీ. కాల మెప్పుడు నొకరీతి ♦ గడువబోదు
కష్టసుఖములు వచ్చుచుఁ ♦ గడుచుచుండు
మంచిచెడ్డలు నిలుచు ప్ర ♦ పంచమందు
కలిమిలేములు రెండును ♦ కలుగుచుండు.

తే. గీ. ధనము వచ్చును పోవును ♦ దానికొఱకు
ఏడ్చినను రాదు నవ్విన ♦ ఎగిరిపోదు
కాలమునుబట్టి భాగ్యంబు ♦ కలుగుచుండు
కాన కాలంబు బండి చ ♦ క్రంబుఁబోలు.

తే. గీ. విద్య నేర్చిన జగమెల్ల ♦ విశదమగును
జగములోపల నున్నవి ♦ సొగసు లెన్నొ
కన్నులకుఁ దోచు వస్తువు ♦ కన్న చదువు
వలన దోచువస్తువులనే ♦ తెలియవలయు.

తే. గీ. కోకిలరవంబునకు కాకి ♦ కూతలకును
భేదమున్నట్లె జనులలో ♦ భేదముండు
వంశమునుబట్టి మాటలు ♦ వచ్చుచుండు
మాటయే చెప్పు మనుజుని ♦ పాటవంబు.

తే. గీ. చెప్పినట్టుల సుజనులు ♦ చేయుచుంద్రు
చెప్పి చేయగఁజాలరు ♦ చెనటి ప్రజలు
చెప్పుటన్నది తనయంశ ♦ నొప్పనందు
దాని ఖండింప నాత్మ హ ♦ త్యగఁదనర్చు.

కం. అడినమాటలు తప్పెడు
వాఁడు మహాపాపములను ♦ బడయును నీచుం
డాడినది తప్పు సుజనుం
డాడిన మఱి తప్పఁదోవఁ ♦ దవి గావించున్.

తే. గీ. ఉన్న దున్నట్లు చెప్పను ♦ నుత్తముండు
ఉన్నదానిని మాని నీ ♦ చుండు చెప్పు
నిజము చెప్పిన కలహంబు ♦ నెరపవలదు
భ్రాతలుగ నెంచవలయు ప్ర ♦ పంచజనుల.

తే. గీ. కలిసికట్టుతనంబులోఁ ♦ గలదుమేలు
కలహమున నంతలాభంబు ♦ కలుగఁబోదు
కలహ మజ్ఞానగాఢాంధ ♦ కారమందు
మానవులు గ్రుడ్డివారలై ♦ మసలరాదు.

ఆ. పర్వతంబు లెత్తి ♦ పడవేయవచ్చును
సంద్ర మీదియీది ♦ సాగవచ్చు
గాని సేవవృత్తి ♦ గావింపఁగారాదు
యెట్టివానికైన ♦ హీనమదియు.

తే. గీ. ప్రాణమునకన్న ఘనము మ ♦ ర్యాద గాన
ప్రాణ మేగిన మర్యాద ♦ బాయరాదు
నీతి గలవాఁడె మర్యాద ♦ నిలుపఁగలఁడు
నీతి లేనివానికి పాప ♦ భీతి లేదు.

ఆ. వంగుకొలఁది ధనువు ♦ బాణంబుకడునాటు
నీచుఁడట్లు వంగఁ ♦ జూచునెడల
హానిసేయ మదిని ♦ ఆలోచనము సేయు
గాన నమ్మరాదు ♦ హీను నెపుడు.

ఆ. చెడ్డకాల మన్న ♦ చీకటివంటిది
బాంధవుండె కానఁ ♦ బడఁడు నందు
ధనము దంధనమని ♦ తర్కించుమానవ
కోటి బానిసలుగ ♦ కూర్చివేసె.

తే. గీ. ధనమునకు దాసు లీధరా ♦ స్థలమునందు
ధనము లేకున్న మనుజజీ ♦ వనము లేదు
ధనము సకలార్థధర్మసా ♦ ధకముగాన
ధనము గడియింపవలెనంద్రు ♦ ధర్మవిదులు.

తే. గీ. బొప్పి గట్టినఁగాని యే ♦ పురుషుఁడైన
తెలివి నొందఁడు లోకంబు ♦ తెలియఁబోడు
రాళ్లదెబ్బల గోరింట ♦ రంగొసంగు
మనుజుఁ డగచాటులనె గాని ♦ మాఱఁడెపుడు.

ఆ. ఋణము సేయరాదు ♦ ఋణదాతలగువారి
పొందు సేయరాదు ♦ మందుకైన
వడ్డి గొనెడువాఁడు ♦ పరమపాపాత్ముఁడు
కటికవానికన్న ♦ కఠినతముఁడు.

ఆ. బండి తోలువాఁడు ♦ పశువుల హింసించు
పూటకూండ్రు డబ్బు ♦ పుచ్చుకుండ్రు
పాపమన్న నివియె ♦ లోపభూయిష్ఠముల్
తంతు తిలలఘాత ♦ తప్పలేదు.

ఆ. జపము సేయువాఁడు ♦ పరమేశ్వరునిభక్తి
సలుపువాఁడు దీక్ష ♦ నిలుపువాఁడు
సద్గుణంబు లుండి ♦ సాగింపవలె; లేని
యెడల వాఁడు నేల ♦ మడియఁ గలఁడు.

## సూర్యుఁడు

ఆ. మంటవలెను పెద్ద ♦ మహతాబుకైఫడి
ఆకసమున సూర్యుఁ ♦ డదిగొ పొడమె
నింత పెద్దవెలుఁగు ♦ నెవరు గావించిరో
యేమొ యెఱుకఁ జెప్ప ♦ నెవరితరము.

ఆ. సూర్యుఁ డుదయమైన ♦ చుక్కలు దాగెను
చందమామ మోము ♦ చాటుసైచె
పక్షు లవిగొ చెట్ల ♦ పాటలు పాడుచు
సంతసించు మనము ♦ సంతసింప.

ఆ. సూర్యుఁ డొక్కఁడున్న ♦ చుక్కలు దీపాలు
ఉండగా నగత్య ♦ ముండఁబోదు
మనము బ్రతుకునట్టి ♦ మార్గంబు లన్నియు
సూర్యునందు మనము ♦ చూడఁగలము.

## కాకి

ఆ. కాకి మెతుకు లేరి ♦ కడు కష్టమున మన
దెబ్బలు పడకుండ ♦ తేరితేరి
లేచి పరువులెత్తి ♦ రెక్క లల్లార్చుచు
జీవములను బుచ్చు ♦ వేవిధాల.

ఆ. కాకి కష్టజీవి ♦ కోకిల సుఖజీవి
కోకిలంబు గ్రుడ్లు ♦ కాకి పొదుగు
కాకికోకిలంబు ♦ కయ్యంబు లాడును
తప్పు దేనిదన్న ♦ ముప్పువచ్చు.

ఆ. కాకి దొంగ యనుచు ♦ లోకంబు పలుకును
దొంగతనము దాని ♦ తోడఁగూడి
యెవరు నేర్పినారొ ♦ యెవ్వరుచెప్పరు
తిండిదొంగ కాకి ♦ తెలియవలయు.

## కోఁ తి

ఆ. కొండమీఁద కోఁతి ♦ కూర్చుండి నేను బ్ర
హ్మాండనాయకుండ ♦ ననుచు జెప్పి
క్రింద దిగినకోఁతి ♦ కందమా చందమా
వెక్కిరించు మూఁతి ♦ కిక్కిరించు.

ఆ. పాలు నీరు పోసి ♦ పవళింపఁజేసి చి
న్నారిబిడ్డ తల్లి ♦ విడుచుఁగాని
కోఁతి బిడ్డ విడువ ♦ చేతీరునైనను
ప్రేమ యన్న నెఱుఁగు ♦ నామె యొకతె.

## బ ం తి

ఆ. బంతి చిన్నదైన ♦ బాగుగా నున్నది
పైకి నెగురవేసి ♦ పట్టుకొందు
దొరకకున్న దాని ♦ పరు గెత్తికొనిదెత్తు
ఎవ్వ రెంతడిగిన ♦ నియ్య నింక.

ఆ. పెట్టియందు నాన్న ♦ పెట్టినబట్టలు
తీసివేసి బంతి ♦ వేసికొందు
బంతి బడికిపోవు ♦ నంతదాఁకను నాడి
దాచుకొందు వెనుక ♦ చూచుకొందు.

ఆ. బంతికన్న మంచి ♦ వస్తువు లేదు నా
బంతి చెడదు చెడును ♦ బంతిపూలు
పండ్లకంటె మరియు ♦ బంగారమునకంటె
బంతి మేలు నన్నుఁ ♦ బాయ దెపుడు.

## పువ్వు

ఆ. చెట్లపూలు కోసి, ♦ చెల్లెలు జడయందు
పెట్టుకొనియె నేను ♦ పెట్టుకొనుట
కేది జడయటంచు ♦ వాదించు మాయమ్మ
యేమిచెప్పఁగలదొ ♦ యేమొ యిపుడు.

ఆ. పువ్వులను గులాబి ♦ పూచిననాఁడె మా
యమ్మ నన్ను చూచి ♦ అదిగొ అనియె
నేను దానితీరు ♦ దాని సౌందర్యంబు
దానితావి గనఁగఁ ♦ దలఁతు నెపుడు.

## బొమ్మలు

గీ. చెల్లెలెప్పుడు నాతోడఁ ♦ జెప్పకుండ
లక్కపిడతలతోడ పె ♦ ద్దక్కఁగూడి
యాడుకొను బొమ్మపెండ్లిండ్ల ♦ నట్లె వేగ
అన్నమును తిని వెళ్లి నే ♦ నాడుకొందు.

ఆ.వె. బొమ్మలన్న నాకు ♦ బొత్తిగా తెలియవు
పెండ్లియన్న నెవరి ♦ పేరుబెట్టి
చేయుచుందు రడియు ♦ చెల్లెకే చెప్పను
చెప్పకున్న అక్క ♦ చెప్పఁగలదు.

ఆ. ఆటలందు నాకు ♦ అలవాటు లేకున్న
ఆటలన్న నెంతొ ♦ యాస ; గాని
తోడివారు నన్ను ♦ తోడ్కొనిపోవరు
వెళ్లలేను నేను ♦ వీధులందు.

# ఆశీర్వాద పద్యములు

శా. శ్రీలీలాలగ నేర్చు సర్వజగముల్ ♦ సేవింపగానోర్చు నే
వేళన్ బాంసువిమిశ్రితాంబుకణమున్ ♦ విశ్వంబుగా మార్చు మా
యాలంకారము లార్చు నేసహజ ఘ ♦ జ్ఞాతోద్భవానందంబుగా
లీలం దీర్చె నొ యాస్వభావబల మో ♦ లిన్ శాంతచైతన్యమై
చాలన్ గూర్చుత మీవధూవరులకున్ ♦ సౌభాగ్యమారోగ్యమున్.

సీ. సీతాపతివ్రత ♦ చెలఁగిరాఘవునకు
మించువేడుక నల ♦ రించునట్లు
రుక్మిణీరమణిసా ♦ రున నొప్పి శ్రీకృష్ణు
మది కనురాగంబు ♦ మలపినట్లు
దమయంతియింతి స్వాం ♦ తములోన నలుని నా
రాధించి కరము గ ♦ రంచినట్లు
ఆర్యామహాదేవి ♦ యమలశీలముచేత
స్థాణుని వలపించి ♦ తనరినట్లు

గీ. వినయసౌశీల్యచారు వి ♦ వేకములను
విభుని నలరించుఁగాత స ♦ ద్విధులచేత
లలితవిమలానురాగవ ♦ ల్లరులచేత
వనిత నలరించుఁగాత యీ ♦ వరగుణుండు.

తే. లతలయందు కపోతదం ♦ పతులయందు
దినములందున చంద్రచం ♦ ద్రికలయందు
నెడతెగనిమైత్రి మీలోన ♦ నెగడుఁగాక
పటములను గానబడు వధూ♦ వరులలీల.

తే. కోకిలముజంట మావిపై ♦ గూరుచుండి
మధుసమయగీతికలు సుధా ♦ మధుర మొలుక
బాడి ప్రకటించు ననురాగ ♦ పాటవంబు
లాశ్రయించుత మిమ్ము న ♦ న్యోన్యమైత్రి.

తే. హల్లకములందు నవపల్ల ♦ వాళియందు
కలితకల్లోలినీజల ♦ కణములందు
రాగమలరారు నది యస్థి ♦ రంబుజేసి
మీదురాగంబు స్థిరము గా ♦ వింపవలయు.

మ. ప్రతిరాగంబున తేజమున్నది సుధా ♦ వారాశితో దాని సం
ప్రతిసేయన్; వలదంచుఁ జెప్పె నొకస ♦ ద్రాగప్రవిష్టుండు మా
కితరం బేదియుఁబోల్పఁదోఁప దిక మీ ♦ యిచ్చన్ బ్రదీపించునం
చితరాగంబె యొసంగు మీయుభయ హృ ♦ త్సీమావకాశంబులన్.

సీ. ఉరముపై నెక్కించె ♦ నువిద నొక్కవిభుండు,
సగచీర నిడె నొక్క ♦ సదయహృదయ
అర్థాంగిగాఁ జేసె ♦ నతివ నొక్కవరుండు
అమ్మగాఁబడె నొక్క ♦ యతివమిన్న
ప్రాణార్థములు నిచ్చె ♦ బడఁతికొక్కప్రభుండు
తలమోసె పతినొక్క ♦ తలిరుబోణి
రణములు భేదించె ♦ రమణికై యొకభర్త
వలువ లిచ్చెను నొక్క ♦ వనజగంధి

తే. ఇట్టు లన్యోన్యప్రేమచే ♦ నెందఱెంద
రవనియందుఁ బుణ్యశ్లోకు ♦ లైనవారొ
అట్లె మీమిధునంబు మో ♦ హానురాగ
రాగసంయుక్తమై ♦ ధాత్రిగాలుగాక.

సీ. హవ్వావధూమణి ♦ యాదంప్రవక్తకు
మించువేడుక నల ♦ రించునట్లు
సతియైన కతదానొ ♦ చతురతశ్రీహుసేన్
మది కనురాగంబు ♦ మలపినట్లు
లల జులీఖాసుంద ♦ రాంగి యూసూఫునా
రాధించి కరముఁగ ♦ రంచినట్లు
శ్రీయాయెషాదేవి ♦ చెలఁగిమహమ్మద్ర
సూలును వలపించి ♦ చొక్కినట్లు

తే. వెలయు నీ వధూవరులకు ♦ నెలమి నిత్య
మంగళము గూడ, జయము దే ♦ వాంగనాళి
దివిని బాడగనాశీర్వ ♦ దించి వేడ్క
గ్రాలు నుంరాలిషాయను ♦ కవి యొకండు.

—✱—

# శ్రీ పంచమజార్జిరాజరాజేంద్రుని హిందూదేశాగమనము

ఉ. ఆయత హిందుదేశమున ♦ కంతకు ద్వారముగాగ నొప్పు బొం
బాయిపురంబులో మొదటఁ ♦ బాదము మోపిన చక్రవర్తి జా
ర్జీ యఖిలావనీపతికిఁ ♦ జెన్నలరారెడు మేరిరాణికిన్
శ్రీయును సౌఖ్య మాయువును ♦ సేమము నప్పరమేశుఁ డీవుతన్.

ఉ. అర్గురిచే బ్రతిష్ఠితము ♦ హైందవ రాజ్యరమావధూటి దు
ర్మార్గుల చేతిలోఁ బడి శ్ర ♦ మంపడి యశ్రులు రాల్పగా దయా
భర్గుఁడు లండనాధిపులఁ ♦ బంపి హితంబిడి సంస్కరింపఁగా
స్వర్గమునుండి దూతగను ♦ బంపిన జార్జికి మంగళంబగున్.

సీ. ఎవని రాజ్యంబున ♦ నినుఁ డస్తమింపక
గలకాల మొకరీతి ♦ గాచునొక్కొ
ఎవని పాలనమున ♦ గువలయప్రియుఁ డింత
పక్షభేదము లేక ♦ పరగునొక్కొ
ఎవని వీక్షణమున ♦ నెనయు దయావార్ధి
వరదలై దేశాన ♦ బారునొక్కొ
ఎవని తేజంబున ♦ నెల్ల సత్సంతతు
లంతకంతకు కళా ♦ భ్యాసులైరొ

గీ. అట్టి కల్యాణనిపుణుఁ డై ♦ నట్టి ధైర్య
శౌర్య విస్ఫూర్తి మా జార్జి ♦ చక్రవర్తి
సకల విద్వేషసమవర్తి ♦ శాంతమూర్తి
వచ్చె భరతవర్షపు తపః ♦ ఫలముచేత.

ఉ. ఎప్పుడు వచ్చునో ప్రభువు ♦ నెప్పుడు చూచెదమో హృదబ్జముల్
విప్పగ మాయినుం డెపుడు ♦ వేడుక వచ్చునొ యంచు నింపుసాం
పొప్పగఁ జూచు కన్నులకు ♦ నుజ్జ్వలమైన వికాస మిచ్చి రా
నొప్పిన జార్జికిన్ శత జ ♦ యోదయముల్ పరమేశుఁ డీవుతన్.

సీ. సూర్యచంద్రులు గ్రుంకఁ ♦ జూడ నంతటి రాజ్య
మేలురా జీదేశ ♦ మెపుడు జూచె
జాతివైషమ్యంబు ♦ నేతీరు నెఱుగని
నృపవర్యుఁ డీభూమి ♦ నెపుడు ద్రొక్కె
ప్రజలహితంబె నా ♦ నిజమైన హితమని
యెంచురేఁ డీపీఠ ♦ మెప్పుడెక్కె
నాగరికత్వంబు ♦ నాటి సింగారించు
నినచంద్రుఁ డా ఢిల్లి ♦ కెప్పుడేగె

గీ. కరబదరమట్లు లీమహా ♦ ధరణిరాజ్య
భారము వహించు విభుఁ డెప్డు ♦ వచ్చె నిటకు
నేఁడు వీతెంచె మాజార్జి ♦ నేలతేఁడు
మేరీరాజ్ఞీ సహిత పరి ♦ వారుఁ డగుచు.

ఆ. ధరణిజాని లేని ♦ దర్బారు లెస్సైన
వరుఁడులేని పెండ్లి ♦ పగిది నయ్యె
నేఁడు రాజ్యరమణి ♦ నిను వరించియు ఢిల్లి
పీఠమున నభీష్ట ♦ విభవమొందు.

సీ. అర్ధాంగియై పతి ♦ నంటివచ్చెడు మేరి
మంగళాంగికి శుభ ♦ మంగళంబు
భరతవర్షపు రాజ్య ♦ భామిని కైసేయ
జనుదెంచు జార్జికి ♦ జయము జయము
పరమప్రీతిని ప్రజా ♦ పాలనం బొనరించు
పార్లమెంట్వారికి ♦ స్వాగతంబు
హిందూమహాదేశ ♦ మీక్షింపవచ్చు రా
చుట్టాల కెవ్వడు ♦ శుభము శుభము

గీ. ధర్మసంస్థాపకుండు వి ♦ ద్యావిదుండు
నైన నృపతి వరించిన ♦ యార్యవర్త
దేశలక్ష్మికి విజయ మ ♦ ద్దేవదేవు
డుజ్జ్వలితతేజు యువరాజు ♦ నోముఁగాక.

సీ. ఢిల్లిపీఠంబెక్క ♦ వెళ్లరా దిపుడని
చెప్పుమాటలు పెడ ♦ చెవినిబెట్టి
అవ్వయు జనకుండు ♦ నధిపులై పాలించు
నట్టి దేశం బేగ ♦ నవసరమని
ముద్దారుబిడ్డల ♦ మురిపెంపు తల్లిని
నొప్పించి శ్రమలకు ♦ నోర్చి యోర్చి
బహుయోజనంబులు ♦ పడరానిశ్రమల సం
ద్రము దాటివచ్చిన ♦ ధైర్యశాలి

గీ. శౌర్యలక్షణ లక్షితుఁ ♦ డార్యధర్మ
విదుఁడు విద్యానవద్యప్రవీణుఁడైన
శ్రీ మహాజార్జిచక్రవ ♦ ర్తికిని మేరి
రాజ్ఞికి జయంబు భరత వ ♦ ర్షంబునెల్ల.

చ. కనిన యనుంగుబిడ్డలను ♦ గారవ ముంచుచు మాసుఖంబులన్
దన సుఖమంచు మాశ్రమకు ♦ దానె నిమిత్తమటంచు నెంచు నా
జనని గతించె విక్టొరియ ♦ సాధ్వని ; యాయుమపుత్రు డెడ్వరుం
డినుమడిఁ బ్రోచి తల్లి నవు ♦ దే మరపించెఁ గృపాబ్ధినించుచున్.

గీ. మున్ను యువరాజువై వచ్చి ♦ ముద్దులొలుక
నలఘుసంప్రీతి బ్రోచెద ♦ ననుచు బలికి
ఆ దయామృతవృష్టి మా యందు గురుప
శ్రమయనక వచ్చితివి జార్జి ♦ చక్రవర్తి.

సీ. ఆత్మేశుఁ బాయక ♦ ర్థాంగియై ప్రభుభక్తి
ప్రజలకు బోధించు ♦ పరమసాధ్వి
తరుణు లందరికి నా ♦ భరణమై సుగుణ ర
త్నాకరమై యొప్పు ♦ నతివమిన్న
ప్రీతితో నార్గురు ♦ బిడ్డలఁ గని యెన్ని
సిరిసంపదల దూగు ♦ తరళనయన
శాంతాది శమదమ ♦ స్వాంతయై విక్టోరి
యారాణి మరపించు ♦ నమలచరిత

అఖిల లక్షణలక్షిత ♦ యైన లేమ
లలిత కళ్యాణగుణగణ ♦ ములకు దేవి
జారిజికి రాణి యలివేణి ♦ మేరిరాణి
సన్నుతింపగ దరమె వా ♦ గ్జానికైన.

మ. చిరకాలంబున కార్యసోదరులు వి ♦ చ్ఛిన్నంబు గాకుండగా
మరలన్ గూడిరి హిందుదేశమున స ♦ న్మానింప నానామతాం
తరులై యుండిన గాక యింగ్లిషుప్రభు ♦ త్వం బీధరామండలిన్
ధరణీశంద్రులతోడ నిల్పి మము ని ♦ త్యం బేలు నిచ్ఛారతిన్.

ఉ. భారతదేశ మంతయుఁ గృ ♦ పాణము పట్టి జయించినాము నే
డారయ దాని వీడవల ♦ దంచు వచించిన వల్వ దంటి వీ
ధారుణి భీముడున్ గెలువ ♦ ధర్మజుఁ డేలినయట్టు లీవు వి
స్ఫారవినీతి ఛత్రమును ♦ చాటిడి ప్రోవుము జార్జిభూవరా!

ఉ. హైందవదేశ నౌకకు భ ♦ యంబిఁక లే దధికార మంత నీ
యందున మోసి యున్నది ప్ర ♦ యాణికులన్ బ్రజనీయనుజ్ఞసాం
పంద సిరానఁ దాల్చు నిపు ♦ డంతట నిర్మల రాజభక్తి రూ
పొందెడు గాలియున్ విసరు ♦ చున్నది మమ్ముతరింపజేయుమా.

ఆ. పార్లమెంటు మారు ♦ ప్రభువులు మారెద
రఖిలమంత్రివర్గ ♦ మపుడె మారు
కాని నీవు మార్పు ♦ గాబోవు స్వర్గతే
జంబ వగుచు ప్రజల ♦ సాకెదీవు.

ఉ. ఎన్ని వరప్రదానముల ♦ నెందరొ కోరుచునున్నవారు నీ
వన్నిటి నిత్తునన్న నిడ ♦ నన్నను, మాకొకదాన మీయగా
సన్నుతిసేతు మోధరణి ♦ జాని, యనే మనహిందుదేశ మీ
వెన్నటికిన్ మదిన్ మరువ ♦ కెప్పటియట్లు హితంబు గూర్పు మా.

ఉ. తల్లుల కెల్లఁదల్లివయి ♦ తండ్రుల కెల్లను దండ్రివయ్యు మా
కెల్ల నభీష్టసంపదల ♦ నీయఁగ రాజులకెల్ల రాజువై
చల్లనిచూపులన్ మనుచు ♦ సామివి మాయపరాధ మున్న నీ
యుల్లమునన్ దలంపక స ♦ మున్నతిఁ బ్రోవుముజార్జిభూవరా.

మ. భవదీయం బగుపాదపంకజములన్ ♦ బల్మారు రారాజులున్
నవమాణిక్యకిరీటపంక్తులొరగన్ ♦ నందింతు రింద్రుండవో
యవనీచంద్రుఁడవో దయామృతము మా ♦ యందిష్టు వర్షింపగాఁ
జనవేపారగ నేగుదెంచితి వహో ♦ జార్జీ నృపాలాగ్రణీ!

తే. రాజదంపతు లనురాగ ♦ రాశిఁ గ్రుంకి
ప్రజలఁ గాపాడుఁగావుత ♦ ప్రజయు రాజు
భక్తి భజియించుభాగ్యంబుఁ ♦ బడయుగాత,
దేశమంత సుభిక్షమై ♦ తేలుగాత.

తే. ప్రభువు జార్జిని జూడ బొం ♦ బాయివచ్చి
వాని దర్శించి వేడుక ♦ బట్టలేక
ఆశుధార నీపద్యంబు ♦ లల్లి నా కృ
తజ్ఞతను దెల్పినాఁడ సో ♦ దరులయెదుట.





గీ. గాలిచే మింట మేఘముల్ ♦ కలిసికొనిన
మెరు పదేటికి రావలె ♦ నెఱుఁగరాదు
యువక యువతీ సమాగమం ♦ బొదవెనేని
విరహ మేటికి వచ్చెనో ♦ యెఱుఁగరాదు.



గీ. మండు దీపపుకళికను ♦ మాయకాని
జేరి శలభంబువలె సంత ♦ సించుచుంటి;
వకట! నీనామరూప వ ♦ ర్గాళినెల్ల
రూపడఁచునో! యిడునో! స్వస్వ ♦ రూపమహిమ.



గీ. ఆకసంబున మబ్బులు ♦ నావరించు
వంటిమీద రుజాభార ♦ మంటుచుండు
పేరుపై మచ్చలును వచ్చు ♦ నేరికైన
కర్మతప్పదు మూఁడు లో ♦ కములు గన్న.



# శ్రీ శ్రీ బికనీర్ మహారాజా స్వర్ణోత్సవ ధ్యానశ్లోకపంచకం

శ్లో. నానారాజ కిరీటకోటి విలురత్ విభ్రాజ పాదాంబుజా
విశ్వశ్రేయ కళాకలాప విలసద్విజ్ఞాన విద్యానిధీ
సౌహృద్యాద్యభినందితాఖిల జగత్ సామ్రాజ్య తేజోజితా
శ్రీ బికీర్నర్ప్రభు తే సదా విజయతాం స్వర్ణోత్సవం మంగళం.

శ్లో. పాశ్చాత్యామర పూజ్యపాద విబుధాః సంవర్ణితాలంకృతా
వేదాద్యాగమ శాస్త్రపారగ మహా విద్వత్సభాపూజితా
ఆర్యావర్త వసుంధరాభరణ సత్ సింహాసనాధిష్ఠితా.

శ్లో. విద్వత్కోటి చకోరచంద్ర కృషికాకల్పాగమా అగమా
దారిద్ర్యాంధతమోర్కబింబ సుజనక్షేత్రాంబుదా కోవిదా
ధర్మస్థాపక భారతీమతహితా సంవర్ధితా సంస్తుతా.

శ్లో. బ్రహ్మానంద సముజ్జ్వలైకముదితా సంపత్కళాశోభితా
సర్వే బంధుజనో సముత్సుకహితా శాంతాన్వితా పూజితా
ఆర్షాభిష్ఠిత శౌచశీల కవితా సమ్యక్కళాపోషితా.

శ్లో. ఆపద్బాంధవ దీనరక్షక దయా సర్వస్వ సంవాసితా
సర్వజ్ఞ స్వకపోల కల్పిత కవిత్వాదర్శ విద్వన్మతీ
సత్యాన్వేషణ సద్విభూషణ సమాశ్రిత్యాభిసంరక్షణా.

—✶—

# శ్రీ పంచమజార్జి సార్వభౌమునినిర్యాణము

ఉ. భారతదేశ మంతయును ♦ భానునికైవడి రాజ్యమేలి దు
ర్వారవిచార ఘోరమగు ♦ ధ్వాంతము దిక్కుల నావరించు న
ట్లారయ ధాత్రిబాసి చని ♦ నాఁడవు పంచమ జార్జి చక్రవ
ర్తీరమణీయకీర్తి రమ ♦ నెల్లెడ నిల్పి జగద్ధితంబుగన్.

ఉ. ఎందఱొ రాజ్యముల్ బడసి ♦ యెన్నొ విధంబుల నేలినారు వా
రందఱు కాలగర్భమునఁ ♦ గ్రాలిన నీవలెఁ గీర్తిచంద్రికల్
సుందరలీల లోకమున ♦ శోభిలఁజేయఁగఁ జాలరైరి నీ
చందము లోకవంద్యము ని ♦ జంబుగ పంచమ జార్జి సత్ప్రభూ.

మ. పృథివిన్నేలిన నీ పితామహి మహా ♦ విక్టోరియారాజ్ఞి య
వ్విధి నెడ్వర్డు ప్రభుండు నీ జనకునిన్ ♦ మెప్పించిన ట్లీవు వే
విధులన్ గాచితివయ్య జార్జినృప యా ♦ విశ్వంభరాదేవి నీ
పృథు హస్తంబులఁ దాల్చి నీ మహిమ ♦ వర్ణింపంగ సామాన్యమే.

—✱—

# శ్రీ తుమురాడ సంగమేశ్వర శాస్త్రిగారు

ఉ. భారతమాత దివ్యశత ♦ వర్షములన్ దప మాచరించి యీ
భూరివిలాసు వైణికుని ♦ పుణ్యసుమూర్తి ని జ్ఞానవర్తినిన్
సారవిచారునిన్ విమల ♦ స త్తుమురాడకులాబ్ధిచంద్రు నే
పారగ సంగమేశ్వరుని ♦ పార్థునికై వగగుందె ప్రేముడిన్.

ఉ. కాలవధూటియొక్కొక యు ♦ గంబున నొక్క మహాత్ము నొక్క భూ
పాలుని గాయకున్ కవిని ♦ పండితునిన్ సృజియించి లోకమున్
జాలగ సంతరించు నని ♦ చాటెడువాక్యము రిత్తగాదు మా
పాలికి సంగమేశ్వరుని ♦ వైణికుఁ జేసి తరింపజేసెడున్.

సీ. పంచమస్వర మభ్య ♦ సించె కోకిల కష్ట
పడి యెంతొ మధుమాస ♦ వాసరముల
బంభరస్వరములు ♦ పాడనేర్చెను భృంగి
పుష్పాసవము పొట్ట ♦ పోసికొనఁగ
కీకారవంబు ష ♦ డ్జాకారమన కేకి
ప్రావృట్పయోదముల్ ♦ పతయుకొఱకు
జిలిబిలిపలుకులు ♦ పలుకనేర్చెను శుక
మవ్యక్తనాదంబు ♦ లలమికొనఁగ

గీ. అట్టు లొక్కొక్కరాగంబు ♦ నాశ్రయించి
సృష్టిని నలంకరించె నీ ♦ ఖగచయంబు
గాని, తుమురాడవంశ రా ♦ కాసుధాంశ !
నీవు నిఖిలరాగంబులు ♦ నేర్చినావు
వందనంబయ్య స్వాగత ♦ వందనములు.

శా. వీణారూపిణి వాణి నీకరమునన్ ♦ విశ్రాంతమున్ జెంది బ్ర
హ్మానందాంబుధినోలలార్చి సభ మో ♦ హాస్త్రంబునన్ దేల్చి మూ
ర్ఛానారాచములన్ మనోమలినముల్ ♦ సర్వంబు బోకార్చి నా
వౌనౌ సంగమశాస్త్రి స్వాగతము మీ ♦ కత్యంత మీతీరునన్.

ప్రణవనాదంబు పలికించి ♦ వాణి వీణ
యందు నిజనాథుఁ గాంచి కృ ♦ తార్థయయ్యె
మేము నీవీణ గాన సు ♦ ధామయాప్తి
మునిఁగి చరితార్థులైనార ♦ మనఘచరిత.



# శ్రీ మౌలనా షౌకత్ అలీ నిర్యాణము

శ్లో. భారతీయ స్వరాజ్యార్థం
త్యక్త్వా సర్వస్వ మీదృశం
తమసా భాస నిర్వృత్యా
షౌకతాలీ దివంగతః

ఉ. భారతదేశ దాస్యమును ♦ బాపుటకై చెరసాలలందు దు
ర్వార దురంత ఘోర విష ♦ వాహినులందు వసించి మించి సా
కార ప్రభుత్వవర్గ పరి ♦ కంపిత శాసనసభ్యతా మహా
వారధి నీది షౌకతలి ♦ స్వర్గము స్వాగతమియ్య నేగెడున్.

మ. కవియొగ్బాలు నృపుండు కామిలు జగ ♦ త్కల్పాంతరోదంచితో
ద్భవ రాజ్యాంగవినేత షౌకతలి యీ ♦ దాస్యాబ్ధి మర్దించి భా
రవులై క్రుంకిరి ముస్లిమావని కటా ♦ రాత్రించరావాసమం
దవగాహాబ్ధిని బోవు నౌక నిక ♦ గమ్యస్థానమున్ జేర్తురో.



# శ్రీ కొమరరాజు లక్ష్మణరాయ నిర్యాణము

చ. తెలుఁగను నాట్యరంగమున ♦ దివ్యులు మెచ్చ ప్రధానపాత్రయై
నిలిచి విమర్శగీతముల ♦ నీతికథావళి పాడి పాడి చం
చలవలె నిష్క్రమించితి వ ♦ జాండము చీకటివార; ఉన్న వా
రలు గననేర్తురే కొమర ♦ రాజకులాగ్రణి లక్ష్మణాగ్రణీ.

గీ. పలుకువెలఁదికి చరితల ♦ తలపుఁ బెట్టి
స్వర్గపాతాళములు మెట్టి ♦ వచ్చినట్లు
పూర్వపురుషుల ప్రతిభల ♦ పొలుపు దెలిపి
రా కొమరరాజు లక్ష్మణ ♦ రావుగారు.

గీ. తెలుఁగుపలుకుల చరితల ♦ తెలివి దేర్చి
చదువుసర్వస్వమున వన్నె ♦ సంతరించి
మెరపువలె దోచి యక్కటా ♦ మింట దాఁగి
రా కొమరరాజు లక్ష్మణ ♦ రాయవరులు.

ఆ. తేటతెలుఁగువారి ♦ పాటల పలుకుల
నిన్ను చూచుచుందు ♦ మన్నియెడల
నీవు అమృతరూపి ♦ వై వాసి మావెంట
మాటలాడుచున్న ♦ మాట నిజము.

మ. ప్రతిభాషాహృదయాంతరంగము కొమ ♦ రాజాన్వయా! లక్ష్మణ
స్తుతి మాకున్ వినవచ్చు దేశమున నీ ♦ తో మేము వెన్నాడి నీ
ప్రతివ్యక్తిన్ సమకూర్చి అర్పితమహా ♦ ప్రావీణ్య మేపార సం
గతిగా విద్యకు వన్నె బెట్టుటకు సం ♦ కల్పింపగాఁజేయఁగన్.

—★—

# శ్రీ ఎ. వి. దాసు పంతులు గారి నిర్యాణము

[ఈ మహాశయుడు పిఠాపుర నివాసి. లండను నగరము వెళ్లి బారిస్టర్ పరీక్ష ప్యాసయి వచ్చెను. ది 4-6-1916 వ తేదీ ఆదివారం రాత్రి స్వర్గమలంకరించెను. వీరి కప్పటికి 33 సంవత్సరముల వయస్సుండెను]

శా. హా! యావంచకులాబ్ధిచంద్ర గుణధ • న్యా దాస విద్వన్మణీ
నీయాఖ్యానము నేటితో ముగిసెనే • నీరేజగర్భుండు నీ
ప్రాయం బింతయె వ్రాసెనే కట కృపా • రాహిత్యుడై చెల్లపో
మాయాలోకము స్వప్నదీపముల పా • మ్యంబై వితంబింపఁగన్.

ఉ. పుట్టిననాఁటగోలె చెడు • బుద్ధు లెఱుంగవు సద్గుణంబులన్
బెట్టినపేరు పుణ్యములు • పేర్చినసారు నుతింపరాదు తొ
ల్పట్టులకైన 'దాస' వర • భూసుర నీ సుకుమారసత్కళల్
మట్టిని నెట్టిపోయెనె స • మస్తము నస్తమయంబు నొందఁగన్.

సీ. పరసీమలకుఁ బోయి • బారిస్టరీ పరీ
క్షను నారితేరిన • ఘనుఁడ వీవు
ఆంగ్లభాషను చాల • నభ్యసించి యుపన్య
సింపనేర్చిన వచ • స్థిరుఁడ వీవు
అన్యదారల కల • నైన నను దలపోయ
నట్టి ప్రజ్ఞాశాలి • వగుదు వీవు
సత్యమునకు ప్రేమ • శాంతంబునకు హితా
చరణబుద్ధికిని ని • దాన మీవు

తే. చారుసుందరమూర్తి యోం • కారవర్తి
దాన సుగుణనివాస వి • ద్యావిలాస
హాససల్లాపముల మమ్ము • బాసి రోసి
పరగఁబోయితె స్వర్గ సో • పానమెక్కి.

క. నీయాత్మకు నీజీవికి, నీయంశకు స్వర్గతేజ • నివహము ప్రాప్తం
బై యలరుగాత వర మహ, నీయగుణోల్లాస దాస • నిర్జరవినుతా.

—✱—

# గ్రామ్య భాష

తే. పౌరుషము వోయె భారత ♦ వర్షరాజ్య
లక్ష్మి వోయెను సౌభాగ్య ♦ లక్ష్మి వోయె
భాషయును పోవనున్న దీ ♦ ఫక్కి చూడ
దీని నైనఁ గావరె యభి ♦ జ్ఞానులార.

మ. తొలుతన్ సంస్కృతభానుడూర్జితకళన్ ♦ ద్యోవీథికిన్ బ్రాకుచున్
తలపై కెక్కియె యస్తమించె నిల త ♦ త్ప్రాగల్భ్యముల్ వీడుచో
తెలుఁగో పాడ్యమినాటి చంద్రునివలెన్ ♦ దీపించి రూపించకే
విలయంబౌటకు వేచియుండె నకటా ♦ వీక్షింపరే పండితుల్.

కం. నెలకైన నడిమి వెన్నెల
గలదని యూహించు ♦ మాట కలదు తెలుంగున్
నెల నెత్తికెక్కు తెలుఁగము
విలయంబయి పోవనున్న ♦ విధము జనించెన్.

సీ. సలలితాలంకార ♦ ములను బెట్టగలేదు
తొడవులు కళలార ♦ తొడగలేదు
అతులితాకార ప ♦ ద్ధతు లేర్పరచలేదు
తిలకింప సొగసులు ♦ దిద్దలేదు
వచనంబులకు నైన ♦ వన్నెఁ బెట్టఁగలేదు
పదముల రాగంబు ♦ పర్వలేదు
దోషంబులకుఁబోని ♦ త్రోవ చూపఁగలేదు
ప్రౌఢభావములకుఁ ♦ బ్రాకలేదు

గీ. పెద్దసారస్వతంబును ♦ పెంచలేదు
ఇతరు లనువదించు కవిత్వ ♦ మెసఁగలేదు
పెక్కుశబ్దాలు వాడి పెం ♦ పెక్కలేదు
తెనుగువాణి తిరోధాన ♦ మును వహించె.

ఉ. వ్యాకరణంబు వల్వదట ♦ వాక్యములంగల సౌష్ఠవంబు వి
ద్యాకలనంబు పేశల సు ♦ ధామధురోక్తుల నర్థగౌరవ
ప్రాకటమైన శ్లేషయును ♦ ధ్వన్యర్థి వృథాయట పెంటపాటలే
నీకిక దిక్కొటాంధ్ర రమ ♦ ణీమణి యెంత నికృష్టవైతివే.

మ. అపశబ్దంబు లటంచు నెయ్యవి ప్రయో ♦ గార్హంబులుంగావొ గ్రా
మ్యపదంబుల్ బహుళాంధ్రలోకమున స ♦ మ్యగ్గౌరవంబిచ్చినేఁ
డుపయోగింపఁగ సంస్కరించునట యో ♦ హో కాలమేమారి యీ
యపచారాలు ఘటించుభాషలోక లె ♦ క్కానిక్కమూహించినన్.

శా. హృద్యంబైన పదంబులన్ విడిచి నే ♦ డిస్కూళ్లలోఁ జెప్ప నీ
విద్యల్ నేర్చిన నేర్వకున్న నొకటే ♦ పృథ్విన్ బ్రతిష్ఠించి మీ
రుద్యోగంబులు సేయలేరిచట మీ ♦ కుద్యోపతుల్ ప్రేమతో
సద్యోజాతఫలంబు లేదు కృషియే ♦ సర్వోత్తమం బియ్యెడన్,

మ. ప్రతిపద్యంబుకు హృద్యమై వెలయుగా ♦ బ్రాల్మాలగాబోదు సం
గతులున్నన్ అవి కొన్నియే రసముతో ♦ గ్రాలున్ఘనవ్రాతముల్
క్షితి వర్షించెడు బిందువుల్ దనరి శు ♦ క్తిన్ వ్రాలిముత్యంబులై
కుతుకంబేర్పడఁదోఁచు కొన్నియె సుమీ ♦ కుక్షిన్ప్రదీపించుచున్.

# ఆంధ్ర సారస్వత ప్రశంస

సీ. తేటతెల్లంబులై ♦ తేనెసోనలు నయి
పాలుపారునుడువుల ♦ పొదలి పొదలి
ముత్యాలపేటలై ♦ మురిపెంపు నీటులై
విలసిల్లుపాటల ♦ వెలసి వెలసి
వలపులబరిణలై ♦ తొలకుసోయగములై
కులికించుపదముల ♦ నలరి యలరి
సిరులకు నెలవులై ♦ విరులనెత్తావులై
తులలేనిరసముల ♦ దూగితూగి

తే. దేశభాషావధూటుల ♦ దేటి తేటి
కావ్యమాధుర్యములు చాల ♦ గాంచి కాంచి
తెలుఁగు తియ్యనిపలుకులు ♦ పలికినావు
రసగుణకదంబ యాంధ్ర సా ♦ రస్వతాంబ.

సీ. ఏలపాటలు తీగ ♦ లై లీలఁ జెలువొంద
నుయ్యెలలుగఁజేసి ♦ యూగియూగి
భావగీతిక లేరు ♦ లైపారి సొంపార
దెలినీట జలకేళి ♦ దేలి తేలి
సొగసుకైతలు తేనె ♦ సోనలై దిగజార
సొక్కి చేరలఁ దీసి ♦ జుట్టిజుట్టి
అలకావ్యములు కృత ♦ కాద్రులై విలసిల్ల
సంధ్యావిహారంబు ♦ సలిపి సలిపి

తే. చారుత్రైలింగ మధ్య దే ♦ శమున నడుగు
లుంచి బంగారమును గురి ♦ పించి మించి
దెసల గీర్తిగడించిన ♦ దివ్యవాణి
రసగుణకదంబ యాంధ్ర సా ♦ రస్వతాంబ,

సీ. పున్నమచంద్రుని ♦ బురుడించు నెలంత నె
మ్మోముతో నొకమారు ♦ పోలె దీవు
గంగాఝరీ సము ♦ త్తుంగతరంగ సం
గతులతో నొకమారు ♦ గలిసె దీవు
ఆణిముత్తెపుసరు ♦ లలరుల దండల
తోసరి యొకతరి ♦ తూగెదీవు
కీర శారీ కోకి ♦ లారవములతోడ
కలనిస్వనము గూర్చి ♦ వెలసె దీవు

గీ. సాంధ్యరాగాళితో తోడి ♦ స్వరము గూర్చి
ప్రకృతిపాడెడు కృతితోడ ♦ పరగె దీవు
ఇట్టు లెన్నని నిన్ను వ ♦ ర్ణింపఁగలను
రసగుణకదంబ యాంధ్ర సా ♦ రస్వతాంబ.

సీ. కవియెంత కవిచేతి ♦ కలమెంత యల మషీ
జల మెంత నిను వ్రాసి ♦ తెలుసుకొనఁగ
వనమెంత వనములో ♦ పలి రసాలం బెంత
పికమెంత నిను పాడి ♦ పిలుచుటకును
చెఱకొంత చెఱకు చ ♦ క్కెర యెంత తేనెంత
మధువెంత నీ స్వాదు ♦ మహిమఁ గనఁగ
సుమమెంత కుసుమంపు ♦ సొగసెంత జాళువా
పసిడెంత నీకాంతి ♦ బఱగుటకును

తే. ప్రకృతియే నీవె నీవె యీ ♦ ప్రకృతి వేము
ఎవరు కాదనగలరు నీ ♦ కీవె సాటి
రూఢిగల శుద్ధప్రణవ స్వ ♦ రూప మీవు
రసగుణకదంబ యాంధ్ర సా ♦ రస్వతాంబ.

సీ. కోయ చెంచు కిరాత ♦ కులములో నడుగుంచి
యేల పాటలను పా ♦ డించినావు
జనపదంబులు ద్రొక్కి ♦ చని ముద్దుపదముల
పలికించి తేనెలు ♦ జిలికినావు
నగరంబులకు మెట్టి ♦ నగి యాలుమగలకు
ప్రేమగీతలు విని ♦ పించినావు
దేశదేశంబుల ♦ దిరిగి జాతీయ గా
నములు నేర్పి రసాబ్ధి ♦ నమరినావు

గీ. భారతమువంటి సంహిత ♦ బడసినావు
కవులు పండితు లార్యులఁ ♦ గాంచినావు
ఇంట పొరుగింట పసిడి వ ♦ ర్షించినావు
రసగుణకదంబ యాంధ్ర సా ♦ రస్వతాంబ.

—★—

# భారతమాత

చ. తినుటకుకూడు కట్టుటకు ♦ తెల్లనివస్త్రము వాసయోగ్యమై
దనరు గృహంబుమానె తల ♦ దాచికొనంగ కుటీరమైన లే
కనయము దీనభావమున ♦ నన్న్యులపంచనుజేరి యూరకే
కనులనుబాష్పధార లొలు ♦ కన్ విలపించు గతంబుజెప్పుచున్.

ఉ. ధారుణి నెల్ల దేశములు ♦ దైన్యదవానలమందు జిక్కినన్
జేరి క్షుధార్తిదీర్చుకొని ♦ చేరలతో ధనధాన్యరాసులన్
గోరికమీఱజుట్టి నిను ♦ గొల్చుచుఁ బోయెదువారెగాని నా
కూరిమిమాని నీయురము ♦ గ్రుద్దుటకున్ గమకింపరెప్పుడున్.

ఉ. నిర్ధనులెందరో చదువు ♦ నేరని మోరకులెందరో మహా
నర్థపరంపరన్దవిలి ♦ అమ్మవసుంధర రత్నగర్భ మా
ప్రార్థనమాలకించి మము ♦ పాలనసేయుమటంచుగొల్తు రా
యర్థములేని పూర్వబిరు ♦ దావళులున్నవి మొత్తుకొంటకున్.

ఉ. పేరుప్రతిష్ఠ లూడినవి ♦ పేదరికంబు ఘటించె కాసు కా
ధారములేదు నేటి ఋణ ♦ దాతలు నెత్తురుగూడబీల్చి నా
బోరను గ్రుద్ది పడి ♦ పోవగ బానిసయంచుదిట్టి నో
రారగ నొవ్వనాడిరి దు ♦ రాత్ములసంగతి చెప్పశక్యమే.

చ. కలుములుజిమ్ముచున్ పయిఁడి ♦ కంబములన్నిలబెట్టి కోట పే
టలు గుడిగోపురంబులు క ♦ డానిముదంబున గట్టినట్టి నె
చ్చెలి తలదాచుకొంట కొక ♦ చిన్నకుటీరము జాతిసంఘమం
దలవడదయ్యె ధాత్రిపరు ♦ వన్నదియుండునె పేదరాలికిన్.

ఉ. ముప్పదిమూఁడుకోట్లు తన ♦ పుత్రకులున్ నవరత్నపుంగనుల్
కుప్పలుతిప్పలైయెసఁగు ♦ కొండలు పైడికొటార్లు సస్యముల్
జెప్పఁటకేమి చారువన ♦ సీమలు శోభిలు నెన్నియేని యీ
గొప్పలు ముప్పతిప్పలయి ♦ గోడుచెడన్ చెడిపోయె నెంతయున్.

శా, ఆ పాంచాలికి జన్మభూమి సమర ♦ వ్యాపారపారాయణుం
డై పేర్గన్న కిరీటికొండు విలువి ♦ ద్యారంగమై నేళ్ళు దా
మే పట్నాంగనకంఠహారములు నెం ♦ తే తీవిరాణించునో
ఆపాంచాలము నేఁడు వాసిచెడి దుః ♦ ఖాక్రాంతమైయొప్పెడిన్.

ఉ. యూరపుదేశ మట్టిటుల ♦ నూగగ శౌర్యపరాక్రమంబునన్
భారతవీరకోటి రణ ♦ పాండితి వైరులఁజీల్చి రక్తసి
క్తారుణమూర్తులై నిజ జ ♦ యధ్వజముల్ నెలకొల్పినప్పుడే
ధారుణిమెచ్చెఁ దద్రుధిర ♦ ధారలు భోరున పార్లిపారగన్,

ఉ, భారతమాత యిప్పుడు ప్ర ♦ భాత శకుంతకదంబగీత శృం
గారములాలకించి చిర ♦ కాలము పండిననిద్రనుండి సొం
పారగ మేలుగాంచె మఱి ♦ పండదు లాలిపదంబుపాడి సం
స్కారములెన్ని జేసినను ♦ సాగదుమాయ నిరంతరాయమై.

—✶—

# స్త్రీస్వాతంత్ర్యము

ఉ. కాంతలఁ బూజ్యలం చరయఁ ♦ గావలెఁగాని, స్వతంత్రవృత్తియొ
క్కింత యొసంగెనే నది య ♦ నేకవిపర్యయముల్ ఘటించి హృ
త్కాంతులకున్ సుఖంబిడరు ♦ ధాత్రికిమంత్రిస్వతంత్రుడైనభూ
కాంతుఁడు గాజు లుంచుకొని ♦ కానల డాగునె ముష్టి యెత్తునే.

చ. ఇరువురకున్ స్వతంత్ర మది ♦ యెన్నఁడుఁ జెల్లదుస్త్రీలకోమఱిన్
బురుషులకోస్వతంత్రమిడఁ♦బోలుస్వతంత్రులునస్వతంత్రులన్
పరువునఁ బెంపఁగావలయు ♦ బాపురె! స్త్రీకి స్వతంత్రమున్న నే
పురుషునికీర్తి నిల్చు నిజ ♦ బుద్ధి వితర్కము జేసి చూచినన్.

సీ. పెండ్లికి బంధులఁ ♦ బిల్వఁగావలె నన్న
పూబోఁడు లేయూరు ♦ పోవఁగలరు
పరులకు నుపకార ♦ మొనరింపవలె నన్న
చేడె లేయేపనుల్ ♦ చేయఁగలరు
సంఘాభివృద్ధిని ♦ సలుపఁగావలె నన్న
నారు లేయేపక్క ♦ నడువఁగలరు
జారచోరులవృత్తి ♦ సమయింపవలె నన్న
సాధ్వు లేయేరీతి ♦ సాగఁగలరు

అట్టి యబలాస్వతంత్ర మే ♦ మవసరంబు
దేశమే యుద్ధరింతు రు ♦ ద్దేశ మేమి
చెడన దేమున్న దిప్పుడు ♦ చెడున దేమి
ధీరవరులార సంఘ సం ♦ స్కారులార!

సీ. భిల్లపుళిందు ల ♦ త్యుల్లసనం బొప్ప
నువిదల స్వాతంత్ర్య ♦ మొసఁగలేదె
ప్రాచీనసంస్కార ♦ పరులెల్ల దాస్యంపు
టువిదలస్వాతంత్ర్య ♦ మొసగఁలేదె
సభలందు నృత్యంబు ♦ సలుపుచు జీవించు
నువిదలస్వాతంత్ర్య ♦ మొసఁగలేదె
పెండ్లియాడక స్వేచ్ఛ ♦ విహరించుచుండెడు
నువిదలస్వాతంత్ర్య ♦ మొసఁగలేదె

అదియె వీరి కథోగతి ♦ నందఁజేసె
నస్వతంత్రలు నబలలై ♦ యాత్మభర్త
నింట నర్చించుసతులతో ♦ నెసఁగఁగలరె
ధీరవరులార సంఘసం ♦ స్కారులార.

సీ. ఆంగ్లేయు లిప్పుడు ♦ ననుభవించుచునుండి
రతివలస్వాతంత్ర్య ♦ మతికియతికి
పారసీకులు నిప్పు ♦ డారసి దుఃఖింతు
రతివలస్వాతంత్ర్య ♦ మతికియతికి
హిందువు లిపుడు నూ ♦ హింతురు నాట్యంపు
టతివలస్వాతంత్ర్య ♦ మతికియతికి
ఇతరపాశ్చాత్యు లెం ♦ తేనిచింతించెద
రతివలస్వాతంత్ర్య ♦ మతికియతికి

స్త్రీలకు స్వతంత్రమనునది ♦ చీడపురుగు
తగదు సంస్కారులకు స్వతం ♦ త్రింపుమాట
దాని పురికొల్పినను బాపఁ ♦ దరముగాదు
ధీరవరులార సంఘ ♦ సంస్కారులార

సీ. మొగవారితోఁగూడి ♦ ముచ్చటలాడుచుఁ
బోవుట సాధ్వికిఁ ♦ బోలదెపుడు
పొరుగిండ్లకును బర ♦ పురుషులతోఁ గూడి
పోవుట సాధ్వికిఁ ♦ బోలదెపుడు
సభలలోనికి వచ్చి ♦ సయ్యాటలాడుచుఁ
బోవుట సాధ్వికిఁ ♦ బోలదెపుడు
మానాభిమానముల్ ♦ మాని వర్తింపుచుఁ
బోవుట సాధ్వికిఁ ♦ బోలదెపుడు

గీ. పోలదని మేము చెప్పెడు ♦ బుద్ధిగాదు
వరయువతి చారుసుస్వభా ♦ వంబు సాక్షి
ధీరగాక స్వతంత్రతంబు ♦ కోరఁగలదె
ధీరగుణులార సంఘ సం ♦ స్కారులార.

చ. పరపురుషాళిఁ గాంచి తన ♦ వైఖరి యింకొకరీతి మార్చి సం
బరమున లేతనవ్వులయుఁ ♦ బైఁటను మాటికి లేవనెత్తుచున్
సరసపచేవిలాసములు ♦ సారెకుఁ గూరిమిఁ జూపుచుంట మేల్
తరమె కులాంగనామణికిఁ ♦ దద్గతి జారలతాంగిమార్గముల్.

---

# ప్రేమగీతము

అకట విరహాగ్ని యెన్నినా ♦ ళ్లాపవలయు
దగ్ధ మగుచున్న దీమేను ♦ దాఁగి యుంట
అశ్రుధారలు బాణంబు ♦ లట్టు లురము
నాటి వ్రయ్యలుసేసె నీ ♦ నాఁటి కబల
కౌఁగలింతలు ప్రేమాను ♦ రాగవచన
వైభవంబులు జ్ఞప్తికి ♦ వచ్చినపుడు
అసువులా పోవు బ్రతుకాశ ♦ యెసఁగఁబోదు
నీవు రాలేవు నన్ను రా ♦ నీయ వబల
వలదు మానసమా ! చెలి ♦ దలఁపవలదు
ఆ స్థితిని నాగిపొమ్ము ; రా ♦ జ్యాంగకముల
కవులకలములు మొక్కవో ♦ గడచినట్లు
పొరలువాగునీటికి గట్టు ♦ పోసినట్లు
అతివపై నీకు నిజ విర ♦ హానలంబు
దగిలియుండిన లోలోనె ♦ దగ్ధమగుము
గాని యాలేమ కపకీర్తి ♦ గలుగునట్లు
వెలువరింపకు మిసుమంత ♦ విరహచింత
ఆశ లన్నియు పందిరి ♦ యట్టు లమరె
నీవనెడుతీగ దానిపై ♦ నెక్కి తుదకు
జీర్ణమై పోవునో వయ ♦ శ్శ్రీవహించి
కాంతిని వెలార్చునో సుమా ♦ క్రాంత మగుచు.

—★—

# గ్రామ్యము

అస్తోకప్రతిభావిభాసము మహో ♦ ద్యత్తేజ మవ్యాజవి
ద్యాస్తోమంబున కగ్రగణ్యము కళా ♦ ధ్యాయంబు సర్వంసహా
విస్తీర్ణప్రజకైన యీ తెనుఁగు ఠీ ♦ విన్ భావి నర్థింపకే
న్యస్తంబైన వికారసూచకకథా ♦ ధ్యాహార మీరీతి వ్య
త్యస్తంబైన యపార్థముల్ గలుగు వ్యా ♦ ఖ్యానంబులోకాని క
భ్యస్తంబున్ బొనరింప నేమితెలివో ♦ ప్రత్యక్షమౌబుద్ధి లో
కస్తుత్యంబగు తేటు పోదుడిచి ధి ♦ క్కారించి యీగ్రామ్యపుం
రస్తా దీసిరి వామమార్గులవలెన్ ♦ రమ్యం బినే యందు రేం
చేస్తా మీకలికాలధర్మములవై ♦ చిత్ర్యంబు చిత్రింప ప్రా
శస్త్యంబైన తెలుంగుబాస మనకున్ ♦ సర్వస్వమై తల్లియై
ప్రస్తావింపగఁ బోలునట్టిది తృణ ♦ ప్రాయంబుగాఁ జేసి వి
స్వస్తాయంబును త్రొడుత్రెంపి తుదకున్ ♦ జాడించి ప్రాకట్టైకున్
పుస్తిన్‌గట్టకుఁడంచు "ఢం" అనుచు రం ♦ డోల్గట్టి చాటించుతూ
వస్తావుండి రయారె గ్రామ్యు లహహా ♦ వ్యాకర్ణ సూత్రాలనే
పస్తాయించియు దిద్దుతారట బలే ♦ బంట్రోతులే వీరు మేం
చూస్తాంగాదది క్రొత్తయున్నపుడు వ్రా ♦ స్తూ క్రొత్తగాదిద్ది భా
షిస్తున్నట్లు ప్రయోగమేర్పడియెనం ♦ చేమేమొ చేస్తార్సరే
వాస్తంగా నొకదారి లేనపుడు స ♦ భ్యత్వంబు శాసింపఁగా
వస్తుందా వడి కావడుల్ సుడుల సౌ ♦ భాగ్యంబు రూపింపఁగా
వస్తుందాయమకంబువ్యంగ్యములసౌ ♦ మ్యత్వంబుసౌందర్యమున్
వస్తుందా కవితావిలాసవిలస ♦ త్ప్రాచీనశృంగారమున్
వస్తాయా స్వపదంబు నానుడుల నా ♦ నారూపభేదంబు లీ
కోస్తా క్రొత్తది ప్రాతలన్ గలపు సం ♦ కోచంబు వర్జించి మీ

ప్రస్తారంబులు దిద్ది ముద్దులకు సం ♦ భావించి సూచింపఁగా
వస్తారా సరి మంచిదే వివిధ వి ♦ ద్వద్భాష లూహింపఁగా
వ్రాస్తే యిస్తరపిస్లియేమగరుమా ♦ ఫఖ్ భేష్ చమత్క్రించు నో
యెస్తే మిష్టరు మైడియర్ మొదలునాం♦గ్లేయంబు పైశాచిహిం
దుస్తానీ కలగూరగంప విపరీ ♦ తోక్తుల్ విడంబింప చూ
పిస్తారా కవిశిల్పకల్పన కథా ♦ విస్రంభ సంరంభముల్
దస్తూరిన్ దిలకింప కంపిత వచో ♦ దంతంబు లెంతే ప్రయో
గిస్తారో పరగేరుచేల నిరులన్ ♦ గీలించి నాగళ్ళ మో
యిస్తూ తద్రచనాకలాపముల నెం ♦ తే రాగమాధుర్య మా
లిస్తూ పల్లెల పాట పాడి ప్రజలన్ ♦ లీలాసమారూఢ స
ద్యస్తంబైన స్వరాజ్యగానకలనా ♦ ద్వైతంబు సిద్ధింపఁగా
చేస్తారా సముపాసితంబయిన యీ ♦ సిద్ధాంత మద్వాన్నమై
ప్రస్తావింపఁగరాదు లాక్షణిక వి ♦ ద్వద్వ్రాత మీపక్షమే
దస్తాలెన్నియొ వ్రాసి పెట్టిరట కా ♦ దా పెక్కుప్రామాణ్యముల్
వస్తాదుల్‌బలె చూపి పెద్దసభలన్ ♦ వాదించి శోధించి ఈ
బస్తీమీద సవాలు కొట్టిరి మహా ♦ బాహాబలాఢ్యుల్ జబర్
దస్తీమీరహుటాహుటిన్‌వెతలిశా ♦ స్త్రంబుల్‌మహాభాష్యముల్
వ్రాస్తూ గ్రంథచయంబు లక్ష్యములుగా ♦ వాకట్టి వాయించుత
ద్వస్తిన్ బద్ధలుకొట్టనేర్చునెడ రా ♦ వాలంబు దుర్రుచ్చి పి
ల్పిస్తున్నారు శబాసు మీయశమునై ♦ లింపుల్ నగారాలు వా
యిస్తున్నారు వినీలనీరదము లెం ♦ తే వారి వర్షింప పం
డిస్తే నల్లపెసల్ పసందయిన ప ♦ ప్పే బెల్లమల్లంబు పో
పిస్తే వచ్చెడుఘాటు తప్ప రుచి యే ♦ మిచ్చున్ నిగారించు నీ
మోస్తర్ ఖాయమె యైన దేశములలో ♦ పోట్లాట వస్తుంది అ
బెస్తల్‌మాలలుహిందువ్వరబ్బులు మహా ♦ విద్వాంసులైకావ్యముల్

వ్రాస్తారందలిపెద్దభావములు మీ ♦ వంటోరు వింటారు వి
న్యస్తంబైన ప్రపంచవర్తన కళా ♦ ఖ్యానంబు కైతారసం
సుస్తా చేస్తురు జోడుశాలువులు నా ♦ నా సత్క్రియార్థంబులున్
వస్తుల్ వాహనముల్ సువర్ణములు తాం ♦ బూలంబులెంతే సమ
ర్పిస్తారో కుసుమాంజలిన్ బొగడి పం ♦ పిస్తారొ విద్యాంసు లీ
శాస్తిన్ బోదురు మన్నుగొట్టుకొని మా ♦ శాస్తుర్లువేదాలతో
కుస్తీపట్టు పనేదిలేదు ప్రతి డొ ♦ క్కున్ చెప్పు కైత్వంబు లా
భిస్తే బాపనవోళ్ళబాస మననే ♦ బిచ్చంబ యున్నాళ్ళకున్
దోస్తీ వొచ్చెను తెల్గుబాస మనకున్ ♦ దొడ్లోనిదే యింక మా
దుస్తుల్ కోకలు చుట్టబెట్టి కడు సం ♦ తోషంబుతో తద్దికిన్
ముస్తాబున్ బొనరింతుమంచు కుకవుల్ ♦ మోరెత్తి భాషింతు రే
మిస్తేనేమి కవీ త్వదాశయము లి ♦ ప్డేపీట నాలించు నీ
నేస్తం బొక్కఁడు లేఁడు కాలము శత ♦ ఘ్నిన్ ప్రేల్చి తల్లేఖినిన్
నిస్తంద్రంబుగఁ ద్రిప్పనప్డె తెలియన్ ♦ జీరాడు మారాడఁగన్.





అ. చదువు మానవులను ♦ మొదలంట మార్చును
చదువుచేత నరులు ♦ చతురులగుదు
రందు పెద్దచదువు ♦ లఖిలార్థములు గూర్చు
చదువుతోటి వేరె ♦ సాటిగలదె.



గీ. ధనముకన్నను విద్యయే ♦ ఘనము గాన
విద్య గడియింపవలె నరుఁ ♦ డుద్యమించి
ధనము నశియించు విద్య ని ♦ ధనముగాదు
ఐహికాముష్మికమ్ముల ♦ కదియె త్రోవ.

# గీతము ౨

అనుమాన మేమిటి ♦ అపాటిదైతె
ఆదర్శమేమిటి ♦ అమాటకైతె
ఉపమానములు జను ♦ లూకొట్టుతార
పాతాలలోపెట్టి ♦ పాడుకొంటార
చినిచిన్న ఊళ్ళలో ♦ చెప్పుకొంటార
ఆ నిండుమనసులు ♦ ఆ నవ్వు మోము
లా ప్రేమహృదయాలు ♦ ఆ విశ్వరూపు
లా మహావిశ్వాస ♦ మా కళాకలన
మాత్మసమర్పణ ♦ మందు జూపించి
లేచిపోయిన మధు ♦ కాచపాత్రలను
చూచి వగచెదవే ♦ సొంపువాటిల్ల

కన్నీళ్ళు కాల్వలై ♦ కారజొచ్చినవి
కాననసీమల ♦ గడ్డిమొల్చినది
కసపిస త్రొక్కిపో ♦ గల్గుటేగాని
వానిరహస్య మె ♦ వ్వారికి తెలియు
వానిలో నగ్ని యె ♦ వ్వారికితెలియు
ఏడ్పుచే బద్ధలై ♦ హృదయమీనేల
రుధిరంబు పారించి ♦ రూఢిమై కటిక
నేలను మొలిపించె ♦ నే గాని విభుని
రాతిగుండెను రెండు ♦ వ్రక్కలొనర్ప
జాలదయ్యెను శక్తి ♦ చాలనేలేదు
అలపించిన భక్తి ♦ అంటనేలేదు
రాగాలధోరిణి ♦ రాలేదు ; పశుల

కాపరి పాడగా ♦ కాపాలిని విని
ఏమి నేర్చినదన్న ♦ లెవ రేమిచెప్ప
నేర్తు రానిజ మామె ♦ నేర్చునే కాని

ఎనసిన నెనరులో ♦ నే యున్నదంత
ఆనాడు చెప్పిన ♦ దీనాడు చూచి
శివజటాజూటాల ♦ శివమెక్కి గంగ
కరగినీరై యేళ్ళు ♦ గా మారిపోయె
కొండను బోర్లించి ♦ కూర్చుండి మురళి
మోమెత్తి విశ్వంబు ♦ ముందర నిలిపి
తాననేమాటలో ♦ తనలోనిపాట
వెన్నాడ చీకట్లు ♦ విచ్చిపోయినవి
ద్వారాలువిప్పి సౌం ♦ దర్యరేఖలను
మేఘాలపెట్టి మా ♦ మీద వర్షించి
నేత్రాలను విప్పి మా ♦ నిద్రమేల్కొల్పి
చూపించెనే గాని ♦ చూడలేదేమి
రూపించెనే గాని ♦ రూఢిలే దేమి
అపరంజ్యోతిలో ♦ ఆసూత్రనగరి
శూన్యాలయాలలో ♦ శోభిల్లువెలుఁగు
ఎవరుచూచారట ♦ కెవరువెళ్లారు

చెదలేటిగట్ల నం ♦ చలు పైడియిసుక
తిన్నెల చరియించు ♦ తీరువుచూచి
తాకట్లబడి జీవి ♦ తావధినున్న
భావదాస్యములోని ♦ బంధంబువదలు

మార్గంబు వీక్షించి ♦ మమతవెలార్చి
వచ్చిన దీ సము ♦ పాసనాబలము

ఇందేమిఫల మున్న ♦ దీదారి నెనసి
ఎందేగవలయునో ♦ ఏమి కానున్న
దో ఏమి చెప్పగా ♦ దోచ దెవ్వరికి
ఆలోచనలయందె ♦ అశనిపాతాలు
ఆలోకనలయందె ♦ అగ్నివర్షాలు
కలధౌతమయ సౌధ ♦ కలనంబునందు
మలయమారుత సుధా ♦ మార్గంబులందు
ఆనందమేమిటి ♦ యనురాగమేమి
టది యతీతము వీని ♦ కాయుషస్సులను
ఆసంధ్యలను మహా ♦ త్మ్యాల మధ్యాల
మనసుమళ్ళించి సం ♦ భవముబోర్లించి
భావాలలోపలే ♦ స్వర్గంబుగట్టి
చూచేటివారికే ♦ చోటుందిగాని
సంశయాలకు బోయి ♦ సాగేటివారి
కేమున్న దీ మరు ♦ భూమివాకిళ్ళ

స్రోతస్సు లెక్కడ ♦ సొగసెక్కడిచట
దాహమారేదారి ♦ తలపోయవలద
చీకట్ల నిర్జించి ♦ చేరగావలద
చిత్రచిత్రా లన్ని ♦ చెప్పగావలద
మనసులో మాటలు ♦ మనసులోనేవుండి
మంటలై చల్లారి ♦ మణగిపోయినవి.

—★—

# * జాతీయగీతము

సీ. చైనా యరేబియా ♦ సర్వదిగంత భా
రతదేశములు స్థావ ♦ రంబు మాకు
ఏధాత్రి యేయూరి ♦ కేగిన నిస్లాము
వీరశూరు లటన్న ♦ పేరు మాకు
వరఖడ్గములనీడ ♦ పెరిగినారము. చంద్ర
రేఖాధ్వజము తేజ ♦ రిల్లు మాకు
అవని తొల్తటి యాల ♦ యమున కర్చకులము
పరమేశ్వరుఁడు కాచు ♦ వాఁడు మాకు

గీ. చెడువృథాలాపముల భయ ♦ పడెడునట్టి
కాతరుల మెంతమాత్రంబు ♦ కాము మేము
కాలమా మమ్ము పలుసార్లు ♦ గాంచినావు
పెఱుకనేరవు ధరణి మా ♦ పేరు నూరు.

సీ. హూణజాతులకెల్ల ♦ ప్రాణంబు లసియాడ
మాజయధ్వానముల్ ♦ మలయునాడు
పాశ్చాత్యదేశముల్ ♦ భయమున ఘూర్ణిల్ల
మాశస్త్రములు గతి ♦ మాస్చునాడు
వైరివీరులు సైప ♦ నేరని మాసైన్య
వాహినీకుల మిల ♦ వలచునాడు
జిబ్రాల్టరాదిగా ♦ జితమహీధరముల
మా ధ్వజాంకము లూడి ♦ మసలునాడు

---

* ఎగ్బాల్‌కవి వ్రాసిన ముస్లిం జాతీయగీతమునకు అనువాదము.

గీ. ఒక్కఁ డీశ్వరుఁడను భక్తి ♦ యొలయు మాకు
ఘనతరేస్లాముపై ప్రేమ ♦ గలదు మాకు
కాలమా మమ్ము పలుసార్లు ♦ గాంచినావు
పెఱుకనేరవు ధరణి మా ♦ పేరునూరు.

సీ. స్వర్గసన్నిభమైన ♦ స్పైనుదేశమ ! నీకు
నా దినంబులు జ్ఞప్తి ♦ యందు గలవ
నీవనాంతపుదీవ ♦ తావుల మా కులా
యము లలంకారమై ♦ యలరుచుండె
పైగ్రీసు జాన్హవీ ♦ యుగ్రనదీతరం
గము లింక మాకీర్తి ♦ గానములను
పలుపుచున్నవి జరూ ♦ సలమానరక్షణ
కొఱకు మారక్తంబు ♦ వరదలట్లు
పాఱించినార మా ♦ యేరు తన్మాడుల
స్ఫురియించు పచ్చనె ♦ త్తురులఁ దడిసి

గీ. ఆరసూలునిపేరు మా ♦ యాత్మ తేజ
రిల్లునందాఁక చేటు వా ♦ టిల్లఁబోదు
కాలమా మమ్ము పలుసార్లు ♦ గాంచినావు
పెఱుక నేరవు ధరణి మా ♦ పేరు నూరు.

—★—

# శశి–నిశి*

మ. "బగదా" దన్న ప్రసిద్ధపట్టణము సొం ♦ పారున్ ధరిత్రీవధూ
టి గళాలంకృత రత్నహారనిభమై ♦ లీవిన్ యశోద్ధారుఁ డా
నగరంబుఁ బరిపాలనంబు సలుపున్ ♦ నానాప్రకారంబులన్
బొగడన్ గోవిదకోటి; మేటిమగఁడై ♦ భూరిప్రభావాఢ్యుఁడై.

ఉ. అతని కొక్క కూఁతురు మ ♦ హాసుగుణాన్విత పూతభద్ర సం
జాత యశస్సమావృత ని ♦ శా యన గల్గెను తండ్రి నామె సం
ప్రీతిని బాఠశాల నిడి ♦ విద్యల నేర్పుచునుండఁ దోడివా
రాతతశబ్దశాసనము లారఁ బఠింపుచు నుండి రెంతయున్.

మ. నిశికంటెన్ గడునల్లనై వెలయు నా ♦ నీరేజపత్రేక్షణన్
నిశియంచున్ ముదమార పేరిడిరి ని ♦ ర్నిద్రప్రభాభాసమా
స శతానీకసమానులైన పితరుల్ ♦ నైజాఖ్యమే మేటికాం
తి శిరోభూషణమైన మేల్ నగ పురం ♦ ధ్రీరత్నముల్ దాల్పగన్

చ. శశియను బాలకుం డమర ♦ సంగ్రహకోశము వల్లెవేయుచున్
నిశకు సమార్థనామముల ♦ నేర్చి పఠించుచుండ నా నిశా
శశిముఖి యాలకించి తన ♦ సంగతియే యని భ్రాంతయై తమో
వశమున రూక్షపుంగనులు ♦ వాల్పక చూచుచు వాని కిట్లనున్.

చ. నిశి యని మాటి మాటి కిటు ♦ నిర్భయవృత్తి పఠింతువేల యో
శశి నను రవ్వ చేయుటకు ♦ జాలినవాఁడవె నేను ధారుణీ
భృశునకుఁ బుత్రికన్ జెనఁటి ♦ పేదవు నీవు శఠుండ! నాదు కో
ప శిఖికి నగ్గమై వెతల ♦ పాలగుటేటికి మందబుద్ధివై.

---

* లైలామజ్ను గాథను ప్రబంధముగా వ్రాయుచు వినిచినది.

వ. అనిన నిశి—

క. నాపాఠము నేచదువుట
నాపని నాకితరమేల ♦ నాపై నీవున్
గోపించెద వపరాధము
జూపింపఁగవలదె రాజ ♦ సుతవైన సరే.

వ. అంత నిశి—

మ. అపరాధం బిఁక వేర కావలెనె యా ♦ హా ! యామినీయంచు నన్
గపటం బేర్పడ నుచ్చరించెదవు ధి ♦ క్కారంబుతోఁ జెల్లరే
నృపసూనల్ దగ నెల్లిదంబయితిమే ♦ యిస్సీ తృణప్రాయ జా
న పదావాసుని కింతపాటి విలు వై ♦ నం జెల్లదే మాయెడన్.

మ. అని కోపించిన యామినీలలన మౌ ♦ ఢ్యం బాత్మనూహించి యే
మనలే కాశశి బాష్పముల్ విడిచి కాం ♦ తా ! నీవు నాపాఠముల్
గొని వల్లించెడు నీడు వచ్చునపు డే ♦ గోడున్ విమర్శించి న
న్ననుమానించుట మానుకొందు విఁక వి ♦ ద్యన్నేనుజాలించెదన్

మ. అని పొత్తంబులు నేలమోది వికలుం ♦ డైయెంతోదుఃఖించుచున్
జనె ఘోరాటవి కీకటాళికి నిశా ♦ సంస్కార హృత్పద్మ సం
జనితాఖండవివేక మెల్లయెడలన్ ♦ సంధానమున్ జేయుచున్
దనలోఁ దాను నిశాస్వరూపమును సం ♦ దర్శించుచున్ మోహియై

ఉ. యామిని కాలవాహినిఁ బ్ర ♦ యాణము చేయుచునేర్చె పెక్కువి
ద్యామహితంబులైన కళ ♦ లంతట కోశము వల్లె వేయుచున్
యామినిశబ్దముల్ జదువు ♦ నప్పుడు బాల్యమునాటమాటి యెం
తే మది జ్ఞప్తికిన్ దగిలి ♦ యేఁడి విధుండని పృచ్ఛ సేయఁగన్.

చ. చదువుట మాని కానలకు ♦ సాగె భయంపడి నీదుకోప మా
పదలకు దావలంబనుచు ♦ బాలవిధుండు నిశావధూటి నీ
వది యిసుమంతయున్ దెలియ ♦ వైతివి పేదలపాటు భాగ్యసం
పద గలవా తెరుంగ రతి ♦ బాధలఁ గూలి నశించిపోయినన్.

మ. అనఁ జింతించి నిశావధూటి తన వి ♦ ద్యారాజ్యగర్వంబు గ
ప్పినకంఠ్లన్ నిజతత్త్వనిర్వచన ని ♦ ర్వృత్తిన్ విలోకింపకా
దని శైవాలనిరుద్ధనీరము లవి ♦ ద్యాభ్రాంతి వర్జించున
ట్లనుమానంబుల వక్రమార్గముల ద ♦ హ్యంబౌదు రీమానవుల్.

మ. అని చింతించి గతంబుకై వగచి నా ♦ యజ్ఞానమున్జేసి వి
ద్యను మాన్పించితి నాశశిన్ వినుత ధూ ♦ ర్తాశిన్ సుధారాశినా
శిని నానాగమవాసి భాసురకళా ♦ శ్రీసంతతోల్లాసునిన్ ;
నను నేనే సమయించుకొంటినని సం ♦ తాపంబుచే మూర్ఛిలెన్.





మట్టిలో కల్పినావు నా ♦ మాట యెత్తి
బోవు నాచితి పేర్చి యీ ♦ త్రోవవెంట
నెచట బోయెదవోయి యీ ♦ యింధనములు
కాల్చి బూడిదచేసి యీ ♦ గాలి కెగుర
వేసి మరి పొమ్ము నీవెంట ♦ విసరునట్టి
అపరాగారుణాహతి ♦ నైన నీదు
వెంట వచ్చెదనోయి న ♦ న్నొంటిచేసి
విడిచిపోవకు నీధాన ♦ విపినసీమ —

# నైరాశ్యము

కురిసి మేఘాలు మెఱపులు ♦ మెఱిసి పోయె
ఏళ్లు తెగఁబాఱి బీళ్లుగా ♦ నెండిపోయె
కాని, కన్నీళ్లకాల్వలు ♦ కట్టలేదు
ఆమె తలఁపను దారి ర ♦ వ్వంతయైన
తరగలే దింక యోజనాం ♦ తరవిశీర్ణ
నిమ్నసోపానపంక్తుల ♦ నిలిచిపోయె
ఊర్ధ్వలోకాల యాస నీ ♦ కున్నదో ప
రాత్పరా పరాగమన మి ♦ థ్యాపదల నిషిద్ధ
జీవనము పొంత నేడ్చెదో ♦ చెప్పవేమి ?
తావళము త్రిప్పు తపసిచం ♦ దమున నీవు
బాష్పముల రాల్చుచున్నావు ♦ పగలురేలు
క్రాలు హరి యాతనికి, ♦ ప్రియురాలు నీకు
దొరకెద రనెడుమాట ♦ లేదోయి – లేదు
ఎండమావుల నీరును ♦ ఎండ పశుల
పాలుఁ ద్రావఁబోకుము కొఱ ♦ మాలి ఊహ
రథము లేగెడు బయళులఁ ♦ బ్రాయికముగఁ
బోయి బోరలఁ బడి లేవఁ ♦ బోవు, కాల
వాహినులసుళ్ల నిరికి వి ♦ హ్వలములైన
ప్రేమపాతాల నెమరులు ♦ వేసి వేసి
వగచి నిట్టూర్పు విడిచి పో ♦ వలదు ; వెలుఁగు
చీఁకటులమధ్య వాపోయి ♦ చేయుదేమి ?
చినుకులటు రాలి పురుగు చా ♦ డ్పునను ప్రాకి
లేళ్లవలెఁ బరువెత్తుచు ♦ రాళ్లవలెను
నిద్రపోయెదవోయి ! ♦ యుపద్రవముల

దాఁటి చుక్కల కెగసి నీ ♦ పాటపాడి
లోకమును ద్రిప్పకొనుము నీ ♦ లోఁ బ్రపంచ
మున్నదనుమాట మఱవకో ♦ యన్న ! యెన్ని
రంగముల దాఁటినావొ ప్ర ♦ సంగవశము
చేత ; నైనను తెలిసి నీ ♦ చిత్తమందు
ఆమె మొదలంట తుడిచి వె ♦ న్నాడి పోయి
పూడ్చియేడ్చిన నీట నీ ♦ పాలఁతిమేను
మొలిచి రేకెత్తు టెఱిఁగి ఆ ♦ పూవు నీది
గాఁ దల ధరింపవోయి నీ ♦ కనుల నద్ది.
ఎడ్ల నడిపించునట్టులే ♦ యేళ్లు తిరుగు
పంటపొలములు మనచేతి ♦ నంటలేదు
పరగ ముక్కారుపంటలు ♦ పండువారి
మొగములును పండు ఆశా ప్ర ♦ మోదములను
కాంత ! నీకొంగు బంగారు ♦ గాఁగ నన్ను
కట్టుకొమ్మని అడిగిన ♦ కార్య మేమి ?
ఆ మహాప్రేమ మనసులో ♦ నలరవలయు
సహజగతులందె గలదు నీ ♦ సంతసంబు
చెడ్డ చేసెడువారలు ♦ చేయుచుందురి
వారిహృదయాలలోన లో ♦ పములునుండు
ఆత్మవత్సర్వభూతాని ♦ యనెడుమాట
మంచికే కాని చెడ్డకు ♦ మలపఁజనదు
ఏనికైనను కడుచింత ♦ నూనరాదు
అట్లు కావలసియె అది ♦ యైన దనుకొ
నుటయె లెస్స జగమ్మముం ♦ గటను గొప్ప
చిత్రఫలకంబు మానవ ♦ జీవితంబు.

# కవికలనములు

చ. కవుల మటంచు లోకమున ♦ గాకులరీతిఁ గళావిలాసముల్
ప్రవిమల సుస్వరాద్యఖిల ♦ రాగము లేరివి కావు కావటం
చవి యివి యల్లి యార్చుచుఁ గ ♦ టా కొఱమాలుటె కానిమమ్ము నే
యవనివిభుండు సత్కవుల ♦ టంచుఁ బఠించి సముద్ధరించెడున్.

ఉ. కావ్యములున్ ప్రబంధములు ♦ కల్పితదివ్యచరిత్ర లెన్నొ మం
తవ్యములట్లు మాకలము ♦ దారత వ్రాసి నిరర్థవృత్తికిన్
భావ్యముగాఁగ దుఃఖమున ♦ నల్లనియశ్రులు రాల్చుచున్న క
ర్తవ్యము దాచె నీప్రకృతి ♦ రాజన మిచ్చెడు రాజు లేమిచేన్.

మ. జలజాతప్రభవాంత మెప్పుడును ని ♦ స్సారంబుగాఁ బోదు చ
క్షులకున్ జ్ఞాననవాంజనంబిడి కనన్ ♦ సుఖ్యాతవంశంబునన్
జలజాక్షుండని పేరుమోసి మనుపో ♦ నానొప్పు ధీశాలి భూ
వలయాధీశ్వరుఁ డాంధ్రసత్కవులనున్ ♦ బాలించుచున్ వెల్గినన్

ఉ. గంటకు నూరుపద్యములె ♦ కావు సహస్రము చెప్పవచ్చు ము
క్కంటిని ద్రిప్పవచ్చు నది ♦ గర్వముగాదు రసంబు వ్యంగ్యమై
వింటను వీడుబాణముల ♦ వేగమునన్ తులఁదూగు పద్యముల్
గంటము మోపి వ్రాయుటకుఁ ♦ గల్గినవాఁడె కవీశ్వరుం డనన్.

ఉ. అట్టి కవీశ్వరుం బిలిచి ♦ యాదర ముంచి కృపాబ్ధినించి చే
పట్టి త్వదీయ వంశ నృప ♦ వర్యుల పూర్వచరిత్ర లున్న వు
న్నట్టుల వ్రాయజేసి దిశ ♦ లందు యశంబును గూర్పరాదె నీ
యట్టి మహాత్ముఁ డీపనికి ♦ నాయతుడైనను సాగకుండునే.

# ధనము

ఎనుబదినాల్గులక్షల మ ♦ హీ మహితంబగు జీవరాశిలో
ఘనుఁ డనిపించు మానవుని ♦ గౌరవ మంత స్వతంత్రతన్ స్వశ
క్తిని సముదారభావమున ♦ కేంద్రమునై విలసిల్లుచున్నదా
ధనమె ధనంబు తక్కినవి ♦ దంధనముల్ పదవెన్ని జెప్పినన్
మనుజునకెన్ని భాగ్యములు ♦ మంజులవిద్యలు ప్రాజ్యరాజ్యముల్
దనరిఁనగాని వ్యర్థము; స్వ ♦ తంత్రతయున్ స్వకులాభిమానమున్
జననియు జన్మభూమియును ♦ స్వర్గముకన్న గరీయమైన వం
చును నెఱిఁగున్న వానిదె వి ♦ శుద్ధ మహామహితంబునైన జీ
వనము ; స్వతంత్రవర్తనము ♦ పావనమైన స్వగౌరవంబునౌ
ధనము ; ధనంబు దంధనము ♦ ధర్మమెనీకుస్వరాజ్యమన్నిటన్
ధనములు వచ్చు పోవు జల ♦ దంబులకైపడి నాత్మగౌరవం
బును స్వకులాభిమానమును ♦ భూషితమైన స్వతంత్రతాప్తియే
ధనము నిషిద్ధ జీవన వి ♦ ధంబున మానవుఁ డెన్నఁడైన నీ
ధనమును గోలుపోవలదు ♦ తద్ధనసాధనమే స్వరాజ్యమున్.

— ✦ —

# శ్రీమౌలానామహమ్మదలీమహర్షినిర్యాణము

శా. ఏడీ యాగుణరాసి, భాసురకళా ♦ నేకార్థనిర్ణేత నేఁ
డేడీ భారతదాస్యశృంఖలము నెం ♦ తే త్రెంపనూహించి పో
రాడన్ యూరపు బ్రహ్మరాక్షసికి ప్రా ♦ ణార్థంబులన్ వీడువాఁ
డేడీ పోయెనె యా మహమ్మదలి లే ♦ నేలేఁడు విశ్వావళిన్.

ఉ. భారతదేశదాస్యమును ♦ బాపగఁ బ్రాణధనంబు లామహా
క్రూరపిశాచరాజ్యమున ♦ కున్ బలిగానిడి, నేడు స్వర్ణ దీ
నారములన్ ప్రశాంత కరు ♦ ణామయవృష్టిని దింపి, దేశ కే
దారములెత్తగా మహమ ♦ దాలి కటా! దివికేగె నర్థియై.

— ★ —

# శ్రీ పేరి పేరయ్యశాస్త్రిగారు

ఉ. శ్రీకరుఁడాదిదేవుఁడు న ♦ శేషజగంబులు నొక్కరీతి న
స్తోకదయారసంబునను ♦ జూచుచుగాచెడు నీశ్వరుండు సు
శ్లోకసుఖాప్తిసంపదల ♦ శోభిలసేయుత పేరివంశ నీ
రాకరచంద్రుడై దిశల ♦ రాజిలు పేరయశాస్త్రి కెప్పుడున్.

చ. అనఘు డఖండపండితు డ ♦ వార్యసుతుండవు పెక్కుశాస్త్రవ
గొని పఠియించి శిష్యులకు ♦ కోరినవారికి వేడ్కమీర చె
ప్పిన మహనీయమూర్తివి ప ♦ విత్ర వచోవిభవానువర్తి వీ
వనయు హసన్ముఖుండవు మ ♦ హాత్మక పేరయశాస్త్రి ధీమణీ

ఉ. ఈవు పిఠాపురంబునకు ♦ నెప్పుడు వచ్చియు కాలుమోపి ో
న్నావొ యదే ముహూర్తమున ♦ నాలుగుమోములవానిరాణి
ణావరపాణి వాణి కరు ♦ ణామతి వచ్చి వసించె నట్టి వి
ద్యావిదుడీవు నిన్నెఱుగ ♦ రజ్ఞులు పేరయశాస్త్రి సత్తమా.

సీ. చదివించినాడవు ♦ శతసహస్రశ్లోక
గ్రంథార్థములు శిష్య ♦ గణములకును
వినిపించినాడవు ♦ విమల విజ్ఞాన ప్ర
పంచ సంగ్రహ మార్య ♦ వర్యులకును
బోధించినాడవు ♦ పుణ్యలక్షణ లక్షి
తాకారగరిమ మ ♦ హాత్ములకును
సాధించినాడవు ♦ సకల వాఙ్మయసార
రసవదలంకార ♦ రాజములను

తే. నీకు తెలియని విద్యలు ♦ నీకు రాని
కళలు లేవన్నమాట ని ♦ క్కంబె కాని
యొరులెఱుంగరు నీదు వై ♦ ఖరులవరుస
సకలగుణధుర్య పేరయ ♦ శాస్త్రివర్య.

తే. వాసిగ పిఠాపురోన్నత ♦ పాఠశాల
యందు పదునాల్గు శర పరి ♦ యంతమైన
కాలముండియు ఫలమును ♦ గాంచలేక
వెడలితని విని కన్నీళ్లు ♦ విడిచినాము.

తే. పూలనుండియు వాసన ♦ పోయినట్లు
వనము విడిచియు పక్షులు ♦ జనినరీతి
ఆవుపాడుగుల పాలారి ♦ పోవునట్లు
నీవు పాఠశాలను వీడి ♦ నావు గాదె.

ఉ. ఎందఱు పండితోత్తముల ♦ కింపెసలారగ పీఠికాపురం
బందు బుభుక్ష తీరెను మ ♦ హాత్ములు సాధులు సత్కవీశ్వరుల్
సుందరు లార్యబ్రాహ్మకులు ♦ సొచ్చి సుఖంబులదేలి హాయిగా
నుందురు శాస్త్రివర్య తమ ♦ రుండుట కిం దిరుకయ్యె నెంతయున్.

మ. ధరవిద్వాంసులు పూజ్యు లన్నియెడలన్ ♦ దర్కింప నీవెందు నే
పురమం దుండిన లోటులేదు మఱి మా ♦ పుణ్యంబు నేడింతలో
కొఱవౌటన్ నిను వీడుకొంటిమి సుమీ ♦ కోటీరమాణిక్యమున్
విరతిన్ భూపతి వీడుకొన్న పగిదిన్ ♦ పేరయ్యశాస్త్రీశ్వరా!

గీ. మణులనైన సువర్ణ భూ ♦ షణములైన
గని పరీక్షించువారలు ♦ గలరుగాని
మనుజకోటిని కుజన స ♦ జ్జనులపోల్చు
వారు మిక్కలి తక్కువ ♦ వసుధయందు.

ఉ. ఇచ్చోటుబాసి శిష్యులకు ♦ నెంతయు ఖేదముగూర్చియేగు మీ
రచ్చట నున్న మమ్ము మఱి ♦ యీపురి, నున్నతపాఠశాలయున్
ముచ్చటదీరగా మరువ ♦ బోరని స్వాగత మిచ్చుచుంటిమో
సచ్చరితాంక శాంతగుణ ♦ సాగర పేరయశాస్త్రి సత్తమా.

కం. మీకడ నైషధకావ్యము
ప్రాకటముగ నభ్యసించి ♦ బడసితి విద్యన్
శ్రీకర పేరయశాస్త్రి సు
ధాకర మా స్వాగతంబు ♦ దగ గైకొనుమా.



# లైలా విలాపము

రాళ్ళు రువ్వకుఁ డతఁడు నా ♦ ప్రాణవిభుఁడు
వెఱ్ఱివాఁ డని మీరేమి ♦ వెరువవలదు
పిచ్చివాఁ డని మీరేమి ♦ పిలువవలదు
పేదవాఁడని మీరేమి ♦ పెట్టవలదు
యాచకుం డని మీరేమి ♦ యాడవలదు
వెలఁది విశ్వంబుగా మార్చి ♦ వెలఁదియందు
విశ్వమునుఁ బెట్టి తనవైపు ♦ వికచ మంద
హాసములు సేయు సౌందర్య ♦ వాసరముల
కలిసి నవ్వెడు నా చెలి ♦ కాఁ డితండు.



# ఈశ్వరుఁడు

సీ. అవని సృజియించినట్టి వి ♦ శ్వాత్మకుండు
మానవుల కన్ని యెడల తో ♦ డ్పడెడువాఁడు
ఊహలకు నందనట్టి మ ♦ హోన్నతుండు
ఈశ్వరుఁడు మాకు నెప్పుడు ♦ హితము గూర్చు.

తే. గీ. పంచభూతంబు లెవ్వాని ♦ వాసగృహము
పరగ నక్షత్రలోక మె ♦ వ్వాని పథము
భానుచంద్రు లెవ్వనియాజ్ఞ ♦ బాయకుంద్రు
అతని నీశ్వరు సేవింతు ♦ ననవరతము.

తే. గీ. రాత్రియందున నెలవెల్గు ♦ గ్రాలజేసి
పగటి యందున భానుని ♦ పంపి యెల్ల
జంతు జాలంబులను గాచు ♦ సర్వమయుఁడు
నీశ్వరుఁడు మాకు దోడ్పడు ♦ విశ్వమందు.

తే. గీ. ఆకు పచ్చని కొమ్మకు ♦ నందమైన
నెట్టని సుమంబు కల్పించు ♦ నెమ్మెకాఁడు
శుక్తిగర్భాన ముత్యాలు ♦ జొనుపు నట్టి
ఈశ్వరుండిచ్చు మాకు న ♦ భీష్టసిద్ధి.

—★—

# పంచములు

సీ. ఆర్యు లార్యావర్త ♦ మందు పాదముమోపి
క్ష్వారదశ్యుల కల్పు ♦ కొనఁగలేదె
బౌద్ధులు ధరనెల్ల ♦ వ్యాపించి మతదీక్ష
పాశ్చాత్యులకునిచ్చి ♦ పరగలేదె
రామానుజుఁడు ప్రేమ ♦ రాలగ గడజాతి
శ్వపచులకు మత మొ ♦ సంగలేదె
షణ్మతోద్ధారుఁడౌ ♦ శంకరగురుఁడు చం
డాలి భోజనమును ♦ గ్రోలలేదె

తే. ఎందరో మహనీయు లీ ♦ చందమునను
జాతి నవ్వలఁద్రోసి స ♦ న్నీతిదలఁచి
విశ్వ మేకాత్మకంబని ♦ వెలసినారు
ఇంక మనమేల పంచము ♦ నేలరాదు ?

ఉ. పంచములంచు వారి వెలి ♦ వేయగ నేమి కతంబు వారు ప్రా
పంచిక మర్త్యజాతులకు ♦ బాహ్యులె! యేహ్యులె! వారినెల్ల సృ
ష్టించిన దైవ మింకొకఁడె ♦ చెల్లరె ! మానవకోటి నిట్లు గ
ర్హించుటకన్న పాపమిక ♦ నెయ్యది యుండు మనస్సెసాక్షి మీ
రించుక వంచి శీర్షమును ♦ హృన్ముకురంబున జూడగల్గినన్.

—✦—

# ఆంధ్రదేశపు మహమ్మదీయుల స్థితి

ఉ. భారతవర్షమా ! ధరణి ♦ భారతవీరులఁ గన్న తల్లి వి
స్ఫారనదీనదార్భాట వి ♦ భాసిని వింధ్య హిమాలయ ప్రభా
ధారిణి సర్వభాగ్యచయ ♦ దాయిని మాకొక కల్పవృక్షమై
కోరినవిచ్చి నీవపుడె ♦ కొంటివి యిచ్చిన సొత్తులన్నియున్.

శా. ఈరాన్‌దేశ నివాసులో యవనులో ♦ యేరీతి నిన్ జేరిరో
వారిన్ నీ గృహమందు విందిడివసిం ♦ పన్‌జేసిస్వాతంత్ర్యముల్
దారంబోసి మయూర పీఠముల లీ ♦ లం జేర్చి సౌభాగ్య స
ర్వారంభంబు లొసంగినా వపుడు మా ♦ కత్యంతమో యిండియా!

మ. పరిపూర్ణంబగు విద్యయుం గలిగి భూ ♦ భాగంబు బాలించి యా
ధరణిన్ గోటలుపేటలాదిగల సౌం ♦ దర్యంబు నెక్కొల్పి బం
ధుర సత్కీర్తి గడించి పూర్వులు మహో ♦ ద్యోగంబులంజేసిపో
యిరి యానాటి వసంతకాలమిక మా ♦ కీనాఁడు రాఁజాలునే!

మ. అధికారంబదియస్తమించెఁ, గల భా ♦ గ్యంబెల్ల సున్నాయె, నీ
పృథివీరాజ్యము పూజ్యమాయె, జదువున్ ♦ వీక్షింపఁగాలేదు హా
విధి చెద్దంబులు మాన్యపాలకుల యే ♦ వీథిన్ గరీంద్రాళిపై
నధిరోహించెనొ యందెకాల్పడక బో ♦ నయ్యెన్‌తదా దీనతన్.

చ. పుడమియు రాజ్యమున్ విజయ ♦ భూతిశయంబులొసంగవేడ్కతో
గడుపునబెట్టి పెంచితివి ♦ కాని మమున్ దుదకిట్లువీడి యా-
యిడుమల బెట్టెదంచెరుగ ♦ మింతయు హైందవమాత ధాత్రి నీ
తడవు దలంపగా సవతి ♦ తల్లివి మాకిక ముందు నాళ్ళకున్.

—*—

శా. యోషారత్నము లందఱిం బలెను మా ♦ యోషల్ ధనాకృష్టికై
గోషావీడి ప్రయత్నముల్ సలుప సం ♦ కోచింత్రుమాయందొగిన్
భూషింపందగు విద్యలేదరిగి యే ♦ భూపాలునే గొల్వ యీ
వేషంబుల్ మఱి సాగనేరవిటుపై ♦ భిక్షార్థమేగన్ దగున్.

కం. హుక్కా పీల్చుచు నింటను
మక్కావార్తలను వినుచు ♦ మగువల వలలోఁ
జిక్కి మదోన్మత్తతో
లెక్కింపమి భాగ్యలక్ష్మి ♦ లీలన్ బోయెన్,

గీ. హిందూమాతృక నీతప్పు ♦ కింతలేదు
శాత ఖడ్గంబు రణభేరి ♦ కేతువవని
రాజ్య మధికార భాగ్య గౌ ♦ రవము ప్రజల
యోగ్యతా యోగ్యతలఁబట్టి ♦ యొసఁగెదీవు.

శా. ఏవాక్కుల్ మును మిమ్ములం బొగడగా ♦ యే లేఖినుల్ వ్రాసెనో
యా వాక్కుల్ నిరసింప నిప్పుడకటా ♦ యాలేఖినుల్ వ్రాయుము
న్నే వార్లిచ్చిన మాన్యముల్ తిని ముదం ♦ బేపార జీవింతురో
ఆ వారిన్ ఖలు లందురేలయని మీ ♦ రాలోచనల్ మానుడీ.

మ. చతురంభోధి పరీతభూతలము మీ ♦ సర్వాధిపత్యంబు లు
న్నతరీతుల్ రిపులాజి గైకొనిన నా ♦ నాదేశరాజన్య పూ
జితమై యేరిపు చేతులంబడక సత్ ♦ క్షేమంబులంగూర్చు సం
స్తుతమౌ విద్యను గోలుపోయి రిది మీ ♦ దోషంబు గాకుండునే !

సీ. ఉద్యోగముల జేయ ♦ నూహించి ప్రజలలో
మర్యాద గడియించి ♦ మనగ లేరు
అస్థానముల కేగి ♦ యమల విద్యాప్రౌఢి
ప్రకటించి కానుకల్ ♦ పడయలేరు

అంగడులకుఁ బోయ ♦ యడ్డిగ కూలికి
బరువు మోయుటకైన ♦ పనికిరారు
కానలలో బోయి ♦ కష్టంబులకు నోర్చి
కడుపుల కఱ్ఱతో ♦ గాయలేరు

గీ. చదువ కీరీతి చెడినారు ♦ చదువుకున్న
పలువిధంబులఁ గడియించి ♦ బ్రతుకగలరు
కాన యికనైన మీదు సం ♦ తానములకు
తెరవు జూపుడు జీవించు ♦ కొఱకు మీరు.

శా. ఏదీపంబులు మేరు భూధరముదా ♦ కీ జాలెనో వెల్గు నే
డా దీపంబులె యారిపోయినవి క ♦ ట్టా కొన్ని యున్నన్ నిరా
మోదంబొప్పగ మాయజూచెడి నదే ♦ పూరించి తైలంబు లే
దే దానిన్ మఱిదాపనేల యవె మా ♦ యిస్లాం సభాదీపముల్.

కం. ఏపుర వీధులలో మా
భూపతు లరుదెంచు ధ్వనులు ♦ పూరించిరొ నేఁ
డా పురవీధులలో బి
క్షా పాత్రములెత్తు ధ్వనులె ♦ గానగనయ్యెన్.

గీ. దీనజనులార ! మహమ్మ ♦ దీయులార
ధరణి మీ వినాశము సో ♦ మరితనంబు
విద్యలేమియె సుండు స ♦ ద్విద్యయున్న
రాజ్యమున్నట్లు మీ రల ♦ రారఁ గలరు.

గీ. ఇప్పుడైనను మనము స ♦ మిద్ధవిద్య
చదువు కొన్ననుఁ బూర్వ తే ♦ జస్స్వరూప
గౌరవము వచ్చుఁ; గులమెల్ల ♦ గడనకెక్కు
లేనిచో నధోగతి రాక ♦ మానదింక.

—★—

# బాగ్దాదు మధువీథి

(కాపాలికుని దృశ్యము)

అచికొంటిని వలపు ముత్యాలసరులఁ
గొల్లగొట్టితి ప్రేమ నిగూఢసీమ
దోఁచుకొంటిని విరహకాణాచిఁజూచి
సంగ్రహించితి రాగరసంబు దంబు
పొలుగూడితి ప్రణయరత్నాల గనుల
నింక నస్తేయమేది నాకేటి సిగ్గు
ఇంక వ్రతభీతియేది నాకేటి యెగ్గు ?

మేఘములఁ దొంగిచూచెడు మెఱుపసిఁడి
కుసుమసతు లిచ్చు పుప్పొడి కుంకుమంబు
కులుకు బేడిసమీల క్రొందళుకు వెండి
శర్వరీకన్య తలమీఁది చంద్రవంక
నెచ్చెలీ ! నీవని యెఱింగి నిలిచి నిలిచి
దోఁచుకొనిపోయి దాఁచుకోఁ జూచినాఁడ
ఇంక నస్తేయమేది నాకేటి సిగ్గు
ఇంక వ్రతభీతి యేది నాకేటి యెగ్గు ?

ప్రకృతి జవరాలి కేదార రాగరసము
రిక్కగములంటి రాచు గోరంట కెంపు
కలువ వగకాని తేటవెన్నెలల సుధలు
అబ్జసన్నిభ విహ్వ లైణాంబకములు

నెచ్చెలీ ! నీవని యెత్తింగి నెమకి నెమకి
దోఁచుకొనిపోయి దాఁచుకోఁ జూచినాను
ఇంక వ్రతభీతియేడ నాకేటి సిగ్గు
ఇంక నస్తేయమేది నాకేటి యెగ్గు ?

ఆహా! నాట్యాంగనలు నృత్యము సేయుచు, పాటలు పాడుచున్నారు.
ఆహా! ధన్యము. ధన్యము. నే నిప్పుడొక నటుఁడను.

చేసితి జన్నముల్ దపముఁ జేసితి జీవరహస్య మేమిటో
యీసరి కక్కటా ! తెలియ దింతయు వ్యర్థము బ్రహ్మవిద్య సం
న్యాసమొసంగు ఘోరవిషనాగము గావున వీడినాఁడ నా
యాసవమున్ మృగాక్షియధరాసవమున్ నన్నుఁదేర్చు నెంతయున్.

(శ్రుతి నభినయించి) ఆఁగు మాఁగుము శైలూషాధమా ! దోషీ ! దోష దూషితపరాయణా ! జగము మిథ్యగాదు మనముమిథ్య మనభావములు మిథ్య. అతీంద్రియములైన స్వర్గనరకంబులు మిథ్య పాపపుణ్యములు మిథ్య. ఓమతాంతర దురంత దుర్వాదీ ! నీ వ్యాసము లింకఁగట్టి పెట్టుము. ఇదిగో నీ నోటికి తాళము వేయుచున్నాను. చూడు మింక నీ వాకల్పాంతముదాఁక లేవఁజాలవు.

మధువె యమృతంబు శైలూషి మంజువదన
లెల్ల దేవకన్యలు గానమే రసంబు
తంత్రినాదమె తేజంబు తనమనోజ్ఞ
వనితగలచోటె కైలాసపట్టణంబు.
వసుధ కిదె ప్రేమ నేర్పెడు పాఠశాల
కవుల కాణాచి గాయక కల్పతరువు
సోమరస మమ్ము సంతలో భామలుండు
కోన బ్రహ్మచారుల కొల్లు కూట మిదియు.

ఇందులో నేనిప్ప డొకఁడను. అహా! ఏమి నాయదృష్టము!

ముంగురు లుంగరాలు నెలఁబోలు మొగంబును చేరెఁడేసి క
న్నుంగవ బారెఁడేసి సుమనోజ్ఞకచంబులు పైటచాటునన్
తొంగిలిచూచు చన్గవలు తొట్రిలు గాజుల నిక్వణంబుతో
నంగజ రాజ్యలక్ష్మివలె యంగన వచ్చెను కౌఁగిలింపఁగన్.

(మెఱపుమెఱసిన ట్లొకసుందరి ముందఱకు వచ్చి ప్రసన్న యగును)

అనళినీదళాయతములైన కనుంగవ మేనితావి యా
జాను విలంబికేశములు చారుపయోధరముల్ మనోహరం
బైన తనూవిలాసము బయల్పడ గాజులు గజ్జెలందెలున్
వీణియఁబోలె మ్రోయ నలివేణి యినే చనుదెంచె ముద్దిడన్.

నిగనిగలాడు నీతనువు నీకనుదమ్ములు నీయొయారమున్
సొగసగు నీదుఠీవి కడు సొంపులునింపు పయోరుహంబులున్
నగు మొగమున్ విలాసము ఘనాఘన సన్నిభ కుంతలంబులున్
మగువల మేలిబంతివని మాటికిఁ జెప్పక చెప్ప నెచ్చెలీ!

గాలములట్లు గ్రాలి తమకంబున నెందరి మానసంబులన్
గాలిచి కారుచీఁకటుల కైవడి నీకురు లొప్పుచున్న వో
బాలకురంగలోచన! భవత్పరిపుల్లముఖాబ్జ మెందఱిన్
దేలిచి నవ్వువెన్నెలలఁ దీర్చుచు నున్నదొ చెప్పు మంగనా!

కారు మొయిళుల చిమ్మచీఁకటులఁ బోలు
నీదు కురు లంధకారంబు నింపుచుండ
నీ మనోహరవదనంబు నిండు చంద్ర
బింబమును బోలె వెలిఁగించు విశ్వమెల్ల.

(మోకాళ్లపైఁ గూర్చుండి)

ప్రియుని యసువులు నీ వనవీధి వీచు
వాయువులఁ బోలుటకునైనఁ బనికిరావె
ప్రియుని ప్రేమాగ్ని నీ యింట వెలుఁగు దీప
పంక్తులకుఁ బోలుటకునైనఁ బనికిరాదె.

నివసింతునా నట న్నిరేజనయన వ
క్రాలకమ్ముల నీడఁ గాంచి కాంచి
వగతునా వగలాఁడి బాలమృగీ దృగం
చల విలాసంబులఁ దలఁచి తలఁచి
నిల్పుదునా ప్రాణి నెలఁత నెమ్మోము సుం
దరహాసచంద్రిక లరసి యరసి
వీక్షింతునా ప్రేమవెలఁది వాగమృత వా
హినులందు రసమనై యేఁగి యేఁగి

పాటపాడెదనా నాతి ప్రణయగీతి
తో సుధాధారలను దొప్పఁ దోఁగి తోఁగి
మోహవార్ధిని వేసారి మునిఁగి మునిఁగి
కరగిపోయెద నా నాతికొఱకు నేడ్చి.

చుట్టలుగఁజుట్టి యురులట్లు సోలుచున్న
ముంగురుల నాదు హృదయ విహంగ మట్టె
చిక్కువడి వియోగాబ్ధివీచికలఁ దోఁగి
యశ్రువుల రాల్చుచున్న న న్నరయ వేమి ?

కురు లురులలీల ననుఁ జుట్టుకొనియె నేను
వెఱ్ఱినై పోయితిని మోహవీచికలను

దొప్పఁదోగియు నాదుచేదోయి కతివ
నీవె సంకెళ్లువేయు మింకేమి వలదు.

ప్రణయినీ ! నీప్రేమవార్ధి వీచికలందు
సొక్కి సోలుచునున్నఁ జూడ వేమి
ప్రేయసీ ! నీరాగవీథిలోఁ దెగి రక్త
సిక్తమై యుంత వీక్షింప వేమి
నెచ్చెలీ ! నీ మోహనివహ దావాగ్ని ద
హించివేసినను చింతించ వేమి
మానినీ ! నీవచో మాధుర్యవాహిని
కసువు లర్పించిన నరయ వేమి

సంతసము నమ్మి దుఃఖమ్ము సంతలోనఁ
గొంటి వెతఁగంటి వేడిసకంటి ! నిన్ను
నుల్లమను నింటిలో దాఁచుకొంటి దాని
తెఱచి కనుఁగొమ్ము నీదు సుందరపటమ్ము.

వెదడలై స్వచ్ఛమైన నీ బెళుకు కనులు
కులుకుజవ్వన మొయ్యార మొలుకు సుధలఁ
జిలుకు పలుకులు రత్నాలు, తళుకు లీను
చిన్ని పొన్నారి నన్నేల జేరినావు ?

విఱుపుచూపులు నగుమోము కురులవిరులు
నడుము సన్నంబు కుచభార మడుగరాని
హొయలు కంకణక్వణములు నొలయునట్టి
సానదీర్చిన జంత్రపాంచాలి కీవు.

సొగసుకన్నులు జిగిబిగువైన యురము
మొగలిపువ్వు వన్నె తెగడు మేను
భోగవిలసనంబు రాగాను రాగంబుఁ
బోలు నీవు వలపుమూట గావె.

ముంగురులసొరు చారుకురంగలోల
లోచనంబులఁ బాఱున లోక మధుర
రాగములతీరు మరుని సారంగధరుని
మీఱి సొంపారు చిన్ని పొన్నారి నీకు;

తేనెలతేటలై పలుకు తియ్యని ముద్దులమూటగట్టు చం
ద్రానన ! చారు భీత హరిణాయతలోచన ! పద్మగంధి ! నీ
పీనపయోధరాలపయి వేసిన పైఁట సడల్చియున్న నీ
జాణతనంబు నే మఱవఁజాల యుగంబులు నేండ్లు పోయినన్.

వలపులవలంతి మరుని ప్రాంజలులబంతి
ఇంతి రత్నాలదొంతి చేమంతి కుసుమ
కాంతులీను నితాంత శృంగారమైన
మేను దొలుఁకాడ మేఘాలలోన మెఱపు
మెఱసినట్టుల ముత్యాలు కురిసినటుల
స్వర్గతేజంబు భువి దిగి వచ్చినటుల
భరతరాజ్య మహాలక్ష్మి వచ్చినట్టుల
వచ్చి మాటాడవేమి నాపాప మబల !

(ఆమె పువ్వులు గురియును)

కా ;—ధన్యోஉస్మి.

చెలి :—

శశివి నీవైన నే నొక నిశిని గానొ
వాక్య మీ వైన నే నొక పలుకు గానొ
శరధి నీ వైన నేను నిర్ఝరిని గానొ
భవుఁడ వీవైన నేను పార్వతిని గానొ !

కా :—ఎట్లు ?

చెలి ;—మఱచితివి. నేను నీ ప్రియురాలను. బానిసవర్తకునిచే నపహృతనై యీ పురి విక్రయింపబడుచుంటిని. అని (కన్నీళ్ళునించును)

కా ;—హా! హతోఽస్మి (అని కౌఁగలించుకొనును.)





గౌరవము కోరి ఈ రీతి ♦ దారిలేని
పేదజీవితమును చాల ♦ ఖేదముపడి
ఈద్వ గావలసెను యిట్టు ♦ లెన్ని నాళ్ళు
బాధపెట్టుదువో సామి ♦ పలుకవేమి,
గడనసేయఁగ నాకేమి ♦ తెలిసిరాదు
విద్యయా లేదు బలము తె ♦ ల్వియును లేదు
సామి నీవె ఆధార మీ ♦ బ్రతుకునకు య
థార్థమగు సాధనమ్ముగాఁ ♦ దలపవయ్య.



పాపము చేసెడు వారికె
లోపము రానున్న దన్న ♦ లోకోక్తికి ఏ
పాపము చేసిన చెల్లదు
తాపత్రయముల్ సమున్న ♦ తంబులె చెపుమా !

# నిశాసందేశము

కం. శ్రీ మొహియుద్దీన్‌బాద్షా
నామమహాఋషి నుతింప నర్థింపఁ దరం
బే మాబోంట్లకు నది వి
ద్యామార్గము తత్త్వపథమునం దగపడఁగన్. 1

ఉ. రేలన్ గొన్ని ప్రియార్ధభావముల నర్థింపన్ సమర్థంబులై
రోలజ రోకలఁ బాడునా తలఁపులో రూపించు ప్రేమైక గా
నాలాపంబులు స్వర్ధునీ దివిజ స్వర్గానందముజ దీసిపో
దా లావణ్యము దాస్యజీవనమునం దర్థంబుగా దింతయున్. 2

మ. స్ఫురదద్రాగరసంబు సంధ్యల నుషఃస్రోతస్సులజ దాఁగి త
చ్చరితార్థ ప్రతిపాదకంబగు నభఃస్వర్గీయగానంబులో
నెఱసైపోయిన ప్రేమపాత్ర మెవరేనిన్ బాడి నిద్రాణమై
యిరులన్ గాటుకపట్టియున్న మతి నెంతే లేపగా వత్తురే. 3

ఆ. లేప వచ్చినాము లెండు నిద్రించెదు
వారలెల్ల తెల్లవారె నదిగొ
వేఁగుచుక్క నిశల వెన్నాఁడు నీ కళా
కౌశలంబు చూడఁగలరె పగలు. 4

ఉ. చిత్రము లేఖనాకలనచే ప్రహసించెడు చూడు నీ జగ
త్సూత్రము చిత్రపున్హృదయ సూత్రములో లవమైన లేదు త
ద్గాత్రము కౌశికీలసితకాంచనమున్ బురుడించు నీ కళా
మాతృక కాలవాహినుల మాన్చు జయధ్వజ మెత్త చూచితే. 5

ఉ. ఆఁకటిచేతఁ గొట్టుకొను వ్యక్తిసుధాకలశానద్రావి యే
దో కథ చెప్పునట్లు తనధోరణి పెద్దయెలుంగులాల గీ
తాకలనంబు చేయునది తత్త్వమొ భైక్షుకమైన తృప్తియో
మా కెఱిఁగింపడేమి మఱి మాటలు కోటలుదాఁటి చాటుచున్. 6

ఉ. ఈ నిశలందు బంతవలె నెన్నిదినాలిటు నిద్రపోదు వా
జాను విలంబకేశములు జారి నిమీలిత లోచనంబులం
దాని మలీమసంబగు నజాండము చీఁకటి క్రమ్మివేసి నీ
స్థానము మార్చివేసె ననుసంగతి సుంత యెఱుంగ వయ్యయో! 7

శా. నేనే కోకిలమైన మావిచివురుల్ నిండార భక్షించి మీ
జ్ఞానంబంతయు పంచమస్వరము శృంగారంబులోఁ బెట్టి నే
గానంబున్ లొనరించి యావనము లోకంబంచుఁ జూపించి మి
మ్మానందాబ్ధినిఁ దేల్చియుందునుగదా యానాటి కానాటికిన్. 8

ఉ. పాడిన దొక్కపాటె యది పాడకముందె విపంచికాశ్రుతిన్
బాడి రహస్యముల్ తెలియవచ్చె నిసీ యని పాఱవేసి మై
నాఁడి సమూర్ధ్వగాత్రకలనంబున నింగి కదల్పఁజూచు నీ
పోఁడిమి వల్లకాటి బుడబుక్కలవానిగ సుండఁబోలునే. 9

చ. హృదయము వ్రక్కలై రుధిర మేరుగఁబాఱుచు చెప్పుచున్నయా
పదమున నగ్నియున్న దది పాడకు మో కథకుంత నీకు మొ
క్కెద మిదె మా నమస్సుల నొకింతనిజంబునుచెప్పి యా ప్రియా
సదనము దారిచూపు మదె చాలును శాంతికి మోరలెత్తఁగన్. 10

ఉ. ప్రేమపిపాస యీ విపినవీధుల విహ్వలఁజేసి తెచ్చె నా
నా మహితాగమంబుల గనంబడు వైదికరూపపంక్తియే
సోమరసంబొ త్రావి తమ చూడ్కులు కేంద్రముజేసి చూచు నా
భూమి తపస్సమాధులకుఁ బోలినదే యని చెప్ప చూచితే. 11

సీ. గేదంగిరేకులలో దాఁగినట్టి సౌ
యగము సౌరభముల నవిసిపోయె
పారాణిపెట్టిన పాదంబులో చక్ర
రేఖను నేల ముద్రింపఁబడియె
రంగవల్లికల కురంగాంకుఁ డలరి నె
త్తిని నేలఁబెట్టి వర్తింపఁదొడఁగె
కస్తూరికాతిలకంబు కలంకారి
చీరల సొబగులోఁ జేరిపోయె

గీ. ప్రకృతివ్యక్తిత్వమందు రూపములు వేరు
వేరులై రసోపాసనా వీక్షణముల
లేచి యాతిథ్య మిచ్చు నీ జీవితమున
మెట్టవేదాంతు లెఱుఁగ రీ గుట్టొకింత. 12

సీ. జ్ఞానమార్గముబట్టి గగనాలకెగసి నీ
స్వీయస్వర్గంబు వీక్షింపలేవ
బ్రహ్మవిద్య నెఱింగి బయలును భేదించి
చీఁకట్ల తెరవులు చెప్పలేవ
స్వస్వరూపముపెట్టి పాతాళవీధుల
హేమభాండారంబు లెత్తలేవ
చిచ్ఛక్తి సంధించి చేలునాగట దున్ని
మంచిముత్యాలు పండించలేవ

గీ. స్వరము గుర్తించి రేల నీపాట పాడి
చూపి ప్రమాన్పడ్డజీవుల లేపలేవ
నీవు నీవైనచోటులో నిలిచి నిఖిల
మేలఁదగు స్వారాజ్యంబు తే నెంచలేవ. 13

గీ. భ్రాంతివదలిన తత్త్వ మెవ్వనికిఁ దెలియు
తత్త్వమన్న తానేకదా తనకుఁ దానె
తెలియుటేమిటి యున్న దే తాను తనకు
మార్పు లేదని చూచుటే బ్రహ్మవిద్య. 14

ఉ. మాకు జగత్త్రియైకమగు మర్మములన్ని యెఱుంగవచ్చు మా
రాక విశాల విశ్వ పరిరంభ రమామహితాత్మ క్రియా
శ్రీకర సత్కళాకలనచే విహరించెడు మోదమందు మా
నాకము మా నివాళినిగొనం దలపోసినదంచు నొప్పెడున్. 15

ఉ. మే మల పుణ్యపాపముల మేలును కీళ్ళు గ్రహించినాము మా
నీమములందు మానసిక నిగ్రహముల్ వెలిబుచ్చినార మీ
సోమరసంబునందుగల సోయగ మీ ప్రజ యేమెఱుంగు స్వ
ర్ధామము దాఁగియున్నదను తప్పులు చెప్పుట తప్పు మూర్ఖులై. 16

ఉ. మే మొక గవ్వకైన నుపమింపనిరీతిని దోఁచుచుంటి మీ
భూమి ప్రజాప్రపంచముఁను బోలక ప్రేమరసంబునందు మా
సోమముపోల్చి యీప్రకృతి సోయగమందు విభూతమైన వి
ద్యామహిమంబు మా కరములం దిడుకొంట నెఱుంగ రెవ్వరున్.

సీ. ఈయేటిపాటల్లొ నాయూసుగీతాలు
పాడుకొంటాను రేఁబగలుకలిసి
ఈమిట్టమామిళ్ళలో మీది పలవెక్కి
యూఁగుచుంటాను నా రాగమునకు
ఈకాలినడకతో నాకాశమెక్కి నే
కలిసికొంటాను నాకములకెగసి
ఈపల్లెకొంపల్లొ కాపాలికనుబోలి
చూచుకుంటాను నా చోటుసొగసు

గీ. ఎచటబుట్టినానొ యెచటకువస్తినో
ఎచటకేగుటగునొ యేమిగతియొ
పుట్టుచావులేని పురిచేరుకుంటాను
నవ్వు నవ్వి మనసు దువ్వుకొందు. 18

గీ. ఏమిచెప్పిన నిజమునం దేమిలేదు
చెప్పునవి కల్పనాకథ లెప్పటికవి
సాక్ష్యమియ్యవు తన మనస్సాక్ష్యమందు
లగ్నమై నిన్ను నీవు దలంచుకొనుము. 19

మ. నదివై పాఱుచు పక్షివై యెగురుచున్ నాకంబుమిన్నేటిలో
నొదవన్ రోదసి ప్రేమగానముల నెంతో గూర్చి యానంద సం
పద పాడన్ మధుపానమత్తమతిౘేవ న్నీయభివ్యక్తి యా
యుదయాస్తాచలమున్ గదల్చెడు స్వభావోన్మేష మర్థింపఁగన్.

సీ. ఈయేటి పడవలో నీ గట్టుదారిలో
నేయూరు నేపల్లె కేగువారొ
తేలిపోయేదొకరు కాలనడిచేదోరు
కలుసుకోవాలంటె కానిమాట
మాటలాడాలంటె చోటుసాగాలంటె
ఊసులాడక తత్త్వ మెుండవలదె
మనసులో ప్రేమలు మనసులోనేయుండి
అగ్నియైమండి చల్లారిపోవె

గీ. చీఁకటులదాఁటి వెన్నెల చేరులోన
నెవరు నేమూలచేరునొ యెవరికెరుక
ఊహ యొకచోట ఆ నిజ మొక్కచోట
నుండిపోవును మోక్షంబు నొదవబోదు. 21

చ. అరవిరిమొగ్గలోఁ గలుగునట్టిసుధామధురంపు ప్రేమమై
తరువులనెక్కి పాడు నల తాత్త్వికగీతములందు సొక్కి బం
భర మదెవచ్చె నీజతబాసిననాఁడుగదా ! రసాత్మక
స్ఫురణ నిజానురాగమతి పుష్పొడియై వెలిజిమ్ముతెమ్మెరల్. 22

సీ. శైవులు నన్ను వైష్ణవుఁడంద్రు వైష్ణవుల్
శైవుఁడందురు నేను శైవుఁడనొకొ
వైష్ణవుఁడనొ నాకె బాగుగాఁదెలియదు
శైవవైష్ణవభేద సంగ్రహంబు
శైవమేమిటికి వైష్ణవమేమిటికి పెద్ద
మచ్చలుపడ్డ జీవనముపొంత
చీఁకటిపోదు చేసేది తోఁచదు మత
భేదాలకాలంబు వెడలిపోయె

తే. నేమనుష్యుండ నైతిక మేసువిడువ
నాకు నిందేమి స్తుతియేమి లోకమును త
రించుటే నామతంబు గుర్తించువరకు
శూన్యదృక్కుల భేదాలు చూడఁబడును. 23

సీ. అల విరోచనుఁడు శూన్యము నెప్డ వాదించె
దాని నెప్పుడుద్రుంచె ప్రాణవాది
ప్రాణవాదులనెప్డు పడఁదోసె నల మనో
వాదులు వారి సంవాదమందు
విజ్ఞానవాదులా విధిని బౌద్ధులు వారి
నోడించినారు పేరోలగముల
అణువాదులనఁగ మధ్యమవాదులనుబట్టి
తర్కించినారు విద్యాప్రసక్తి

గీ. న్యాయవైశేషికాది నానాప్రకార
మతమతాంతర దివ్యధర్మప్రచార
మెప్పు డెవ్వార లేరీతి నెసక మెసఁగ
చేసిరో వారిచరితలు చెప్పలేము. 24

ఉ. గౌరవమాఱఁగా విషయగాథల వైదుషులందు కొంగుబం
గారముగా నటించి గుణకర్మలడించి నిషిద్ధజీవనా
కారముదాల్చి క్రమ్మర నొకానొకప్రేమతరంగ విప్లవో
ద్వారిధియందు బోర్లపడి వాగెడు భక్తుఁడితండు నెచ్చెలీ. 25

గీ. చేతులెత్తి నీవేమి వీక్షించినావు
చెలి త్వదీయాత్మ హరిని వీక్షించినాఁడ
ప్రేమపాఠాలు చదివి చెప్పినది రాధ
ఆరహస్యంబు విప్పె నీహాసమదిగొ. 26

గీ. గుళ్ళరాళ్లుదేవుళ్లుగాఁ గొల్తువీవు
నేను నీలోన దేవు నీక్షించుచుంటి
నీవు దేవళమును మ్రొక్క నేగుచుంటి
వదిగొ దేవుఁడె నిను మ్రొక్క నరుఁగుచుండె. 27

గీ. పువ్వుపువ్వును భ్రమరంబు పోయి మధువు
బిచ్చమెత్తును నది కులవృత్తిగాఁగ
నీదువేదాంత మీరీతి నెగడుచుండ
చెప్పెదేమిటి విని చేయు చేతయేమి ? 28

సీ. ఎన్నాళ్ళు వేఁడినా యేపూజఁజేసినా
ఎవరువిన్నారు నింకెవరుగలరు
ఏమేమిపాడినా యేమి సాధించినా
యెరిగేదియొకటె చూచేదియొకటె

ఏమాటచెప్పినా యేదారిచూపినా
వెళ్లేదిలేదు మావల్లకాదు
ఏజ్యోతియెదురైన నేరాతి మ్రొక్కినా
పలికేదిలేదు ఆపథమెకాదు

గీ. చేసినదె చేసి చేడ్పడి చెప్పుకొనుట
కైన కొఱమాలి నిర్జీవమైన తెరవు
బట్టి యేవీటకేగునో బలుకరాదు
రాదురాదని యూరుకుండరాదు కాద. 29

సీ. కథకుండా యీలాటి కవిత చెప్పావంటె
మనసులో మచ్చలు మాయగలవె
కథకుండాయీతీరు పథముపెట్టావంటె
ప్రియులపాట్లింక తప్పించదరమె
కథకుండాయీరీతి గాథలల్లావంటె
రక్తపాతాలు వారధులుగావె
కథకుండా యీభాతి కష్టాలుకూర్చితే
ప్రియుల సమాధులు పెట్టగలమె

గీ. ఒట్టుపెట్టిన గతి నోరుకట్టి నీ క
విత్వరసవాహినులు మనోవీధులందు
ప్రేమప్రళయాలమధ్య పాలించవయ్య
అర్ఘ్యములు గూర్తురెరంగి నీయవని యెఱింగి. 30

శా. చైతన్యంబు లచేతనంబులు నవస్థాభేదముల్ స్థావర
వ్రాతంబుల్ శ్వసనాహతిన్ గదలుచున్ భాషించు మ్రాన్పడ్డ
విద్యాతత్త్వంబులు నుద్ధరించునెడ వాచాగోచరంబున్ పృథ
గ్ధాతుత్వార్థము లుగ్గడించెదు మహా స్థాణుత్వ మర్థించుచున్. 31

ఉ. చంచులగింజలేరికొని చాతకి జీవితమందు నేడ్చు ప్రా
పంచికవాంఛ యీపులుగువంటిదె లోకము భౌతికంబులో
కొంచెము మార్పులున్న నవి కోవిదులెంచరు యిట్లు వీని న
ర్థించి కృతార్థులౌదురన నెంతప్రమాదము చెప్పుమీ నిశా. 32

శా. గోరింటన్ రుధిరావశేషహృదయాకోశంబు మేఘాల గ
ర్జారావంబులఁ దోఁగి వారిధితరంగార్భాటముల్ దాఁగి దు
ర్వారంబైన నిగూఢప్రేమకలనారాగంబు గర్భంబులో
నీరై నిల్చనతీరు పాఠములుగా నేర్పున్ మహాత్యాగియై. 33

ఉ. ఈవును నే నెఱుంగము గతించినసంగతి శూన్యభాండ మే
వేవో వచించు మీటునటకుండు నెఱుంగఁడు బోర్లవడ్డ నా
జీవితమెత్తుకోఁదలఁచి సీధువుకై కయిచాపుచున్న దా
భావము ముక్తకంఠమునఁ బాడుచునున్నది యౌగికంబుగన్. 34

ఉ. ఊహసతంబు మేలునకు నువ్వెళులూరునుగాని ప్రాప్త మా
కూహకమందు తోడ్పడదు గృధ్రము మాంసము పీకిపీకి యా
రాహువు వక్రమైనపడి రాలునరుండు నివాతదీపమ
ట్లైహికదగ్ధజీవితమునందు పదంపడి నెగ్గనేర్చునే. 35

ఉ. ఏమినిరీక్షణంబు నిటులేమిటి కైహికజీవితంబు నా
నామలినావభావముల నగ్నతఁజెంది కరంబు చేడ్పడన్
భూమికివచ్చె నీప్రళయముల్ గడవందరమే నిశాప్రయా
ణామని లెక్కపెట్టుచు మహావిపదంబుధి నీదులాడుచున్. 36

శా. ఎన్నేండ్లేగెనొ రోదసీకుహర మింకెన్నేండ్లుగానుండునో
మన్నైపోయిరి పెక్కురీతిరుగలిన్ ప్రామృద్ధరంధ్రాల న
ధ్వానంబున్ దివిబొక్కి శూన్యహృదయ ద్వారాలఁజీఁకట్లక్రిం
దన్నిద్రింపక లేచిపోయిరి దివాంధంబట్లు చీరాడకన్. 37

సీ. జన్మజన్మాలెత్తి జానపదాలలో
పాటపాడిననాఁటి మాట తెలుసు
రకరకాలైనట్టి రాగాలు తెలిసి మా
రక చూచుకొన్న గౌరవముతెలుసు
తరతరాలుగనున్న నరకాల స్వర్గాల
తలుపులు తెఱచిన తెలివితెలుసు
చిమ్మఁచీకట్ల నెపమ్మున నిశినాట్య
మాడిన సొగసుగుడ్యములు తెలుసు

గీ. తెలుసు పుణ్యపాపంబుల తెరవులేమొ
మరణమేమిటొ యాతెరమఱుగులేమొ
తెలుసు నేనన్నతత్త్వంబు తెలుసు నా ర
హస్యమంతయు నాలోనిదనుచు తెలుసు. 38

సీ. ఎత్తేటిజన్మలు యీనాఁటికైనను
విరమించులాగు కాన్పించలేదు
ఇంద్రియలోలత్వ మేనాఁటికానాఁడు
పెఱుఁగుచునేయుండె తరుగదింత
గడ్డువేసంగిలోఁ గాలిమన్నై వాన
కారున మొలకెత్తుగతిని నీవు
జన్మజన్మాల సంస్కారాన బుట్టుచు
చచ్చుచుంటివిగాని చావనట్టి

౩౯

గీ. తెరవు వెదకవు నొక్క యుక్కరమునందు
నీదుమోక్షంబు నీముందు నిలిచియుండు
చూడవేమిట్లు సర్వంబు చూచుపగిది
నిన్ను గాఁ జూచుకొమ్ము నభ్యున్నతమ్ము. 39

శా. ఓసీ! మేఘ గతాగతంబయిన నీయూర్ధ్వాపరోధగ్రసం
వాసంబున్ విడనాఁడి కాంతులు వెసన్ బాయన్ విడంబింతువే
మేసన్యాసి నిపాతవాతములలో నీ నేల వర్షించి నీ
రై సస్యాలజనింతువే మఱి పునర్జన్మంబు పోనాఁడవే. 40

సీ. ఏరూపుచూచినా నారూపమందులో
తొంగిచూచేలాగ తోఁచుచుండు
నేపాటపాడినా నాపాటలో స్వర
మేనుగా రేకెత్తి యెసఁగుచుండు
నేచుక్కచూచినా నాచుక్కలోకాంతి
నాకాంతిగావచ్చి నవఘళించు
నేప్రొద్దుచూచినా నాప్రొద్దులోతేటు
నాతేటుగావచ్చి నాట్యమాడు

గీ. విశ్వరూపంబుగా నన్ను ననశ్వరముగ
చూచుచున్నాను నాకింక చోద్యమేది
మరణమేది పూర్వ్వది యూవరణమేది
యేదిలేదింక నేనుగా నేసఁగు కతన.

శా. ఆలాపంబుల నుగ్గడించు నవవిద్యాతత్త్వమం దెన్ని యో
స్థాలిత్యంబులు నున్న వాతెఱవులో సంపూర్ణపాండిత్యమున్
రాలేదింక నిశాకవాటములలో రాగాలపేర్లుంచి నీ
వాలాపంబులు సేయుమా తెఱవులం దర్థంబు గానేర్చునే.

ఉ. ఆగెడినేమి యీపథమునందు నిదర్శన మేమికాన మీ
యాగడమందు జీవితములాగునె యీశ్వరసృష్టియందు
నానాగతు లున్నవింక సహనం బతికష్టము లేచిపోవఁగా
సాగదు ప్రొద్దుగ్రుంకినది సంకట మేమిఘటించునోకదా.

సీ. బాకాలునూదిన వ్యాసంగరచన క
లాకలాపంబు చల్లారఁజూచు
సోదెలుచెప్పి నిస్తుల వస్తుసామగ్రి
శూన్యాలయాల ప్రాచుర్యమెసఁగు
గాథలుకప్పి దిగ్దంతిదంతావళ
ములలేపి మచ్చుమందులనుజల్లు
శపథాలుపెట్టి యాసల నువ్విళులునూరు
బాలకురంగాల బట్టితెచ్చు

గీ. నాటకములాడు తత్త్వవిజ్ఞానములను
పెట్టి చదలేటి బంగారు విపణివీధు
లందు ప్రేమలకమ్ము వక్రాలకముల
ముళ్లువిప్పుముపువ్వు పందిళ్ళతపసి.

ఇది

శ్రీ ఉమర్ ఆలీషాకవికృత

నిశాసందేశము

సంపూర్ణము.

౧

అదిగో చూడము ఆలకింపు మల బ్రహ్మాండంబు భాషించు తో
యదముల్ వార్ధులు మారుతాహతిని వృక్షానీకముల్ ప్రొద్దులం
దుదయార్కుండు సుధాంశుఁ డాకసము నుద్యోగించి యాపాటలో
వెదకంబొమ్ము త్వదీయనామము మహా విశ్వాకృతిన్ బోల్చుచున్

౨

భళ్ళున తెల్లవారినది పక్షులు కూసెడివేళ చీకటుల్
ద్రెళ్ళను వేగుచుక్క తెరఁదీసి ఉషస్సును తొంగిచూచున్
చల్లని గాలికై తిరుగు స్వర్గరమన్ తెగముద్దుపెట్టు నో
పల్లవపాణి నీప్రణయ పాఠము దిద్దుము యౌగికంబుగన్.

3

నేనే కోకిలనైన నీజగము రేకెత్తించి నాపంచమ
స్థాణుత్వంబును డించి పోయి ప్రణవస్థానంబు సాధించగా
నానందాన రసైకలోక విగళద్వ్యాపార రత్నాకరం
బేనై పోల్చి మరల్చియుందును వసంతేచ్ఛాప్తి దాస్యావనిన్.

౪

ఆడెడిదేమి ఈప్రకృతి యందము మఃందర నాడుచున్న పూ
బోడి దృగంచలంబు లవె పూసినకాటుక మాటునుండి వె
న్నాడు విలాసభాసురమునందు విలిప్తములైన రేఖ లీ
రేడు జగాల్త్రోవల గురించి వరించును నాడునాటికిన్.

౫

ఆది హృదయానుషంగమగు నట్టి యథార్థము దానినుండి యా
పదలు, వ్యథల్, వృథాపరిభవావసథంబులు పుట్టు జీవితా
స్పద విషవారి ప్రేమ వివశంబగు నగ్ని రగిల్చి నీలతో
యదము తటిల్లతల్ పిడుగులట్టుల రాల్చుచుఁ బోవు నేయెడన్.

౬

పూచినయీసుమంబు నెలబోలె హసించుచు అనవాప్తిసం
కోచమనస్కయై రజని కౌంగున ముంగురుబోలు భృంగినన్
జూచి భయాన నీతమసు జూచిన డోకని లేచి పోవఁగా
చూచెనుగాని ఆకపటిసుళ్ళకు నేలను రాలె ముక్కలై.

౭

ఇదియొకదగ్ధకాష్ఠము అదేపనిగా వెలుగియ్యఁజాల దిం
దొదవినతైల బీజములు నుష్ణున బూడిదయై మరుత్తులో
కదిసి లయాంతవీధులకు కాలికొలందిని పోయి నీరుగా
పొదలి జలాభమై కురిసి పువ్వయి నీజడ సొంపు నింపెడున్.

౮

ఈచిగురాకుబోడి తన కేమిటొ చిత్తము తత్తరించునం
చాచతురంతయానమున నాలపనం బొనరించునట్లు దో
బూచులనాడు నేత్రములు బొమ్మల పోలిక నిల్చిపోయె ; ఆ
ఖేచరియూర్ధ్వదృష్టి పరికించిన సంయమి గాక యేమగున్.

౯

ప్రేమ జడంబు ప్రేమ కడు విహ్వలయైనది దీనియందు నే
మేమొ మహావిలాసములు నేర్పడుచున్నవి వాని వ్రాయఁగా
లేము వచింపలేము కబళించెడు జువ్వని తాటిచెట్టు ఆ
రామమునందు ప్రేమ కొక రాగము పెట్టెడు గంటె నెచ్చెలీ.

౧౦

ఆలమునందు బెట్టె వెలయాలిని బోలిన బొమ్మలాట వై
తాళికు లాసవాంగడిని తద్ధిమితా యని గజ్జెకట్టి ఆ
డాలని బోల్తకొట్టిరి కడాపటికిన్ సిగపట్ల గోత్రమున్
గాలికి బుద్ధిచెప్పినది కాసరకూసర యైన కైవడిన్.

౧౧

అకటా! నన్విడనాడి పోయెదవె నీయందేను ప్రాణంబు ని
ల్పి కదా తిర్గుచునుంటి నాచెలిమి నోలింబాసిపోఁ జెల్ల దూ
రక నన్గన్గొను మీవు నేను ఒకటే ప్రాణంబు కాదా యిదే
సకియా నాల్కకు రెండుదార్లు గలవా చాలించు నీకోపమున్.

౧౨

పొంగిపోయెను కన్నులుపోవ నిన్ను
చూచు తలపున కాయంబు సొక్కిపోయె
ఎందరినొ నీదుజాడ యాచించినాడ
గాని ; చెప్పరు తెలియని కారణమున....

౧3

కార్తిక మీనెలన్ మధుముఖంబగు పూలు విలాసలాలసా
వర్తిత చంద్రికన్ మధువు పాత్రలఁబోసి విహారవైఖరీ
నర్తన నివ్వటిల్లెడు పునర్మిళితాప్త వధూవర ప్రియ
స్ఫూర్తినిఁ గంటివే ప్రణయశోభిత రాగరసాంకురావధుల్.

౧౪

కార్తికమున్ నిశావసిత కాలము తూర్పుదిశాణ మెక్కి ఒ
క్కర్తుక వెన్నెలన్ బిలిచి కైవడి వెన్నెలవచ్చె నాసుధా
మూర్తిని గాంచి హర్షమునఁ బొంగెడు నీమధురాసవంబు క
ర్కర్తిగఁ ద్రాగెదేల నిజ కోమలి పాత్రల నింపుచుండగన్.

౧౫

పెక్కులగచాటులను బడి విసిగివిసిగి
వేగి వేసారి వేసారి విచ్చియున్న
ప్రాణి యాకట్టెనుండి యాపగిదినూత్న

ధోరణిని లేచి వచ్చి నీ ద్వారవీధి
ద్రొక్కి యాత్మీయవివశ మాధుర్యగీత
మాలికారూపమున వీచు మాపురేపు
వేరె వింజామరల నీవు పెట్టవలదు.

౧౬

మనసున ప్రేమయున్న నొకమారయినన్ కనిపించి యుందువో
వనజనిభాస్య ప్రేమకు నివాసము రాళ్ళనుఁగల్గఁబోదు నీ
కనులకు సాంధ్యరాగములుఁ గానఁగవచ్చిన నాదు రక్తమం
చమకొను మద్ది వ్యాజమున కాకస మెక్కెను నీవు చూడఁగన్.

౧౭

కవిత రసానుషంగమగు కావ్యము ; ఏకళతోడ పోల్చగా
నవు నదిగాదు ; ఇయ్యది పయఃపరిపుష్పిత పారిజాత సం
భవసుమ వాసనాలహరి పాడిన యాడిన వింత వైఖరుల్
దవిలినఁగాని ఆకవిత లాస్యము సేయరు మానసంబులన్.

౧౮

ప్రేమ నిపాతవాసనల విహ్వలయైన మనస్సు జీవిత
వ్యోమము నెక్కి శాంతికయి యువ్విళు లూరుచు రాలిపోవు దృ
-క్ఛీమనగఁబు నేట ప్రతిబింబితమై పడి లేవలేదు ; ని
ర్ధూమవిదగ్ధ జీవనము త్రోవలు చెప్పఁగలేము నెచ్చెలీ !

౧౯

ఆమని యీవసంత మధురాసవమున్ కలశాలఁ బోసి యీ
భామిను లాడుచున్ చషక పంక్తుల ద్రావుచు మేళవించు నీ
యామిని మేల్మొసుంగుల నొయారముగా పరువెత్తు మోము సౌ
దామిను లంటి యీనటక ధామము తోరణఁ గట్టె రక్తికిన్.

౨౦

ఇది విపరీత మీఱగడు నెవ్వనిదో పరకీయ యీమె యీ
సదనము కెట్లు వచ్చినది పాపము పండినదో యనంగ నీ
సదనము ప్రాయికంబయిన సౌష్ఠవమున్ విడనాడి పోయె ఆ
పదలకు లుప్తమై మదిర పానము చేసెదుచోట నియ్యెడన్.

౨౧

ఎక్కడ చెప్పుకొందు నిక నెక్కడిశాంతి నిజానురాగ మిం
కెక్కడ నున్నదో శలభ మింగలమం దుసు రిచ్చి ప్రేమకున్
జక్కనిపాఠ మిచ్చెనది సైకతసీమల గ్రాలు తెమ్మెరల్
సొక్కుచుఁ బోయి క్రొవ్విరిని సోలి పరీమళమైన కైవడిన్.

౨౨

ధ్వనులన్ కాంతుల రూపరేఖల సదా ధ్యాహారమైనట్టి యీ
తనువున్ దత్ప్రతిభావిభాసమగు సంధ్యారాగ రాగాలలో
జను మోహాత్మకమైన జీవితమునన్ జంచత్సుధామాధురీ
ధ్వనులన్ పాటల నాలకించు మదె నీవాసంబు సందేశమున్.

౨౩

ఆహా ! కాలము పోవుచున్నది శరవ్యాఘాత వేగంబునన్
మోహావేశముతో జగత్సకలమున్ మోదావహంబైన సం
దేహం బింతయు మిథ్యయో నిజమొ యీ దివ్యప్రభాభాసకం
బీహాదూరము నైన నీమరుగులో సృష్టిన్ విలోకింపుమా.

౨౪

అన్నిటికన్న నెన్నికగు నాసవపానము మిన్న మాకు తత్
ఖిన్నపరంపరంబయిన క్లిష్టపదంబులె మేలు మాకు త
ద్భిన్నపదంబు శాంతియు గతిన్ గలిగింపనిచేని యీప్రపు
త్రోన్నతజీవయాత్ర నెటులో ముగియించుట కర్జ మియ్యెడన్.

౨౫

ఇది విపరీత మీయగడు లేటికిఁ బుట్టెను శాంతిధామ మీ
సదనము సామగానముల సాగెడుచోట సురాపణంబుగా
మొదలు పునాది ఆ మధువుపోసెడు ముంతల కాలవాలమై
ఇదియొకపెద్ద సోదెవలె నేర్పడియున్నది చూడవచ్చినన్.

౨౬

నేనే మేఘమనైన నాయురుములున్ నిర్ఘాత పాతంబులున్
స్థానాలన్ని మరల్చి జీవనము దాస్యాభావదృగ్వల్లభా
ధీనంబున్ బొనరించి సంస్కరణ వందీభూత చేతస్కనై
జ్ఞానానందము స్వాంతవీధుల నటత్సౌదామినిన్ జొన్పుదున్.

౨౭

ఆలపనంబుసేయు హృదయాలయ ప్రేమ విపంచి తంత్రికా
జాలము ముళ్ళువడ్డ దిక సాగదు పాట యయాచితంబుగా
గాలికి కొట్టుకొన్న ప్రియగానము కొంగున మూటఁగట్టి కెం
గేల నివాళిఁబోయు పరకీయుకు మచ్చలు చూపఁబోలదే.

౨౮

ఆలపనంబుసేయు హృదయాలయ రాగ విపంచితంత్రికా
జాలము చిక్కువడ్డ దిక సాగదు పాట మృదంగ నిస్వనా
భీలరస ప్రవాహమదె వీచికలన్ మిష బొర్లవడ్డ కెం
గేలను ముళ్ళు విప్పుచును కేంద్రము చేసెడు జీవితంబునన్,

౨౯

గమ్యస్థానము లేదు జీవికి మహా గాధావగాహంబునై
సామ్యత్వ ప్రతిబంధకంబయిన యీ సంసార పాథోధితో
సామ్యంబై తెగ ఘోషపెట్టు నది ప్రాసందేశ మాదిబ్బ యీ
ఘామ్యాకాశమనేటి యీతిరుగలిన్ బాధై విడంబించెడున్.

౩౦

పకపక నవ్వుచున్న మధుపానలసత్కలశంబు పొంగి పో
ర్లకమునుపే మృగాక్షి చికురంబుల పువ్వులఁ దోగు వాసనా
వికసితవార్ధిలో మునిఁగి విశ్వము రాగరసంబులో గళ
చ్ఛకలముఁగాగ నెంచు మట స్వర్గము దాగుడుమూత లాడెడున్.

౩౧

అది యొకమాటె గాని తనయందనురాగము మాననట్టి ఆ
సుదతికి చేరుటమ్ముత్ లవి శోకపు టశ్రువులందు చూడ మా
యెదగల నిర్మలత్వ మిఁక నేటికి ప్రేమపదార్థమన్న దు
న్నదె యిహజీవితంబున కనంతనిశాసముపాశ్యమౌ నెడన్.

౩౨

నిందలు మోపుచుండినను నేరము లందరికుండు వానిలో
కొంద రెరుంగ రామరుగు కొంచె మెరింగిన నవ్వువచ్చు నే
మందుర సర్వమున్ జలములందు నిపాతమునైనచే మహా
నందము ప్రేమ యెందునుఁ గనంబడ దీ యిహజీవితంబునున్.

౩౩

కాటుకఁబెట్టు కన్నులకు కాంచనహారములందు సోయగం
బేటికి చూత నెంచెదవు ఏదొ వికారము నీవిలాసమం
దోటు ఘటించునేమొ యని యూరక పొక్కెదవేల యీ జగ
న్నాటకమందు పాత్రల కనంతత లేదని నేర్చియున్న నా
మాటల లెక్కయేమి పరమాణుల దూళుల పోల్చుకొన్నచోన్.

౩౪

ఒకతెరవెల్గు వెల్గున మహోన్నతలీల తటిల్లతాకృతిన్
ప్రకట మొనర్చె నింగిని నిపాత తమో మలినావభావ మీ
ప్రకృతిరసానుషంగము ప్రభాతములన్ రచియించునట్టు లీ
వికటము మాని మానసిక విహ్వలమున్ విడి కాంచు మీశ్వరున్.

3౫

ఇది యొక దొంగవెర్రి తనకేటికి మోహము ప్రేమయందు ఏ
సుదతియు నెగ్గలేదు తన చూడ్కులు బందలు చేసి బాష్పముల్
వదలిన దాని వానికయి బాసలు నాసలె గాని యా ప్రియా
హృదయము చొచ్చిపో వనుచు నేడ్చెడు నీసతికూడ రాయియే.

3౬

చెలిమికి వ్యక్తి యేమిటికి సృష్టి సమస్తము నీవుఁగాగ నీ
కలిమికి మేరలే దనెడు జ్ఞానికి లోకమునందు నెల్లరున్
చెలులుఁగదా ముదావహముచేఁ గనుగొన్న జడంబు లన్ని నీ
తలఁపున మాటలాడు మహితం బొక వ్యక్తిగతంబె నెచ్చెలీ!

3౭

జీవనభాండమం దొలికి సీధువుఁ బోసి ప్రసిద్ధ దానధా
రావహమైన మైకమున నాకము చూడుము దీనికన్న నీ
భూవలయాన దుఃఖములు పోవు చికిత్స యెఱుంగరాదు ఏ
దోవిధమైన బాధ యెద నొచ్చి ప్రియంపడనీయ చేయెడన్.

3౮

విధి! మనోగతవ్యథ యెట్లు వెలువరింతు
ఎవరు గ్రహియింతు రెవ్వారి కెఱుక దీని
నిజము నిజదగ్ధపటల సన్నిభము; ఈశ్వ
రుం డొకఁడె తోడ్పడఁగ సమర్థుండు సూవె

3౯

కన్నులలోన చూపు నినుఁ గాంచెడుదాకను నున్న దింక ఆ
పన్నతఁ గన్న జీవితము పట్టున నూపిరి ముక్కు నున్న దో
యన్నులమిన్న నీమనసునం గల క్రోధము బాయలేదు వి
చ్ఛిన్న తమో నివృత్తమగు జీవిత మారడిగొట్టు కాదొకో.

౪౦

కనటగు జవ్వనంబు కనకాంగి తమోవృత రుద్ధ వైకృతా
వసథమునందు చీకటుల పాలయిపోయె లతాంగి పల్లవో
ల్లసిత వికాసపుష్పముల లాతిమెరుంగులు పెట్టు కీల్జడన్
కుసుమములన్ని జారినవి కోమలి వెన్నెల నేరికొందువే.

౪౧

పృథుమధురాధరంబులును వీణియతంత్రులు మేళవింప నీ
సుధలవెలార్చు గానముల సొంపు నుతింప నిలింప గాయనుల్
మధుకలశాలతో ప్రమద మంజులగాత్రము లాలపించి నీ
కథలు నుతింతు రాకలన కాదన నేర్తువె ప్రేమపాఠమున్.

౪౨

బొమ్మలఁ గొల్వఁ జేసితివి బోదెల కానల దాచినావు మో
హమ్మన ప్రాణమిచ్చుటకు నైనను జంకఁగలేదు గాని నీ
వమ్మకచెల్ల ! నాచెలిమి నాహుతి చేసితి వెంతజాణ వీ
విమ్మెయి యేమిచేయుటకు నెంచితొ బూడిద ప్రామికొంటకున్.

౪౩

చూచితి దేశదేశముల చూచితి వాని యదార్థ శౌచ శీ
లాచరణంబు లాచదువు లామహనీయ విలాస విహ్వల
ప్రాచరణంబు లాంధ్రులకు ప్రాయికమైన విశేష శేముషిన్
గోచరమై తనర్చు తెలుగున్ తెలుగించెదుజాడఁ జూచెదన్.

౪౪

కాదంబరిని నొక్క కణమైన మూడులో
కములకు కాణాచిగా నొసంగ
ప్రియురాలి వేడుక వీణ పాడిన ప్రేమ
గీతాక్షరములు స్వర్గీయవృష్టి

వెన్నెల బయలులో గన్న ప్రేయసి సోయ
గము సుధాంబుధి ప్రేమకలశమట్లు
ఆరూఢమునకు నింద్యాభాసమైన నా
వెలది దృగంచల విలసనములు

ఎవరు కొలుతురు రాగరసేతరంబు
లైన బారలచేరల కందరాని
ప్రేమపాతాల నవసిన వీధులందు
వాసనలదోగు మధుమాస వాసరముల.

౪౫

వీణాతంత్రులు మేళవించి విలురత్నైకపాతాల వి
న్నాణంబున్ హృదయాంతరాళ విచలన్నాదంబు మార్మ్రోయ గీ
ర్వాణిన్ బాడెడు నామె గాత్రలహరిన్ స్వర్గీయ సౌందర్య మే
రాణన్దోఁచెడు జూచితే యదియె మార్గం బీశ్వరున్ గొల్వఁగన్.

౪౬

కిన్నెరకంఠమెత్తి తన గీతము దిక్తట కుంభికుంభముల్
ధన్నని పాడు నాస్వర సుధారసధారల మోసులెత్తు రా
గోన్నతి విశ్వభారతికి నువ్వి ళులూరు నివాళిగూర్చున
ట్లున్నది దీనిలో మరుగు లున్నవి ప్రేమరసంబు గ్రోలఁగన్.

౪౭

గగనము శూన్యవీధి సుడిగాలి మలీమస ధూళిధూరం
బగు నొకవ్యక్తి దాల్చి విలయాలయ మేగుచు దగ్ధకాష్ఠమ
ట్లగడు జనించు జీవితమునందు మరీచికబోలు విశ్వమం
దగపడుచున్న దాప్రళయమందు నుషస్సగు ప్రేమఁ గంటివే.

౪౮

సిద్ధనిషిద్ధ జీవనము చేసెడువాని హృదంతరాళ సం
బద్ధ రసస్వరూప సముపాసితమైన జలాంజలిన్ విము
క్తోద్ధతిఁ గన్నముత్తెములతో నెనవచ్చినఁ జాలు నైష్ఠికా
రుద్ధవిషంబు స్వర్గపు పురుంగయి యేటికి నారగింతువో.

౪౯

హారతి యాయుషస్సున జలాంజలిఁ బట్టెద వేమి వింతశో
భారతి నీహృదంతరముపై తెరతీసిన ప్రేమమూర్తి సిం
గారము మాటుచేసుకొని గానముచేసెడు నీ వచస్సు కం
గారయిపోవుచున్న కడకన్నుల నశ్రులురాల్చె నెచ్చెలీ !

౫౦

హారతి యాప్రభాతము సుమాంజలితో నిడి పాడుచున్న గం
భీరము నీముఖాబ్జమున వెన్నెలపై తెరఁదీసినట్టి సిం
గారముఁ గూర్చె నీసొగసుకంటెను స్వర్గము లేదు ప్రేమవా
చా రచనాప్రకారముల చాటున ప్రాణము లియ్యఁ బోలదే.

౫౧

తోరణగట్టు మాటలను దోయిలి వేదన క్రుమ్మరింతు వీ
తీరున జీవితంబు కడతేర్చెదవో మధుపాన మైక మే
పారెడు నేడు నీప్రియ పిపాస నుపాసితమైన ప్రేమ యె
వ్వారికి జెప్పవచ్చు నుడుపంక్తుల నేరుల తొంగిచూడగన్.

౫౨

ప్రకృతి విశాలవిశ్వమున పాటలు పాడుచు నవ్వుచున్న దీ
వికసిత సాంధ్యరాగముల విశ్రుతమైన నిశావధూటి త
న్నకలుషిత ప్రభాతముల నాకరమైన వెలుంగు మాన్పు నం
చొక లవమైన నేర దదిగో భవితవ్యము తోఁచ దేరికిన్.

౫౩

పారాణిపెట్టిన పాదంబు తిరిగిన
నెత్తురుటమ్ములు నెమకవలదు
కాటుకదిద్దిన కన్నుల చీకట్లు
కనుబొమల్ మధ్యను గాంచవలదు
తెలిముత్తెసరులు మల్లెలుఁ గ్రాలు తలఁ బ్రాలు
బోయుచు నేరుకో బోవవలదు
ప్రేమసోపానాల వెడలుచు పడిపోయి
బూడిదయై లేవఁ జూడవలదు

ఈపరాగంబుఁ దోగి యేరూపరాగ
రససముజ్జ్వలమై, యథోర్ధ్వా ధ్వగమన
వాహినులఁ జెందునో దానిఁ బట్టుకొనఁగ
వెంగలివిధాన వెంటాడి వెడలవలదు.

౫౪

బారుగఁ గ్రుమ్మరించి జలభాండము నుత్తది చేసివేసి యా
దారిని పారవేసి తసదారిని పోయెను నవ్వులాడి దు
ర్వారవిచార వారిదము వర్షములై వడగండ్లు రాల ని
ట్టూరుపుటగ్ని భగ్నమగుచుండగ నెంచెడు నాసయున్నదే.

౫౫

కాయలు కాచిపోయినవి కన్నులు ; కానగరాదు నాకళా
ప్రేయసి విశ్వరూపము వరించినదో ప్రతియంద మామెదే
గేయము పాడుచున్న దది కిన్నెరసాని, నిపాతధూతకెం
జాయల నీలిరంగు తెరచాటున దాగుడుమూత లాడుచున్.

౫౬

ఘళ్ళున తెల్లవారెను ప్రభాతము తూరుపుకొండ సూపె నా
గళ్ళను దున్నినట్లు నవకంబులుఁ దీర్చె నభంబు నాంద్రుముం
గిళ్ళను ముగ్గు లుంచి తమకేల నుషస్సున కర్ఘ్యమిచ్చె ఆ
వేళ్ళ కవీ! రచించుటకు వేచెదవే కథ లెన్ని వాగినన్.

౫౭

వగపునుఁదెచ్చి నీహృదయవాసముఁ జేసెదవేల నవ్వులో
నగపడుశాంతి నీమనసునం దమృతత్వము జిమ్ముచున్నదా
సొగసున నిన్ను పోల్చుకొని చూడుము రాగరసైకవీచికా
శుగములు మిన్నుముట్టు దివిజొచ్చి జయధ్వజమెత్తు నెచ్చెలీ.

౫౮

ప్రియునియుదంత మెంతయు నవీన మహామహనీయరాగసం
చయ మెవరేని దెత్తురని సారెకు దారులు చూచుచున్న ఆ
పె ; యనల దగ్ధమానసము వీగిన ఆశలతాప్రసక్తికిన్
జయ మెపుడైన గల్గునె నిజంబుగ బూదయి పోవు లోపలన్.

౫౯

నదివై, విశ్వము పక్షివై యెగురుచున్ నాకంబు మిన్నేటిలో
పొదవన్ రోదసిప్రేమగానముల నెంతో గూర్చి యానందసం
పద పాడన్ మధుపానమత్తమతికేళ్రివన్ నీయభివ్యక్తి ఆ
యుదయాస్తాచలమున్ కదల్చెడు స్వభావోన్మేష మర్థింపగన్.

౬౦

ఎన్నేండ్లేగెనొ రోదసీకుహర మిం కెన్నేండ్లుగా నుండునో
మన్నైపోయిరి పెక్కురీ తిరుగలిన్ మ్రొన్పద్దరంధ్రాల న
ధ్వాన్నంబున్ దివి బొక్క శూన్యహృదయద్వారాల చీకట్లకిం
ద న్నిద్రింపక లేచిపోయిరి దివాంధంబట్లుఁ జీరాడకన్.

౬౧

గోరింటన్ రుధిరావలిప్త హృదయాక్రోశంబు మేఘాల గ
ర్జారావంబులదోగి వారధితరంగార్భాటముల్ దాగి
దుర్వారంబైన నిగూఢ ప్రేమకలనా రాగంబు గర్భంబులో
నీరై నిల్చినతీరు పాఠములుగా నేర్పున్ మహాత్యాగియై.

౬౨

చైతన్యంబులు చేతనంబులు నవస్థాభేదముల్ స్థావర
వ్రాతంబుల్ శ్వసనాహతిన్ కదలుచున్ భాషించు ప్రమాన్వృద్ధ వి
ద్యాతత్వంబులు లేచుకాలము స్వభావవ్యక్తసంజ్ఞాప్తి త
చ్ఛేతస్సంగతు లాలపించెడు జగత్సామాన్య భాషాకృతిన్.

౬౩

గౌరవమారగా విషయగాథల వైదుషులందు కొంగు బం
గారముగా నటించి గుణకర్మల డించి నిషిద్ధజీవనా
కారము దాల్చి కర్మమ్మర నొకానొక ప్రేమతరంగ విప్లవో
ద్వారధియందు బోర్లపడి వాగెడు భక్తుఁడితండు నెచ్చెలీ.

౬౪

భాషలు వచ్చివేసినవి భావములం గల మార్పు వానిలో
దోషము లుగ్గడింపగల త్రోవలు వచ్చెనుగాని రాత్రిశై
లూషి నిశాకవాటములలో వెనుకంజల వేయుచున్ తృషా
పోషితమైన రాగముల పోకల నేర్పుట గాన మెచ్చుటన్.

౬౫

ఆలాపంబుల నుగ్గడించు నవ విద్యాతత్వమం దెన్నియో
స్థాలిత్యంబులు నున్న వాతెరవులో సంపూర్ణ పాండిత్యమే
రాలే దింక నిశాకవాటములలో రాగాలపే ర్లుంచి నీ
వాలాపంబులు సేయ మానెలవులం దర్థంబు కానేర్చునే.

౬౬

కాలము తప్పివచ్చు నది కాదనలేము ప్రయత్నపడ్డ ఆ
వేళకు బుద్ధిమాంద్యమొ వివేకవిహీనతొ సంభవించు దుః
ఖాలు సుఖాలు వానికవె గల్గును వానిరహస్యముల్ తృణా
గ్రాళిని మంచుబిందువుల యట్లె యహర్నిశలందు రాలెడిన్.

౬౭

ఏదో బుద్ధి ప్రమాదమందు తన కేమేమో స్వలాభాప్తికై
వాదంబాడుచు బెంగపెట్టుకొని ప్రాప్తంబుల్ విలోకించు నీ
గాథల్ త్రవ్వినకొద్ది పూను పెరుగున్ కర్తవ్య మూహించు వా
రీదారిన్ జనఁబోరు కావున స్వతంత్రేచ్ఛన్ విడంబించుమా.

౬౮

ఆగెదవేమి ఈవిపినమం దొక చేరెడునీళ్ళు లేవు ఈ
ఆగడమందు జీవితము లాగవు ఈశ్వరసృష్టియందు నా
నాగతు లున్న వింక సహనం బతికష్టము లేచిపోవగా
సాగదు ప్రొద్దు క్రుంకినది సంకట మేమి ఘటించునో కదా!

౬౯

ఎత్తుము లంగ రీపడవ యేటిని బడ్డది గాలివాన ఉ
వ్వెత్తుగ వచ్చుచుండె తెర దించుము ఈ నడిరేయియందు నీ
చిత్తము తత్తరించినను చేయునదేమి నిశావధూటి చే
యెత్తున మేల్ముసుంగు ధ్వజమెత్తెను యేకడ త్రోసివేయునో.

౭౦

ఇటుకలు శిల్పి కొన్నిటిని పృథ్వి పునాదిని కప్పివేయు కొ
న్నిటి శిఖరాగ్రసౌధముల నింపు విలాసముగాక పంపకం
బటువలె వచ్చు కర్మఫలమం చననేటికి కల్మిలేములన్
ఘటనలు కోరి పెట్టినవిగావు కృపామతి మార్చుమంటకున్.

౭౧

పాడై పోయి వ్రతాగ్ని హోత్రములు సంప్రాప్తంబునౌ కర్మ వె
న్నాడన్ దీర్ఘికలందు మృత్తికలు అన్నప్రాయమై గాల నే
నాడో పచ్చికరూపు దాల్చి కుసుమప్రాయంబు సంధిల్ల పూ
బోడీ నీయలివేణి గొల్చెను మహాపుణ్యంబు రాజిల్లగన్.

౭౨

పానకమందు పుల్లవలె వచ్చి వధూటి రచించు గీతికా
గానరసార్ద్రమైన స్ఫటికంబున వీణను మీటుచుంటి వా
గానము గాత్రమాధురికి గాదు స్వతంత్రతలోన గన్న వి
జ్ఞాన రసానుభూతి త్రిజగంబుల నూపునటంచు చెప్పెదున్.

౭౩

కలువ గులాబి మోదమున గ్రోలుచు నావగలాడిఁ బోలు నా
వల నగుబాటుగా వలపు వడ్డికి బారగ కౌగలించు వె
న్నెల నెలబాల గ్రుంకు గిరి నిల్చి నిశాంగన కొంగునందు నా
చెలిమిని బాయుచున్ కనుచు చెప్పగ అెప్పలు మూసె నెవ్వగన్

౭౪

ఎప్పుడు చిక్కులె ప్రాణికి
చెప్పుకొనందగిన సుఖము చేకూరదు ఈ
ముప్పుల తేలుట యనునది
ఎప్పుడొ తెలియంగరాదు ఏమనవచ్చున్.

౭౫

ఏదో పెద్దరహస్యమీబ్రతుకులో ఏనాటి కానాడు నా
పాదించున్ నిమునోన్నతంబయిన ఈప్రాప్తంబు ఊర్ధ్వాపర
ద్యోధామంబుల పర్వులెత్తు నిది అంతో యింతొ లేకుండినన్
రాదే లాభము కోర్కెలెప్పుడు ఫలప్రాప్తంబులై రావుసూ.

౭౬

అలాగే అనుకొమ్ము ఆతలపులో అయ్యేవి ఐపోవు ; నీ
పాలేదో అదె గాని ఈనిధులు నీపాకాలుగా సాగవీ
బాలోన్మత్తునిలీల ఏల విఫల ప్రారంభవై యేడ్చెదో
బాలా ఏది లలాటమందు గలదో భావింపగా నేర్తువే.

౭౭

ఏలా పాడెద వట్టిపాటలను నీ యిష్టంబు చేకూర దే
వేళన్ మిన్నుల మూటగట్టి చను నీ విశ్వంభరాదేవి విన్
వేళాకోళము జేయు నీ మనసులో విభ్రాంతియే గావి నే
త్రాలన్ త్రాళ్ళ బిగింతువే శరధి ముత్యాలేరుకోగల్గినన్.

౭౮

కౌశికుఁ డానృపున్ చితుల కాపరిగా చెరగొన్న నాడు రా
కాశశి గాంచి కాలు చితి కైవడి నుండెనటంచుఁ బోల్చె న
య్యో శనిగన్న వాని మతి యుండదు జీవితకర్మవాసనా
వేశితమైన కాలహతి విహ్వలుజేయును బోర్లవెట్టుచున్.

౭౯

పాల న్నీరును రేబవళ్ళను సుధాప్రాయంబుగా ద్రావుచున్
కేళీలీల నొసంగు సీధువును నీ కెంగేలవర్జించు నీ
వేళాకోళము చూచి యీ వెలది నవ్వెన్ నవ్వులో నీవు నీ
లోలత్వంబు నెఱుంగనయ్యె మఱి నీలోపంబు మాయించునే.

౮౦

పాటలు నీవు నేను నొక పద్ధతినే వినుచున్నఁగాని ఆ
మాటల కర్థమున్ రసము మాత్రము భేదముఁ జెందుచున్న దో
పాటలగంధి నీసొగసుపై ముసుగున్ మెలివెట్టు మబ్బులో
మాటయి యున్న వెన్నెలల మాడ్కి మనోజ్ఞత చీలినట్లుగన్.

౮౧

పువ్వులు రాలిపోయినవి ముండ్లపొదల్ విలసిల్లుచున్న యీ
నెవ్వెరగందుతోట నిశి నెంచెడు కాపుర ముండఁగోరి యిం
దెవ్వరు వత్తు రగ్ని రగిలించిన వానల గ్రాలి క్రమ్మరన్
పువ్వులు లేచు మారణముపొంతను జీవిత మున్న దారయన్.

౮౨

మమ్ము నెరుంగువారు మధుమాసములో కలకంఠమెత్తి వ
న్యమ్ముల పాడుకోకిలల యందు శుకంబులయందు నా మయూ
రమ్ముల కోరిరేని వివరంబుగఁ జెప్పను వారు పాంథ లో
కమ్మున ప్రేమపాట చషకమ్ముల సీధువుఁ ద్రావనేర్చినన్.

౮౩

మీ రనుకొన్న చోట నలమేరువు లేదు నిశావధూటి శృం
గారపయోదపంక్తిపయి గప్పి వటాపంచలమందు దాచె నా
చీరచెరగునంటగల చేవగలారు జగాన మృగ్య మీ
దారర సైకసీథువుల ద్రావెడు వారికె గోచరంబగున్.

౮౪

నిజము నెఱింగెవేని మది నిద్దుర పట్టదు మౌఢ్యమందె యీ
ప్రజలు సదాగతాగతికపక్షి చరించుచునుందు రందు భూ
రజము నుడిన్ దిరుగరాలిన రేణువుభంగి ఊహలో
గజబిజి నొందుచుండెడు నొకానొకవ్యక్తి గ్రహించు సత్యమున్.

౮౫

నిద్రను లేచినన్ దిరిగి నిద్రను బోవుచునున్న నీమహా
క్షుద్రదరిద్ర జీవితము శోభిలుచున్న ప్రభాతభాసురో
పద్రవ శాతసాయక వివర్త వికంపిత రాగమాధురిన్
నిద్రితమై రసస్ఫురణ నిర్వృతి నేరదు ఎన్ని పాడినన్.

౭౬

పాషాణంబులు బ్రద్ధలై యణువులన్ ప్రాపించు నుద్భిజ్జ దు
ర్వైషమ్యంబులు లేచి శూన్యసదనాభావంబు వర్జించి సం
ధ్యేషస్సుల్ సవరింప వాసనల నుద్యోగించు నీపువ్వు నీ
యాషాఢంబు మరల్చుచున్నది దృగాశాక్రాంత నిర్విఘ్నమై.

౭౭

తోచనియర్థముల్ కలముతో రచియించెడుపట్టు నీకు నా
లోచనబుట్టు నీ హృదయ లోపములన్ సవరించుకొంచు దో
బూచులనాడు జీవితము పొంతను నీ వొక బొమ్మవోలె నే
దో చదువన్‌దలంతు వదియున్నదె వాస్తవమందు లెక్కడన్.

౭౮

నీదు కమండలంబు రసనీరసమై చషకంబు నాసవో
న్మాదుల తిట్టుచున్నది ప్రమాదము చూడుము శూన్యభాండమం
దేదొ వచించు నామధువునే కడుపారగఁ ద్రావెదేని నా
రోదన పోయి మత్తున పరుండెడి దానన టంచు ముగ్ధయై.

౭౯

నీవనునోడ నీప్రకృతి నీరధివీడుమ కర్ణధారి ఆ
దేవుడు వక్రమై నడచి తిప్పకుఁ జేరిన బద్దలౌను ఏ
దీవికొ చేరెనేని బహుదివ్య నవోదయ చారురత్న సౌ
ధావసథంబు పోల్చు మరి పొక్కెద వేటికి జీవితాప్తికిన్.

౮౦

పారాణిన్ బురుడించు నీకనుల సౌభాగ్యైకరాగంబు నిం
దారోపంబుల నేల్ప్రాకి నదియై యాలేమ పాదాగ్ర మం
జీరంబుల్ లిఖియించు నీమధురవాగ్జీమూత పంక్తుల్ సుధా
ధారల్ నింపుచు పోవు నాప్రణయగాథా మాధురుల్ గ్రోలగన్.

౯౧

పుట్టుం బువ్వు వివర్ణమై రససుధామోదంబు మధ్వాసవం
బట్టుల్ మారి కవోష్ణబాష్పకణ మా యభ్యంతరావాసమం
దట్టె రాల్చెడు నెచ్చెలిన్ దవిలి నీ యవ్యక్తరాగంబునన్
ముట్టెన్ ముట్టువు నన్ను నీ వలపులో మోసెత్తు సౌదామినిన్.

౯౨

ఐహికమైన మానిసులయందములో రసమున్న దా మహా
మోహిత గానమాధురిని మోదముగూరుచు నాసవంబు వ్యా
మోహితవృత్తి నా తెరలముందు నధఃపతితంబు మేల్ముసుం
గై హొయలార నాట్యముల నాడుట గూడ ప్రసిద్ధమే గదా,

౯౩

కేకివిలాసభాసురత కేంద్రముగాగ తదీయషడ్జమా
ఖ్యాకములైన గీతములు గానము సేయదలంచి పింఛసం
ధ్యాకలనంబుచే ధవళమైన యుషస్సును మేళవించి ఏ
దో కథ చెప్పవచ్చు నదె తోరపు ప్రేమయెలుంగు రాల్పడన్.

౯౪

మాది నిషిద్ధజీవితము మాన్పడియున్న తృణాంబుపూరసం
పాదితమైనవృత్తికను పారెడు ఆ సెలయేళ్ళ మధ్య నిం
పాదిగ పాడునాసుజల వాసితమౌ జలకన్య నిర్మలా
మోదము సేవ్యమానమయి పోల్చనతీరున నెంచుడీ మమున్.

౯౫

చ్యుతసంస్కారులు నీతిబాహ్యు లని యేమో నీవు నిస్సాణ మీ
గతి ద్రోయించుచు పోవుచుంటివి వృథాగర్వంబు సంధిల్ల నీ
మతి నానావిధదుర్నిమిత్తకలనా మాలిన్యమైయున్న సం
గతి చింతింప వదేల చీకటులలో గాన్పించు సౌదామినుల్.

౯౬

నీకున్ దోచెడినైతికార్థపటలిన్ నిర్వాణమున్నట్లుగా
లోకం బేటికి మూయజేసెదవు నీలోలేనిస్వర్గంబు యే
లోకానన్ గలదో యెరుంగుదువె నీలోపంబు లోకంబుపై
దాకన్మోపకు మీసుధామధుర సంధ్యాగాన మర్థించుమీ.

౯౭

నీకున్ దేశికులామలీమసమహా నిర్భాగ్యదామోదరా
నీకంబా సరియా జవంజవములో నీరై అధోలోకమున్
దాకన్జేతురు నీవు వారియురులన్ దప్పించి స్వాతంత్ర్య వి
ద్యాకాంతిన్ దివి కట్టుకొమ్ము హృదయ ద్వారంబులన్విప్పుచు

౯౮

నిట్టూర్పుల్ నిగుడించి శూన్యహృదయా న్వేషంబులో విశ్వసా
మ్రాట్టున్ బోల్చఁదలంచి బోర్లపడి విభ్రాజత్క్రళాలోకనా
ఘట్టంబైన స్వజీవనాటకకథాకల్పంబు వీక్షించి నీ
వట్టె మూర్ఛిలిపోయెదేల విఫలావ్యాప్తిన్ వినోదింపకన్.

౯౯

మీరనుకొన్న మార్గముల మేరువు లేదు నిశావధూటి శృం
గారపటాంచలంబు తెరగా రచియించి ముసుంగువెట్టి యా
దారిని మార్చివేసినది తప్పుల నొప్పులు చేసి నైతికా
గారముపేర మ్రాన్పడిన జ్ఞానము ముక్తి నొసంగ దేయెడన్.

౧౦౦

తిట్టుడు మమ్ము మాతెలివితేటలు వక్రపథాన బోయి మీ
తట్టునఁ జేర వీమధువుచేతను స్వర్గము దాక కాలువన్
గట్టి తమస్సులో పడవకైవడి మేము ప్రయాణమైతి మో
చుట్టములార మాసొగసుచూచి హసించుఁడు వెక్కిరించుచున్.

౧౦౧

ముసుంగును వీడి రమ్ము భవమోహితపంకిలమైన కాన కై
వసమున జీవితావధిని పాడొనరింపకు మంతరిక్షమం
దసదృశమైన రిక్కగము లంబుదపంక్తిని హారతుల్ జగ
ద్వసథము పానశాలవలె పాడుచునున్నవి వేడ్క జూడగన్.

౧౦౨

కాల మజాండమున్న వలకప్పి ప్రభాతము సంధ్యలన్న బా
ణాళిని బెట్టి కొట్టి హతమార్చి తమస్సున ముంచివేసె నే
వేళ విచారనీరనిధి వీచికలే శరణంబు నీకు వి
శ్వాలయ నాటకాంకముకటా మది చూచెదవెట్లు చీఁకటిన్.

౧౦౩

వీడినపూవుపై భ్రమర వీరుడు రెక్కల నార్చి పాటగా
పాడెడు గీతమే విరహ వార్ధిరసాకృతి పొంగిపార్లగా
ఓడి నిషాదమై పడయు నొల్లని తేనెలసోన లార్తి పో
నాడుచు పోయినట్టి వ్యసనంబులు వ్రాయగలేరు కోవిదుల్.

౧౦౪

చీకటియున్ బవళ్ళనెడు చేతులు చాచి రసస్వరూప వి
ద్యాకలనంబునన్ ప్రకృతి యక్కున దాల్చగ బిల్చుచున్నదో
కా కవి నీమతంబున వికావికలైన ప్రియార్థవాద దుర్
వ్యాకులమైన మచ్చ మరి బాయదు ప్రాణము బాసిపోయినన్.

౧౦౫

నీవు మనోరథంబుపయి నేరక పోయెదు క్రిందిమెట్ల క
య్యో వినుము వీధిపై కెగయు నూహల కాలము త్రొక్కివేసి నీ
భావము మార్చివేసె సతపస్సును జేసి మరల్చుకొమ్ము నీ
తావు నితాంతశాంతమమృతంబు రసాస్వత మంచు నెంచుమీ.

౧౦౬

ఈ మహనీయమైన నిజ మీశ్వరరూపము ప్రేమభావ ; మెం
తే మధుశాలకై వడిని ఏర్పడుచున్నది దీనిలోని మా
యామయికంబు నైహికమయంబుగ నీమది దోచకున్న సౌ
దామినిలీల చీఁకటినిదాటెద వెంతయు చింత యేటికిన్.

౧౦౭

ప్రారబ్ధంబును సంచితంబును ననర్థాగామియున్ దైహికా
చారంబైన నిషిద్ధకర్మలు భవత్సత్యంబులో లేవు శృం
గారారామ నటన్మయూర విశిఖాగ్రారావముల్ ప్రేమలో
యేరై పారి ఘనాఘనంబులకు నెంతే మోసులెత్తున్‌గదా.

౧౦౮

నీకు దురాగతంబులగు నిందలు బాధలు శోకమోహదు
ర్వ్యాకులమైనమచ్చలు అహర్నిశమున్ భయపెట్టుచున్న వ
య్యో కలఁ గాదె లోక మిది యూహ నెఱింగిన నవ్వు వచ్చు ఆ
లోకనమైన ప్రేమరస లోకములో విహరించు మెంతయున్.

౧౦౯

అదిగో దూడలు ఆలమందలును దుగ్ధాపేక్ష వెన్నాడు ; నం
దుదయంబైన రసావలోకన సముద్యోగంబు చింతించితే
అదె నీ జీవిత మందుఁ జూచెదు పిపాసార్థంబు కారెండలన్
వెదుకన్ బోకుము స్వప్నతుల్యముభవద్విశ్వంబు వాంఛాకృతిన్.

౧౧౦

చినిగిన కాగితంబు లిటు చేర్చెద వేటికి చిత్రవస్త్రమై
తనువును గప్పునో అది యథావిధి పెద్దపురాణమౌనొ ఈ
జను లిది చూచి నవ్వరొ ప్రజాప్రతిపాదకమైన బుద్ధి నీ
మనమున నిల్పి ఈశ్వరుని మార్గము నీవయిపొమ్ము యోగివై.

౧౧౧

అవిగో పక్షులు పారుచున్నవి కులాయాపేక్ష నాకర్షకో
త్సవమై భాసిలువస్తు వందు కలదే తర్కింప తద్భ్రాంతి బా
సి విధూతేచ్ఛ తపస్వి మేలుకొని యీసృష్టిన్ విలోకించు నా
యవకాశంబు చరాచరంబయిన బ్రహ్మాండంబు నిద్రించినన్.

౧౧౨

ఎచ్చటి కేగుచుంటి వరరే భవదీయ విలాసదృక్పథం
బెచ్చట నున్న దందు విషయేచ్ఛ లగాధజలార్ణవంబులో
గ్రుచ్చి నెరుంగవేమి అడుగుం బడి రత్నము లేరుకొందువో
త్రచ్చి విషంబు గొందువొ సుధారసమందు జనింప కుంతగన్.

౧౧౩

సౌందర్యంబు పునాదిపెట్టినకళాస్థానంబు మృగ్యంబు నీ
యందున్ రూఢములైనవిద్యలె యుపాస్యంబుల్ తదన్యంబు లా
నందంబుల్ క్షణికంబు లైహికములున్; నాట్యాంగణం బిందునీ
యందే యున్నది చూచుచుంటిమి అనూహ్యంబైనమైకంబుగన్.

౧౧౪

కన్నులపండువై విమల కాంచనదివ్యచలద్ఘనాఘనా
భిన్న నిశాకవాటమును విప్పి కనుంగొను స్వర్గలక్ష్మి యీ
వెన్నెలయందు దోచు వినువీధిని నాటకరంగమట్లుగా
పన్ని తెరల్ రచించి అదె పాడుచునున్న దుషస్సు రాల్పడన్.

౧౧౫

కాటుకకంటితో కుసుమ కాండము బోల్చెదవేల ఆ కళా
నాటక సూత్రధారినయనంబుల కేంద్రము గన్నసొంపు నీ
పాటల గానవచ్చు మధుపానము వేరుగ చేయనేల యీ
లాటి రసైక మైకముల లాలిక కేమి యెఱుంగు నెచ్చెలీ.

౧౧౬

ఏదిస్వతంత్ర తీబ్రతుకు ఏడ్చుటకైనను సుంత నోచుకో
లేదు తెగించి యీవిధి మలీమసజీవితమున్ ముగింప దు-
ర్వాదము లెన్ని వచ్చి అపవాదము లింత భరింపరాదు ఇ
స్సీ దయివానకేమియొనరించిన కీడు కలంచివేయగన్.

౧౧౭

పుష్కలావర్తమేఘ భూములవిధాన
నాదుకన్నీళ్ళు గురియు ఏనాఁడుఁగూడ
నీదువిరహాగ్నిఁగాలి పెన్జీకటులను
జారిపోయెడు నెడద యెడారియరదు.

౧౧౮

భైక్షుకమైన యీమధుపాత్రను మైకము పెట్టలేదు నీ
కుక్షిని బెట్టుచున్న దదిగో చషకంబునకంటె నీవు వే
లక్షలు తగ్గిపోయితి విలాసములం బడి ప్రేమపారమం
దక్షయమైన ఈమధు వజాండము మైకమునందు ముంచెడున్.

౧౧౯

అదిగొ ఉషస్సు మేల్ముసుగునందు నిశావసనంబు వీడి ప్రా
క్సదనము వేగుచుక్క తెరచాటున నవ్వుచు తెల్లవారె మీ
హృదయకవాటముల్ తెరచి యేకముఖాన ప్రభాతగీతముల్
మొదలిడరేల మ్రాన్పడిన మోళ్ళు చిగుర్చునటంచుచెప్పెడున్

౧౨౦

ఈభిక్షంబు సతంబె ఈసుర స్వతంత్రేచ్ఛా విహారక్రియా
సౌభాగ్యంబున గల్గు రాగ రస విజ్ఞానంబు పాలించు వి
ద్యాభావంబు జనించుదాక అదె సంధ్యాచ్ఛన్న సౌందర్య ధు
ర్యాభాసంబు నిశాంగనా పటకుటీరావాస సంగీతముల్.

౧౨౧

ఆ రమణీయ ప్రేమ విభవాస్పదమైన ప్రసిద్ధ జీవితం
బేరు హరించినారొ అటఏమిటియున్నదో నేడు బద్ధ దు
ర్వారదురంత దుఃఖభవరాగర సోల్బణమైన శూన్యకాం
తారముఁ గానవచ్చు నది దాటగరాని నిశాకవాటముల్.

౧౨౨

భరమౌరాగరసంబు సంధ్యలు నుషః ప్రాసాదముల్ గైకొనన్
చరితార్థప్రతిపాదికంబగు నభః స్వర్గీయ గానంబులో
నెరసైపోయిన ప్రేమపాఠ మెవరేనిన్ బాడి నిద్రాణమై
ఇరులన్ గాటుకబట్టియున్న మది నెంతే లేపగావత్తురే.

౧౨౩

వరదల్ పాఱెడు నేటిలోరుతి నభః ప్రాలేయరుక్చంద్రికా
స్ఫురసౌందర్యము మూటగట్టి యొడిగొంపోవున్ నిశాకన్య యా
తెరలో దాగుడుమూతలాడుమిథునాంధీభూతరాగంబు నె
వ్వరిదోసిళ్ళ నలంకరించునొ అనే భాగ్యంబు వర్ణింపఁగన్.

౧౨౪

వరదల్ పాఱెడు నేటిలో నెవరు సోపానంబుల్ గట్టి భూ
ధరగర్భంబుల కేగజూచెద రదే దండహ్య కాలనలా
వరణం బాకస మంటుచున్నది మహావాదంబులో ధూళిలో
మరుగై పోయిన వెల్గు త్వన్మధువులో మాసై కనన్ రాదిఁకన్.

౧౨౫

పరమార్థంబు తపస్సు సంధ్యలు మఘుప్రాధాన్య వాదంబు లె
వ్వరు కల్పించిరొ ప్రేమవహ్ని యెడదన్ భగ్నంబు గావింప ఆ
నెరసుల్ పోయి రసంబు తేజమున నిర్నిద్రాకృతిన్ బెట్టి ఆ
ఇరులన్ ద్రోలె ప్రభాతమార్గణము లెంతే విచ్చిపోనాడఁగన్.

౧౨౬

ఆనెలవంక గుర్రింకి అపరాద్రి నిశాంగనకొంగునందు అ
య్యో నిదురించుచున్న దదిగో మఱి తేజము లేదు ప్రాప్త కా
లానలమందు నొక్క నెరసై యిటు భూమికి భారమై ఘృణా
నూననిషిద్ధ జీవన మనోవ్యథ నేగతిఁ బుత్తు చీకటిన్.

౧౨౭

బోరలపడ్డ జీవితము పొంతను బొక్కుచు శూన్యభాంత మె
వ్వారికిఁ బోలు నీవిపిన పాంథులకాళ్ళను ముక్కముక్కలై
మారి మనస్సుపై పడిన మచ్చలతో పురుడించు వాని ని
ట్టూరుపు టగ్ని వర్షము సముజ్జ్వలకాంతుల మాపఁ బోలదే.

౧౨౮

మరచెదవేమొ నీప్రియతమంబగుబాస నిజానురాగ బం
ధురమగు మైత్రి ; అధ్యయన ధుర్యములైన త్వదీయప్రేక్షణా
వరణము ప్రేమగానమును పాఠము సేయుచు నుండు నన్నని
వ్వేర రతనాలనేల చొరనిచ్చునె చీకటి కొక్క నాటికిన్.

౧౨౯

అదుకో రమ్మ ఓ వగకాఁడ నేడు
శాద్వలంబుల నెమిళులు చాలఁగలవు
కేకి కేకారవంబుల కేసిపోయి
కలిసి నాట్యాన నడుగుల కలుపుదాము.

౧౩౦

మధువునుద్రావి మానినులమధ్య విలాసవిశేష శేముషిన్
సుధలనుఁ జిల్కు పాటలను సొక్కుచు జీవితనాటకంబులో
పథికునిబోలె వచ్చి అలస్వర్గకవాటము విప్పుచున్న త
త్కథకునిఁ జూచి నేర్చుకొనగాదగు ప్రేమరసస్వరూపముల్.

౧౩౧

ఏటికి నీవిచార మిక ఏమిటి లాభము వెఱ్ఱిగాని నా
నాటికి విశ్వరూపము అనంత విధంబుల మారిపోయి నీ
బోటి తపస్వి బోర్లపడి పోయెడు నీవిషకాలమందు ఏ
మాటకునైన తావొసగు మార్గము గానగరాదు నెచ్చెలీ.

౧౩౨

పుట్టకపూర్వ మొంటివని బుద్ధి దలంపకు పుట్టినాక నీ
పట్టున వచ్చు ప్రాప్తములపట్టు నుపేక్షను సేయఁబోకు నీ
గుట్టు కులాలచక్రమును కుండనుఁ బోలిన; దందు బద్ధలై
నట్టు జలావభావము గతాసువు శూన్యమువైపు బోయెడున్.

౧౩౩

శూన్యము పంచభూతములు చొచ్చెడుచోటని యెంచఁబోకు నీ
కన్యముఁగాని శాంతినిలయంబున కర్థము దీని యున్కి సా
మాన్యులు చూడలేరు తెరమాటున నాటకరంగమట్లు ని
ర్జన్యనిరామయోర్వి తనరారును రెండుగ చీలిపోవుచున్.

౧౩౪

చిరచెఱంగు నేలను రచించెడు గంటివె ప్రేమపాత్ర మా
వారిజనేత్ర నేత్రముల ప్రామినకాటుక దాని నంటగా
నేరదు పూతసచ్చరిత నేర్చిన ఆమె నిజానురాగమం
దారవపాలు భిక్షమునకై జనదే విషయాభిలాషివై.

౧౩౫

ఈతడు గూఢచారి మనకేటికి చుట్టరికంబు ఈకళా
ఘాతకు లర్థరూపమున గానగరారు నిగూఢవర్తనా
ఖ్యాత రసస్వరూపము లయందు మలీమసమైన మచ్చలన్
జూతురు పాంథలోకమున బోలిన సీధువు ద్రావనేర్వకన్.

౧౩౬

శృంగారంబునుగూర్చు నీసొగసు మాదృష్టిన్ సుమావేశసా
రంగంబట్టుల లాగివేసినది త్వద్రాజీవ పత్రేక్షణా
పాంగంబైన సుధాస్త్రపంక్తి హృదయద్వారాల భేదించి అ
ర్ధాంగీకార నటత్కళా కలిత విద్యారంగముల్ జూపెడున్.

౧౩౭

కంటకముల్ కురుల్ హృదయకాండము గ్రుచ్చుకు పోవుచుండవె
న్నంటి హసన్ముఖంబు నెలయందలితేటను బోలు నేదియో
మంట రగుల్చు నీప్రణయ మాధురి మాధ్వరసైక మైకమం
దొంటరిజేసి నవ్వునటులున్నదె పాంథుల పాఠశాలలన్.

౧౩౮

తాళము వేసియున్న నిజధామము ఎవ్వరిదోను అందు వై
తాళికు లేమిపాడి ప్రమదంబు ఘటించుచు నున్నవారొ రా
రేల కవాటముల్ తెరవరేల నిశాంగనకొంగులో జగ
జ్జాలము నిద్రపోయె తెరచాటున దాగుడుమూత లాడగన్.

౧౩౯

ధూళినభంబుపై కెగర దోగుచు నున్నది దాని వాక్కు నా
కాలయ మేగుచుంటి నని యాడుచున్నది యీరథంబు చ
క్రాలను జీర్ణమైనతృణకాండము నూర్ధ్వజగాలుగన్న నీ
వేల జితేంద్రియుండవయి ఈశ్వరు గాంచ వుపాధి మార్చుచున్.

౧౪౦

చాలి నెలన్ హసించుటకు చక్కిలిగింతలు పెట్టుచున్న ఈ
రేలలితాంగి యీలవలి రేకల ముద్దిడుచుండె నెచ్చెలిన్
గ్రాలెడు ముగ్ధరాగమతి గన్న తెరంగు ప్రియాప్తిగాంచి కెం
గేలవిదగ్ధ వాక్సుధల గేరుచు నవ్వుచునుండె చూచితే.

౧౪౧

పువ్వులమధ్య తుమ్మెదలు పోవుచు పాటలు పాడుచుండగా
నవ్వేడు మొగ్గ మోము విడినన్ బ్రహసించెడుపువ్వు నేలపై
నివ్వటిలున్ లురచ్ఛలన నిర్వృతమైన పథశ్రమంబులో
నెవ్వరుగాని మోదము వహించరె ఆశలు చాటు మాటలన్.

౧౪౨

నదిలో కొట్టుకుపోవుచున్న తృణ మేనాడైన పుష్పించి సొం
పొదవన్ మోదము గూర్చునే మెరుగుబుర్వుంబోలె కాంతిన్ వెలా
ర్చెదనన్నన్ శిఖి ముట్టునే తుదకు నే రేలన్ నిశాకన్య ప
య్యెదలో దాగొని తొంటిరూపు గను పేరాశే విలోకించెడున్.

౧౪౩

అణువులు గూడి కూడి ప్రణవాకృతి దాల్చి జనించుచుండు నా
యణువులు మారి మారి మరణాప్తిఘటించును రాకపోకలం
దణుపరిణామమే ప్రకృతియందు రహస్యము ; రేబవళ్ళు జీ
వనపటమెత్తు త్రాళ్ళు తెరబైటను జారకు క్రింది మెట్లకున్.

౧౪౪

చీకటి యీయజాంతమును చేతులఁ జాచుచు కౌఁగలించె న
య్యో కలయందు నీమరుగులున్నవి వానిని విస్తరించి యీ
లోకము పోల్చుకొమ్ము తనలోగల చీకటి పోయి ఆకళా
లోకనమందు నిజడత లుప్తముజెందును నీవె నీవుగన్.

౧౪౫

జల్లెడయందు తూట్లవలె జాలమునం గలగన్న లేయెడన్
ద్రెళ్ళినగాని మూసికలు తీరిచి కప్పగలేము అట్లు నా
యుల్లము తూట్లుతూట్లు పడియున్నది మాయని మచ్చలై వెసన్
క్రుళ్ళెడుపో చికిత్స మరికూడదు భైషజులార పొండికన్.

౧౪౬

ప్రతిముత్యంబున రంధ్రమున్న దది హారంబై విరాజిల్లు త
ద్గతి నీలోపము సీధుపాత్రలకు సింగారంబు గావించు సం
చితసూచీవిచల ద్విభేదనకళాచ్ఛిన్నంబు గాకుండ ఏ
మతి మున్ శోభిలదానిశావధియె సంభావ్యంబు సాదామినిన్.

౧౪౭

పాడుము పాట ఈవిపినపాంధులకున్ సయిదోడుగాగ వె
న్నాడెడు గూఢచారులమనంబులు వ్రక్కలుగాగ నీకళా
రోదము సీధుపాత్రను నురుంగును బోలె మరొక్క రూపులో
జూడగవచ్చు ఈ చెనటిజోస్యము మైకమునందు గల్గెడున్.

౧౪౮

ఎటులన్ దాచితి ప్రేమగానము పికీ యాకృష్ణపక్షాల చె
ల్మిటు లాశీః ప్రతిమింటికెత్తిన నివాళిన్ దోచురాగంబు క
ర్కటమేషావధిలో ప్రభాతములు బర్వన్ భావదాస్యంబు మా
న్పుటకై యీ శిథిలాశ్రమం బునికిగా బుత్తెంచితే జోదువై.

౧౪౯

ఈ మధుపంబు పూర్వ మొక హీనపుపుర్వు ఉపాధి మార్చి ఆ
హోమవిధిశ్రుతుల్ నుడువుచున్నది మార్మనువుఙ వెలార్చ నీ
సామము గానయోగ్యమయి సాగిన ప్రేమరసైకపాఠ వి
ద్యామహితాప్తి మాన్పడిన యాగమపంక్తిని లేవనెత్తెడుఙ.

౧౫౦

ప్రేమ రచించి వీణె వినువీధికి నెగ్గిడి పాడు చారు సౌ
దామిను లంబుదంబులను తంత్రులతో జతకల్పె నీకళా
ధామము మీటువానియెడదన్ జడభావము మేళవించున
య్యో మయికాన .... .... .... ....

౧౫౧

ఆసొగసైన వెన్నెలబయళ్ళ సుధాంశుని ప్రేమరాజ్యమం
దోసఖి నవ్వుచుంటివి సముజ్వలకాంతులు మేళవింప నా
హాస ముపాసితంబులగునట్టి పదార్ధవిమిశ్రితంబులం
దే సహజానురాగ మగుపించు విలాసము లాస్యమాడగన్.

౧౫౨

అంతములేని యీసొగసునందు ప్రఫుల్లముఖారవింద యీ
కాంతప్రియానురాగ మదె గానముచేసెడు వింటివొక్క ర
వ్వంతదృగంచలంబుపయిన శ్రువు దోచి వియోగ మెవ్వ డే
శాంత ఘటింపరాదనుచు ఘోరున చాటెడు ముక్తకంఠయై.

౧౫౩

కాదనలేము మా కలహకారణమైన రసానుభూతిలో
వాదము రక్తపాత తిమిరంబగు యుద్ధముకన్న నెక్కుడై
ఆదయితాస్వరూప నిచయంబగు నిర్గతప్రేమరాజ్య సం
పాదనదెచ్చె యీప్రళయపాతములే ప్రణయాంకరంగముల్

౧౫౪

చరిత యవశ్యకంబు నిజసంగతి మృగ్యముగానిఫక్క త
ద్గతి గతిభేదముల్ తెలిసిగాదె యదార్థము లుండు ; తేనిచో
ప్రతిమనుజుండు కృత్రిమపుపాత్రల వాడుకఁ బెట్టి లోక సం
గతి బరిమార్చ్చఁజూచు చిరకాలము దాగదు మాయమృచ్ఛలన్.

౧౫౫

కథకులు వీర తీచదువుగాదు ప్రసన్నతజూపు సూచికా
పథము ప్రియాంగనాహృదయ ప్రాగ్వ పథంబున పూయు కంటక
ప్రథితసుమంబు వాసనలవాసి యదే తలక్రిందులై జరత్
పృథివికి రాలఁజూచు నదియొత్తెడు ప్రేమరసానుభూతికిన్.

౧౫౬

కోకిల కంఠ మెత్తి తనకున్ గల మాయనినల్పు బోవగా
కేకలు వేసి వేసి తనఖేదము వెల్లడిసేయుచుండ ము
క్కాకలు తీరినట్లు కవికాండము పంచమరాగపూరితా
ఖ్యాకలనంబుగా తలచినట్లు తలంపరు ప్రేమపాఠముల్.

౧౫౭

ఆహా! శూన్యము దీని నొక్కప్రియురాలైనట్టుగా నెంచి నీ
యూహన్ పెక్కువిలాసవైఖరులతో నూరించుచున్నాడ వీ
మోహం బెంతవిషాదపెట్టగలదో ముం దేమికానున్నదో
యూహా మద్యముదావ్రి మత్తమతివై యీనేల నిద్రించుమీ.

౧౫౮

పారము ముట్టగా రజని పాడెడు పాటల మేళవించి శృం
గారరసానుభూతి పరికంపిత ముగ్ధనిశాంగనా నట
చ్చారువిలాసవైఖరిని చాటు ప్రభాతవధూటి నవ్వులో
తోరపు సోయగంబు దెస తోచెడిదే దివినవ్వు నీదెసన్.

౧౫౯

సంగమసంగతంబయిన సంగతి శూన్యమునందు వెల్గు వ్యా
సంగముచే గ్రహించి నిజసంగతియందు లయంబు నొంది సృ
ష్టింగల ప్రేమసీధువును చేరలఁ ద్రావుచు సంతసించు మా
గొంగళియందె యీశ్వరునిగోడు నెరింగితి మిం కిదేటికిన్.

౧౬౦

నెల పదియారుసత్కళలు నేర్చి విశుభ్రవిలాస జ్యోత్స్నచే
పులకితఁజేసె యామినిని ముద్దులఁ బెట్టుచు నున్నయట్లు నీ
విలసిత ప్రేమపాఠముల విహ్వలచేయుచు కౌఁగిలింపఁగా
దలఁచెదవో ప్రభాతమున పాడెడు గానము నాలకింపగన్.

౧౬౧

మేము పరిత్యజించితిమి మేదినిలోని సుఖంబు దుఃఖమున్
సామము లేదు సత్యము ప్రశాంత మహావిభవంబు లేదు. వి
ద్యామధుపాన మత్తమతియై విహరించుచు మేఘపంక్తి సౌ
దామినిబోలె చీకటులదాటి తమస్సుల నిద్రలేపుచున్.

౧౬౨

ఏదియు నిల్వలేదు తుదకీగతి మచ్చలుపడ్డ మానసం
బేదరిలేని దుఃఖముల నీశ్వరు గాంచి తరించునూహచే
బాధల నొందుచున్నది ప్రభాతములోని ఉషస్సు లశ్రుధా
రాదయితంబులై పిలుచురాత్రులయందు లయంబు నొందగన్.

౧౬౩

గుండెలు తూట్లుపడ్డవదిగో మురళింబలె ప్రేమగీతి కా
కాంతము పాడుచున్న దలకైపున మత్తిలి పాంథకోటి కూ
ర్చుండెను విశ్వరూప మటఁ జూచుచు ఆ గగనాలమధ్య మా
ర్తాండునిబోలె నాప్రియునిదర్శన మయ్యె తమస్సు వీడగన్.

౧౬౪

వీడినదానిలో ప్రియమువీడగలేదు ప్రియంబుగన్న పూ
బోడి హసన్ముఖంబు వెలిబుచ్చనినాడు విషంబు గ్రక్క వె
న్నాడుతలంపులో యిరులునాట్యము సేయు విశీర్ణ మీ జడా
రూఢనిగూఢమర్మ మవరోధము బాయగలేరు మానవుల్.

౧౬౫

ఉవిద మదీయమానసము నూసునకై యడుగంగ వచ్చితే
రవిలిన యగ్ని కాంచనము రాజిలునట్లు ప్రియావియోగ సం
భవ బడబాగ్నిలో కరగి భగ్నముగాక మరొక్కపుట్టులో
నవళ పదాలధూళినయి నాకము ముట్టెద నంచు చూచెడున్.

౧౬౬

ఎవరికెఱుంగ జెప్పుదును ఈహృదయాంతర వేదనంబు నిం
దెవరికి లెక్కమావలె ననేకులు ప్రేమ దహించి రా జవం
జవనిహతిన్ తమోనిధిని మాయని మచ్చలు మానసంబుపై
దవిలె ధనుర్విముక్తశరధారలు తోరణగట్టె నెత్తుటన్.

౧౬౭

భయపడెదేల యీ బ్రతుకు వాసరముల్ నిశలందు దీపికా
చయమయి విశ్వరూపమున స్వర్గము గట్టుచునందు కామినీ
నయనములందు కాటుక మనస్సున మాయని మచ్చబోలె నీ
కయితను చెప్పుచున్నది నిగారనిపేయప్రియాసవంబులన్.

౧౬౮

మేము విశీర్ణమౌనడుగుమెట్లకు బోయి నిషిద్ధజీవితా
రామమునందు సీధువును ద్రావుచు రాగరసంబులో సుధా
ధామము గట్టి మబ్బుతెర త్రాళ్ళను లాగి మెరుంగ శర్వరీ
భామిని ముద్దుపెట్టినది రాయని నవ్వుచు నుంటి మీయెడన్.

౧౬౯

చషకమునందు మైకమిడఁ జాలనిసీధువు నీకుఁ గూర్చినన్
విషయము చెప్పి నవ్వెదవు నెచ్చెలి మైకము రాకమున్నె నా
తృష వివరింప పాడెద ననే యది మైకము గూర్చు నీకు నా
మిష మధుపాన మత్తమతి పీవనునింద వహింతువంగనా.

౧౭౦

ఆవిధి శూన్యనాటకమునం దొకపాత్ర కళాప్రపంచ వి
ద్యావివిధార్థముల్ తెరలు ఆర్థిక మాసవ పానమందు మై
కావధి ప్రేమమాధురిని గాంచెడు స్నిగ్ధ విలాసలాస్య సం
భావితమైన జీవితము వైణికతంత్రిని బోలె మ్రోగెడున్.

౧౪౧

బద్దలుకొట్టి జీవితము స్వర్గము గైకొనఁబోయెదన్న నీ
మొద్దుతనంబు మాను మట మోక్షము నాశములోన లేదు నా
ప్రొద్దు నితాంతశోభిత ప్రమోదపదంబులు దెచ్చు నందులో
దిద్దెడు సోయగంబులను తీరిన ఆదివి కట్టు మేయెదన్.

౧౪౨

మధువును పాత్రలో నునిచి మాకిడుచున్న లతాంగి తత్సుధా
మధుర రసైకగానముల మాకథలన్ని వెలార్చుచున్న దీ
మధు సమయంబు కోకిలము మావిపయిన్ గలకంఠ మెత్తి ఆ
విధముగ చాటుచున్న దదె విశ్వము నవ్వుచు వెక్కిరింపఁగన్.

౧౪౩

పాత్రను బోయునట్టి మధుపర్కము మైకము సేయు దీవు ఏ
మాత్రము త్రావినన్ వెగటు మైకమునన్ దెగపాడుచుంటి వీ
క్షేత్రము స్వర్గధామ మని సీధువుకన్నను మైకమిచ్చు నీ
గాత్రము గానమాధురిని గాంచుము మానసికైకమైకమున్.

౧౪౪

కొండలజారు నేళ్ళవలె కోమలమున్ దిగజార్చి కాల నా
ధుండు వినీలజాలములు తోమియు తెల్లగమార్చి వేసె వీ
పండిన నెత్తిపూలు ముడువందలపోసెద వేల నీ వయో
భాండము బద్ధలై రసము వాయకపూర్వమె సొంపునింపుమా.

౧౪౫

శుభదివసంబు నీ మొగము చూచిననాఁడు సరోజనేత్ర నీ
విభవము సృష్టిలో కళల వెంబడి బోవుచు మర్మగర్భ స
న్నిభమయి హృత్కవాటముల నీరొనరింపుచు చూపు విశ్వమున్

౧౭౬

బారుగా పెద్దఎలుగెత్తి పాడనిమ్ము
ముక్తకంఠాన నీ పేరు బొమలు విరచు
ప్రణయ పథములు నొసటను వడెడు వళులు
ప్రేమపాఠాలు నేర్పు వారింపబోకు.

౧౭౭

పడుచున్ లేచుచు నిద్రపోవుచును సంపాదించుచున్ గేరుచున్
కుడువన్బోయిన జన్మభూమి యిది మాకున్ స్వర్గమున్ బోలియీ
నడిరేయిన్ నిశివద్దపాతముల విన్నాణంబు గోల్పోయి ఆ
పాడిచే ప్రొద్దుల పోవ బోవు నదె రేపో మాపో లెక్కించుచున్.

౧౭౮

ఈ కవితాసరస్వతి యనేక సహస్ర శతాదికాబ్దముల్
లోకము సంతరించి నిశిలోఁ బులకింప సరీర మార్దవా
ళా కలనంబునన్ సొగసులన్ విలసిల్లునె చెప్పు నీకళా
లోకనమందు భారతికి లోపము లుంచుట చెల్లునే కవీ!

౧౭౯

ఏమేమో యని వెక్కిరించుటకు నెంతే నేర్చితే గాని నీ
మోమాటంబున చెప్పలేదు మరి నీ మూర్ఖత్వ మాతిట్లలో
నే మాత్రైనది చూడవేమి పరిపూర్ణేచ్ఛావిహారక్రియా
సామర్థ్యంబున దోషదృక్కులకు లక్ష్యం బున్నదే చెప్పుమా.

౧౮౦

ఈ విపరీతభైక్షుక మిదేటికి వచ్చెను కక్షపాలలో
దేవుని బెట్టికొంటి మఱి దీనత యేమిటి తండులంబు లం
దేవి? క్షుధార్తి ముష్టికయి తెంపరివై తలపోయుచుంటి వీ
జీవమహత్త్వ మేమిటో యిసీ యశనంబొ తపస్సొ చెప్పెదే?

౧౮౧

కాళ్ళకు గజ్జె లందియలు గళ్ళున మ్రోయు రవంబు రెండుసం
దిళ్ళను బట్టుకొన్నటుల దిద్దుచుఁ బాడెడు పాటలోన నీ
మోళ్ళు చిగుర్చె ఆ సొగసు ముట్టినచోట రసంబు కాంతిలో
మళ్ళుచునున్న దామరుగుమాటుదె తత్త్వము వేఱయున్నదే

౧౮౨

దేశము కాలవాహినులఁ దెమ్మెరలన్ సుడివడ్డనావ సం
కాశము నొంది దాస్యముల గ్రాలినదోయి కవీ స్వతంత్రతా
వేశము నింపుమెల్లెడఁ బ్రవీణమతిన్ రచియించు ప్రేమ సం
దేశము కంచు ఢక్క నిడె దేల బజారిది యాలకింతురే.

౧౮౩

ఏదో యున్నది చెప్పవైతివి సరే యీ కారుమేఘాల నా
మోదంబిచ్చు తటిల్లతాచయము సంబోధించు నీ గుట్టు అం
దేదో మాయని మచ్చలందఱును గంటే వచ్చులోటేమి ఔఁ
గాదన్నన్ దగవేమి చెప్పెడిది నిక్కంబే గదా నెచ్చెలీ !

౧౮౪

కాటుక కండ్లనుంచి తన కంటెను అందమునందు లేరనే
మాట మనస్సులో నిడి ప్రమాదము లెంచక మోటువాళ్ళ యీ
నాటకమందు పాద మిడినావు త్వదాశకు మేరలేదు ఈ
పాటికి ఇంటికిన్ నడుము పాటలముళ్ళను విప్పుకొంటకున్.

౧౮౫

పాతాళంబు పెకల్చి దోయిలిని నీ వాఃపూరమున్ పట్టి యీ
ప్రాతఃకాలముదెచ్చి యిచ్చితివి నీ పానంబు మధ్వాసవో
పేతంబైన సువర్ణభాండమున సంప్రీతిన్ ఉషస్సంధ్యలం
దాతిథ్యంబు నొసంగు తెమ్మెరలనే దావాప్తి వర్తించెడున్.

౧౮౬

మొదటి చూపున నీప్రేమ పుట్టదేని
నాకు నీయగచాటులు రాకపోను
మనసు మనసు కూడిన దన్నమాటె కాని
మంటలెగసిన ఈప్రేమ మాయదేమి !

౧౮౭

మాకు రసార్ద్రమైన మధుమాసములందు శకుంతలంబు లా
మ్రాకుల నెక్కి యూగుచును మాటలసందడి చెప్పనూను లే
దో కలవచ్చినట్లు ఒకటొక్కటి పూర్వగతాగతంబులం
దేకరువెట్టి ప్రేమ నిగురెత్తెడు పాఠము లేరు నేర్పిరో !

౧౮౮

చండవిచండితప్రభ లజాండము నిండ నుషస్సు దాటి మా
ర్తాండుఁడు నెత్తిపై కెగసి దారుణ తాపము బెట్టుచున్న యీ
మండెడువేసవిన్ విపినమార్గమె పోయెడు బాటసారి యె
వ్వండొ నిమిత్తమాత్రములు పాడుచు ప్రేమకు దిద్దురూపముల్.

౧౮౯

జానపదంబులందు తనజన్మ పొలంబులలోని చెట్లతో
గాని హితంబులేదు కొరగానియెలుంగులు రాలుపాట లీ
మానిని కెట్లు వచ్చె నసమాన మనోహర చారురూప రే
ఖానిచయంబు ప్రేమకు నిగారము పెట్టు నొయారమారయన్.

౧౯౦

ఈ రాలఱ జవరాలు పాదమిడి పాడేపాట పారాణితో
తోరంబైన విచిత్రరేఖలకు నెంతోమోద మేపార శృం
గారాగారములఱ సుధామధుర రాగాలాపముల్ సేయు త
ద్వారంబే యిడి బోర్లవడ్డది మహాధ్వాంతంబు రూపింపఁగన్.

౧౯౧

ఆళ్ళను చోళ్ళ దంచి తమ ఆకలిదీర్చికొనంగ నెంచు కూ
తుళ్ళను గంటివే బ్రతుకు తొంటి మహానరకంబు లేదు ఈ
సుళ్ళను మార్చి విశ్వమును చూచెడు మార్గమె యున్న నింక నె
న్నాళ్ళకునైన రాకడియె నాకముగా నటనుందు నెచ్చెలీ!

౧౯౨

గతచెడు కాలవేగమునఁ గానఁగనయ్యెడు సోయగంబు ఈ
వడువునఁ బుచ్చెనన్న నది స్వప్నము నీరసమైన జీవితం
బడుగున జారిపోవుచును భావరథంబుల నెక్కి చుక్కలన్
గతపగజూచు నీపథము కాదనలేము మనుష్యజాతికిన్.

౧౯౩

రాకాచంద్రుడు వెన్నెలన్గుఱియు తంద్రాజీవమున్ జూచి ని
ద్రాకాంక్షల్ వ్యసనాహతిన్ దవులుముద్రన్ ప్రాప్తకాలంబు లా
లోకింపన్ సమకట్టు నీప్రకరణాలోకంబు శూన్యంబులో
ఏకల్పానకొ నీడ్చు జీవితవిధా నేచ్ఛావిహారక్రియన్.

౧౯౪

దాచినపెద్దకాల మెద దాహము తీరగలేదు వానిలో
దోచినలోపముల్ పరులు దోయిటబట్టిన చిక్కిపోవు ఈ
నాచరితంబు మీచదువునం గనరా దది మీరుచూడ రీ
మేచకకుంతలంబు లిటు మేదిని నీడ్చుచు వ్రాసి చూపినన్.

౧౯౫

భానుఁ డుషస్సుతూరుపుదివాణము కోటబురుజు లెక్కి నీ
పైనిడుచుణ్ కటాక్షములు వంక నదేపనిగా ధరించు నా
జాను విలంబకేశములఁ జారునిశాకలశంబు నాచికోఁ
బూని రసార్ద్రమైన మధుపూరము చేరలఁద్రావు చూచితే.

౧౯౬

కాకా లేవొ గుఱించి నేర్చితివి నీకావ్యంబులో ప్రేమ యే
లోకంబందున నున్నదో మఱచి నీలోపంబు పై వారిపై
ప్రాకన్ నిందలు మోపె దీవు నిజమున్ పాటించితే అకళా
లోకంబందు రవంతపాలు కలదే లుబ్ధుండవై చూచినన్.

౧౯౭

మంగళగీతమందు నొక మాటయినన్ ఎలుగెత్తిపాడి నీ
బంగరు పాదమంటుటకు వచ్చెనె యీ జవరాలు కంఠకున్
గొంగళిగట్టుకొన్న తనగోడునె నేకరువెట్టుగాని ఆ
కొంగునగట్టుకొన్న ప్రియుకోసము రక్తము ధారవోసెనే.

౧౯౮

ఏముగలయట్టి దినముల నెందఱెంద
ఱుఁగ కెన్నోనివాదులఁ బఱపి లేచి
పోయి క్రమ్మర తెలిసి వాపోయి విధిగ
వెదకవత్తురు ; మేము లభింప మపుడు.

౧౯౯

కలధన మర్థవాహినులుగా రచియించి నిజానురాగమం
గలవెలనాంధ్ర వాటికలు గాదులనింపితి .... .... .... .... ....

౨౦౦

నేను మృతుండఁగాను రజనీకరబద్ధములైన చీకటిన్
భానుసహస్రమండలము భాతి వెలింగెడు జ్యోతిగాగ మీ
జ్ఞానము బోర్లవడ్డ చషకంబునుబోలె గ్రహింపలేదు ద
గ్ధానల విస్ఫులింగము లయంబగు కేంద్రము వెల్తురేకదా.

—✱—

# భావనం



ఉ. ఏది చరాచరాత్మక మభీష్టఫలప్రదమై యనంత వి
ద్యాదయితంబునై వెలయు నట్టి మహామహనీయతేజమా
మోదము గూర్చు జ్ఞానసభ మోసి చిగిర్చి ఫలప్రదంబు నిః
ఖేదము మోక్షవృక్షముల కేంద్రమునైన హృదంతరాళముల్. 1

ఉ. జ్ఞానము శూన్యవాచకము సొంజ్ఞలఁబెట్టి వచించు భాష వి
శ్వానకు నూతకోలవలెఁ జాటుచునున్నది సభ్యతార్థవి
జ్ఞానము వానిభేదములె శాస్త్రములందు ప్రవృత్తి యేమతా
ఖ్యానము వానిగోడు విడనాఁడినఁగాని లభించ దాయమున్. 2

సీ. అస్తిపంజరమాంస మస్తిష్కబద్ధమౌ
జీవికి నిజమైన చేవలేదు
నీవనునాత్మకే నిజమైనశక్తి యు
న్నది యదిగొను నరణంబుగాను
గావున నీవనుజీవుని దేహంబు
నుండి వేరుఁగ జేయనొప్పు నీకు
నవుడు స్వతంత్రతత నవఘళించును నీకు
నీ వీశ్వరునిరాజ్య మేలఁగలవు

గీ. గాన నీస్వర్గమును నీవు కట్టుకొమ్ము
ముష్టి పనికిరాదెపుడు ముముక్షువునకు
సర్వ మెదలోననున్నది సాధకునకు
త్రవ్వగా వచ్చుగాదె పాతాళగంగ. 3

శా. ప్రాతఃకాలము రంగవల్లికల చిత్రంబున్ సరోజాక్షులే
రీతిన్ దిద్దు నదే విధాన నెదపై రేయంబగ ల్లాసమై
గీతల్ గీయు జవంజవంబు మఱి నీ గీర్భాషలో విశ్వమే
ప్రాతల్ క్రొత్తలు పెట్టి పాడు సెనగన్ రాళ్ళున్ విభక్తింపకన్. 4

శా. దేదీప్యంబు స్వతంత్రశక్తి యును నుత్తేజంబు వ్యక్తిత్వపున్
బ్రాదుర్భావముగల్గు మార్గమున జీవత్వంబు సంధించి నీ
సోదెల్ పాసి పిపాసకై కొలని జొచ్చున్ రీతి జ్ఞానాప్తి సం
పాదింపందగు లక్ష్యలక్షణము తత్త్వప్రౌఢి రాజిల్లఁగన్. 5

క. శారీరకమగు ప్రేమ
ద్వారంబునుజొచ్చి బోర్లపడి యైహికమం
దారూఢి చెడిన కొందరు
ప్రారంభించిరి యనశ్వరంబగు భక్తిన్. 6

ఉ. పూజలు వేరెసేయుటకుఁ బోకు మనస్సొక పెద్దవస్తువం
దోజ చరాచరాత్మక సముజ్వలమైన యదార్థమున్న దా
రాజితరోద సీకుహర రంగమునన్ హృదయంబు నిల్పి నా
యోజనె వందనార్చనలు యోగవిధానము తత్త్వవేత్తకున్. 7

శా. నీవే యన్నిటియందు నగ్పడెడు భంగిన్ సృష్టిలోఁబెట్టి నీ
భావంబాయెడ పెద్దమార్పు నిడి సంభావించి వీక్షించితే
నీవే సర్వముగాఁగదోఁచెద వనే నిర్లప్తమౌ యౌగిక
శ్రీవాల్లభ్యము నభ్యసించిన మహాసిద్ధుల్ లభించున్ దగన్. 8

ఉ. జీవిత కాచపాత్ర తన చేతుల జారిన దాని నెత్తఁగా
లేవు నిశాకవాటముల లేపి హసించెదు వెన్నెలన్ వయః
శ్రీవిభవంబు బెట్టి వికసించెడు సోయగమందు రూఢమౌ
నీవు స్వతంత్రుఁడన్న రస నిర్ఝరిముంచి తరించు మీవెసన్. 9

చ. గుణరహితుండు పాపముల గోడుదలంపడు నింద్యవస్తువుల్
గొనఁదలఁపోయఁడేదొయొక గుప్పెడుమెక్కురుచుల్ జడత్వమం
దెనయు పదార్థవాదమున కే; పరమార్థముకుండ వేవియున్
గనుక ప్రవర్తనంబు శుచి కావలె జ్ఞానపథంబు పేర్కొనన్. 10

ఉ. మానవులెల్ల రొక్కటె ప్రమాదములందు ప్రయోజకత్వ వి
జ్ఞానమునందు భేదములు గల్గినఁ గల్గగ నిండు నీశ్వరా
స్థానమునందు పుణ్యులకె స్థానము వారి చరిత్రలందు పా
పానల ముందరాదు తపసన్న జితేంద్రియతే నిజంబుగన్. 11

శా. ఆశన్ గొప్ప రహస్యమున్నది భుజంగారోపితంబైననో
పాశంబట్లు తిరోహితంబయి గతభ్రాంతిన్ విడంబించు సం
దేశం బీప్సితసిద్ధిగూర్చునదె ముక్తిత్వంబు ప్రేమైకవా
రాశిన్ ముత్తెములబ్బినట్లు తనలో రాజిల్లు విశ్వంబొగిన్. 12

మ. సముపాస్యంబులు కొన్ని దూరముగ లజ్జాద్వేషమాత్రంబులై
క్రమమున్ దప్పి యినీయతిక్రమణ మర్యాదన్ విడంబించు భా
వములన్ మార్పులుదెచ్చు నీప్రణయసంభావ్యంబులందేదొ యం
దమురూపించు నతేంద్రియంబయిన నీదారిన్ జనన్ బోలునే. 13

శా. ఆకాశంబును భూమియున్ బయలు శూన్యంబున్న నీదృష్టిలో
నాకాశంబును పంచభూతములవే వ్యక్తంబులైతోఁచు నా
యాకాశంబు నిజంబు భావమున లక్ష్యంబై విరాజిల్ల నా
యేకత్వంబె త్వదాత్మ యాశ్వరునిగా నెంచన్ దగున్ జ్ఞానికిన్.

గీ. భావదాస్యంబు దేనికి పనికిరాదు
జ్ఞానికిని స్వతంత్రతయె ప్రధానమనుట
తెలిసి సర్వక్రియానివృత్తిని స్వతంత్రుఁ
డగును నతనికె నీశ్వరుఁడనఁగ దెలియు. 15

ఉ. భావమునందు శూన్యమను భావము మిథ్యలఁ బెట్టఁబోకు నీ
భావము బ్రహ్మవస్తువది వస్తువుగాఁ గయికొమ్మ నందులో
నీవగుపింతు వావెలుఁగు నీశ్వరుఁ డాస్వపదంబు వీడఁగాఁ
బోవకు దన్నుతానెఱుఁగు పాంతయిదే యెవ రెన్నిచెప్పినన్. 16

ఉ. భావమునందు నొక్క యణు భావము పట్టుము దాని నూర్ధ్వమం
దావరణంబుగా నలుపునంటిన క్రైవడి చూడు మందులో
కేవల జీవసాజ్ఞగల కేంద్రము బ్రిద్దలుజేసినట్లుగా
నీవనుకొన్న చీలికయి సృష్టి ప్రకంపితమున్ బొనర్చెడున్. 17

ఉ. భావము భావభేదముల బట్టి యభావములందు శూన్యతా
భావము పెట్టఁబోకు మది వస్తువుగా ఱతిజేసికొమ్ము నం
దీవనుసంస్య వీడునట నీవయినట్టి యదార్థ వస్తువం
దీవు గ్రహించు ముక్తుఁడయి యీశ్వరరూపము వచ్చునెంతయున్

ఉ. భావము వస్తువన్న నది ప్రాయికమై కనవచ్చు నందు నీ
తావును జూడవచ్చు మ్మత్తాత్వికమైన రహస్య మిందు నీ
కేవల మున్నదన్న తన కేంద్రము మృత్తికలందు రేణులం
దావల చూడరాదొగి దదన్యము శూన్యము లందు వస్తువుల్. 19

ఉ. భావము చంపఁబోకు మదిమంచిదొ చెడ్డదొ దానివెంట నీ
త్రోవ మరల్చి యా తెరవు తో సచరాచరమైన సృష్టివి
ద్యావిధమున్నచో నెఱుఁగ నౌ నిఁక వాదములేల నీకు నీ
వై వలగొన్న విశ్వమది వ్యక్తము శాంతికి నాకరంబుగన్. 20

ఉ. భావ రథంబు లోకమును వంచినక్రైవడి పోవుచుండు నా
త్రోవల కడ్డులేదు తన తో జగమున్నదటంచు నెంచు నా
కేవల కల్పనాప్రతిమ కేంద్రము నొందెడు భావవీథిలో
నేవొ మహత్మ్యమున్నదదె యీశ్వర సంఘటనంబు నెచ్చెలీ.

ఉ. భావమునందు సృష్టి నిజ భావములన్ వివరించి శూన్యమం
దేవొ నిజాలు నున్నవని యెంచి యదే పనిఁగా దలంచినన్
నీవు నెఱుంగవత్తువు నదే యపవర్గము శాంతి సత్యసం
భావితమైన ముక్తి మఱి మాటలవేటికి యుక్తివాదముల్. 22

ఉ. భావము శూన్యమందిరము భాతిని పోలిచి నీవు శూన్యమై
పోవుచునుంటి వాతెరఁగు బుద్ధికిఁ దోఁచెడు యుక్తి వాదమా
బావము వస్తురూపముగ మార్చిన నందు నిజాలు వచ్చు నా
నావసుధాత్మకంబులుగ నంబడు ముక్తియొసంగు తానెయై. 23

ఉ. జీవితకాచపాత్రతన చేతుల జారకమున్నె యీయుషః
శ్రీవిభవంబులో హృదయ సీమ పరాగములేరివేసి నీ
భావము శూన్యభాండముల పైనిడ కాత్మ స్వతంత్రశక్తికిన్
కేవలమై చరాచరము కేంద్రముజెందెదు నిన్ను జూడుమీ, 24

ఉ. జీవితపుం రథంబునకుఁ జేరువ దగ్గరలేదు ప్రాప్తమం
దేవి ఘటించునో యవియ దేవిధముంచి తపింపఁజేసి యే
త్రోవకొ లాగు సౌఖ్యములొ దుఃఖములో సమకూరు దానికై
యేవలుకట్టివేసి ముద మేపడు నాసల రిత్త వోవకన్. 25

గీ. ఆకసంబున మబ్బులు నాకళింప
వంద్యభావాలు నీరయి పాఱనేళ్ళ
నేళ్ళు నెఱియలు నిసుకలఁ గళ్ళుఁదీర్చి
వ్రాసి చూపించు తమ దాహవాసరములు. 26

ఉ. నీవొక మట్టికుండవలె నేకరువెట్టెదవేల కల్లలన్
గావలనింధనాలు రతనాలు మనస్సునుకట్టిపెట్టి నా
నావిధ వాసనా లహరి నార్చిత్వదాకృతి యెల్లచోటులన్
నీవలెనుంచు నాకిటుకు నేర్చిన నీకిఁకఁ జీఁకటున్నదే? 27

ఉ. ప్రాప్తమునున్న వస్తువులు వచ్చుట మానవుగాని వ్యక్తికా
ప్రాప్తము జన్మలభ్యము నవారిత దివ్యపథంబునందు త
ల్లుప్తములుం రథాంగగతు లుంబలె వచ్చుచు పోవుచుండు నీ
సుప్తి నెఱుంగుమార్గములు చూడఁగరావు కరంబునేర్చినన్. 28

ఉ. పెక్కనిషిద్ధమున్ మెసవి పేరును నూరును జారిపోవ కై
పెక్కనసభ్యముల్ పలుకు హీనులసంయములంచు మ్రొక్కు నీ
ఫక్కినిషిద్ధ మీశ్వరుని మార్గము ప్రేమరసాను భూతి యా
చక్కి స్వతంత్రుఁడై తిరిగి చావుని పుట్టుని ద్రోవఁజూడుమీ. 29

శా. ఏదోకీలక మీశ్వరుం దెలియనెంతే బోధఁ గావించునాఁ
డాదారిన్ స్థిరబుద్ధివై నడుమునీ యందంతరార్థంబు తా
నైదైవారు ముముక్షుఁడౌదువు ప్రమాదార్ధంబులన్ జేసి తా
నేదో నేర్వక దొడ్డవోవుగతి నూహింపంగ రాదెప్పుడున్. 30

శా. ఏవోనాదములుప్పతిల్లు నవి యే వేవో విమర్శింపఁగా
రావెంతేని తపస్సుచేసినను నీ రాగాల దీక్షాపరో
క్షావైశద్యము విశ్వరూపమయి లక్ష్యంబందు వీక్షింపఁగా
నేవైపైనను నీవు గానఁబడు దెంతే వింత సొంపారగన్. 31

సీ. ఆత్మకు నిత్యత్వమనుమాట భక్తుని
దీక్షలోపలఁగదా తెలియుచుండు
ఆ దీక్ష విజ్ఞాతమైన సమాధిలో
రూఢమౌ నదియె నారూఢమనఁగ
తత్త్వంబు నిజము ప్రత్యక్షసాక్షాత్కార
మిది వితర్కింపఁగా నెసఁగఁబోదు
స్వప్నస్థ జీవుని సంచారమందు వి
శ్వాసంబు కలదది జడమె కాని

తే గీ. జ్ఞానజీవుఁడు గూడ సంచారపథము
కలదు స్వాతంత్ర్యమునకు మార్గములు పెక్కు
కావున ముముక్షువు సమాధి గానఁబడును
విశ్వరూపంబు మేరాజ విజములనఁగ. 32

శా. పుత్రిన్ జూచి రసూల్ మొహమ్మదు సుతాపుణ్యంబునాముష్మికం
బాత్రైలోక్యసుఖంబు గూర్చును; ప్రవక్త్రాధిక్య సంజాత నన్
మాతాౖనన్ దివి యబ్బ నేరికి తపో మార్గంబు లక్ష్యంబు త
త్సూత్రంబుల్ విడనాడఁబోకని వచించున్ ప్రేమ రేకెత్తఁగన్. 33

ఉ. ఆశ్రమముల్ సమాధులు మహామహనీయ తపోస్వరూప వి
శ్వ శ్రుతముల్ తపస్సులకు పాఠకశాలలు వానియందులో
కాశ్రయమైన కోర్కెలకు నాస్పదముండదుగాన మీర లే
యే శ్రమలైన పొంది యట కేఁగుడు ముక్తిలభించు మైత్రతన్.

చ. ఇదియొక బ్రహ్మవిద్య యిది యేరికి యర్థముగాదు తాత్త్వికం
బిది సముపాసితంబయిన యీశ్వరరూప యథార్థమిందు మీ
చదువు నిమిత్తమాత్ర మిట సంశయముల్ పనిచేయ వీమహా
సదనమె విశ్వరూప మప చారము సేయకుఁడీ కతంబునన్. 35

ఇది ఉమర్ ఆలీషా కవికృత భావప్రకరణము సంపూర్ణము.



ది 2-2-1942 సం॥లో షష్ఠమపీఠాధిపతి బ్రహ్మర్షి డా॥ ఉమర్ఆలీషా అధ్వర్యంలో మహాసభల సందర్భముగ విరచిత నివేదిక.

# "బ్రహ్మర్షి" డా॥ ఉమర్ ఆలీషా
## కవి కృతములు



1. శ్రీ మహమ్మదు రసూలువారి చరిత్ర
2. దానవధ
3. మహాభారత కౌరవ రంగము [నాటకం]
4. సూఫీ వేదాంతదర్శము
5. అనసూయ [నాటకం]
6. కళ
7. ప్రభాతకథావళి [కథలు]
8. విషాద సౌందర్యము
9. విచిత్ర బిల్హణీయము
10. బ్రహ్మవిద్యావిలాసము
11. స్వర్గమాత [కందార్థములు]
12. తత్త్వసందేశము
13. పరతత్త్వ కీర్తనలు
14. చంద్రగుప్త [నాటకం]
15. ఉమర్ ఖయ్యాము
16. మణిమాల [నాటకం]
17. శాంత
18. ఖండకావ్యములు
19. బర్హిణిదేవి
20. పద్మావతి [నవల]
21. హాతత్త్వము
22. సాధనపథము

